# సర్వోదయము



రచన

గాంధీజీ

సంకలనము :

భరతన్ కుమారప్ప

అనువాదము :

శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రి

గాంధీ సాహిత్య ప్రచురణాలయము
(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)
రామారావుపేట, కాకినాడ

# విజ్ఞప్తి

మానవజాతికి శాంతి సందేశము నందించిన యుగపురుషుడు మహాత్మా గాంధీ. రానురాను ప్రపంచ చరిత్ర శాంతి స్థాపనకు మహాత్ముని అడుగుజాడల ననుసరించుట దప్ప యన్యమార్గము లేదని నిరూపించుచున్నది. అట్టి మహాత్ముని రచనలను తెలుగులోనికి అనువదించి ఆంధ్ర ప్రజానీకమునకు నందించుటకై గాంధీ సాహిత్య ప్రచురణాలయము చేయుచున్న కృషిఫలితముగా ఇదివరలో ఢిల్లీ దినచర్య, మన గ్రామముల పునర్నిర్మాణము, నా మతము, నూతన విద్యా విధానము ప్రచురింపబడినవి. ఇది అయిదవ ప్రచురణ. ప్రభుత్వము, ఆంధ్ర ప్రజానీకము మా కృషికి తోడ్పడి యింటింటా యీ గ్రంథములు వెలయు జేయవలెనని మా ప్రార్థన.

ఇట్లు
ప్రకాశకులు

# సంపాదకుని విజ్ఞప్తి

ప్రజల కోరిక ననుసరించి "సర్వోదయము, దాని సిద్ధాంతములు, కార్యక్రమము" అను చిన్న పుస్తకము 1951లో నవజీవన్ ప్రచురణాలయముచే ప్రచురింపబడినది. గాంధీజీ మహానిర్వాణాంతరము ఆయన అనుయాయులు వార్ధాలో స్థాపించిన సర్వోదయ సమాజముయొక్క సిద్ధాంతములు, కార్యక్రమమునుగూర్చిన భోగట్టా కొలది పుటలలో తెలియజేయుట దాని యుద్దేశము. అందరు మానవుల క్షేమము ఎట్లు బడయవచ్చుననునదే ప్రస్తుత గ్రంథముయొక్క విషయము.

సామాజికవ్యవస్థయొక్క ఆదర్శము సర్వోదయమని గాంధీజీ అభిప్రాయము. దాని మూలాధారము సర్వమానవ ప్రేమ. అందువలన దానిలో రాజుకు, పేదకుకూడ తావు గలదు ; ఎట్టి మినహాయింపులు లేవు. హిందు-ముస్లిం, స్పృశ్యులు-అస్పృశ్యులు, తెల్లజాతులు-నల్లజాతులు, పుణ్యాత్ములు-పాపాత్ములు అందరకు స్థానమున్నది. ఏ వ్యక్తిగాని, సమూహముగాని అణగద్రొక్కబడరు, అపహరింపబడరు, వినాశము నొందరు. ఈ సాంఘికవ్యవస్థలో అందరు సమాన సభ్యులు ; వారు శ్రమయొక్క ఫలితమును సమానముగా పంచుకొనెదరు ; బలవంతులు బలహీనులను రక్షించి వారి ధర్మకర్తలుగా నుందురు, ఒండొరులు పరస్పరము సహాకరింతురు.

ఆత్మసమర్పణ ప్రేమయొక్క ముఖ్యలక్షణములలో నొకటికాన సంయమము, ఇతరులకై కష్టముల సహించుట

సర్వోదయము చేయుటకు ముఖ్యముగా అవసరము. శతాబ్దుల తరబడి ఆత్మనిగ్రహము, త్యాగపథముల ననుసరించిన భారత దేశము ఇందుకు తగిన క్షేత్రము. పాశ్చాత్యులయొక్క భోగ లాలసత, కోరికలవృద్ధి ఇందుకు పూర్తిగా విరుద్ధము. పెట్టు బడిదారీ విధానమే కానిండు, సామ్యవాదసమాజమే కానిండు —పాశ్చాత్య నాగరికతలోని యీ వైఖరివలన బలవంతులు బలహీనులను పీడించుట, ప్రలోభము, సంఘర్షణతప్ప సర్వో దయము లేక సాంఘికన్యాయము లభించదని తెలిసియే గాంధీజీ దీనిని వ్యతిరేకించెను.

ఇట్టి సర్వవ్యాపకము, త్యాగమయమైన ప్రేమయొక్క తత్వజ్ఞానమునకు ఆధ్యాత్మికమైన పునాది అవసరము. సర్వ వ్యాప్తశక్తియందు మనకు సజీవములగు భక్తి, శ్రద్ధ యుండ వలెనని దీని యర్థము. ఆత్మనిగ్రహము, శిక్షణ, ఆత్మబలము ఇందుకు ముఖ్యము. ఈ ఆధ్యాత్మిక ఆధారవిషయమునందే కమ్యూనిస్టు వాదమున కిది విరుద్ధము. ఏలనన కమ్యూనిస్టు వాదము కేవలము భౌతికవాదము. కాని రెండిటికి లక్ష్య మొక్కటే.

ఆధ్యాత్మిక ఆధారమగుటచేత సర్వోదయ సాధన మార్గముకూడ ఆధ్యాత్మిక మార్గమే. పశుబలముతో దోపిడీ దారుని వినాశనమొనర్చినగాని ఆదర్శమైన సామాజికవ్యవస్థ స్థాపన జరుగజాలదని కమ్యూనిస్టువాదన. అందుచేతనే వర్గ వైషమ్యము, అప్పుడప్పుడు బహిష్కరణ, యుద్ధమూ

ఆధారముగా చేసుకొన్నది. ద్వేషము, హింస తిరుగుదెబ్బ తీసి ద్వేషసంస్కృతము కాగలవు కాన ఆ పద్ధతి నిష్ప్రయోజనమని గాంధీజీ వాదన. స్వయముగా కష్టములను సహించుట, ఉన్నత శీలములద్వారా అత్యాచారుల అంతరాత్మకు, బుద్ధికి విజ్ఞప్తి చేయుటమూలంగా వారి బుద్ధి మార్చి, వారిని మన కృషికి సహాయకారులుగా చేసికొనుట ఒక్కటే యీ అన్యాయ నిర్మూలనకు మార్గమని గాంధీజీ విశ్వాసము. సత్యాగ్రహము లేక సత్యాహింసలపై అచంచలవిశ్వాసము అను పద్ధతి నాయనే సృష్టించెను. ఇందులకు మృత్యువు నెదుర్కొనుట సహితముగా అనేక కష్టములను సహించవలసి యుండును. ఆయన బోధనలయందు ముఖ్యాంశము, ఆయన ప్రత్యేకముగా ప్రపంచమునకు ప్రసాదించినది యీ సత్యాగ్రహమే.

సామాజికవ్యవస్థయొక్క నిరర్థక చిత్రణ ఆయన ఆదర్శము కాదు. జీవితమందు ఎదుర్కొనవలసిన పెనుగాలులందు మార్గము చూపెడి ధృవతారంటె ఎక్కువ ప్రాముఖ్యత గాంధీజీ యీ ఆదర్శమున కీయలేదు. దూరదృశ్యములాయనను ఆకర్షింపలేదు. కావుననే ఆదర్శసామాజికవ్యవస్థ వివరములు తెలుపలేదు. ఆదర్శము దృష్టితో ప్రస్తుత వ్యవస్థను రూపొందించు మార్గమేదియనునదే ఆయనకుగల ఆతురత. ప్రస్తుత స్థితి దృష్టియందుంచుకొని లక్ష్యసిద్ధికి కృషి చేసిన తప్పక విజయము కలుగునని ఆయన నిశ్చితాభిప్రాయము. కావుననే పారిశ్రామికీకరణము, పెట్టుబడిదారు-

కార్మికుడు, భూస్వామి-రైతు మున్నగు ప్రస్తుత విషయము లనే ఆయన సర్వోదయములో చర్చించారు.

గాంధీజీయొక్క యీ యదార్థ, వ్యావహారిక దృష్టి వలన మంచి ఫలితము కలిగినది. ఏలనన ఆయన అనుయా యులు ప్రస్తుతము దేశ మెదుర్కొనుచున్న సమస్యలను సత్యాహింసలతో పరిష్కరించుటకు పూనుకొనిరి. దారి ద్ర్యము, అభావమునుండి ప్రజలను విముక్తులను చేయు సమస్య అన్నిటికంటెను ముఖ్యమైనది. గ్రామీణ పరిశ్రమ లకు ప్రాతినిధ్యము వహించగలిగిన, గాంధీజీ కార్యక్రమము నందు అగ్రస్థానము పొందిన చేతినూలు పరిశ్రమను పునరుద్ధ రించుటద్వారా గాంధీజీ యీ సమస్యను ఎదుర్కొనజూచెను. ఆయన వ్యవసాయము యొక్క ప్రాముఖ్యతను గుర్తింపక పోలేదు. కాని ప్రస్తుతమున్న కౌలుదారీ చట్టములు, భూమి శిస్తు విధానము, గ్రామపరిపాలనా యంత్రాంగముల బరువుకు నలిగిపోవుచున్న కర్షకునకు విదేశీ పరిపాలనలో ఏమీ చేయ జాలమని ఆయన ఉద్దేశము. జాతికి వెన్నెముకగా నున్న కర్షకునకు గడ్డుసమస్యయైన భూ సమస్యను గాంధీజీ అనుయా యులు స్వాతంత్ర్యము లభించిన వెంటనే పరిష్కరింప బూనుట సముచితము.

ఉత్పత్తి సాధనమైన భూమిని దున్నువాని కీయవలెనని సర్వోదయ సిద్ధాంతము యొక్క లక్ష్యము. కర్షకునకు భూమి యీయకుండుట అతనికి జీవనోపాధి మార్గము నిరాకరించుట

యని యర్థము. ఇందువలన కోపిడీ విధానమునకు, శాసనత్వ మునకు అతను లోనుకావలసిన పరిస్థితి ఏర్పడును. భూమి లేని శ్రామికుల రక్తమాంసములపై జీవించు భూస్వాముల త్రోల గించకుండా వారికి భూమి సంపాదించుటెట్లు?

1916 నుండి గాంధీజీ సన్నిహితుడు, శిష్యుడు అయిన వినోబాభావే భారతదేశంలో కమ్యూనిస్టు హింసాకాండకు గురిఅయిన ప్రదేశములో 1951 లో ఈ సమస్య నెదుర్కొన ప్రారంబించెను. గాంధీజీ ప్రబోధముల ననుసరించిన దే ఆయన పరిష్కారమార్గము. ఆయన భూస్వాముల ఉదార ప్రవృత్తిని మేల్కొలిపి, భూదానము పొందారు. అసమాన విజయ మార్జించి ప్రపంచమంతను దిగ్భ్రాంతులను జేసిన భూదానోద్యమ మీ రీతిగా జన్మమందినది. ఈ విధముగా ఇప్పటికే 20 లక్షల యకరముల భూమిలభించినది. 1957 నాటికి భూమి లేని వ్యవసాయకూలీ లుండకూడదను లక్ష్యముతో అయిదుకోట్ల వ్యవసాయ కూలీలకు అయిదుకోట్ల యకరముల భూమి సంపాదింప నుద్దేశింపబడినది. ప్రపంచ చరిత్రలో [illegible] వినాశనము చేయుటకు బదులు ఆయన యందు పరివర్తనము కలిగించి ఆయన వ్యవహారదక్షతను, సామర్థ్యమును ఉపయో గించుకొనుట మూలముగా మనము సర్వోదయము దిక్కుగా ఒక్క అడుగు ముందుకు వేయగలిగినాము.

దీని తరువాత వినోబాజీ ప్రారంభించిన సంపత్తి దానోద్యమము గాంధీజీ సర్వోదయోద్యమము యొక్క మరి

యొక రూపము. భూదాన, సంపత్తి దానముల గూర్చి వినోబాజీ రచనలు, ఉపన్యాసములు సంకలనము చేసి ప్రచు రణకర్తలు "భూదాన యజ్ఞ" మను గ్రంథము ప్రచురించిరి. అందువలన ఇది సర్వోదయమందు ఒక భాగమైనా, యీ గ్రంథములో దానిని చేర్చలేదు.

భూదాన, సంపత్తి దానములతో తృప్తిచెందక వినోబాజీ శ్రమదానము ప్రారంభించారు. భూస్వాములు, ధనవంతులేగాక కేవలం శ్రమచేయువారు కూడ సేవ, త్యాగ ములతో కూడిన యీ ఉద్యమములందు పాల్గొనుటకు దీని వలన అవకాశ మేర్పడినది.

ఆర్థిక సమానత్వము, శారీరకశ్రమ, నిరాస్తిపరత్వం, ప్రణాళికా రచన మున్నగు విషయములందు వినోబాజీ, మరి కొందరు గాంధీజీ అనుయాయులు సర్వోదయమును గూర్చిన గాంధీజీ అభిప్రాయములను విస్తృతమొనర్చారు. గాంధీజీ సర్వోదయ మే విధముగా వృద్ధిపొందుచున్నదో చూపుటకు ఈ గ్రంథము రెండవ భాగములో పైవిషయములలో కొన్ని చేర్చబడినవి. గాంధీజీ మరణానంతరము సర్వోదయ కార్య కర్తలు చేయుచున్న కార్యక్రమముకూడ ఈ భాగములో చేర్చబడినది. సర్వోదయ కార్యకర్తల కార్యక్రమములో భూదానము యెడల ఎక్కువ శ్రద్ధ చూపబడుచున్నా, వేరే గ్రంథము ప్రచురింపబడుటచే యిందు చేర్చబడలేదు.

సర్వోదయముయొక్క ప్రధానాశయములకు సంబం ధించియున్నట్టి, 30 సంవత్సరముల మధ్య యొసగిన గాంధీజీ

యుపన్యాసములు రచనలనుండి కొన్ని పాఠకుని సౌకర్యము నకై సంకలనముచేసి చేర్చినాము. ఈ గ్రంథముయొక్క మొదటి భాగమిదే. గాంధీజీ యభిప్రాయముల విస్తృతీకరణ యందు ఉత్సాహముగలవారు నవజీవన్ ప్రచురణాలయము (అహమ్మదాబాద్) వారిచే ప్రచురింపబడిన Towards Non-violent Socialism, Rebuilding our Villages, Constructive Programme, Basic Education, Women and Social Injustice, For Pacifists, Communal Unity, Drink, Drugs and Gambling అను గ్రంథములు చూడవచ్చును.

గాంధీజీ వార్తాపత్రికలు యంగ్ ఇండియా, హరిజన్ పత్రికలయందు భాగములకు తేదీలుకూడ వేయబడెను. గాంధీజీ గ్రంథములనుండి తీసికొనిన భాగముల విషయములో కూడ తేదీలు తెలిసికొన ఉత్సుకతయుండవచ్చును. 1908లో హింద్ స్వరాజ్, 1930లో యరోడా జైలునుండి, 1908లో గుజరాతీభాషయందు, 1951లో ఇంగ్లీషునందు 'అంటు దిస్ లాస్ట్' 1927, 1929 లలో ఆత్మకథ వ్రాయబడినవి. నటేశన్ అండ్ కో., వారిచే 1917లో "గాంధీజీ రచనలు, ఉపన్యాసములు" యొక్క మొదటికూర్పు, 1933లో నాలుగవకూర్పు ప్రచురింపబడినవి.

ఆధ్యాత్మిక తత్వజ్ఞానమునకు భారతదేశ మొసగినది సర్వోదయమే. దీనికి మూలవేరు మూడువేల యేండ్ల క్రితము పాతుకొనినది. బుద్ధుడు, మహావీరుడు ప్రేమ లేక అహింసా

సిద్ధాంతమును ఉపదేశము చేయుటకు పర్యటన గావించారు. ప్రాచీన ఋషులు శతాబ్దుల తరబడి తపస్సు, సంయమముల గూర్చి ప్రబోధించారు, ఆచరించి చూపారు, కుటుంబము, కులము, గ్రామీణ వ్యవస్థలద్వారా యీ గుణములను వ్యక్తులయందు వ్యాపింపజేసారు. కుటుంబము కొఱకు, కులము కొఱకు, గ్రామ వ్యవస్థకొఱకు తన కోరికలను తగ్గించుకొనుట, తన పంటను ఇతరులతో పంచుకొనుట, వారితో సహకరించుట, తన వర్గమునందు భక్తి కలిగియుండుట, దాని క్రమశిక్షణకు లోబడుట వ్యక్తి నేర్చుకొనెను. అతనికి ఆర్థిక రక్షణకూడ లభించెను. ఏలనన ఆ వర్గము అతనికి, పని, కనీసావసరములను సమకూర్చెడిది. అతనికి, అతని వర్గములోని యితర సభ్యులకు మధ్య ఆత్మీయత, సమానత ఉండెడిది. ఈ గ్రామ సామ్యవాదము దౌర్జన్య రహితమైన సామ్యవాదము. తాత్కాలికముగా "అంటు దిస్ లాస్ట్" అను గ్రంథము చదువుట వలన ప్రేరేపణ కలిగినను, నిజమునకు ఈ భావములనుండియే గాంధీజీకి సర్వోదయము లేక ఆదర్శ సామాజిక వ్యవస్థయొక్క ప్రేరేపణ కలిగినది. వ్యక్తి, అతని సామాజిక జీవితము ప్రేమ, ఉన్నతనైతిక, ఆధ్యాత్మిక సిద్ధాంతములపై ఆధారపడకున్న ప్రబోధనలవలన, ప్రపంచ శాంతిసంఘములవలన, యుద్ధము నిరోధించుటవలన ప్రయోజన ముండదని గాంధీజీ విశ్వాసము. ఏలనన శాంతి తుట్టతుదకు మన దైనికజీవనము యొక్క ఫలితమే. తత్ఫలితముగా పూర్వులవలెనే ఆయనకూడ, మన మాదర్శసామాజిక వ్యవస్థ

నైతికతకు ప్రయోగించవలెనన్న వ్యక్తిని, సంఘమును మార్చుటకు దారి చూపారు.

శాంతి స్వాతంత్ర్యము లందరు మానవులకు ఎట్లు లభించు నన్నదే నేడు మానవజాతి ఎదుర్కొనుచున్న సమస్య. భోగవిలాసముల ననుభవించుచు, ప్రపంచములోని సాధన సంపత్తిని, క్రయ విక్రయశాలలను వశపరచుకొను లోభబుద్ధితో కూడిన పారిశ్రామికీకరణమార్గము ననుసరించి, స్వప్రయోజనమునకై ఇతరుల నణచివేయుటకు సైనికబలము గల పెద్ద పెద్ద వ్యవస్థలను నిర్మించుటద్వారా యిది సాధ్యమగునా ? లేదా స్వార్థత్యాగము, సేవ ఆదర్శముగా ఒక వ్యక్తి అందరకొరకు పనిచేసి జీవించుటకు అనువగు చిన్న చిన్న స్వయంసంపూర్ణములైన సామాజిక వ్యవస్థలతో సామాన్య జీవితపద్ధతులతో కూడిన గాంధీజీ పథగాముల మగుటవలన ఇది సాధ్యపడునా ? ఈ రెండును విభిన్న దిక్కులకు మనలను గొనిపోవును. ఇందు పొరపాటు లేదు. మొదటిది ద్వేషము, యుద్ధము, వినాశమునకు దారితీయును. రెండవ మార్గము ప్రేమ, శాంతి, సర్వమానవ క్షేమమునకు దారి తీయును. ఈ రెండు మార్గములలో నొకదానిని ఎన్నుకొనుట యందే మానవుని గమ్యస్థాన మాధారపడియున్నది. భారతీయులుగాని, యితరులుగాని యీ సమస్యలనుగూర్చి యాలోచింపవలసిన తరుణ మాసన్నమైనది. ఈ పుస్తకము సంకలన మొనర్చుటయందుగల ముఖ్యోద్దేశమిదే. గాంధీమార్గమును

—సంఘర్షణల మూలముగా ఛిన్నాభిన్నమై, ఆత్మవినాశకరమగు సమరము, అధికారబలముయొక్క అత్యధిక కేంద్రీకరణములకు ఆలవాలమైయున్న ప్రపంచమునకు గాంధీజీ యొసగిన శాంతి, స్వాతంత్ర్య సందేశమును—ప్రపంచమున కందీయవలెననియే యీ సంకలనముయొక్క లక్ష్యము.

బొంబాయి, సెప్టెంబరు 1953 భరతన్ కుమారప్ప





# సర్వోదయము

## గాంధీమహాత్ముని వివిధ రచనలు - సుభాషితములు.

## విషయసూచిక

### మొదటి భాగము


| వరుస సంఖ్య | విషయము | పుట |
|---|---|---|
| 1. | ఉపోద్ఘాతము | 1 |
| 2. 3. | హెచ్చుమేలు అందరికీ కావాలి | 3 |


### రెండవ భాగము

### A


| | | |
|---|---|---|
| 1. | ఉపోద్ఘాతము | 6 |
| 2. | విధులా? హక్కులా? | 7 |
| 3. | నైతికమార్గములే ముఖ్యములు | 9 |


### B

### కావలసిన సద్గుణాలు.


| | | |
|---|---|---|
| 1. | సత్యము | 10 |
| 2. | అహింస - అనగ ప్రేమ | 11 |
| 3. | బ్రహ్మచర్యము | 15 |
| 4. | నిర్భీతి | 18 |
| 5. | అస్తేయము | 19 |
| 6. | అపరిగ్రహము | 21 |
| 7. | ఆహారపానీయములలో నిగ్రహము | 25 |
| 8. | త్యాగము, స్వార్థత్యాగము | 29 |
| 9. | కాయకష్టంచేసి మరీ, తిండితిను | 31 |

10. స్వదేశీ 40
11. అన్ని మతములయెడ గౌరవము 47
12. అస్పృశ్యతా నివారణ 52

## మూడవ భాగము

## ఆర్థిక విధానము

### A అహింసాత్మక ఆర్థిక విధానము

1. అహింసామూలము 53
2. ఆర్థిక సౌష్ఠవతకు మానవత్వ లక్షణము అవసరము 53
3. మనిషేధనము - వెండి బంగారాలుకావు 58
4. న్యాయమైన కూలి 60
5. ఆర్థిక సమత 64
6. ఆదాయంలో సమానత 66
7. వికేంద్రీకరణ 68
8. అహింసా వృత్తులు 70
9. పూర్వము ఇండియా సర్వోదయ పంధాలో నడిచింది 74

### B పారిశ్రామిక యుగము.

1. పారిశ్రామిక విధానములో కానికి అరిష్టము (కీడు) 77
2. యంత్రములు 79

### C మూలధనము - శ్రమ (కాయకష్టము)

1. మూలధనం - కాయకష్టము 92
2. ధనమును కేవలం సొంతానికి ఉపయోగించుకోవడానికి ఎవరికిన్ని నైతికమైన హక్కు లేదు. 94
3. ధర్మకర్తృత్వము (ట్రస్టీ విధానము) 94
4. గాంధిగారి ట్రస్టీవిధానము (ప్యారీలాల్ గారి వ్యాసము) 98

## D భూస్వామి - రైతు.


1. ఆదర్శప్రాయుడైన జమీందారుడు 100
2. జమీందారులకు ఒకమాట 102
3. భూమిపై హక్కు 104
4. రైతులు - భూస్వాములు 105
5. సహకార సేద్యము 106


## నాల్గవ భాగము

## సాంఘిక విధానము

## A సంకుచిత సంఘం - మానవుడు.


1. అహింస - ఇదియు ఒక సాంఘిక ధర్మమే 107
2. వ్యక్తి - సంఘము 107
3. అంటరాని తనము వేదానికి చోటేలేదు 108
4. వర్ణాశ్రమములు 109
5. వర్ణమే కులము 110
6. అంతర్ వర్ణవివాహములు 112
7. సంఘములో స్త్రీలస్థానము 114
8. స్త్రీ పురుషులకు సమానహక్కులు 121
9. వివాహము 121
10. వైధవ్యము 123
11. విడాకులు 124
12. సంతాన నిరోధపద్ధతులు 125


## B విశాల సంఘము - తిర్యక్ జంతువులు.


1. గో సంరక్షణ 129
2. ,, 132
3. విశ్వమానవ।ప్రాణిభ్రాతృత్వము 134
4. జంతుబలి 135

## ఐదవ భాగము

## రాజకీయ స్థితి.

### A సర్వోదయ సమాజము.


| | |
|---|---|
| 1. మనిషినడతయే పునాది | 136 |
| 2. సర్వోదయ ప్రజారాజ్యం | 139 |
| 3. గమ్యస్థానము | 143 |
| 4. ఇండియా స్వరాజ్యంలో గవర్నరు ఎలా ఉంటాడు? | 144 |
| 5. స్టేటు - వ్యక్తి | 147 |
| 6. స్వపరిపాలన | 150 |
| 7. అల్పసంఖ్యాకుల హక్కులు | 152 |
| 8. వోటు హక్కు | 153 |
| 9. ప్రాంతీయాభిమానము | 154 |
| 10 ప్రభుత్వం మతాతీతమైనదిగా ఉండాలి. | 156 |


### B. పరదేశములతో సంబంధము.


| | |
|---|---|
| 1. బ్రిటన్‌తో భాగస్వామ్యము | 156 |
| 2. తదితర దేశాలతోటి సంబంధము | 158 |
| 3. శాంతికై అంతర్జాతీయ సంస్థ | 160 |


## ఆరవ భాగము

## చెడును ఎదిరించుటెట్లు?

### A సత్యాగ్రహ మార్గము


| | |
|---|---|
| 1. ప్రేమపాత్ర | 161 |
| 2. సత్యాగ్రహము | 162 |
| 3. పిరికితనానికి చోటులేదు | 164 |
| 4. ఎవరినీ బలవంతం చేయవద్దు | 167 |
| సత్యాగ్రహబలం ఎలా పెంపొందుతుంది? | 169 |

6. సత్యాగ్రహ నియమములు 171
7. నమ్రత 174
8. ఉపవాసములు 178
9. గుమ్మానికి అడ్డుగా పడుకోవడం 175
10 బలవంతంవద్దు - అసహనంకూడదు 177
11 సత్యాగ్రహం ఎట్టివారు చెయ్యాలి? 178
12 సత్యాగ్రహం చేసే తీరు ఏది? 179
13 సంఖ్యలుకాదు ప్రధానం 181
సత్యాగ్రహమనేది ఆఖరుకు ప్రయోగింపవలసిన అస్త్రము 181

## B. ఆర్థిక అసమానత

1. నాన్‌కో ఆపరేషన్ 182
2. వర్గపోరాటము 187
3. కార్మిక సంఘాలు 193
మిల్లు కూలీలకు ఉపవృత్తులు 196
4. ప్రభుత్వచర్య 199

## C. సంఘ వ్యవస్థ

1. దొమ్మీలు-శాంతిసేన 207
2. చోరీలు 219
3. స్త్రీలపై దౌర్జన్యం 225

## D రాజకీయపు దౌష్ట్యములు

1. దుష్ట ప్రభుత్వము - శాసనోల్లంఘనము 229
2. వైదేశాలనుండి వచ్చే దండయాత్రలు 235

# ఏడవ విభాగము

## కార్యకర్తలు-కార్యప్రణాళిక

## A. కార్యకర్త

1. సర్వోదయ కార్యకర్తలకు ఉండవలసిన లక్షణాలు [illegible]

## B. ప్రోగ్రాము


1. రైతులు 249
2. లేబర్ (కార్మికులు) 250
3. { గ్రామోద్ధరణ 258
{ గ్రామముయొక్క గమ్యము 266
4. ఖద్దరు-రాట్నము 269
రాట్న సందేశము 274
సూత్ర యజ్ఞము 274
గ్రామ ఆర్థిక వ్యవస్థలో రాట్నముయొక్క స్థానము 277
5. విద్య - సంస్కృతి 282
విద్యకు పరమావధి ఏది ? 286
ఇతరదేశాల సంస్కృతి గురించి తెలుసుకోవడం 287
సాంస్కృతిక వికాసము 289
భావిభారత సంస్కృతి ఎట్లుండవలెను. 290
6. శౌచారోగ్యములు 292
7. త్రాగుడు, మత్తు పదార్థసేవన 294
జూదము 299
8. స్త్రీలు 302
9. కులమత సమైక్యత 304
10 అస్పృశ్యతా నివారణ 305
11 ఆర్థిక సమత 307
అహింస ఒక సాధనము 309
ఉపసంహారము 310


(మొదటిభాగం సంపూర్తి)

## శ్రీ వినోబా మొదలైన ప్రముఖుల వ్యాసములు

### ఎనిమిదవ విభాగము


1. నూతన విప్లవము (వినోబా) 315

## తొమ్మిదవ విభాగము

## ఆర్థిక సమత

1. ఆర్థికసమత (వినోబా) 321
2. న్యాయమైనకూలి (జే-సీ-కుమారప్ప) 324
3. విచక్షణ పూర్వక సమత (వినోబా) 326
సమత్వం, దయాదాక్షిణ్యం (వినోబా) 327
కమ్యూనిజానికి, సర్వోదయానికి తేడాఏమిటి? (మశ్రూవాలా) 332

## పదియవ విభాగము

## డబ్బుకాదు, కాయకష్టమే సర్వమునకు మూలము

1. కాయకష్టములో ఉండేఘనత (వినోబా) 337
2. మధ్యతరగతులవారికి ఒకమాట (సి. రాజగోపాలా చార్యులవారు) 338
3. సంపదుత్పత్తి హేతుకమైన కృషియేకృషి (వినోబా) 341
4. ఖాదీ స్వావలంబనకృషికి చిహ్నము (మశ్రూవాలా) 344
5. కాయకష్టము 346
6. డబ్బుపీడన వదలించుకోవాలి (కాంచనముక్తి) (వినోబా) 348
7. అపరిగ్రహము-సంస్థలు (వినోబా) 349
8. డబ్బు చందాలువద్దు (వినోబా) 351

## పదకొండవ విభాగము

## గ్రామసర్వోదయము

1. సంపద్విభాగ సూత్రము (మశ్రూవాలా) 352
2. గ్రామ నిర్వహణ (వినోబా) 359
3. సర్వోదయమున కుపకరించు విద్య (వినోబా) 362
4. వయోజనవిద్య (వినోబా) 373
5. సర్వోదయం- దానిస్థూలరూపం (వినోబా) 374
6. ఆర్థిక సమత (జేసీ కుమారప్ప) 375
7. సర్వోదయ పద్ధతిగా జరిగే ప్లానింగ్ (మశ్రూవాలా) 378

## B. ప్రోగ్రాము


1. రైతులు 249
2. లేబర్ (కార్మికులు) 250
3. { గ్రామోద్ధరణ 253
   { గ్రామముయొక్క గమ్యము 266
4. ఖద్దరు-రాట్నము 269
   రాట్న సందేశము 274
   సూత్ర యజ్ఞము 274
   గ్రామ ఆర్థిక వ్యవస్థలో రాట్నముయొక్క స్థానము 277
5. విద్య - సంస్కృతి 282
   విద్యకు పరమావధి ఏది? 286
   ఇతరదేశాల సంస్కృతి గురించి తెలుసుకోవడం 287
   సాంస్కృతిక వికాసము 289
   భావిభారత సంస్కృతి ఎట్లుండవలెను. 290
6. శౌచారోగ్యములు 292
7. త్రాగుడు, మత్తు పదార్థసేవన 294
   జూదము 299
8. స్త్రీలు 302
9. కులమత సమైక్యత 304
10 అస్పృశ్యతా నివారణ 305
11 ఆర్థిక సమత 307
   అహింస ఒక సాధనము 309
   ఉపసంహారము 310


(రెండవభాగం సంపూర్తి)

## శ్రీ వినోబామొదలైన ప్రముఖుల వ్యాసములు

## ఎనిమిదవ విభాగము


నూతన విప్లవము (వినోబా) 315

## తొమ్మిదవ విభాగము

### ఆర్థిక సమత


1. ఆర్థికసమత (వినోబా) 321
2. న్యాయమైనకూలి (జే-సీ-కుమారప్ప) 324
3. విచక్షణ పూర్వక సమత (వినోబా) 326
సమత్వం, దయాదాక్షిణ్యం (వినోబా) 327
కమ్యూనిజానికి, సర్వోదయానికి తేడాఏమిటి? (మష్రూవాలా) 332


## పదియవ విభాగము

### డబ్బుకాదు, కాయకష్టమే సర్వమునకు మూలము


1. కాయకష్టములో ఉండేఘనత (వినోబా) 337
2. మధ్యతరగతులవారికి ఒకమాట (సి. రాజగోపాలా చార్యులవారు) 338
3. సంపదుత్పత్తి హేతుకమైన కృషియేకృషి (వినోబా) 341
4. ఖాదీ స్వావలంబనకృషికి చిహ్నము (మష్రూవాలా) 344
5 కాయకష్టము 346
6. డబ్బుపీడన వదలించుకోవాలి (కాంచనముక్తి) (వినోబా) 348
7. అపరిగ్రహము-సంస్థలు (వినోబా) 349
8. డబ్బు చందాలువద్దు (వినోబా) 351


## పదకొండవ విభాగము

### గ్రామసర్వోదయము


1. సంపద్విభాగ సూత్రము (మష్రూవాలా) 352
2. గ్రామ నిర్వహణ (వినోబా) 359
3. సర్వోదయమును కుపకరించు విద్య (వినోబా) 362
4. ప్రయోజనవిద్య (వినోబా) 373
5. సర్వోదయం- దానిస్థూలరూపం (వినోబా) 374
6. ఆర్థిక సమత (జేసీ కుమారప్ప) 375
7. సర్వోదయ పద్ధతిగా జరిగే ప్లానింగ్ (మష్రూవాలా) 378

# సర్వోదయము

## మొదటి భాగము

(కొందరికి మేలు - మెజారిటీ సంఖ్యకే కాదు.)

"సర్వేజనాః సుఖినోభవంతు"

-: సర్వోదయమనగా ఏమిటి :-

## 1

### ఉపోద్ఘాతము.

నేను స్కూళ్లలో చదువుకొనే రోజులలో నాక్లాసు పుస్తకాలుతప్ప ఇతరపుస్తకాలేవీ చదవలేదనే చెప్పవచ్చు. ఇక, బయటిప్రపంచములో తీవ్రంగా పనిచేయడం ప్రారంభించిన తరువాత, పుస్తకాలు చదవడానికే నాకు టైము ఉండేది కాదు. కనుక, పుస్తక జ్ఞానము నాకు ఎక్కువ ఉందని చెప్పుకోలేను. అయితే, ఇంతమాత్రంచేత నాకేమీ పెద్దనష్టం కలుగలేదని నానమ్మకం. నష్టము కలుగకపోగా, నేను చదివిన కొద్దిదానివల్లనే నాకు ఎక్కువ మేలుకలిగింది. చదివిన ఆ కాస్తా బాగా జీర్ణంచేసుకొని, వంటబట్టించుకోడానికి వీలు చిక్కింది. నేను చదివిన ఆ కొద్దిపుస్తకాలలో, నాజీవితంలో తక్షణం మార్పుకలిగించి, నాజీవితశకటాన్ని సత్పథంలోకి

మళ్ళీ గొప్పమార్పుతెచ్చిన పుస్తకం "అంటు దిస్ లాస్ట్" (Unto this Last) అనే ఇంగ్లీషు పుస్తకం. దీనిని "రస్కిన్" అనే ఆంగ్ల తత్త్వవేత్త రచించారు. తరువాత, దానిని నేను గుజరాతీభాష లోకి తర్జుమాచేశాను. "అంటు దిస్ లాస్ట్" అనేమాటను "సర్వోదయ" అనే మాటగా తర్జుమాచేశాను. "సర్వోదయం" అంటే "అందరికీమేలు" అన్నమాట - (మెజారిటీ సంఖ్య మేలు మాత్రమే అనికాదు) నామనస్సులో గాఢంగా నిండి నిబిడీకృతమైయున్న భావములే "రస్కిన్" గారు వ్రాసిన ఈ "అంటు దిస్ లాస్ట్" అనే గ్రంథంలో (అద్దం లోవలె, ప్రతిఫలించినవని నానమ్మకం. అందువల్లనే ఈ గ్రంథం నన్ను ఆకర్షించి గట్టిగా పట్టుకున్నది. నాజీవితాన్నే మార్పుచేసివైచింది. మానవహృదయంలో దాగియున్న సద్భావములను బయటికి లాగగలవాడే నిజమైన కవి. అయితే, కవి అందరిని సమానంగా ఆకర్షించి మార్చలేడు. ఎందుకంటే ప్రతివాడు సమానస్థాయిలోకి వికాసం పొందియుండ లేదుగా.

"అంటు దిస్ లాస్ట్" అనే గ్రంథంలోని బోధలు నాకు ఈదిగువ రీతిగా అర్థమైనవి:—

1. వ్యక్తియొక్క మేలు అందరిమేలులోనే ఇమిడియున్నది.

2. లాయరుచేసేపనీ, మంగలిచేసేపనీ, సమానమైన విలువగలవే - ఎట్లంటే, ప్రతివాడు తానుచేసే పనివల్ల తన జీవనానికి తగినంత సంపాదించుకోడానికి హక్కు కలిగి యున్నాడు.

3. కృషీవలుని జీవితం - అనగా, నేలదున్నే వ్యవసాయకుని జీవితము - చేతిపనులుచేసే పనివానిజీవితం - ఈ రెండే సవ్యమైనజీవితాలు. జీవితమంటే వీరిద్దరిదే జీవితం.

ఈపైమూడింటిలో మొదటిది నేను లోగడనే యెరిగియున్నాను. రెండవది. నాకు మసకమసకగ - కనపడీకనపడనట్లుగ - ఉండేది మూడవది. లోగడ నాకెన్నడూ తట్టనే లేదు. "అంటు దిస్ లాస్ట్" పుస్తకం చదవడంవల్ల పై వాటిలో రెండవ, మూడవ, అంశములుకూడ మొదటిదానిలోనే ఇమిడియున్నవనే రహస్యము నాకు పట్టపగలువలె గోచరమైనది. ఈ సూర్యోదయంతో ఈ ఉషఃకాంతిలో నేను మేల్కొని, లేచి, తత్క్షణమే ఈ సూత్రాలను నాజీవితాచరణలో పెట్టుకోడానికి దీక్ష వహించాను.

(మహాత్ముని ఆత్మకథ - 4వ భాగం, 18వ అధ్యాయము 1948 ముద్రణనుండి).

# 2

## (హెచ్చుమేలు అందరికీ కావాలి)

"హెచ్చుమందికి హెచ్చులాభం"-ఉంటేచాలుననిమామూలుగా పాటింపబడు("మెజారిటీలాభనాటి"సూత్రము)అహింసావాదిఎన్నడూ అంగీకరింపజాలడు. ఒక్కణ్ణికూడా వదలిపెట్టకుండ, అందరికీ హెచ్చుమేలుచేయడానికే అహింసాపరుడు ప్రయత్నిస్తాడు. ఈప్రయత్నంలో తాను మృత్యువునుకూడ పొందడానికి సిద్ధమౌతాడు. తనచావువల్ల ఇతరులుబ్రతకనీ అనే దానికి ఇతడు సిద్ధపడతాడు. తనచావువల్ల, తనకూ ఇతరులక్కు

కూడ మేలుచేసినవాడవుతాడు. "అందరికీ మేలు" అనే మాటలో "హెచ్చుమందికి మేలు" అనే మాటకూడ చెప్ప నక్కరలేకుండ ఇమిడియే యున్నదికదా! కనుక, "అందరికీ" మేలు అనేవాడు, "మెజారిటీ సంఖ్యకు" మేలు అనేవాడు —ఈ ఇద్దరూ చాలాదూరం కలిసియే నడుస్తారన్నమాట. కాని, తుదకు ఎక్కడో ఒకచోట ఇద్దరు విడిపోయే స్థితివస్తుంది; అంతేకాదు, ఒకరికొకరు వ్యతిరేకంగాకూడ పనిచేయవలసి వస్తుంది. ఈ మామూలు లాభనాటిజేరంమనిషి తనకునష్టం కష్టం వచ్చేపనిమాత్రం చేయడు. ఆస్థితి వచ్చేటప్పటికి వాడు అక్కడ ఆగిపోతాడు. అందుకు ప్రాణం బలిచెయ్యడు. అతని సిద్ధాంతం అంతే. కాని, "అందరికీమేలు" అనే మనిషిమాత్రం అవసరంవచ్చేటప్పటికి తాను ఆహుతిఅయిపోతాడు.

(యంగ్ ఇండియా : 9-12-1926).

## 3

మనకు కావలెనని కలలుకంటున్న నిజమైన ప్రజారాజ్యం, (పంచాయితీరాజ్యం) ఇదే. సర్వోదయం ప్రత్యక్షం కావాలంటే అందరిని మనము సమానంగా చూడాలి. మనలో అట్టడుగుననున్న యెంతటి తక్కువ వాణ్ణయినా సరే, మనలో మహాగొప్పవాళ్ళతో సమానంగా — మన దేశపరిపాలకులుగ — చూచుకోవాలి. అంటే, మనలో అందరూ పవిత్రులనిన్నీ, ఒకవేళ ఎవరైనా ఇప్పుడు అట్టి పవిత్రులుకానిచో, (క్రమేపి) కాగలరనిన్నీ, మనము స్నేహముగ భావించుకోవా

ఉన్నమాట. పవిత్రత అనేది వివేకంతో, విజ్ఞానంతో, జతగా నడిచిపోతూ ఉండాలి. అప్పుడు. ఎవరుకాని, ఒకకులానికి మరొకకులానికి, ఒకవర్గానికి మరొకవర్గానికి, పైకులాలకి వెలి కులాలకీ — భేదాలను మనస్సులోనైనా పాటించడు. అందరు తనతో సమానులేనని ప్రతివ్యక్తి భావిస్తాడు; అందరిని మైత్రిని ప్రస్ఫుటించే పేశలమైన ప్రేమసూత్రంతో ముడివేసు కొని ఉంటాడు. ఎవడుకాని ఇంకొకడిని "అంటరానివా డుగా" భావించడు. చెమటోడ్చి పనిచేసే కూలివాడు, ధన రాసుల్లో మునిగే భాగ్యవంతునికి సమానమేనని అప్పుడు మనం అనుకుంటాము. స్వయంగా చెమటోడ్చి, న్యాయంగా తిని పొట్టపోసుకోవడం ఎట్లాగో ప్రతివాడు అప్పుడు నేర్చు కుంటాడు. శరీరశ్రమకు, బుద్ధిశ్రమకు తేడాఏమీ లేదనే సంగ తిని కూడ అప్పుడు తెలుసుకుంటాడు. దేశంలో ఈస్థితి త్వరగా రావాలంటే, ముందుగా మనమందరం మనంతటమనము పాకీ పనికి పూనుకోవాలి, పాకీవాళ్ళమయిపోవాలి. బుద్ధియున్న వాడెవడూ నల్లమందుకాని, కల్లుసారాయిలుకాని, ఇతర మత్తుపదార్థాలుకాని. ఎన్నడూ ముట్టుకోడు. స్వదేశీవ్రత మును తనదైన సూత్రముగ ప్రతివాడు అవలంబిస్తాడు. తన భార్యకాని పరస్త్రీని, ఆమెయొక్క వయస్సునుబట్టి, తల్లిగా, సోదరిగా, లేక కూతురుగా భావిస్తాడు. ఆ పరస్త్రీని ఎన్నడూ మోహదృష్టితో చూడడు. అంతఅవసరమేవస్తే అతడు తన ప్రాణాన్నైనా బలిఇవ్వడానికి సిద్ధపడుతాడుకాని, ఇంకొకడిప్రాణం తీయడానికి కోరడు,

(హరిజన్ : 18-1-1948).

# రెండవ భాగము.

(సర్వోదయంయొక్క ఆధ్యాత్మికాధారము)

## A. ఉపోద్ఘాతము

## 1

### అనుష్ఠించు సాధన విధానమే ప్రధానము

ఆదర్శాన్ని చేరడానికి మార్గమేదో తెలుసుకుని దానిని ఉపయోగించుకోనట్లైతే వట్టిఆదర్శాన్ని ఎంతస్పష్టంగానిర్వచిస్తేమాత్రం ఏమి ప్రయోజనం? అదిమనస్సుకుఎంత నచ్చితే మాత్రం ఏమిప్రయోజనం? కనుక, ఆదర్శాన్నిచేరే మార్గములమీదనే, సాధనవిధానములమీదనే నెక్కువగ నాదృష్టిని కేంద్రీకరిస్తున్నాను. ఆమార్గాలను క్రియలో సాధించి అనుష్ఠించడానికిన్ని నాశక్తినంతా ముఖ్యంగా ఉపయోగిస్తున్నాను. ఆమార్గంమీదనే మనం జాగ్రతగ కేంద్రీకరిస్తే ఆదర్శంచేరడం మనకుదానికదే సులభమయిపోతుంది. అదీకాక మన సాధనవిధానాలు ఎంత పవిత్రమయినవైతే ఆదర్శంవైపు మన నడకకూడ అంత సుకరం, చేరువ అవుతూ ఉంటుంది.

ఈ నడక పద్ధతి, యాంత్రోవ-చాలా చుట్టుత్రోవగ-అతిచుట్టుత్రోవగకూడ కనపడవచ్చుకాక. అయితే, పర్యవసానంలో ఇదే మిక్కిలి దగ్గరత్రోవ అయితీరుతుందని నా గట్టినమ్మకం.

(అమృతబజార్ పత్రిక - 17-9-1933)

# 2

## విధులా? హక్కులా? ప్రధానం; విధులే!

ప్రతివాడు "నాహక్కు, నాహక్కు" అంటూ గట్టిగా అరుస్తూ, తాను విధాయకంగా చేయవలసిన విధులను గూర్చియే తలపెట్టకపోతే లోకంలో మిగిలేది నట్టి గందరగోళం, ఘోరసంక్షోభం తప్ప ఇంకేమీ వుండదు. హక్కుల గురించి ఎక్కువగా నొక్కిచెప్పుకోడానికిబదులుగా, ప్రతివాడు ఎవడి డ్యూటీని, విధాయకకృత్యాన్ని వాడు చేసుకుంటూ పోతూవుంటే లోకంలో తక్షణమే సక్రమపంథా తానంతట దానే ఏర్పడితీరుతుంది. ఈ చిన్నసూత్రాన్ని-సర్వోపయోగకరమైన ఈ చిన్నిసూత్రాన్ని, యజమానులకు - కూలీలకు మధ్య కానివ్వండి, భూస్వాములు-రైతులమధ్య కానివ్వండి, మహారాజులు - వారి ప్రజలమధ్య కానివ్వండి, హిందూ ముసల్మానులమధ్య కానివ్వండి, ప్రయోగిస్తే లోకంలో ఎట్టి గందరగోళము లేకుండా సర్వత్ర ప్రశాంతి వెల్లివిరుస్తుంది. ఇండియాలోను, ప్రపంచంలోని ఇతర దేశాలలోనుకూడ ఇప్పుడు చెలరేగుచున్న అల్లర్లు, ప్రజల జీవితములలో గలుగుచున్న తారుమారులు, వ్యాపారాలలో జరుగుచున్న తల్లక్రిందు పలిటీలు, ఒడుదుడుకులు, ఏమీ వుండవు. నేనుచెప్పే సత్యాగ్రహ సిద్ధాంతం మానవులు ప్రప్రథమముగ అనుష్టించవలసిన విధులనుండియు, తద్విధుల నిర్వహణముద్వారా తదుపరి వాటంతట అవిగ లభ్యమయ్యే హక్కులనుండియు, ఉత్పన్నమగుచున్నది. ఒక ఉదాహరణ చూడండి. హిందువుడనేవాడు తన

పొరుగుననున్న మహమ్మదీయునియెడ నిర్వర్తించవలసిన విధియేమి? అతనిని తనతో సమానమయిన మనిషిగ చూచి, అతనితో సఖ్యభావము నెరపుకొనవలెను. అనగ అతని కష్ట సుఖాలలో తానుకూడ భాగస్వామి కావాలి. అతనికి కష్టము వచ్చినప్పుడు సహాయం చెయ్యాలి. అప్పుడు ఆ ముసల్మాను నుండి ఆదేవిధమయిన సఖ్యసహాయములు రావాలని కోరుకో డానికి ఆ హిందువునకు హక్కు వస్తుంది. బహుశః అట్టి సఖ్య సహాయాలు ఆ ముసల్మానునుండి వస్తే రానూవచ్చు; ఒకవేళ బహుసంఖ్యాకులైన హిందువులుచూపిన ఈసఖ్య భావానికి ప్రతిగ తిరిగి సఖ్యభావం కొద్దిమందియైనా ముస ల్మానులనుండి రాకపోతే, - రాకపోగా, పైగా ప్రతివిషయ ములో వారు దెబ్బలాటకే దిగేటట్లయితే, - అది వారి అమానుషత్వాన్నే వెల్లడిస్తుంది. అట్టిస్థితిలో బహుసంఖ్యా కులైన హిందువులవిధియేమి? ఒకటిమాత్రం నిశ్చయంగా కాదు. అనగ, తమకు బహుసంఖ్యాకమైనబలం ఉందికదా యని, తక్కువసంఖ్యగల ముసల్మానులుపైకి ఉంకించి, వారిని అణగగొట్టివేయడం మాత్రం ఎంతమాత్రంకాదు. హిందువు లిట్లాచేస్తే, వారు తాము ఆర్జించినహక్కును బలప్రయో గంచే అక్రమంగా లాక్కున్నారని అర్థమగును. అట్టిచో హిందువులకర్తవ్యమేమిటంటే, ఏకోదరులైన తమ సోదరుల అమానుషచర్యలను ఎట్లు నివారించుకుంటారో, ఆపద్ధతినే ఈ ముసల్మానులచర్యను నివారించుకొనవలసిఉంటుంది.

(హరిజన్ : 6-7-1947).

# 3

## —♦ నైతికమార్గములే ముఖ్యములు ♦—

పాశ్చాత్యదేశస్థుల మనస్సులలో సాధారణంగా ఉన్న భావమేమంటే - మానవసంఘంలో మెజారిటీ సంఖ్యాకులకు సౌఖ్యంకలుగచేయడమేచాలు అని. దానితో మానవుని కర్తవ్యం తీరిపోయినదేఅని వారుభావిస్తారు. సౌఖ్యమంటే భౌతికసౌఖ్యమే అని, డబ్బుసౌఖ్యమేఅని వారి ఉద్దేశ్యం. ఇంకేమీ వారికి అక్కరలేదు. ఇట్టి సౌఖ్యాలను సంపాదించుకోవడంలో నీతిధర్మాలు విచ్ఛిన్నమైపోయినా సరే అట్టే ఫరవాలేదని వారంటారు. ఇట్టిఊహాలవల్ల వచ్చేదుష్ఫలితాలు నేడు యూరపుఖండం మొగంమీద స్పష్టంగా వ్రాసినట్లు కనబడుతునే ఉన్నవి.

నీతిధర్మాలను విడుగత్రొక్కిపారేసి, కేవలం భౌతికమైన, ఆర్థికమైన, సౌఖ్యాలకే పాల్పాడేపద్ధతి ఈశ్వరాదేశములకు విరుద్ధమైనది. ఈ సంగతిని పాశ్చాత్యదేశాలలోని బుద్ధిమంతులు కొందరు నిరూపించియేయున్నారు. వారిలో "జాన్ రస్కిన్" అనువారొకరు. నీతిధర్మాలకువిధేయులై నడుచుకొన్నప్పుడే మానవులు నిజమైన సౌఖ్యమును పొందగలరని ఆయన తాను రచించిన "అంటు దిస్ ల్యాస్ట్" అనే గ్రంథంలో సహేతుకముగ వాదించి నిరూపించియున్నాడు.

ప్రపంచంలోఉన్న అన్నిమతాలలోకూడా ఈ నీతిధర్మమనేది విధాయకమైన అంశముగఉండియేయున్నది. సరే; మతములు చెప్పినమాట యెట్లున్నను, మన ఇంగితజ్ఞానమే

ఈసత్యాన్ని మనకుబోధిస్తుంది. అనగ, మానవుడైనవాడు నీతిపథాన్ని అనుసరించితీరాలని. ఈనీతిపథాన్ని అనుసరించడం మూలంగానేతప్ప ఇతరత్రా మానవుడు సౌఖ్యంపొందలేడు.

("రస్కిన్"గారి "అంటు దిస్ ల్యాస్ట్" అనే గ్రంథానికి సంక్షిప్తానువాదంచేస్తూ గాంధిగారు తానువ్రాసిన ఉపోద్ఘాతంలోని మాటలివి. 1951 సం॥లో ప్రచురణమైన ఆగ్రంథంలోని IX – XI – పుటలనుండి కైకొనబడినవి.)

## B. – కావలసిన సద్గుణాలు

# 1

### సత్యము

మనకార్యకలాపములన్నీ సత్యమునుఆశ్రయించే ఉండాలి. సత్యమనేది కేవలం మన అనుక్షణ ఉచ్ఛ్వాసనిశ్వాసములుగనే ఉండాలి. మన ప్రయత్నప్రస్థానములో ఈమెట్టుకు చేరగలిగితే, సక్రమజీవితమునకు సంబంధించిన సూత్రాలన్నీ వాటంతటఅవియే మన చేతికి చిక్కగలవు. ఆ సూత్రాలకు మనములోబడి నడుచుకోవడమనేది మనకుస్వతస్సిద్ధమైపోతుంది. సత్యమును మనము ఆశ్రయించకపోతేమాత్రము ఇతరధర్మాలనువేటినికూడ మనం జీవితంలో అనుసరించడం ఎన్నటికీసాధ్యంకానేకాదు.

సత్యమే దేవునికి సరియైనపేరు. కనుక, ప్రతిమానవుడున్నూ తనవిజ్ఞానవిశేషమునుబట్టి తనకుసత్యమనితోచినదానిని

అనుసరించడంలో తప్పేమీలేదు. అంతేకాదు, అట్లు అనుసరించుట అతని విధాయకకర్తవ్యముకూడా. ఆవిధంగా ఎవరుగాని సత్యం అనుసరించుపట్ల తనపక్షాన యేదైన పొరబాటు ఉన్నట్లయితే ఆపొరబాటు ఈసత్యప్రభావంవల్ల దానంతటదియే దిద్దుబాటుఅయిపోతుంది. సత్యమునుశోధించి కనుగొనడమనేది సులభముకాదు. దానికి తపస్సు అవసరము - అనగా, స్వార్థత్యాగము, స్వయంగా కష్టనిష్టూరాలకు తలయొగ్గడం - చివరికి ప్రాణంసహా అర్పించడానికి సిద్ధమవడం అన్నమాట. స్వార్థానికి దీనిలో ఈషన్మాత్రమైనా తావు ఉండజాలదు. ఇట్టి నిస్వార్థసత్యాన్వేషణంలో, ఎవరుకాని, చిరకాలము త్రోవతప్పియుండలేరు. ఎప్పుడైనా తప్పుటడుగు కస్మంజాలకపడింపా. ఆతడుబోర్లపడతాడు; తత్ఫలితంగా (ఇదితప్పుత్రోవఅని తెలుసుకొని) తక్షణమే గుర్రిక్కతిప్పుకొని, సరియైనత్రోవకు మళ్ళుతాడు.

("ఎరవాడామందిరంనుండి" అనే గ్రంథము - 1945 ప్రచురణ - పేజీలు 2 — 3).

# 2

## —• అహింస - అనగా - ప్రేమ •—

కొందరు వేళాకోళంగా మాట్లాడుతున్నట్లు అహింస అంటే, అదేదో వికటమైన వస్తువుకాదు. ఏప్రాణికీ హాని కలిగించకుండాఉండడమనేది "అహింస"లో ఒకభాగమన్న మాట నిజమే. అయితే, ఈనిర్వచనం "అహింస" అనే

దానిలో అత్యల్పభాగంమాత్రమే. మనస్సులోయేదైనా చెడుతలంపుపుట్టుటకూడ హింసయే ; అనవసరపుతొందర పాటుఅనేదికూడ హింసయే - అబద్ధంచెప్పడం, ఎదుటివాణ్ణి ద్వేషించడం, ఎదుటివాడికి చెరుపుకలగాలనికోరుకోవడం - ఇవన్నిహింసలే. ఇట్టివిజరిగినప్పుడల్లా అహింసాసిద్ధాంతాన్ని మనం ఉల్లంఘించినట్లేలెక్క. అంతేకాదు, ఇతరులకు అవసరమైనవస్తువును వారికిలేకుండచేసి, మనంఅట్టేపెట్టుకోవడం కూడా హింసయే. అదికూడ అహింసాసూత్రాన్నిమనం ఉల్లంఘించినట్లే.

అహింసపాటించకుండ, సత్యమును వెదకడానికిగాని, దానిని కనుక్కొనడానికిగాని, ఎన్నటికీ సాధ్యంకానేకాదు. అహింసా, సత్యము - అనేఈరెండు దిట్టంగా- ఒకదానిలో ఒకటి పెనేసుకుపోయినవి. వాటిని విడదీయడంసాధ్యముకాదు. అవి ఒకనాణెముయొక్క రెండువైపులవంటివి - అంతకంటె కూడ, ఏవిధమైనముద్రలులేని, ఒకపల్చటిరేకునకు తిరగబోర్ల (ఉల్టా, సీదా) అనే రెండుప్రక్కలవంటివి. ఇట్టిరేకునకు తిరగయేది, బోర్లయేది? ఏదియెట్లున్నను - అహింసమార్గము, సత్యము గమ్యము- అనగ చేరవలసినచోటు. మార్గము మార్గముగా ఉండవలెనంటె అదిమనకుఎల్లప్పుడుఅందుబాటులో ఉండాలి-మనంఅందుబాటులోకితెచ్చుకోవాలి. కనుక;అహింస మనకుపరమమైన ధర్మము. దానిని మీరడానికి వీలులేదు. మార్గమునుగురించిమనంజాగ్రత్తపడితేదానినితప్పినడవకపోతే, గమ్యస్థానానికి నేడుకాకున్న రేపైనను చేరితీరుతాము. ఈ

రహస్యమును మనము గట్టిగ గ్రహిస్తే అంతిమవిజయం మనదై తీరుతుంది. ఇందుకు సందేహంలేదు.

(ఎరవాడామందిరం నుండి – 1945
ప్రచురణ పేజీలు 7 – 9).

"అహింసా" సూత్రము జీవితధర్మమని అంగీకరించి నప్పుడు, అది మనజీవితమును సర్వత్రక్రమ్ముకొనియుండ వలెను; అంతేకాని, ఇక్కడకాస్త అక్కడకాస్త అంటు కొంటేచాలదు. "అహింస అనేది ఎక్కడో వ్యక్తులకుపనికి వస్తుందేకాని, మానవసమూహాలమీద పని చేయదని" చెప్పడం చాలాపొరపాటు. (హరిజన్ – 5–9–1936).

చరిత్రచొచ్చుకుపోగలిగినంత పురాతనకాలమునుండి, నేటివరకు దృష్టిని బరగించి చూచినట్లయితే, మానవుడు క్రమక్రమేపి అహింసవైపునకే నడచిపోతున్నాడని మనకు గోచరమవుతుంది. మన అనాదితరమువారు నరమాంసభక్షకులు. ఇట్లు కొంతకాలం నడవగనడవగ, నరమాంసభక్షణము వారికి వికటముగతోచింది. అది పనికిరాదనుకొని, ఇతరజంతువులనువేటాడి తినడంసాగించారు. అడవులలోతిరిగి వేటాడి జీవించేపద్ధతి లజ్జాకరమని మానవుడు మరికొంతకాలానికి గ్రహించాడు. అందువల్ల ఆతడు నేలదున్నివ్యవసాయం చేయడం మొదలుపెట్టాడు. తనతిండికి ముఖ్యంగాభూమాత మీదనే ఆధారపడడంఅలవరచుకొన్నాడు. ఈరీతిగా దేశ దిమ్మరి వేటకానిదశనుండి మానవుడు స్థిరమైన, సభ్యమైన, జీవితదశలోకివచ్చి గ్రామములు తదుపరి పట్టణములు అనే

స్థిరనివాసములను ఏర్పరుచుకున్నాడు. ఇంతేకాక, కేవలం తనకుటుంబములోనివాడుగనేకాక, ఒకసంఘంలోవాడుగ, ఒక జాతిలోనివాడుగ ఆతడు తనను రూపొందించుకున్నాడు. ఈ దశలన్నీకూడ ఏమిటి? హింసక్రిమక్రిమంగాతగ్గిపోవడం, అహింసక్రిమక్రిమంగాహెచ్చడంకాదా? ఇట్లుజరిగియుండక పోతే, ఈపాటికి అనేకవేలఅల్పప్రాణులు ఈసృష్టిలోవి నశింపై పోయినట్లే మానవజాతికూడయెన్నడోనశింపైపోయి ఉండేది.

ప్రవక్తలు, అవతారపురుషులుకూడ దాదాపుగ ఈ అహింసాధర్మమునే బోధించియున్నారు. వారిలోఒక్కరు కూడ హింసనుబోధించినవారులేరు. నిజానికి, అన్యథా యెట్లుండగలదు? హింసను వేరే యెవరికీ బడిపెట్టిబోధించ నక్కరలేదు. మానవుడు మృగమే అయిపోయినప్పుడు పశువే అయిపోయినప్పుడు హింసచేస్తాడు. కాని, అతడు ఆత్మవంతు డైనప్పుడు "అహింస"పాటిస్తాడు. తనలోఉన్న ఆత్మ తత్వాన్ని మానవుడు గ్రహించినతక్షణమే అతడు ఇక హింస కుడుగఉండలేడు. ఆతడు క్రిమేపిఅహింసవైపునకు పురోగ మిస్తాడు; లేదా, మృత్యుముఖంలోనికైనాసరే చొరబడి పోతాడు. అందువల్లనే,యావన్మందిప్రవక్తలు, అవతారములు సహా సత్యము, సోదరత్వము, న్యాయము, శాంతి, సమన్వ యము మున్నగు ఉత్కృష్టధర్మములను బోధించియున్నారు. ఇవన్నీకూడ అహింసాధర్మముయొక్క లక్షణములే.

అనాదినుండి నేటివరకు మానవసమాజము క్రిమ క్రిమేపి హింసనువదలివేసి, అహింసవైపునకే పురోగమిస్తూ వచ్చిందని మనమునమ్మితే, ఇకముందుకూడ, ఇంకాయెక్కువ

యెక్కువగ మానవజాతి అహింసవైపునకే నడచిపోవలసి ఉంటుందని–నడచిపోతుందని-మనమునిశ్చయముచేసుకోవాలి. ఈసృష్టిలోనేదీకూడ స్తబ్ధముకాదు - నిరంతరచలనమే * సృష్టికి లక్షణము. ఈచలనము ముందుకుకాకపోతే, ఇక వెనుకకుఅయితీరుతుంది. (హరిజన్ : 11–8–1940).

## 3

### బ్రహ్మచర్యము

బ్రహ్మచర్యమంటేఏమిటి? దాని ఉత్పత్త్యర్థమిది - మనిషిని భగవంతునికి చేరువగ తీసికొనివెళ్ళే ప్రవర్తనయే బ్రహ్మచర్యమని నిర్వచించబడినది.

అన్ని ఇంద్రియములను సంపూర్ణముగ మనవశమం దుంచుకొనడమే ఈప్రవర్తనయొక్క–సారాంశము. బ్రహ్మ చర్యమనేమాటకు నిజమైన, సరియైన అర్థమిదే.

బ్రహ్మచర్యమంటే జననేంద్రియమును నిగ్రహించు కోవడమేఅని సాధారణంగా అనుకోవడంకలుగుతోంది. ఇట్టి భావముకేవలం సంకుచితమైనది. దీనివల్ల బ్రహ్మచర్యమనే ఆదర్శం హీనస్థితికివచ్చింది.అంతేకాదు; దానిని అనుష్టించడం కూడ దుస్సాధ్యముగచేయబడింది. తదితరఇంద్రియాల నన్నిటిని నిగ్రహించుకొనకుండ, ఒక్క జననేంద్రియమునే నిగ్రహించుకొందామంటే అదిసాధ్యముకానిపని. ఈఇంద్రి

* "సృ" to move-'సృ' అంటే నడక.

యములన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడియున్నవి. ఈఇంద్రియములలో 'మనస్సు' అనేదికూడ (దిగువస్థాయిలో) ఇంద్రియమే. ఇది ఆరవఇంద్రియము. ఇట్టి 'మనస్సు'ను నిగ్రహించుకొనకుండ వట్టి భౌతికేంద్రియపంచకనిగ్రహము ఒకవేళ కొంతకాలంపొందగలిగినను, అది స్థిరంగా నిల్చేదికాదు; దానివల్ల ఏమీప్రయోజనంలేదు.

(హరిజన్ : 13-6-'36).

జిహ్వేంద్రియనిగ్రహానికి బ్రహ్మచర్యమునకు చాలా దగ్గిరసంబంధంఉంది. జిహ్వను నిగ్రహించుకోగలిగితే, బ్రహ్మచర్యసాధన సులభమవుతుంది. ఇది నాస్వానుభవంవల్ల చెప్పే మాట.

("ఎరవాడామందిరం" నుండి - 1945
ప్రచురణ - పేజీ 15).

పురుషుడు తనప్రేమను ఒకస్త్రీకిస్తే, అట్లే స్త్రీ తన ప్రేమను ఒకపురుషునికిస్తే, పూర్తిగ అర్పణచేసివస్తే - ఇక, లోకంపై వారు చూపగలగడానికి మిగిలేప్రేమయేది? "మనం ఇద్దరంబాగుంటేచాలు; మిగతాలోకం ఎట్లాపోతేమనకేం" అనే సంకుచితదృష్టియేర్పడినట్లవుతుంది. భక్తిగలస్త్రీ తన భర్తకోసం తనసర్వస్వం అర్పణచేయడానికిపూనుకొన్న యెడల, - అట్లే, భక్తిగలపురుషుడు తనభార్యకోసం తన సర్వస్వం అర్పణచేయబూనుకొన్నయెడల - వారిద్దరు అంతకంటె విశాలమైన విశ్వవ్యాప్తమైన ప్రేమోన్నతస్థితికి ఎక్కజాలరు. వారిప్రేమఆవరణ వారిద్దరితో నేసరి. మిగతాయావ

న్మానవకోటిని తమ ఆత్మబంధువులుగ చూచుకోలేరు. ఎందు కంటే, తమ ప్రేమఅనేవొడ్డిచుట్టు ఎత్తుగోడలుకట్టేసుకున్నారు కద. తమ సంతానంయొక్కక్షేమకొద్ది, వారు విశ్వమానవ ప్రేమకు దూరదూరమైపోతారు. కనుక, అహింసా వ్రతాన్ని అనుష్టించ దలచుకొన్నవారు పెండ్లిచేసుకొనేకూడదు. ఇక, పరస్త్రీవంక చూడకూడదని వేరేచెప్పవలెనా ?

"అయితే, ఇదివరకే పెండ్లి అయియున్నవారేమి చేయవలె" అని ఎవరైనా అడుగుతారేమో. వారుసత్యమును ఎన్నటికీ కనుగొనలేరా? విశ్వమానవసేవకు వారెన్నడూ నోచుకొనలేరా? తమసర్వస్వమును విశ్వమానవసేవా పీఠముమీద అర్పించుకొనే భాగ్యం వారికిలేనేలేదా? ఉన్నది, ఒకమార్గము. పెండ్లిచేసుకొన్నప్పటికి ఆదంపతులు పెండ్లి చేసికొననట్లుగానే నడచుకుంటూఉండవచ్చును. ఇట్టి ఆనంద స్థితిని నిజముగా అనుభవించియున్నవారున్నారు. అనగా, వివాహితులై కూడ వివాహితులుకానట్టే సాధనచేసి ఆసాధనలో విజయంపొందినవారినిచాలమందిని నేనెరుగుదును. వివాహితులైన దంపతులు ఒకరినొకరు భర్త భార్యసంబంధముగ భావించుకొనకుండ, అన్న చెల్లెలువలెగ భావించుకోగలిగితే, వారికి కామబంధనమువదలిపోయి, విశాలవిశ్వమానవసేవ చేయడానికి అడ్డంకులనన్నిటిని తాము తొలగించుకొన్నవా రవుతారు. ప్రపంచంలోఉన్నస్త్రీలందరు తనతల్లులనో, అక్కచెల్లెండ్రనో, కూతుళ్ళనో భావం మనకుకలిగితేచాలు. అదే తక్షణం మన బంధనాలనన్నిటిని తెంచిపారవేసి, మనలను మహోన్నత పదమునకు ఎక్కించగలదు. ఈరీతిగా, భార్య

గాని, భర్తగానినష్టపడే దేమీలేదు. పైగా, తమసౌభాగ్యమును, తమకుటుంబసౌభాగ్యమును వారు పెంపొందించుకొన్న వారేఅవుతారు. వారిరువురిప్రేమ నికృష్టకామకర్మలము నుండి విడివడి, మరింత గాఢమవుతుంది.

("ఎరవాడామందిరం" నుండి - 1945
ప్రచురణ - పేజీ 10 - 11)

# 4

## —♦ నిర్భీతి ♦—

ఇతరసుగుణాలు మనలోఅలవడడానికిముందుగ, 'నిర్భీతి' అనే ఉత్తమగుణము అత్యావసరము. అదిలేనిది తక్కినసుగుణాలేవీ పట్టుబడవు. "నిర్భీతి" అనేది లేకపోతే 'సత్యము' నెవరుగాని ఎట్లు అన్వేషింపగలరు ? ప్రేమనెట్లు చూరగొనగలరు? "ధీరులకె, భీరులకుగాదు దేవపథము" - అనగ, దేవపథము, లేక హరిపథము ధైర్యవంతులకేగాని పిరికివారికి కాదని" ప్రియతముడను ఒకానొకమహాభక్తుడు గానముచేసి యున్నాడు. ఇక్కడహరి (దేవ) అనే పదమునకు అర్థము "సత్యము" అని తెలిసికొనవలెను. ధీరులు, ధైర్యవంతులు - అనే ఈమాటలకు అర్థమేమిటి? (చేతిలో కత్తిపుచ్చుకొన్నవాడుకాదు) -నిర్భీతి అనే ఆయుధమును, కవచమును ధరించినవాడన్నమాట

("ఎరవాడామందిరము" నుండి - 1945 - పేజీ 27).

# 5

## అస్తేయము (దొంగతనముచేయకుండుట)

ఒకవంక, పరధనాదులనపహరించుచు, "నేను సత్యమును పాటిస్తున్నాను, ప్రేమామృతమును గ్రోలుచున్నాను" అనిఎవరైనగాని ఎట్లుచెప్పకొనగలడు? అయినప్పటికి, విచిత్రమేమనగ, మనలో ప్రతివారము తెలిసియో తెలికయో ఈ "పరస్వహరణ" దోషమునకు పాల్పడుచునేయున్నాము. "ఇది ఎవరిదీకాదుకదా, నేతీసుకుంటేతప్పేమీ" అనే నమ్మకంతో ఏవస్తువునైనాసరేమనం తీసుకుంటే అదీదొంగతనమే. ఫలానివారిదని తెలియకుండ, బేవారసుగ, రోడ్డుప్రక్క ఏవస్తువైనాపడిఉంటే అదిమనంతీసుకోకూడదు. అట్టివస్తువు ఆదేశ ప్రభువుది, లేదా అచ్చటిస్థానికాధికారి అధికారములోనిది. అది ఆఅధికారికి అప్పగించవలెనేకాని, మనం తీసుకోరాదు. అట్లాతీసుకుంటే అది దొంగతనమే (స్తేయమే) అవుతుంది.

మనకు నిజంగా అవసరంలేని ఒకవస్తువును ఒకనినుండి - అతని అనుమతితోనైనాసరే - తీసుకుంటే, అదికూడ దొంగతనమే. మనకు నిజంగా అవసరంలేనివస్తువు, - అదియెంత అల్పమైనదైనాసరే - మనముతీసికోవడం - (తీసికొనిఅట్టె పెట్టుకోవడం) తప్పు. సాధారణంగా ఈరకందొంగతనంలోకి వచ్చేవి ఆహారపదార్థాలు. నాకు అవసరంలేని ఒకపండు నేనుతీసుకోవడం దొంగతనమే. అవసరమైనదానికంటె ఎక్కువ తీసుకోవడంకూడ దొంగతనమే. మనకు నిజంగా ఏవి అవసరములో ఏవి కావో మనంసాధారణంగా తెలుసుకోకుండా

ఉంటాము. అందుకని, లేనిపోనిఅవసరాలన్నీ ఊహించి, కల్పించుకొని ఊరికే పెంచుకుంటూ ఉంటాము. ఇది అక్రమము. ఈవిధంగా మనమంతా మనకు తెలియకుండానే దొంగల మగుతున్నాము. మనం కొంచంజాగ్రత్తగ పరిశీలించి చూచుకుంటే, మనం అవసరాలనుకొన్న వాటిలో చాలాభాగం అనవసరములని చెప్పి సులభంగా వదిలించుకోవచ్చు. కనుక, అస్తేయధర్మమును (అనగ దొంగిలించరాదు అనేధర్మమును) అనుష్ఠించదలచినవాడు, క్రమక్రమముగ తన అవసరాల నన్నింటిని తగ్గించుకుంటూపోతాడు. ఈనాడు ప్రపంచంలో ఉన్న ఘోరదారిద్ర్యబాధకు మూలకారణం మానవులు ఈ అస్తేయధర్మమును పాటించకపోవడంవల్లనే ఏర్పడియున్నది.

అస్తేయధర్మము ననుష్ఠించువాడు, "అయ్యో, నాకు రేపటికిలేకపోతుందేమో" అనే బెంగఎన్నడూ పెట్టుకోనడు. దుష్టమైన ఈబెంగే ఈదొంగతనాలకన్నిటికి మూలకారణం. ప్రప్రథమంలో ఇవ్వాళ్ళమనకు "ఫలానివస్తువుకావాలి" అనే కోరికమాత్రమేకలుగుతుంది. ఇక, రేపటినుండి దానిని ఎట్లా సంపాదిద్దామా అని ప్లానులువేయడం మొదలుపెడతాము. "వీలైతే మంచిమార్గంగానే సంపాదిద్దాము, వీలుతప్పితే చెడుమార్గానైనాసరే సంపాదించుకుందాము" అనే ప్రయత్నంలో పడతాము.

దొంగతనమేది వస్తువులదొంగిలించడంలోనేకాదు, ఇతరులభావాలుదొంగిలించడంకూడ దొంగతనమే. మొదటగ ఎవరిలోనో ఉద్భవించినిభావాలు తానే "మొదటగ కని

పెట్టానని'' ప్రగల్భాలుకొట్టుకోవడంకూడ దొంగతనమే. (ఇదిభావచౌర్యం).

కనుక, అస్తేయధర్మావలంబియైవాడు ఎంతోనమ్రత గలిగిఉండాలి; మంచిమెళుకువ, జాగరూకత, గలిగిఉండాలి. తనఅలవాట్లు మిక్కిలి వినీతమును, నిరాడంబరముగను, నిరహంకారముగను ఉండాలి.

"ఎరవాడామందిరము'' నుండి - 1945 - పేజీలు 19-22).

# 6

## అపరిగ్రహము

అస్తేయమునకు దగ్గరసంబంధముకలదే అపరిగ్రహము. ప్రథమంలో ఒకానొకటి దొంగవస్తువుకాకపోయినప్పటికి (అనగ, న్యాయార్జితమైనవస్తువే అయినప్పటికి), తదుపరి దానిఅవసరంతగ్గిపోయినతరువాతకూడ దానిని దగ్గరఅట్టే పెట్టుకుంటే, అదిదొంగతనమ్మే అవుతుంది - అది దొంగ వస్తువేఅవుతుంది. ఒకవస్తువును దగ్గరఉంచుకోవడమంటే, భవిష్యదుపయోగంనిమిత్తం దాచుకోవడం అన్నమాట. సత్యాన్వేషియైనవాడు, ప్రేమసూత్రావలంబియైనవాడు, రేపటికనిచెప్పి ఏదీ నిలవచేసుకోరాదు. రేపటకనిచెప్పి భగవంతుడేదీ నిలవచేసియుంచడు. ఆ క్షణమునకు కేవలంకావలసినదానికంటె హెచ్చుగ భగవంతుడెన్నడూ సృష్టించడు. కనుక, భగవంతుని రక్షణమీద మనకువిశ్వాసముంటే ఆతడే ప్రతిదినము మనకు కావలసిన "ఆహార''మును తప్పకఇస్తూ

ఉంటాడని గట్టిగనమ్మాలి. ఇక్కడ "ఆహార"మంటే మనకుకావలసినప్రతివస్తువూ అన్నమాట. ఇట్టిగట్టివిశ్వాసముతో జీవించినభక్తులు, ప్రవక్తలు, ఎన్నడూ చెడిపోలేదు. వారిస్వానుభవమే ఈమాటకు ఋజువు. ఇది భగవన్నిర్మాణసూత్రము. ఏరోజుకారోజు, ఎవరెవరి కెంతకావలయునో భగవంతుడు అంతేఇస్తాడుకాని, అంతకు హెచ్చు ఇవ్వడనేదే ఈభగవన్నిర్మాణసూత్రము. ఈసూత్రమును గ్రహించకపోవడంవల్లనే-దానినిపాటించక అశ్రద్ధచేసినందువల్లనే-లోకంలో ఇన్నివ్యత్యాసములు-ఈవ్యత్యాసములనుండి ఈఅనేకదుర్భరదుస్థితులు ఏర్పడుచున్నవి. భాగ్యవంతులైనవారు తమకు అవసరంలేని యెన్నోవస్తువులను వృధాగా తమవద్దఅట్టేపెట్టుకొని.కుళ్ళబెట్టుచున్నారు. ఇంకొకవైపున, కోట్లకొలదిపేదలు తిండికిలేకమాడిచస్తున్నారు. ప్రతివాడు తనకుకావలసినంతవరకే అట్టేపెట్టుకొని, (మిగతాదివదిలివేస్తే), ఎవడూ లేమిడిలో ఉండనక్కరలేదు. అందరూసుఖంగాఉండవచ్చు. ఇప్పుడున్నస్థితిఏమంటే, పేదవాడు ఎంతఅసంతృప్తిగాఉంటున్నాడో, తుదకు, భాగ్యవంతుడుకూడఅంత అసంతృప్తిగానే ఉంటున్నాడు. పేదవాడు తానూ కోటీశ్వరుడుకావాలని అఱ్ఱులుచాస్తున్నాడు; మరి, కోటీశ్వరుడు కోటికోటీశ్వరుడు కావాలని అంగలారుస్తున్నాడు. కనుక, లోకంలో సర్వత్రి అసంతుష్టిపోయి సంతుష్టభావం ఏర్పడాలంటే, మున్ముందుగ భాగ్యవంతులే దోవచూపించాలి - అంటే, మున్ముందుగ తమసంపదలను వదలుకోవాలి. భాగ్యవంతులు తమఅత్యావసరములకుమాత్రమే తమసంపదను పరిమితంచేసుకుంటే, తిండి

నుంచి వెలుపలికి రావాలని అనుకునేవారెవరైనా మనలో ఉంటే. నాకు స్వయంగా ఈసూత్రము తప్పక అనుసరించ వలసిఉంటుందని నాగట్టివాదన. ఎవరిదగ్గరఉన్నదికాని కూడ లాగాలని నాకులేదు. నేనట్లుచేసినట్లయితే, అహింసాసిద్ధాంతాన్ని తప్పినవాడినేఅవుతాను. నాకున్నదానికంటె, ఇంకొకనివద్ద హెచ్చుగఉంటేఉండనీ. అది లాక్కోవాలనినేను కోరను. కాని, నాజీవితానికిసంబంధించినంతవరకు, నేను గట్టిగచెప్పగలిగేదేమంటే.— నాకు అక్కరలేని యేవస్తువును కాని, నేను నాదగ్గర అట్టిపెట్టుకొనుటకు ఎంతమాత్రము సాహసించలేను— రోజుకుఒకపూటకుకూడ సరిగ్గాతిండి గడవని జనం ఇండియాలో కోట్లకొలదిఉన్నారు. ఆ తినే కాస్తకూడ ఏమిటి, ఒకచిన్నచపాతీ (రొట్టె); దానిలో నెయ్యివగైరా కొవ్వుపదార్థం ఏమీఉండదు. ఉంటే ఒకచిటికె ఉప్పు ఉంటుంది. ఈకోట్లకొలదిజనానికి సరిగ్గాతిండి, బట్ట సమకూర్చేవరకు, నిజానికి మీకుకాని నాకుకాని, మనవద్దఇప్పుడున్న ఈఆస్తిని (సంపదను) ఉంచుకోడానికి ఎంతమాత్రము హక్కులేదు. అన్నిసంగతులు ఇతరులకంటె బాగా తెలిసికోవలసినటువంటి మనబోటివాళ్ళము మనఅవసరములను విధిగ తగ్గించుకొనవలసియున్నవి. అవసరమైతే, మనం ఒకపూట పస్తయినాపడుకొని, ఈ అశేషపేదజనానికి తగిన బట్ట, తిండి, ఆరోగ్యము, సమకూర్చడానికి తోడ్పడవలెను.

“మహాత్ముని ఉపన్యాసములు, రచనలు” నుండి—
4వ ప్రచురణ: పేజీ 384).

# 7

## —: ఆహార పానీయములలో నిగ్రహము :—

మత్తుపదార్థములు, మత్తుపానీయములు, సేవింపకుండుట - నానావిధములైన ఏవేవో తిండ్లు - ముఖ్యముగ మాంసములు తినకుండ నిగ్రహించుకొనుట - అనునవి ఆత్మోన్నతిని సాధించుటకు మిక్కిలిగ తోడ్పడుననుమాట నిశ్చయమేకాని, అంతమాత్రముచేత మనపనిపూర్తికాదు. గమ్యమునుచేరుటకది ఒకసాధనముమాత్రమేయగును. మాంసమును తింటూ ఎవరితోనైనా తేనేయని కలిసితింటూనే మరి భగవద్భక్తితో ప్రవర్తించుకొనేవారు చాలామందియున్నారు. అట్లుకాక, మాంసాహారమును, ఇంకఅనేకపదార్థములనుసహా, నిష్కర్షగవిసర్జించియు, తాముచేసేపనులలో నిత్యము భగవదపచారముచేయువారునుఉన్నారు. వీరికంటె, మొదటిరకంవారే మోక్షమునకు ఎక్కువచేరువలోఉన్నారని గట్టిగ చెబుతున్నాను.

("యంగ్ ఇండియా" 6-10-1921).

మనశరీరపోషణనిమిత్తమై మనతోడిప్రాణులను చంపుట మహాపాతకము. మనఆత్మోన్నతికి ఇట్టిజీవహింస మానుట అత్యవసరమని నాగట్టివిశ్వాసము. మనసాధనలో ఇట్టిస్థితిఎప్పటికైనా వచ్చితీరుతుంది. శాకాహారపు "పిచ్చి" నాకున్నది. ఈపిచ్చినిగురించి చెప్పుచున్నప్పుడు, "గోల్డుస్మిత్"అను ఒకానొక ఆంగ్లమహాకవి రచించిన కరుణారసభరితమైన ఈదిగువ రమ్యగీతము జ్ఞాపకంవచ్చుచున్నది.

తే. హరిత గిరిసాను సుఖచరత్ ప్రాణిగణము
హింసఁబాల్పడఁజేయ నే నెంచఁజాల
కరుణ ననుగను నా మహా పరమ పితరు
సరణిఁ దెలిసొంది వానిపై జాలిగొందు!

[No flocks that range the valley free
To slaughter I condemn
Taught by the Power that pities me
I learn to pity them.]

("ఇండియాకుస్వరాజ్యము" అను గ్రంథమునుండి
1932 - పేజీ 402).

ఇంద్రియములను అదుపులో ఉంచుకొనదలచిన వారికి జంతాహారము ఎంతమాత్రమూ పనికిరాదని అనుభవంవల్ల నేను తెలుసుకున్నాను. అయితే, ఒక్కమాట - ప్రవర్తనను సరిదిద్దుకోవడంలో కాని, ఇంద్రియములను నిగ్రహించుకోవడంలో కాని, ఆహారంయొక్క ప్రాముఖ్యమును గూర్చి అతిగ చెప్పుకొనుటకూడ సరికాదు. మనం తినేతిండి యెట్టిదో జాగ్రత్తగచూచుకొనుటకూడ అవసరమే - అదిచాలాప్రధానమైనదే - దానినిగురించి మనం ఎంతమాత్రము అశ్రద్ధచేయరాదనుటయు నిజమే కాని, మతమనేదిఅంతా కేవలం తినేతిండిలోనే ఉన్నదని చాదస్తంగా అనుకోవడంకూడ తప్పే. ఈ చాదస్తం ఇండియాలో హెచ్చుగఉన్నది. ఎంతమాత్రము జిహ్వాచాపల్యాన్ని కట్టివేసుకోనకుండ, పదిపడితేఅది, ఎప్పుడు పడితేఅప్పుడు, నానాచెత్తచెదారం చెడామడా తింటూ

ఉండడం ఎంతతప్పో-సర్వమతసారం తిండిలోనే ఉన్నదనడం కూడ అంత తప్పే.

(యంగ్ ఇండియా).

అహింస కేవలం ఒక్క తిండిలోనే లేదు. దానికి అది అతీతంగా ఉన్నది. మనిషి యేమితింటున్నాడు, ఏమి త్రాగుతున్నాడు అనేవి చిన్నవిషయాలు. వీటిఅన్నింటికంటె - వీటిననుసరించియున్న జిహ్వానిగ్రహమనేదే ఎక్కువ ప్రధానమైనవిషయము. నీవు తినదలచుకున్న పదార్థములగురించి ఎంతైనా జాగ్రత్తపడితే పడు - దానికేమీఅభ్యంతరము లేదు. ఈజాగ్రత్త, ఈనిగ్రహము మంచిదే. అవసరము కూడాను. అయితే, ఇవన్నియు అహింసలో సహస్రాంశము మాత్రమే యని తెలిసికొనుము. తినేతిండివిషయములో అట్టే పట్టింపు లేకుండా ఉండికూడా అహింసాధర్మానుష్ఠానమూర్తులుగ ఉన్నమహానుభావులెందరో ఉన్నారు. అట్టివారందరు మనకు వందనీయులే. ఎవరిహృదయము కరుణారసభరితమై ఇతరులబాధజూచినప్పుడు భరింపజాలక కరగి నీరై పోవునో - ఎవరిహృదయములో ఎట్టికల్మషములులేకుండ ప్రక్షాళనమై పోవునో, అట్టివారే ఆ అహింసామూర్తులు. ఇట్టి సల్లక్షణ సంపత్తియున్నచో, ఆవ్యక్తికి తిండివిషయమై అట్టేపట్టింపు లేకపోయినప్పటికి, అతనిని అహింసామూర్తియే యనవచ్చును. అట్లుకాక, ఒకవ్యక్తి తిండివిషయంలో అతిపట్టుదలగఉండి కూడ, స్వార్థమునకు, ఇంద్రియోద్రేకమునకు బానిసయ్యె.

పాషాణహృదయుడైనచో, అట్టివానికి అహింసయంటేఏమిటో తెలియనే తెలియదన్నమాట.

(యంగ్ ఇండియా 6-9-1928)

గ్రామసేవకుడు రోజుకు మూడణాలకుమించకుండఉండే మామూలు గ్రామస్థునితిండిమీదనే బ్రతుకవలెనని గాంధీగారు అంటున్నమాట నిజమే. అయితే, కేవలం కడుపు మాడ్చుకొని మరీ తగ్గించుకొని తినాలని ఆయన ఉద్దేశ్యం కాదు. ఒకనాడు ఒకగ్రామస్థుడుండెను. ఆయన రోజుకు ఒక పూటేతిండితినేవాడు: అదిన్నీ అతిస్వల్పము - అనగ 15 తు॥ అన్నం, కాస్త పప్పుకూర, కొంచంమజ్జిగ, - మొత్తమంతా, కలిపి రోజుకు ఒకఅణాఖరీదుమించని తిండితినడమనే కఠోర వ్రతము పట్టినాడు. ఇందుపై గాంధిగారు ఆయకిట్లు సలహా వ్రాసెను.

"నీఆహారము అత్యల్పముగనున్నది. అదిదాదాపు కడుపుమాడ్చుకోవడమే అన్నమాట. భగవంతుడీ శరీరాన్ని మనకు ఒకధర్మసాధనగ ప్రసాదించియున్నాడు. దానినినీవు పూర్తిగ ఉపయోగించుకొనడంలేదు, భగవద్దత్తమైనశక్తులను ఎలాఉపయోగించుకోవాలో తెలియనివానినుండి - తెలిసియు ఉపయోగించుకొననివానినుండి - ఆశక్తులు లాగివేయబడు నట, ఈకథ నీకుతెలుసునా?

ఇంద్రియములు మనముచెప్పినమాటవినక, తిరుగు బాటుచేసినప్పుడు వాటిని అణచవలసినదే. దానిఅవసరం అప్పుడువస్తుంది. కాని, ఇంద్రియములు మనస్వాధీనంలో

ఉండి, మనము చెప్పినట్లు వింటున్నప్పుడు-వాటిని పరోపకారార్థమై వినియోగింపవీలైనప్పుడు-వాటిని అణచడం, మాడ్చడం తప్పు. అంటే, ఇంద్రియములను అనవసరంగా మాడ్చటంలో ప్రత్యేకం ఘనతయేమీ లేదు."

(హరిజన్ 12-11-1935)

## 8

### - త్యాగము - స్వార్థత్యాగము -

త్యాగమంటే ప్రపంచాన్ని వదలివేసి అడవులలోపోయి ఒంటరిగా కాలాన్ని గడపడం కాదు. నీ నిత్యజీవితంలో నీవు చేసే ప్రతిపనిలోను ఈ త్యాగ లక్షణం కనిపించాలి. ఒక గృహస్థుడు తన సంసారాన్ని ఇంద్రియ లోలత్వమునకై కాక, తన విధ్యుక్తకర్తవ్యముగ ఎంచుకుని సంచరిస్తుఉంటే, ఆతడు త్యాగియే - అతడు సంసారంలో ఉన్నంతమాత్రంచేత త్యాగి కాకపోడు. అల్లే, ఒక వర్తకుడు. నిత్యము తనచేతులలో నుండి కోట్లకొలది ధనము అటుఇటూ తిప్పుచున్నప్పటికి అతడు త్యాగబుద్ధితో ఈపనులు చేస్తున్నట్లయితే, అతడును త్యాగియే. అతడు ధనాదిశక్తులను పరుల సేవనిమిత్తమై ఉపయోగించుచున్న యెడల ఆతడు త్యాగియే. అట్టివాడు లోకులను మోసగింపడు - వ్యాపారంలో అక్రమలాభములు పొందజూడడు. నిరాడంబరమైన జీవితమునడుపుకొనును. ఎట్టిప్రాణికిని హానిచేయడు, కోట్లకొలది ధనం నష్టపడడానికైనా సిద్ధపడతాను కాని ఎవరికి హానికలిగించడు.

త్యాగధనుని జీవితము కళాపరిపూర్ణమైన ఉత్తమపదముగనుండును. అది యే విజ్ఞానానందముతో నిండియుండును. లోకులకు సేవచేయదలచినవాడు, తన సౌఖ్యమునుగూర్చి యోచిస్తూ కాలమువృథాచేయడు తన యోగక్షేమములను పాలించునని రక్షించునని యెరిగి ఆ పరమేశ్వరునికే వదలివేస్తాడు. కనుక, కంటికి కనబడినవస్తువునల్లా "నాది" అని తాను ఇంట్లో వేసుకోడు. అట్టివాటిని బరువులచేటుగ ఎంచుకుంటాడు. తనకు అత్యవసరముగ కావలసినంతవరకే తీసికొని, మిగతాదానిని వదలివేస్తాడు. తనకెట్టి అసౌకర్యములు కలిగినను చిరాకుపడడు, కోపమువహించడు, చెక్కు చెదరకుండ మనస్సులో ప్రశాంతముగనుంటాడు. సుగుణసంపత్తికి ప్రతిఫలం సుగుణ సంపదయే - అట్లే సేవకు ప్రతిఫలం సేవయే. దానిలోనే అతనికి పూర్ణతృప్తి కలుగుతుంది.

లోకులకు సేవచేయవలెనంటె మనలో ఉన్న ఉత్తమ గుణములన్నీ పైకి రావాలి. కల్తీవంచనచేయకుండ, సర్వ సద్గుణములను సాధికలోనికి తెచ్చుకోవాలి. తనమేలుకంటె ముందుగ లోకులమేలును చూడాలి. ఇంతయేల స్వచ్ఛమైన భక్తుడు యెట్టి అరమరిక లేకుండ తనజీవితమును యావత్తు మానవ సేవకై అంకితముచేసి వేస్తాడు.

("ఎరవాడామందిరమునుండి" - 1945-పేజీలు, 57-60)

తాను చేసిన త్యాగమునుగూర్చి తాను (తదుపరి తన మనస్సులో) దుఃఖపడరాదు. మనస్సులో ఇలా దుఃఖపడితే,

ఆత్యాగముయొక్క పవిత్రతయే పోతుంది; అంతేకాదు, అట్టి వర్తిశీవస్తే, మనిషి విరిగిపోతాడుకూడా. తనకు హానికరమైన వని తోచిన వస్తువులనేకద మనిషి వదలివేస్తాడు? అట్టిచో, ఆ వదలివేసిన వస్తువులగూర్చి విచారపడడానికిబదులు, "పీడ వదలిపోయిందని" సంతోషించవలెనుకద.

(యంగ్ ఇండియా 15-7-1926).

# 9

## —: కాయకష్టంచేసి, మరీ, తిండితిను :—

"మనిషిబ్రతకవలెనంటె అతడుచెమటోడ్చాలి" అనే పరమసత్యము నాకు మొట్టమొదటగ "టాల్‌స్టాయి" అనే రష్యాతత్వవేత్త వ్రాసినవ్రాతలు చదివినమీదట గోచరమైనది. ఇంకా, అంతకుపూర్వమే ఆంగ్లతత్వవేత్త "రస్కిన్" అనే ఆయన వ్రాసిన "అంటు దిస్ ల్యాస్ట్" అనేగ్రంథం చదివినమీదట ఆ పరమసత్యాన్ని నేను పూజించడం ప్రారంభించాను. "కాయకష్టముచేసియే మనిషి తనభుక్తి సంపాదించుకోవాలి" అన్నది భగవన్నిర్ణయమైన సూత్రము. ఈసత్యాన్ని మొట్టమొదట నొక్కిచెప్పినవాడు "టి. యం. బాండారిఫ్"అనే రష్యన్ గ్రంథకారుడు. తదుపరి "టాల్‌స్టాయ్" ఈసిద్ధాంతాన్ని బయటికితీసి, బాగా ప్రచారం చేశాడు. ఈసిద్ధాంతమే మనభగవద్గీత మూడవఅధ్యాయములో వివరింపబడియున్నదని నాఅభిప్రాయము. (దేవతలకు) బలిపెట్టకుండ ("యజ్ఞము" చేయకుండ) ఊరికే

వంతుకుతినేవాడు దొంగిలించిన తిండితినేవాడని గీతచెప్పినది. "బలి" అనేమాట, "యజ్ఞం" అనేమాటకు ఇక్కడ అర్థం "కాయకష్టం" అనేతప్ప వేరేఅర్థములేదు.

మనబుద్ధితో తర్కించిచూచినా ఈసత్యమే మనకు గోచరిస్తుంది. కాయకష్టంచేయనిమనిషికి (తేరగా) తిండి తినడానికి ఎల్లాఅర్హతవస్తుంది? క్రైస్తవుల "బైబిలు"గ్రంథ మేమంటున్నది: "చెమటఓడ్చి నీవు తిండితిను" అంటున్నది కద. ఒకకోటీశ్వరుడు హార్దస్తమానం కాలు క్రిందపెట్ట కుండ మెత్తటిపరుపులలోపడి దొర్లుతూఉంటే, - తిండికూడ ఎవరైనా నోటిదగ్గరకు తీసికొనిఅందిస్తూఉంటే - అతనికి ఆ బ్రతుకు విసుగుపుట్టదా? ఇలా ఎంతకాలం కాలుచేయి కదపకుండ ఉండగలడు? ఆకలిమందగించదా? కనుక, ఆకలి కలిగించుకోడానికి ఆతడేమిచేస్తాడు? బస్కీలో, దండేలో, తీయాలికదా! అప్పుడుకదా అతనికి నోటికిముద్దయెక్కుతుంది! ఈరీతిగా, భాగ్యవంతుడుకాని, పేదవాడుకాని, ఏదో రూపంలో కాళ్ళూచేతులుకదలించి కసరత్ చేయవలసిఉంటే, ఆ కసరత్ అనేది, ఆ శ్రమఅనేది, ఉపయోగపడే యేదో శ్రమగా ఉంటే ఎంతబాగుంటుంది! దీనిని "అన్నమిచ్చే కసరత్", "అన్నమిచ్చే కాయకష్టం" 'బ్రెడ్ లేబర్' అందాము. పొలంలో పనిచేసే కర్షకునితో "నీవు దండేలుతియ్యవయ్యా, బస్కీలుతీయవయ్యా, ప్రాణాయామం చెయ్యవయ్యా" అని చెప్పవలెనా? మరి, మానవకోటిలో పదింటతొమ్మిది వంతులుపైచిలుకు జనం నేలదున్ని కాయకష్టం చేసి బ్రతికే

వారేకద. ఇక మిగిలిన ఆ కొద్దిమంది పదింట ఒకవంతుకు తక్కువైనజనంకూడా అపారమైన బహుసంఖ్యాక కర్షకజనం వలెనే కాయకష్టంచేస్తూఉంటే - కనీసం తమతిండివరకైనా చెమటోడ్చి పనిచేస్తూఉంటే బహుశా ఇప్పటికంటె లోకమెంత సుఖమయముగ, ఆరోగ్యవంతముగ, ప్రశాంతంగా ఉంటుంది! ఇట్టివారు ఈ కృషిలో తామొక చెయ్యివేస్తే ఇప్పుడు వ్యవసాయానికి సంబంధించియున్న అనేకక్లిష్ట సమస్యలుకూడ సులువుగ పరిష్కారమైపోతవికద. మినహాయింపులేకుండ ప్రతిఒక్కరు ఈ రకంగా తిండివరకైనా కాయకష్టం చేసితీరాలనే ధర్మాన్ని బాధ్యతను అంగీకరించి ఆచరిస్తూఉంటే, మానవసమాజంలో నేడుకనిపించుచున్న ఈ దిక్కుమాలిన హెచ్చుతగ్గులు మాసిపోవునుకద. కాయకష్టం చేయవలెననే ఈధర్మం అన్ని వర్ణములవారికి సమానంగా వర్తించే ధర్మమే. ధనవంతులకు, కూలివారికి మధ్యస్పర్థ ప్రపంచం అన్నిదేశాలలోను ప్రబలియున్నది. పేదవాడు ధనవంతునిచూచి అసూయచెందుతున్నాడు. అట్లుకాక, అందరుకూడ కాయకష్టంచేస్తూఉంటే, ఈ హెచ్చుతగ్గుల తరగతుల భేదము మాసిపోతుంది. ధనవంతులు అట్లాగే ఉంటే ఉండవచ్చుకాక. కాని, వారాధనముసు తమ సొంతముగ ఎంచుకొనకుండ దానికి తాము ధర్మకర్తలుగ ఎంచుకొని తదితరులకొరకు దానిని వినియోగిస్తూ ఉంటారు.

అహింసననుసరిస్తూ, సత్యమునుఆరాధిస్తూ, బ్రహ్మచర్యానుష్ఠానమును సహజధర్మముగ చేసికొన్నవానికి, ఈ

కాయకష్టానుసరణమనేది సర్వశ్రేయోదాయకమైన వర ప్రసాదముగ ఉంటుంది. ఈ కాయకష్టమనేది ఒక్క వ్యవసాయమునకే నిజముగ వర్తించగలదు. కాని, ప్రస్తుతానికి ప్రతివాడు ఈ వ్యవసాయమును చేపట్టేస్థితిలోలేడు. అందువల్ల, నాగలిపట్టి వ్యవసాయం చేయలేనివాడు. పోనీ కనీసం రాట్నంపుచ్చుకొని వడకవచ్చును, లేదా, నేతనేయవచ్చు. వడ్రంగమో, కమ్మరమో చేయవచ్చు. కాని ఏది చేస్తూవున్నప్పటికీ వ్యవసాయమనేదిఒక్కటే ఆదర్శప్రాయమైన కృషియని మాత్రం సదా మనస్సులో మరువకుండ గుర్తుంచుకోవలెను. ప్రతివాడు తనపాకీపనితానే చేసుకోవాలి. తనకుతానేపాకీవాడుగ పనిచేసుకోవాలి. తిండిఎంత అవసరమో మలవిసర్జన కూడ అంతఅవసరముకద. అందువల్ల నీ చేతితో నీవుఅన్నం తిన్నట్లే నీచేతితోనే నీమలమునుకూడ తీసివేసి శుభ్రపరచుకో. (ఆ పని ఇతరులకు పెట్టకు.) ఇదే అత్యుత్తమైనపద్ధతి. ఒకవేళ ఇంట్లో ప్రతిఒక్కరు ఈ పాకీపని చేయడం సాధ్యంకాకపోతే కనీసం ఏ కుటుంబానికి ఆ కుటుంబమైన తమపాకీపనిని తాము చేసుకోవాలి. పాకీపని అనేది మనమానవసమాజంలో ప్రత్యేకంగా ఒకానొక తెగవారి మొగానమాత్రమే విధిగ వ్రాసిన వ్రాతయేయని యెంచడంలో, ఏదో పెద్ద దోషమున్నట్లుగ మూలంలోనేదోషమున్నట్లు నామనస్సుకుచాలా సంవత్సరాలనుండితట్టుచూవచ్చినది. అత్యవసరమైన ఈశౌచవిధిని ఈరీతిగా చాలహీనదశలోనికి ప్రప్రథమముగ దింపియుంచిన ఆ వ్యక్తి యెవరో ఇప్పుడు తెలిసికొనడానికి మనకు చరిత్రాధారములు కన్పట్టడంలేదు. ఆతడెవడైనా అగుగాక. ఆతడు మానవ

కోటికీ మేలుచేసినవాడుమాత్రంకాదని చెబుతున్నాము "మన మంతా పాకీవాళ్ళమేసుమా" అనేభావం మన మనస్సులలో చిన్నప్పటినుండి గట్టిగ ముద్రలుపడేటట్టుగ బోధించుకోవలసి ఉంటుంది. ఈ సత్యమును గ్రహించినవారికి దాని ఆచరణకు ఒక సులభమార్గమున్నది. అదేదనగ :- పాకీ పనిచేసి జీవించడమే మన జీవితసాధనగా ప్రారంభించడం. ఆ పనిలో మెళుకువలు తెలిసికొని, ఆవృత్తిలోనికి మనం దిగితే, మానవులందరు సమానులనే సమత్వభావం మనం గ్రహించడానికి, అది తోడ్పడుతుంది.

"పరవాడా మందిరంనుంచి" 1945 – పేజీలు 35–37

"యజ్ఞం." "శ్రమ" అనేవి అనేకరకాలు. వాటిలో ఒకటి తిండికై చేసేకాయకష్టం. ప్రతివాడు తనతిండికై చెమటోడ్చి శ్రమిస్తేచాలు – ఎక్కువచేయనక్కరలేదు. అప్పుడు అందరికి కావలసినంత తిండీ ఉంటుంది, కావలసినంత విశ్రాంతీ ఉంటుంది. "జనసంఖ్య ఎక్కువైందరో, తిండిపెట్టలేమరో, పిల్లలనుకనవద్దరో" అనే మొఱ్ఱకు తావుండదు. రోగాలుండవు. మనంనిత్యం మనచుట్టూ చూసే ఈ దుస్థితి ఉండదు. ఇట్టికృషియే అన్నిటికంటె మహోత్తమమైన "యజ్ఞము" – మహోన్నతమైనకృషి. కేవలం తన పొట్టకేకాక, మనిషి తన మనస్సుతోనో, తన కాలు చేతులతోనో, ఏవో ఇతరములైనకృషులు చేయవచ్చుగాక. అట్టివన్నీ అందరి సమిష్టిక్షేమము నిమిత్తమై ఉచితముగ, ప్రేమపూర్వకముగ చేస్తే కృషులు అవుతవి. ఇట్టి

స్థితిలో "ధనవంతుడు లేడు, పేదవాడు" లేడు - పై అంతస్థు వాడు లేడు, దిగువ అంతస్థువాడు లేడు - "స్పృశ్యుడు" లేడు "అస్పృశ్యుడు" లేడు.

ఇది అందని ఆదర్శమంటే అందుకు కాక. అంతమాత్రం చేత, దానికొరకై మనం సాధనచేయకుండా మానరాదు. "శ్రమ" లేక "యజ్ఞ"మనే ఆదర్శంలో ఉండే యావదంశములు మనం పూర్తిగా అనుష్ఠించలేకపోయినప్పటికి మన తిండి మనం సంపాదించుకోడానికి కావలసినంత వరకైనా ప్రతిరోజు మనం కాయకష్టంచేస్తే - అంతవరకైనా మేలే. ఆదర్శంవైపునకు మనం చాలవరకు ముందుకునడచిన వారమవుతాము.

మనమీ ప్రకారంచేస్తే మన అవసరములన్నీ చాలా వరకు తగ్గిపోతవి; మన ఆహారంకూడ నిరాడంబరం అవుతుంది. మనమప్పుడు బ్రతడానికి తినేవాళ్ళమవుతాము కాని తినడానికి బ్రతికేవాళ్ళముకాము. ఈ మాటను శంకించే వారెవరైనా ఉంటే తామే స్వయంగా పరీక్షించి చూడవచ్చు. అనగ, మీరే స్వయంగా చెమటోడ్చి, ఒక పదార్థమును పండించి, దానిని తినిచూడండి. అది వహ్వా, యెంత రుచిగా ఉంటుందో మీకు అప్పుడే తెలుస్తుంది. ఆ శ్రమవల్ల మీకెంతో ఆరోగ్యంవస్తుంది. అదిగాక, లోగడతిన్న పదార్థములనేకములు అనవసరమైనచెత్త అనికూడ అనిపిస్తుంది.

"అయితే కాయకష్టం చేతకాకుండ, బుద్ధిశ్రమచేత తిండి సంపాదించుకొని తినకూడదా" అని ఎవరైనా ప్రశ్నించ

వచ్చు. "కూడదనే" నేను గట్టిగా చెబుతాను. ఎందుకంటె, ఈ (భౌతిక) శరీరానికి కావలసినతిండి వగైరా అవసరాలు ఈ (భౌతిక) శరీరమే తీర్చాలి" అంటాను. "సీజరుకు(రాజుకు) చెందినది సీజరుకే ఇచ్చివేసేయి" అనేసామెత ఇక్కడ బాగా వర్తిస్తుందనుకుంటాను.

బుద్ధితో, మనస్సుతో చేసేపరిశ్రమ, లోపల అంత రాత్మకు సంబంధించినదిగ ఉంటుంది. దానికదేతృప్తి. దానికి (వస్తురూపమైన) ప్రతిఫలంకోరకూడదు ఆదర్శమైన రాజ్యంలో డాక్టర్లు లాయర్లు మొదలైన బుద్ధిశ్రామికులు కేవలం మానవశ్రేయస్సుకొరకే పనిచేస్తారుకాని, తమ స్వార్థంకొరకై ఎంతమాత్రముకాదు. "కాయకష్టంద్వారానే తిండి సంపాదించుకోవాలి" అనే ఈ సిద్ధాంతముననుష్ఠించిన ట్లయితే, నేటి మానవసమాజస్వరూపములోనే (పైకి తెలియ కుండానే) ఎంతోమార్పు. విప్లవాత్మకమైనమార్పు — వస్తుంది. మానవునియొక్క గొప్పతనము స్వార్థంకోసం ఒక రితోనొకరు గుద్దులాడుకొని జయించుకోవడంలో కాకుండా పరస్పరం సహకరించుకోవడంలో– ఒకరికొకరు ఉపకారం చేసుకొనుటలో పోటీపడంలోనే ఉంది. "పోటీ"అనేది ఒక రితో నొకరు గుద్దులాడుకోవడంలో కాకుండ, ఒకరికొకరు సహాయంచేసుకోవడంలో,ఉండాలి. మనిషియొక్క గొప్పతనం అందులోనే ఉంది.ఒకటినొకటి పీక్కుతినే జంతుధర్మంపోయి (దీనినే మత్స్యన్యాయం అంటారు.) "ఆత్మవత్ సర్వభూ తాని" అనే మానవధర్మం ప్రతిష్ఠితమవుతుంది,

"గ్రామాలకు పోండి" అనే మాటకు అర్థమిదే. అనగ "కష్టించిమరీ అన్నం తినండి" అనిఅర్థం. అయితే కొందరు విమర్శకులేమంటారంటే. కోట్లకొలదిజనం గ్రామాల్లో ఉండనే ఉన్నారుకదా; వారంతా కడుపునిండా తిండి తింటు న్నారా, సగం కడుపునకే తింటున్నారుకదా, దీనికేమిచెబు తారు" అని అడుగుతున్నారు నిజమే. కాని దీనికి సమా ధానము స్పష్టమే. అదేమంటే:- వీరుతింటున్న ఆసగంఅన్నం కూడ కష్టించి తింటున్నమాటనిజమే. "కష్టించి తిను" అనే సూత్రానికి వీరువిధేయులయియేయున్నారు. కాని, ఈ విధేయత స్వచ్ఛందమైనదికాదు. అనగ, వారంతటవారు మన స్సులో ఇష్టతమీాద చేసేదికాదు. విధిలేక పరిస్థితులబలాత్కా రముచేత చేసేదిగాఉన్నది. వీలైతే ఈ కాయకష్టం తప్పించు కొని పారిపోదామనిచూసే ధోరణేవారిది. పల్లెటూరు విడిచి పారిపోయి హాయిగా ఏ బస్తీలోనో వెన్నెలవిసనకర్రలలాగున తిరుగుదామనే మనస్తత్వమే వారిది. ఒకయజమానికి బలా త్కారంగా లొంగి విధిలేక - చేసేవిధేయత, బానిసత్వమని పించుకుంటుంది కాని, స్వచ్ఛంధసేవయని యనిపించు కొనదు. అట్లుకాక, ఐచ్ఛికంగా తండ్రికివిధేయుడై కొడుకు చేసేసేవ, సత్పుత్రుడనేకీర్తికిపతాకగ ఉంటుంది. అదేరీతిగా బలాత్కారంగా కాయకష్టం చేయవలసివచ్చి చేసి తినేతిండి దారిద్ర్యానికీ, రోగాలకు,అసంతుష్టికి మూలమవుతుంది. ఇట్టిది కేవలం బానిసత్వము. స్వచ్ఛందంగా— మన ఇష్టాపూర్తిగా చూపే విధేయత మనకు సంతృప్తిని, ఆరోగ్యాన్ని ఇస్తుంది - ఈ ఆరోగ్యమే మనకు నిజమైనధనం - బంగారు మొహిార్లీలు

వెండినాణాలు, కావు. "గ్రామ పరిశ్రమలసంఘం" అనే పేరుతో స్థాపించబడిన సంఘము ఇట్టి "స్వచ్ఛంద కాయకష్టం" సిద్ధాంతమునకొక ప్రయుక్తసాధనముగ ఉద్దేశింపబడినదే.

—(హరిజన్ 29-6-1935)

ప్రశ్న:— "మహాకవి రవీంద్రుడు, మహాప్రకృతివేత్త 'రామన్' వంటివారుకూడ, కాయకష్టంచేసి తిండి తినాలిసిందే" అని మనము నిక్కచ్చిచేయవలసినదేనా? ఇదంతా వట్టిదంబుగకాదా? బుద్ధిశ్రామికులు, శరీరశ్రామికులుకూడ సమానులేఅని మన మేలఅనరాదు - ఇరుతెగలవారు ఉపయోగకరమైన సంఘసేవ చేసేవారేగా!

జవాబు :- బుద్ధిశ్రమకూడ ముఖ్యమైనదే. జీవితవిధానంలో దానికికూడ ఉచితస్థానమున్నది. ఇది నిస్సందేహామే. కాని, నేననేదేమంటే (భౌతికమైన) శరీరశ్రమ అందరికీ విధాయకము అవసరముఅంటాను. ఏ మనిషిని ఈ విధికృత్యమునుండి మినహాయించడానికి వీలులేదు. కాయకష్టముచేస్తే ఆ బుద్ధిశ్రామికుల కృషికికూడ మరింత వన్నెవస్తుందటాను.

(హరిజన్ 23-2-1947)

# 10

## * స్వదేశీ *

స్వదేశీవ్రతావలంబియైనవాడు ప్రప్రథమముగ తనకు సన్నిహితంగా తనచుట్టూఉండే జనానికి ఉపకారము- సేవ - చేయడానికి తన జీవితమును అంకితంచేసుకుంటాడు. అంటే మిగతా (దూరస్థుల) జనసంగతి వదలివేస్తాడన్నమాట; ఒకప్పుడు వారిమేలును బలికూడ పెడతాడన్నమాట. అయితే ఈ "వదలివేయడం" "బలిపెట్టడం" అనేవి పైకి మాత్రమే అట్లా కనిపిస్తవి. తత్వతః విచారిస్తే, దగ్గిరవారికి చేసే స్వచ్ఛమైనసేవ, ఉపకారం - దూరస్తులకు అపకారంగా ఎన్నడూ పరిణమించవలసినపనిలేదు; పరిణమించదుకూడాను. ఆ సేవయొక్క స్వతస్సిద్ధమైన గుణమట్టిది. సన్నిహితులసేవ దూరస్థులకు అపకారంకాకపోగా, మేలేఅవుతుంది. "ఆత్మవత్ సర్వభూతాని" - అనేసూత్రము గురితప్పని - అమోఘమైన సూత్రము. దీనిని ప్రతివారు గాఢముగ మనస్సుకు హత్తుకొనవలెను. దానివల్లమనకు శ్రేయస్సుకలుగుతుంది. అట్లుకాక దగ్గిరవారినివదిలివేసి ఏక్కడోఉన్నవారికి సేవచేస్తానని బారలుచాపుతూ భూగోళముయొక్క అంచులకుపరుగులెత్తే మనిషి తుదకు ఉభయభ్రష్టుడవుతాడు; ఇటు తనసన్నిహితులకు సేవచేయవలసిన విధాయకకృత్యములు తప్పిపోయిన వాడగుటయేకాక అటు దూరస్థులకేమో మేలుచేద్దామనే ఆశ్యాశనుకూడ భగ్నపరచుకున్నవాడవుతాడు. ఒక ఉదాహరణ చూడండి; నేను పుట్టిపెరిగినచోట నాకు ఇరుగుపొరుగు వారు

సన్నిహితులు కొందరున్నారనుకొండి. వారిలో బంధువులు నాపై ఆధారపడియున్నవారున్నారు, నావల్ల ఉపకారంపొందాలని సహజంగా వారుకోరుకుంటూఉంటారు. అల్లా కోరుకోడానికి వారికి హక్కుకూడా ఉన్నది. అటువంటివారినందరిని అర్థాంతరంగా వదలివేసి ఎక్కడోదూరంగా ఉన్నవారికి సేవచేస్తానంటూ లేచిపోతాననుకో. దీనివల్ల జరిగేదేమిటి? దగ్గరలో ఉన్న నాబంధువులు ఆశ్రితులు దిక్కులేనివారై అల్లాడుతూ ఉండడం జరుగుతుంది. అంతేకాక నేను వసుగెత్తిన ఆ కొత్త చోటులో—నా "పిలువని పేరంటపు" హంగామావల్ల నాపిచ్చి ప్రోత్సాహప్రదర్శనంవల్ల పరిస్థితులు తారుమారై గందరగోళమేర్పడడమే సర్వసాధారణముగా జరుగుతుంది. అంతకంటే మేలేమీ అక్కడ జరుగదు. ఈరీతిగా రెండుదుష్ఫలితాలు కలుగుతవి. ఒకటి నాసన్నిహితులక్షేమాన్ని భంగపుచ్చిన దోషం. ఇది క్షమించరానిదోషము. రెండవది చేసేదోమేలు చేస్తానని ఉరుకులాడుకుపోయిన ఆ దూరస్థులకు అనుకోకుండానే నావల్లహాని, చెరుపు, కలుగడం మరొకదోషం. స్వదేశీ వ్రతమును భంగపుచ్చినవానివల్ల ప్రప్రథమంగా ప్రాప్తించే రెండు దుష్ఫలితాలివ్వి.

అయితే స్వదేశీ,సూత్రాన్ని తప్పుగా అర్థముచేసుకున్నప్పుడుమాత్రమే కీడుకలుగుతుంది. ఉదాహరణ చూడండి. దగ్గరవారుకదా, వీరిని పోషించవలెకదా యనిచెప్పి నాపిల్లాంబిడ్డలను దోచిపెట్టడానికిగాను దొంగతనంగానో దొరతనంగానో డబ్బుపోగుచేసుకోవడం మొదలుపెట్టితే. స్వదేశీధర్మాన్ని

నేను తల్లక్రిందులుగ చెడకొట్టినవాణ్ని అవుతాను. నా దారాపుత్రాదులయెడ నేనునిర్వర్తించవలసిన సక్రమధర్మాన్ని న్యాయమార్గాన నిర్వర్తించ వలసినదనియే స్వదేశీసూత్రము చెప్పుచున్నదికాని న్యాయమార్గముఅతిక్రమించి అన్యథా వర్తించవలసినదని చెప్పుటలేదు. అట్టిన్యాయమార్గమును అనుష్ఠింపబూనినప్పుడు విశ్వజనీనమైన సత్ప్రవర్తనవిధానములు నాకువాటంతటఅవియే గోచరమగును. స్వదేశీవ్రతానుష్ఠానము ఎవరికీ ఎన్నటికీ ఎట్టిహానియుచేయదు. అట్లుచేసేటట్లయితే అది స్వదేశీవ్రతమేకాదు. అది నన్నుకెచ్చగొట్టే దురహంకారమే అవుతుంది.

పరులసేవనిమిత్తమై తనదారాపుత్రాదులనుకూడబలిపెట్టవలసినఘట్టాలు స్వదేశీవ్రతానుష్ఠానంలో రావచ్చును. ఇట్టిస్థితిలో ఇష్టపూర్తిగ స్వచ్ఛందంగా అర్పించే బలికర్మ తాను తనదారాపుత్రాదులకుచేసే మహోన్నతమైనసేవగా ఉపకారంగా ఉంటుంది. "తనప్రాణాన్నిరక్షించుకొనగోరేవాడు దానిని కోల్పోతాడు; భగవత్ కైంకర్యముగ తనప్రాణాన్ని బలియిచ్చేవాడు రక్షణపొందుతాడు" అని బైబులుగ్రంథములో ఒక వాక్యమున్నది. ఈ మహావాక్యంవ్యక్తులకువర్తించినట్లు కుటుంబములకుకూడ వర్తిస్తుంది. ఇంకొక ఉదాహరణచూడండి. నా ఊళ్లో ప్లేగుజాడ్యం వ్యాపించినదనుకొనండి, ఆప్లేగురోగులకుసేవచేయడంలో, నేను, నాభార్య నాపిల్లలుఅంతా సాఫుగా చచ్చితుడిచిపెట్టుకుపోతామనుకోండి. ఇట్టిరోగులకుసేవచేయటంలో నాతోపాటు నాభార్యాపిల్లలనుకూడా రండిరండి అనిపిలిచి, వారినికూడా బలిపెట్ట

చూడడంలో నేను నా దారాపుత్రుల క్షేమాన్ని భంగపుచ్చినవాడనవను. వారికి నేను వినాశకారకుడగాను. పైపెచ్చు వారికి నేను పరమమిత్రుడనవుతానన్నమాట. స్వదేశీ ధర్మములో స్వార్థానికిచోటులేదు. స్వార్థమనేది ఏమయినా ఉంటే అదిపరమోత్కృష్టమైన స్వార్థమన్నమాట. (ఆత్మోన్నతిని సాధించుకునే స్వార్థమన్నమాట) ఈ రకపు "స్వార్థము" పరార్థమునకంటే పరమార్థమునకంటేభిన్నమైనది కాదు. విశ్వమానవసేవయొక్క పరమసారమే "స్వదేశీ."

ఈ హేతువాదననుసరించియే నాకు ఖాదీపై గురికుదిరింది. స్వదేశీతత్త్వాన్ని సంపూర్ణంగా అన్వయింపజేయడానికి ఈ ఖాదీయే అత్యవసరము, అతిప్రముఖ్యమైన సాధనగ నాకుగోచరమైనది. నామనస్సులో నేనొక ప్రశ్న వేసుకున్నాను. "ఇండియాలోనున్న అసంఖ్యాకజనానీకానికి ఇప్పుడు సద్యః అత్యావసరముగ కావలసిన వస్తువేది? అందరికి తేలికగ బోధపడి, నచ్చేదిఏది? సులభంగా అనుష్ఠించదగినదేది? తేలికగా చేపట్టదగినదేది? తద్వారా ఇండియాలో సగంఆకలితో పొట్టలు నకనకలాడుతున్న కోట్లకొలది జనం బతకటానికి సాధనమేది? ఇవన్నీకలిసివచ్చే సేవావిధానమేది?" అనినేనునాలో ప్రశ్నలు వేసుకున్నాను. ఈ ప్రశ్నలకుజవాబుగానే నాకు రాట్నము—ఖాదీ, అనేవి ప్రత్యక్షమైనవి. ఈ రెంటినీ విశ్వవ్యాప్తంగా చేయడం ఒక్కటే ఈ నా పై అన్నికోర్కెలను, షరతులను సంపూర్తిగ నెరవేర్చుటకు ఏకైకసాధనగ నాకుగోచరమైనది.

ఖాదీద్వారా స్వదేశీధర్మానుష్ఠానము చేస్తే ఇతరదేశాలలోనూ, ఇండియాలోనూ ఉన్నమిల్లుదార్లకు హానికలిగించినవారమవుతామని ఎవరు కాని భారబాటుపడరాదు. ఒకదొంగ ఉన్నాడనుకోండి. వాడిచేత దొంగతనంమాన్పించడం వానికి మనం హానిచేసినట్లా? దొంగసొత్తును వానిచేత అసలుయజమానికి ఇప్పించేటట్లు చేస్తే, ఆదివానికి నష్టపరచినట్లా? వానికి హానిచేసినట్లా? కాదు. వానికి మేలే చేసినట్లగునుకద. దొంగతనం మానడంవల్ల వానిగుణం బాగుపడి సుగుణసంపత్తి అనేలాభమును పొందుతాడు. దొంగసొమ్ము వదలించుకోవడంవల్ల పైకి నష్టంగా కనిపించినా — వాడుపాపవిముక్తియనే లాభాన్ని పొందుతాడు. అట్లేకల్లుతాగేవాళ్ళు, నల్లమందువేసుకునేవాళ్ళు తమతమదుర్వ్యసనాలను మానివేస్తే ఆ కల్లుదుకాణదారులకు ఆనల్లమందువ్యాపారస్తులకు హానిచేసినట్లా? ఈ వ్యాపారస్తులకు హానికలిగించకపోగా, వారికి నిజముగ మేలేచేసినట్లవుతుంది. "మేలు" అనేమాటకు నిజమైనఅర్థము తెలుసుకుంటే ఇదంతావారికిమేలే. పాపసంపాదనవదలిపోవడం ఉభయులకుమేలే. ఇటు కల్లుసారాయితాగేవాళ్ళకుమేలు- అవిఅమ్మేవాళ్ళకుమేలు. అది ఎవరికీనష్టములేదు. అదిఅందరికి స్వచ్ఛమైన మేలు.

స్వదేశీధర్మావలంబన అంటే ఊరికే ఏవో నాలుగు నూలుపోగులు అటూఇటూ వడికి, వడుకునూలుబట్టలు ఏవో కట్టుకుంటేసరి అనిఅనుకోవడం చాలాపొరపాటు. మనచుట్టూనున్నసంఘమునెడ మనమనుష్ఠించవలసిన కర్తవ్యనిర్వహణ

ములో ఖాదీ అనేది అనివార్యమైన ప్రప్రథమపు మెట్టు. ఖాదీ ధరించేవారు చాలమంది కనిపించవచ్చును. కాని, ఖాదీధరిస్తూనే, తదితర యావద్విషయములలో విదేశీవస్తువ్యామోహమునువదలలేక, వాటిలో మునిగిపోయినవారిని మనము తరచుచూస్తూ ఉంటాము. అట్టివారు స్వదేశీ ధర్మాన్ని అనుష్ఠిస్తున్నారని చెప్పజాలము. వారు ఖాదీకి ఏదో తాత్కాలికమైన "ఫ్యాషన్" — మోజువెంట పోతున్నారని మాత్రమే చెప్పాలి. స్వదేశీవ్రతావలంబి తన చుట్టూవున్న జనాన్ని పరిస్థితులను, చక్కగ, జాగ్రత్తగ, పరిశీలించి, పరీక్షించుకొంటూ ఉంటాడు. సాధ్యమైనంతవరకు తన ఇరుగుపొరుగువారికి సహాయంచేయాలని చూస్తూ ఉంటాడు గనుక, స్థానికముగ తన ఇరుగుపొరుగువాళ్ళు తయారు చేసిన వస్తువులనేకొని ఉపయోగించుకోవడానికిచూస్తాడు. అవి నాసిరకమువి అయినాసరే, ఇతర చోట్లనుంచివచ్చేవాటి కంటె ఖరీదు ఎక్కువైనవి అయినాసరే, అవేకొంటాడు. వాటిలో ఉండేలోపాలు సవరించడానికే ప్రయత్నిస్తాడు; అంతేకాని ఆ లోపాలుకారణంగా చూపెట్టి వాటిని విసర్జించి పరాయివస్తువులు కొనడానికి ప్రయత్నించడు.

అనేక మంచి అంశములనువలెనే, ఈ స్వదేశీ అనే దానినికూడ వికారంగా అనుష్ఠించవచ్చును. ఇట్టి ప్రమాదం సంభవించకుండ మనము జాగ్రత్తగ చూచుకోవాలి. విదేశీ వస్తువులు, అవి కేవలం విదేశీవిఅనే కారణంచేతనే విసర్జించి, మనదేశానికి సరిపడనివస్తువులను మనదేశంలో తయారు

చేయడానికిగాను, మన కాలమును ధనమును వృథాచేసుకొంటూ కూర్చోవడం కూడ గొప్పతప్పు. ఇది స్వదేశీ తత్వానికి విరుద్ధమైనపని. స్వదేశీధర్మావలంబి విదేశస్థులయెడ ఎన్నడూ మనస్సులోకూడ విద్వేషభావము వహింపలేడు; ప్రపంచంలో ఎవరియెడలకూడవిరోధభావ ప్రేరణచే నడవడు. స్వదేశీయమనునది విద్వేషవిధానముకాదు. అది నిస్స్వార్థసేవాధర్మము. అది స్వచ్ఛమైన అహింసాధర్మములో, ప్రేమ ధర్మములో, సుప్రతిష్ఠితమైయున్నది. (ఈ వ్యాసము 1931లో ఎరవాడాజైలునుండి విడుదలైన తరువాత గాంధిగారు వ్రాసినది. "ఎరవాడా మందిరంనుండి" అను గ్రంథములో 1945లో ముద్రింపబడినది. పేజీలు 63–67)

—: స్థూలంగా చెప్పవలెనంటే, స్వదేశీ అనగా ఇది :—

దేశీయపరిశ్రమలను సంరక్షించవలసివచ్చినంతవరకు,— ముఖ్యముగా, ఏ పరిశ్రమలు లేకపోతే ఇండియాప్రజలు జీవనాధారాలులేక మాడిపోతారో – అట్టిపరిశ్రమలను సంరక్షింపనవసరమేర్పడినంతవరకు – విదేశీవస్తువులను విసర్జించి, దేశంలో తయారైన వస్తువులే ఉపయోగించడమే ఈ స్వదేశీధర్మానికి స్థూలనిర్వచనము. కనుక ఆ వస్తువుయెంత మంచిదైనా యెంత ఉపయోగకారియైనా, దాని ఉపయోగం ఎవరినీ నష్టపరిచి దరిద్రులనుచేయకపోయినా— అదికేవలం విదేశీదిఅనే ఒక్క కారణాన్ని పట్టుకొని దానిని విసర్జించివేయడం "స్వదేశీ" ధర్మానుష్ఠానమనిపించుకొనదు. ఇది "స్వదేశీ" అనే పదానికి మిక్కిలి సంకుచితార్థమగును.

# 11

## —: అన్నిమతముల యెడ గౌరవము :—

మతములన్నీ ఒకే గమ్యస్థానమునకు చేర్చే రోడ్లన్న మాట. ఒకే గమ్యస్థానమునకు చేరేటప్పుడు ఏ రోడ్డయితే నేమి? నిజం చెప్పాలంటే – ఎంతమందివ్యక్తులున్నారో, అన్ని మతాలున్నవన్నమాట.

(హింద్ స్వరాజ్ : 1946– పేజీ 35–36)

మనమతమంటే మనకెంతగౌరవమో, ఇతరులమతములయెడలకూడ మనమంత గౌరవం చూపాలి. అంటే, మనమతంలోఉండే లోటువాట్లను మనం గమనించగలిగామన్నమాట. వాటిని ఒప్పుకుంటున్నామన్నమాట. ప్రేమ సూత్రమును అవలంబించే సత్యాన్వేషి ఇట్టిమాటలను తప్పకనే ఒప్పుకుంటాడు. సత్యముయొక్క సంపూర్ణ స్వరూపము మనకు గోచరమే అయియుంటే, మనము దానిని వెదకవలసిన పనేమున్నది? సత్యముయొక్క పూర్ణరూపము మనకు కనిపిస్తే మనము భగవంతునిలో ఐక్యమైనట్లే. ఎందుకంటే, సత్యమే దేవుడు కనుక. కాని, మనం పూర్ణజ్ఞానులముకాము. మనము సత్యాన్వేషులము. అనగా సత్యమేదో తెలుసుకోవాలని వెతుకుతూ ఉండేవాళ్ళము. అదిమనకింకా దొరకలేదు. అంటే, మనలోటు – మనం అసంపూర్ణులము అనేమాట– మనము గుర్తించామన్నమాట. మనమే అసంపూర్ణులమైతే మనమనుకున్నమతంమాత్రం అసంపూర్తిది కాకుండ

ఎట్లుండగలదు ? మనం అసంపూర్ణులము కనుక, మన మూహించిన మతంకూడ అసంపూర్తియే. దేవుణ్ణి మనంపూర్తిగా ఎలా తెలిసికోలేకపోయామో దాన్నికూడ మనం పూర్తిగ తెలిసికోలేదు. మన మూహించినమతం సంపూర్తిదికాదు కనుక, అది నిరంతరం మార్పులకు, క్రొత్త క్రొత్త అర్థాలకు, గురిఅవుతూ ఉంటుంది. ఈ నిరంతర పరిణామపరంపరలవల్లనే సత్యమువైపునకు, దేవునివైపునకు, మననడక సాధ్యమవుతున్నది. మానవమాత్రులచేత స్థూలముగ ఊహింపబడిన మతములన్నీ ఈ రీతిగా అసంపూర్తివేయైనప్పుడు వీటిలో వీటికి తారతమ్యముల ప్రశంసయేరాదు. అన్నిమతములు సత్యమును మనకు కొద్దికొద్దిగ చూపించేవేకాని, పూర్తిగ చూపించేవికావు. అందువల్ల, పొరపాటుపడుటకు అన్ని మతములలోను అవకాశమున్నది. ఇతరమతములయెడగౌరవము మనముచూపుచున్నామంటే, వాటిలోని లోపాలు మనం గ్రహించడం లేదనికాదు. అంతే, వాటితోపాటు మన మతంలోని లోపాలనుకూడ మనం బాగాజాగరూకతతో కనిపెట్టుకుంటూ ఉండాలి. అయితే, మనమతంలో లోపాలు కనిపెట్టినంత మాత్రాన, దానిని వదలివేసి, పరాయిమతంలో చేరాలని కాదు. ఆ లోపాలను సవరించుకోడానికి మనం గట్టిగా ప్రయత్నించాలి. సమానదృష్టితో అన్ని మతాలను పరిశీలించి చూస్తూ, వాటివాటిలో ఉండే సుగుణాల నన్నిటిని మనమతంలోనికి చేర్చుకొని, వాటిని మనవిగ చేసుకోడానికి మనం ప్రయత్నించాలి. ఇట్లు చేయుటకు ఎంతమాత్రము వెనుకాడకూడదు.

అంతేకాదు, ఇట్లాచేయడం మనవిధ్యుక్త ధర్మంగాకూడా ఎంచుకోవాలి.

చెట్టుకు ఒకేమొదలుఉండి, అనేకకొమ్మలు ఆకులు ఉన్నట్లుగానే, సత్యమైన సంపూర్ణమైన మతం ఒక్కటే ఉన్నది. అది మానవుల బుర్రలలోనుండి వెలువడేటప్పుడు బహుశాఖలుగ, పలుమతములుగ, తయారవుతుంది. ఈ అన్నిటికిమూలమైన ఆ ఏకైకమతము వాక్కునకు అందనిది మానవులు అసంపూర్ణులు — కనుక, వారికి చేతనైన భాషలలో దానిని చెబుతూఉంటారు. వారితోపాటే అసంపూర్ణులైన మరికొందరు ఆ భాషకు వ్యాఖ్యానాలు చెబుతూ ఉంటారు. వీరిలో ఎవరి వ్యాఖ్యానంసరైనది? ఎవరిదృష్టికి వారిదేసరైనది! అయితే, వీరిలోప్రతివారు చెప్పేది తప్పయి యుండుట అసంభవముకాదు. అందుకనే, సహనము అవసరము. అంటే తనస్వమతాన్ని అశ్రద్ధచేయవలసినదనికాదు. పైపెచ్చు, తన స్వమతాన్ని ఎక్కువవిజ్ఞానవిచక్షణాలతో నున్ను, నిర్మలమైన ప్రేమతోనున్ను, చూచుకొనవలెనని యే అర్థము. సహనమనేదిమనకు ఆధ్యాత్మికమైన అంతర్దృష్టిని ప్రసాదిస్తుంది. ఇది మతోద్రేకముకాదు. మతోద్రేకానికి సహనానికి ఉత్తర, దక్షిణ ధ్రువములకున్నంతదూరంఉన్నది. మతమునుగురించిన సత్యదృష్టి మతాలకు మతాలకుమధ్య నుండే అడ్డుగోడలనన్నింటిని పడగొట్టి వేస్తుంది.

("ఎరవాడామందిరంనుండి" — 1945 పేజీలు 38–40)

(7)

గొప్పగొప్ప మతాలనుగురించి పరిశీలిస్తున్నప్పుడు మనమొక సంగతి ముఖ్యంగా జ్ఞాపకం పెట్టుకోవాలి. అంటే ఆయా మతములయందు దీక్షితులైనవారిని బాగా ప్రసిద్ధిజెందినవారి వ్రాతలద్వారానే ఆ మతాలను పరిశీలించాలి. ఉదాహరణ:- భగవద్గీతనుగురించి బాగా తెలుసుకోవాలంటే, మూల గ్రంథమే చదవాలిగాని. ఎవరోచేసిన తర్జుమాలను చదివి ప్రయోజనంలేదు. వ్యతిరేకదృష్టితో వ్యాఖ్యానింప బూనిన వారి వ్రాతలు చదివి లాభంలేదు. భగవద్గీతయందు భక్తి శ్రద్ధలుగలవారి వ్రాతలే చదవాలి. అట్లే బైబిలు చదవాలంటే. సుప్రసిద్ధ క్రైస్తవభక్తులు వ్రాసిన వ్యాఖ్యానాల ద్వారానే చదవాలి. మనమతముతోపాటు ఇతర మతాలను కూడ ఈ రీతిగా పరిశీలనచేయడంవల్ల సర్వమతములకు ఏకైక మూలమైన గట్టిపునాది మనకు గ్రాహ్యమవుతుంది. "భిన్న మతముల భిన్నతత్త్వము మసారము"నకు దూరముగ నిర్మల స్ఫటికమువలె వెలుగుచున్న పరమసత్యమతము, విశ్వవ్యాప్తమైన మతము మనకు గోచరిస్తుంది.

ఇతర మతములను సమభావముతో పఠించుటవల్ల, స్వమతమందు మనకున్న భక్తి చలించి, సన్నగిల్లిపోతుందని ఎవరుకాని ఎన్నడూ తలపరాదు. ప్రతిమతములోను సత్యముయొక్క మూలతత్త్వములు ఇమిడియేయున్నవని హిందూ ధర్మము చెప్పుచున్నది. అందువల్ల అన్నిమతములయెడల మర్యాద గౌరవభావములుకలిగి యుండవలెననియు చెప్పుచున్నది. అనగ, తన స్వమతమందుకూడ మున్ముందుగ

గౌరవభావముండవలెనని యర్థము. ఇతర మతముల పరిశీలించి వానిని మెచ్చుకొన్నంత మాత్రముచేత మనస్వమతమునకున్న గౌరవము తగ్గిపోతుందనుకోరాదు. మన మతమందు మన కున్న గౌరవమే పర మతములమీదికికూడ ప్రసరిస్తుంది.

(యంగ్ ఇండియా 6-12-1928)

తమ మతమునుగూర్చి ఇతరులకు బోధించి చెప్పుకో వచ్చును. కాని, ఇట్లు చెప్పుటలో వారిని తమ మతములోకి కలుపుకోవాలనే దృష్టితో మాత్రం ఉండరాదు. భక్తి అనేది పైకి వేరే చెప్పుకోవలసినది కాదు. ఆ భక్తిప్రకారం మనం మనజీవితాన్ని నడుపుకోవాలి. అట్లా నడిస్తే ఆ మతం దానంతట అదే లోకంలో ప్రచారమైపోతుంది.

(యంగ్ ఇండియా 20-10-1927)

మతమనేది కేవలం వ్యక్తికి సంబంధించినది.మనభావాలకు అనుగుణ్యంగా మనం నడుచుకుంటూ పరాయివారిలో గల ఉత్తమబావాలను లక్షణాలను మనం అలవర్చుకోవాలి. ఈ రీతిగ ఒక మతస్థులు ఇంకొక మతస్థులతో పరస్పరం ఉత్తమలక్షణాలను, భావాలను, కలబోసుకొనవలెను. ఈ ద్వారా భగవంతుని చేరడానికి జరిగే మొత్తం మానవయత్నానికి, మనం తోడ్పడ్డవాళ్ళ మవుతాము.

(హరిజన్: 28-11-1936)

# 12

## అస్పృశ్యతా నివారణ :

ఎవరూ అస్పృశ్యునిగా పుట్టరు. అందరు ఆ ఏకైక మహాతేజమునుండి చెదిరిపడ్డ విస్ఫురవ్వలేకదా. ఒక మానవ వ్యక్తిని జన్మతః అస్పృశ్యునిగ ఎంచుట తప్పు.

అస్పృశ్యతను పాటించరాదంటే, అస్పృశ్యులనేవారితో స్నేహం చేసుకున్నంతమాత్రముచేత చాలదు. సర్వప్రాణులను మనవలెనే చూచుకొని, ప్రేమించవలెను. "ఆత్మవత్ సర్వభూతాని". "అస్పృశ్యతా నివారణ" అంటే యావత్ప్రపంచమును ప్రేమించి సేవించుట అని అర్థము. ఇదే అహింస. "అస్పృశ్యతా నివారణ" అంటే మనిషికి, జీవికి – జీవికిమధ్యనున్న భేదభావపు గోడలన్నీ పగులగొట్టివేయుట అన్నమాట. ఇండియాలోనేకాక, ప్రపంచంలో అన్ని దేశాలలోకూడ ఈ అడ్డగోడలుపెట్టబడియున్నవి. (వీటిని పడగొట్టివేయాలి)

(ఎరవాడా మందిరంనుండి–1945–పే 31, 33, 34)



# మూడవ విభాగము

## : ఆర్థిక విధానము :

(A అహింసాత్మక ఆర్థిక విధానము)

## 1

### అహింసా మూలము.

అందరికీ అందుబాటులో లేని వస్తువును - మనం అందుకోగలం గదా అని - లంకించుకోవటం మన ధర్మముకాదు. మనం కోరే నూతన ఆర్థికవిధానంలో మన ఆదర్శం ఈ రీతిగానే ఉంటుంది. ఈ రకం ఆర్థికవిధానము ప్రజలలో వ్యాపింపజేయుట అంత కష్టమేమీ కాదనుకుంటాను. ఈ నూతన విధానము చాలవరకు జయప్రదంగా మనము అమలు జరుపగలిగితే దీనివల్ల గొప్ప ఆధ్యాత్మిక ఫలితాలు మనకు తెలియకుండ వాటంతట అవే కలుగుతవి. ఆధ్యాత్మిక సూత్రాలు మన కందని నట్టిగాలిలో- తమ లోకంలో తామే ఎటో తిరుగాడే సూత్రాలుకావు. అంతమాత్రమేకాదు, అవి నిత్యజీవిత కృత్యాలలోనే వ్యక్తమవుతూఉంటవి. కనుక, ఇవి మానవుల ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలపై ప్రసరిస్తూ ఉంటవి.

(యంగ్ ఇండియా 3-9-1925)

## 2

### : ఆర్థిక సౌష్టవతకు మానవత్వలక్షణము అవసరము :

మనిషికూడ ఒక ఇంజనే. దీనిని నడిపించే యంత్రశక్తి మనిషిలో ఉండే ఆత్మయే. ఇదొక వింతమైన ఇంజన్. ఇది

జీతానికి పనిచేయదు. వత్తిడికిలొంగి పనిచేయదు. ఎంత ఎక్కువ జీతమిస్తే, ఎంత ఎక్కువ వత్తిడిపెడితే, అంత ఎక్కువ పనిచేసే ఇంజనున్నూ కాదు. దానిని నడిపించే ఆత్మశక్తికి, లేక, ఇచ్ఛాశక్తికి, బొగ్గువెయ్యాలి. ప్రేమయే ఈ బొగ్గు. ఈ బొగ్గు ఎంత ఎక్కువవేస్తే అది అంత ఎక్కువ శక్తివంతమై పనిచేస్తుంది. ఇట్టి విషయాలలో సర్వత్రా ప్రవర్తించే సూత్ర మొకటి యున్నది. అదేమనగ యజమానిలో నౌకరులోకూడ ఏదో కొంత బుద్ధిశక్తి అనేవి ఉన్నవని అనుకుందాము. అయినప్పటికి వారికి కొనసాగలిగే గరిష్ఠ భౌతికఫలితం ఏ రీతిగా కలుగుతుందంటే, ఒకరికొకరు విరోధపడడంవల్ల కాదు. ఒకరియెడల ఒకరు సద్భావము ప్రేమకలిగి యుండడంవల్లనే కలుగుతుంది. నిస్స్వార్థమైన అనగ, ప్రతిఫలంకోరని ప్రేమభావం వల్లనే అత్యంతమైన లాభం కలుగుతుంది. మనం చూపే దయకు ప్రతిఫలంగా మన నౌకరు మనయెడ మంచిగా ఉండాలనే కోరికచేత మనము వానియెడ దయజూపితే, అట్టి కృతజ్ఞత అట్టి మంచి నీకు వానినుండి రాదు, నీకు రాతగదుకూడ. అంతే. ప్రతిఫలోద్దేశ్యంతో చూపే దయకు విలువ లేదు. అందువల్లనే నీకా విలువ తిరిగిరాదు. అట్లుకాక, ఆర్థిక ప్రతిఫలం పొందాలనే కోరిక లేకుండ, ఊరికే – నిష్కామ బుద్ధితో నీ నౌకరుయెడ దయజూపుము. అప్పుడు, నీకు సర్వార్థిక లాభములున్నూ వాటంతట అవి వచ్చిపడతవి. బైబిలులో చెప్పినట్లు "ప్రాణం రక్షించుకునేవాడు కోల్పోతాడు. కోల్పోయేవాడు రక్షించుకుంటాడు." అనే సూత్రము ఇతర సందర్భా

ంలో వలెనే- ఈ ఆర్థిక సంబంధాలలోకూడ - సమానముగా వర్తిస్తుంది.

ఒక ఆఫీసరు తనక్రింది సిబ్బందిచేత అత్యధికమైన పనిచేయించడానికిగాను - తనకు ఈ మాత్రమైన శ్రమ లేకుండ - కేవలం రూల్సునే అమలుజరుపబూనినా డను కొందము. ఇట్టి ప్రతిఫలాకాంక్ష సిద్ధాంతముమీద పనిచేస్తే, ఎన్ని క్రమశిక్షణ రూల్సు అమలుజరిపినా, అతను తనసిబ్బంది వద్ది పూర్తిపనిని తీసికోలేడు. అట్లుకాక, తన సిబ్బందితో అత్యంత సన్నిహిత స్నేహభావముకలిగి, వారి యోగక్షేమ ములయందు అత్యంత శ్రద్ధకలిగి. వారిజీవితములను అత్యంత మైన విలువతోచూచుచుండిన యెడల వారి శక్తిని కౌశల మును, అత్యంతసమర్థవంతముగ పటిష్టముగ పెంపొందించ గలడు. వారికి తనయెడల ఉద్భవించిన సద్భావప్రేమలవల్ల నున్న తనప్రవర్తనయెడల వారికిచిక్కిన విశ్వాసమువల్ల నున్న వారియొక్క శక్తి కౌశలమును ఏ ఇతరవిధముచేతను అందుకొనజాలనంత మహోన్నతసితికి కొంపోగలడు,

ఒకవర్తకప్రకారం పెనీయజమాని తనకంపెనీలో తనక్రింద నున్న సౌకర్లకందరికి తండ్రివంటివాడు. అనగ తండ్రికున్న అధికారముతోపాటు, బాధ్యతకూడఉన్నదన్నమాట. ఒక చిన్నకుర్రవాడు ఈ కంపెనీలో తనక్రిందికి నౌకరుగా వచ్చాడు అనుకొందము. సాధారణముగవానిస్థితియేమి? ఆ కుర్రవాడు తనతలిదండ్రుల ఆదరణభరితవాతావరణమునుండి

వెలువడి బయటికి రావలసివచ్చినదిగద. కనుక ఆకుర్రవానికి ఇకతండ్రియైనా, తల్లియైనా ఆకంపెనీయజమానియే. ఇతనికి సదాప్రోత్సహించడానికి, వానిమంచిచెడ్డలచూడడానికి దగ్గర ఈ యజమానితప్ప యెవరుంటారు? కనుక, తన నౌకర్లకు న్యాయముకలుగజేయడానికి ఆయజమానికి ఒకటేమార్గమున్నది? ఎట్లంటే తనకొడుకే వేరేదిక్కులేక తనకంపెనీలోనే ఒకనౌకరుగకుదురుకోవలసివస్తుందనుకోండి ఈ రీతిగా తనకొడుకే నౌకరుగవచ్చినప్పుడు ఆయజమాని వానినెట్లాచూస్తాడు? "నాకొడుకే ఈ నౌకరుగవస్తే నేనెట్లాచూస్తాను?" అనే ప్రశ్నను ఈ యజమాని నిర్మొగమాటంగా తనకుతానే వేసుకుంటేసరి. దానికివచ్చేజవాబే దీనికి మార్గము.

ఒకఓడకెప్తాను తనకొడుకునే సామాన్యపు నావికుడుగ ఉంచవలసివస్తుందనుకో. అప్పుడుతాను తనకొడుకునెట్లాచూస్తాడో, మిగతా తనక్రిందనౌకర్లనందరిని అట్లాగేసమానాదరణభావముతో చూచితీరాలి. ఇది ఆతనివిధాయకకృత్యము. అట్లే ఒక ఫ్యాక్టరీయజమాని తనకొడుకునే సామాన్యపు కూలీగాపెట్టవలసివస్తే ఆతడుతనకొడుకుతోపాటే తక్కినసౌకర్లందరినీ చూచితీరాలి. ఆర్థికసంబంధమైన ఈ అంశముమీదచెప్పదగిన నిజమైన సమర్థవంతమైన ఫలవంతమైన క్రియాత్మకమైన పరమసూత్రమిదే.

సముద్రమధ్యంలో ఓడపగిలిపోతే దానిని విడిచి పారిపోయేవాళ్లలో ఆఖరువాడుగానే దాని కెప్తాన్ ఉండితీరాలి.

ముందే తాను పారిపోకూడదు. అక్కడ ఓడలో తినుబండారాలు అయిపోయి, ఓడలో జనం మాడిపోవలసి వస్తే, ఉన్నరొట్టెలతో అందరూ తినగా ఏకాస్తయినా మిగిలితే ఆకాస్తే కెప్టెన్ తినాలి కాని, ముందుగా తానే మ్రింగి కూర్చోరాదు. అదేరీతిగా, వ్యాపారములలో క్లిష్టఆర్థికదుస్థితి వచ్చినప్పుడు ఫ్యాక్టరీ యజమాని, తనతో పనిచేసే యావన్మంది సిబ్బందితో సమానముగా తాను ముందుగ బాధపడడానికి సిద్ధమవాలి. అంతేకాదు, తనసిబ్బందిలోని వారికంటె, తానే ఎక్కువ బాధపడడానికి సిద్ధమవాలి. తనకంటె వారు ఎక్కువ బాధపడేటట్లు చేయరాదు. కరువు వచ్చినప్పుడు, నడి సముద్రంలో ఓడ పగిలిపోయినప్పుడు లేక భీషణ రణరంగం మధ్యంలో తనకొడుకును రక్షించుకోడానికి తండ్రి తాను ఆహుతికాడా? నే చెప్పే ఈమాటలన్నీ వింతగా కనిపించవచ్చు. ఇందులో వింతేమీలేదు. వింత ఏదైనా ఉంటే ఈ మాటలెంత సత్యమైనవన్నదొక్కటే వింత. ఈసత్యము సర్వకాలసర్వావస్థలకు వర్తించేసత్యము. "ఆహా! ఇదెంత సత్యమైనది, ఎంత ఆచరణయోగ్యమైనది" అనియే మనసు ఆశ్చర్యపడవలెను.

("అంటు దిస్ లాస్ట్"- అను ఆంగ్లగ్రంథానికి గాంధిగారు వ్రాసిన సంక్షిప్తానువాదమునుండి - 1951 పేజీలు 8-11; 21 - 23)

(8)

# 3

## —: మనిషే ధనము; వెండిబంగారాలుకావు :—

"ధనము" అనుపేరుతో అందరూ కావాలనికోరుకొనేది ఏది ? నిజంగా వెండిబంగారాలుకాదు. తోడి మనుష్యులపై ఆధిపత్యం – అధికారం చెలాయించడం, పొరుగువానిచే తేరగా చాకిరీచేయించుకోవడం ఒకకూలివాని, లేక వర్తకుని, లేక కళాకారుని సేవలను మనము తేరగా పొందాలని. కనుక "ధనవంతు"డవడమంటే మనం డబ్బు పోగుచేసుకు కూర్చోవడమనే మామూలుమాట అటుండగ, మనకంటె మనపొరుగువానికి తక్కువడబ్బుఉండే ఉపాయాలన్నీ పన్నడమన్నమాట. మనకంటె లొచ్చుస్థితిలోలేకపోతే వాడు మన కాలికిందికివచ్చి మనకెందుకు చాకిరీచేస్తాడు ? కనుక, మనకు బాగాఎక్కువ ఉండాలి. వాడికి బాగా తక్కువ ఉండాలి. ఈ తేడా ఎంతహెచ్చుగ ఉండేటట్లుచేయగలిగితే మనభాగ్య మంత హెచ్చుగ ఉంటుందన్నమాట.

ధనముయొక్క మజాఅంతా తోడిమనుష్యులపై పెత్తనం, ఆధిపత్యము చెలాయింపగలగడమే అనుమాట సిద్ధమైనది. కనుక దీనివల్లఏమిఏర్పడుచున్నది?ఎంతెంతగొప్పవాళ్ళమీాద, ఎంతెంతమంది హెచ్చుసంఖ్య మనుష్యులమీాద మనము ఆధిపత్యం – పెత్తనం – చెలాయింపగలిగితే, మనము అంతంత ఎక్కువ ధనవంతులు మగుతామన్నమాటకదా ! అట్లే ఆలోచించిచూస్తే అసలు "మనుష్యులే" ధనము అని తేలుతున్నది – బంగారంకాదు, వెండికాదు. ధనముయొక్క

నిజమైన నాళాలు ఎర్రగాఉంటవి - అనగా మనుష్యుల రక్త నాళాలే ధననాళాలన్నమాట. లోహ ధాతువులతో నిండిన పర్వతసానువులు కావు. బంగారుగనులు కావు. మనుష్యుల నెత్తురుకండలే బంగారుముద్దలు. సర్వవిధములైన ధనసంచయ ముల పరమ ప్రయోజనమేది ? కాంతివంతమైన కన్నులతో ఆనందభరితమైన హృదయాలతో సంపూర్ణసౌఖ్యవంతమైన జీవనముతో సదాతొణికిసలాడుచుండు మానవులను తయారు చేయగలగడమే సర్వధనసంచయముల పరమప్రయోజనమై యున్నది. ఇట్టి ఆనందభరిత మానవాళిని ఎంత హెచ్చు మందిని తయారుచేయగలిగితే, ధనముయొక్క ప్రయో జనము, సార్థకత అంతహెచ్చగునన్నమాట. పరమదయా ళుడగు ఏసుక్రీస్తు భక్తురాలనని చెప్పుకొను ఆంగ్లమాత ("ఇంగ్లండు" అను తల్లి) క్రైస్తవేతరులను తనక్రిందబానిస లుగ చేసికొని, వారి తలపాగలలో గోల్కొండ వజ్రాలు పొదిగి, "ఇదిగో నేనెంత ధనవంతురాలనోచూడండి. నా నౌకర్ల తలపాగలలోనే వజ్రాలున్నవి చూడండి" అని లోకా నికి డాంబికముగ తన గొప్పను చెప్పుకొనుటమాని - ఎన్నటి కైనా, క్రైస్తవేతర తల్లులకున్న సుగుణసంపత్తిని, ధనసంచ యములను సంపాదించుకొని, తనబిడ్డలను"ఇదుగో చూడండి- వీరే నారత్నాలు, వజ్రాలు- (గోల్కొండవజ్రాలు కావు)" అని లోకానికి సగర్వముగ ప్రదర్శింపగల మంచిరోజు — శుభోదయము రాగలదని నేనుఆశించుచు కలలుకంటున్నాను. నాకల నిక్కమగుగాక !

( "అంటు దిస్ ల్యాస్ట్" అను ఆంగ్లగ్రంథమునకు గాంధిగారి అనుసరణము - 1951 ప్రచురణ- పేజీలు 28, 29, 41, 42 )

కనుక,జీవితమనేదితప్ప వేరే ధన మనేది లేదు.మహో దారమనస్కులు, ఆనందభరితాంతఃకరణులునైన బిడ్డలను హెచ్చుమందిని ఏ దేశం కని సాకి పెంచుతుందో ఆ దేశమే, ఆ దేశమాతయే ధన్యురాలు.ఆ దేశమాతయే అత్యంత ధనవంతు రాలు. ఏమానవుడు తనస్వజీవిత ధర్మములను (పురుషార్థము లను) సంపూర్తిగ సాధించుకొని స్థితప్రజ్ఞుడై, ఇతరులను తన సుగుణసంపత్తిచేతను, తనకున్న ఐహిక ధనసంపత్తిచేతను దనిపి, వారికి పూర్తిగ మార్గదర్శి అవుతాడో అట్టివాడే లోకంలో అత్యంత ధనవంతుడు.

("అంటు దిస్ ల్యాస్ట్" - సంక్షిప్తానుసరణము -1951 ప్రచురణ - పేజీ 57)

# 4

## —: న్యాయమైన కూలి :—

నా మనిషికి నేను న్యాయమైనజీతంఇస్తే నేను అనవస రముగ - వెక్కసముగ డబ్బుకూడపెట్టుకోలేను. భోగాలకై డబ్బు దుబారాగాఖర్చు చేయలేను. లోకంలోఉండే అపార మైన పేదరికాన్ని మరింతహెచ్చుచేయలేను. నా నుండి న్యాయమైనజీతం తీసుకునేమనిషి, తనక్రిందనున్న నౌకర్ల

యెడకూడ న్యాయంగానే ప్రవర్తిస్తాడు. అందువల్ల న్యాయ ప్రవాహం ఎండిపోదు. పైగా పోగా పోగా అది పెద్ద మహా నదియే అవుతుంది. ఇట్టి న్యాయతత్పరతతో నడిచే దేశము సౌఖ్యవంతము, భాగ్యవంతము అవుతుంది.

కనుక, "స్పర్థ పోటీ అనేది దేశానికి మంచిది" అని మామూలుగ అర్థికవేత్తలు చెప్పేమాట సరికాదని తేలుచున్నది. పోటీవల్ల జరిగేదేమంటే యజమాని కూలివాని నుండి చాకిరీని తేరగా అక్రమపు చౌకగా తీసికోడానికి వీలిస్తూండడమే. పోటీవల్ల జరిగేదింతే. మొత్తంఫలిత మేమంటే, భాగ్యవంతులు మరింతభాగ్యవంతులవటం, పేద వాళ్ళు మరింత పేదవాళ్ళవడం ! ! తుదకు మొత్తం దేశ మంతా నాశనానికే దోవదీయడం! ! వాని శక్తిసామర్థ్యా లకు అనుగుణ్యాముగ పనివానికి న్యాయమైన కూలి ఇవ్వాలి. దీనిలో కూడ అసగ సామర్థ్యాన్నిబట్టి కూలియిచ్చే పద్ధతిలోకూడ ఒకవిధంగా పోటీ ఉండనేఉంటుంది.ఎట్లంటే ప్రతి వాడు, రెండవవానికంటె హెచ్చునామర్థ్యాన్ని అల వర్చుకోడానికి ప్రయత్నిస్తాడు. అనగ, పోటీ అనేది సామర్థ్యాం అలవర్చుకోవడంలో ఉంటుందేకాని, "ఆపనిని నేను వాడికంటె తక్కువకూలికి చేస్తా"నని అడ్డురావటంలో ఉండదు. హెచ్చునామర్థ్య సంపాదనకైపడే పోటీలో, తగాదాలుండవు. అసంతృప్తిఉండదు. గవర్నమెంటు నౌక రీలలో ఉండే ఆకర్షణకు ఇదే కీలకము. గవర్నమెంటులో జీతాలు ఆయా పోస్టులకు ఇంతింతనిమాత్రమే ఉంటవి కాని,

ఆపోస్టుకువచ్చే మనిషిని బట్టిఉండవు. ఆ పోస్టుకు రాదలచుకున్నవాడు ఆ పోస్టుకు తగిన సామర్థ్యత తనవద్ద ఉందని అంటాడేకాని, ఆ పోస్టుకునిర్ణయమైయున్న జీతానికంటె తక్కువజీతానికి వస్తానని అనడు. ఇదీ గవర్నమెంటు నౌకరీలలో ఉండేరహస్యము. ఆ పోస్టుకు దరఖాస్తుపెట్టిన రెండవవానికంటె, తనకెక్కువసామర్థ్యం ఉందనే చెపుతాడు అనగా సామర్థ్యంలో పోటీపడతాడుకాని, రెండవవానిని తోసివేయడానికి తాను తక్కువజీతానికి వస్తానని అనడు. సేనలోను నౌకాదళం డిపార్టుమెంటులలోను కూడ ఇదేపద్ధతి. అక్రమపద్ధతుల కిచ్చట తావులేదు. కాని, వర్తకవ్యాపారములలోను, మిల్లులు ఫ్యాక్టరీలు మొదలగు పరిశ్రమలలోను, ప్రాణాంతకమగు పోటీలు స్పర్ధలు ఏర్పడియున్నవి. ఈపోటీలవల్ల దగాలు, దొంగతనాలు, ఇచ్ఛకాలు హెచ్చయిపోయినయి. తక్కువరకం వస్తువులు తయారౌతున్నాయి. ఫ్యాక్టరీదారుడు, కూలివాడు, కొనేవాడు– అందరూ దగాకే సిద్ధపడుతున్నారు. ప్రతివాడు తనస్వార్థంకోసమే చూసుకుంటున్నాడు ఇందువల్ల మానవునకు మానవునకు మధ్యనున్న యావత్తు సంబంధము విషపూరితమైపోతోంది. కూలివాళ్ళు కడుపులు మాడి సమ్మెలుచేస్తున్నారు. మిల్లు యజమానులు పచ్చి దొంగలవుతున్నారు. కొనుక్కునేవాళ్ళుకూడ తమనీతి వర్తనను పాటించడం మానివేశారు. ఒక అన్యాయం లక్ష అన్యాయాలకి దోవతీస్తోంది. తుదకు కలిగే ఫలితమేమి? యజమాని కూలివాడు, కొనేవాడు – అందరూ దుఃఖం, అసంతృప్తి అనుభవిస్తున్నారు. సర్వనాశనం అవుతున్నారు. ప్రజలు

సంపాదించుకున్నామన్న ధనమే వారి మెడలకు ఉరితాళ్ళవు తున్నాయి. వాళ్ళకు శాపాలై కొట్టుతున్నాయి.

నిజమైన ఆర్థికవిధానము ధర్మము, న్యాయము అనునది మాత్రమే. తాను ప్రత్యనర్తనుడై పొరుగువానికి న్యాయం కలగజేయడంలో మానవునకు సౌఖ్యమున్నది. దేశానికి సౌభాగ్యమున్నది. మిగతాధనమంతా వట్టిడాంబికమే. అదిపరాపరి మానవున్ని, దేశాన్ని సర్వనాశనానికి తీసికొనిపోతుంది. ఎట్లాగోఅట్లా డబ్బు సంపాదించడమే గొప్ప అని ప్రజలకు బోధించడం వారికి మహాపచారము చేయడమన్నమాట.

("అంటు దిస్ లాస్ట్" - సంక్షిప్తానుసరణము 1951 ప్రచురణ - పేజీలు 59-63)

"ధనాన్నే దైవంగా పూజించు" అని చెప్పే ఆర్థిక శాస్త్రము దుర్బలునకు అన్యాయంచేసి ధనరాసులను గుట్టలుగ పేర్చుకోడానికి బలవంతులకు తోడ్పడే అర్థశాస్త్రము కేవలం దగాశాస్త్రము, ఘోరపాతకశాస్త్రము. అది సర్వత్ర మృత్యువునాహ్వానిస్తుంది. సత్యమైన ఆర్థికశాస్త్రము మానవుల మధ్య న్యాయానికై నిలబడుతుంది; అందరిమేలును సమానముగ సమకూర్చుతుంది. అందరికంటె ఎట్టిదుర్బలునికైనా సరే, బలవంతుడనేవానితో సమానంగా మేలు చేకూర్చుతుంది. సత్పథ జీవితమునకట్టి ఆర్థికశాస్త్రమే తప్పక కావాలి.

హరిజన్ 9-10-1937.

# 5

## —: ఆర్థిక సమత :—

సంఘమంటే నా అభిప్రాయ మేమిటో చెపుతాను. మనమందరము సమానముగ పుట్టాము. అంటే, సమానావకాశాలకు అందరికి సమానముగ హక్కున్నది. అయితే శక్తిసామర్థ్యాలు లేవిమాత్రం అందరికి సమానములుగ లేవు. ఈ శక్తిసామర్థ్యాలలో సమానముగ ఉండడమనేది ప్రకృతి సిద్ధముగనే అసాధ్యమైన స్థితి. ఉదాహరణ :— అందరూ సమానమైన ఎత్తుగా ఉన్నారా ? అందరూ ఒకేరంగుగా ఉన్నారా ? తెలివితేటలు అందరికీ సమానముగ ఉన్నవా ? లేవుకదా. కనుక సహజంగానే కొందరు ఎక్కువసంపాదించుకో కలుగుతారు; కొందరు తక్కువే సంపాదించుకోగలుగుతారు. శక్తిసామర్థ్యములు ఎక్కువగ కలవారు తమ శక్తిసామర్థ్యాలను ఉపయోగించుకొని ఎక్కువగ సంపాదించుకుంటారు. అందువల్ల వారివద్ద యెక్కువ సంపద, ధనం ఉంటుంది. ఇట్టి వారు తమశక్తిసామర్థ్యాలను దయార్ద్రదృష్టితో (అనగసంఘ క్షేమమునకై) వినియోగిస్తే వారు ప్రభుత్వము చేయవలసిన పనినే చేయుచున్న వారవుతారు. అట్టివారు తోడిమానవుల యోగక్షేమములనుచూచే ధర్మకర్తలు (ట్రస్టీ) అవుతారు. ఇంకొకరకంగా వారుండరు. ఎక్కువ శక్తిసామర్థ్యములు గల మనిషి ఎక్కువసంపాదించుకొననీ అంటూ, వానిశక్తులను అణచి వేసుకోమని చెప్పను. అయితే అతడు సంపాదించే సంపాదనలో హెచ్చుభాగం సమిష్టి సంఘశ్రేయమునకయ్యే

వినియోగించాలంటాను. ఎట్లంటే, ఒక కుటుంబములో తండ్రికి ఎక్కువమంది కొడుకులుంటే వారిలో సంపాదనపరులైన కొడుకులందరి సంపాదన మిగతా యావత్తు కుటుంబముయొక్క సమిష్టిలాభమునకై వినియోగింపబడుచున్నది కదా. *

(యంగ్ ఇండియా - 26-11-1931)

సంపదను సమానముగ పంచడమంటే సత్యమైన మార్గమేమి? అనగా, ప్రతిమనిషికీ వానివానికున్న సహజావసరముల నన్నిటిని తీర్చుకొనుటకు వానికి తగినంత సంపద ఉండాలి. అంతకెక్కువ రవ్వంతయు ఉండరాదు. ఉదాహరణ :— ఒకనికి జీర్ణశక్తితక్కువగ ఉండి, పావుసేరు బియ్యమే సరిపోతే, ఇంకొకబలాశికి జీర్ణశక్తిఎక్కువగ ఉండి శేరుబియ్యంకావలసిఉంటే, మొదటివానికి పావుసేరేఇవ్వండి; రెండవవానికి శేరుఇవ్వండి. ఇది సంపదనుసమానముగ పంచినట్లే అర్థము. ఈ ఆదర్శాన్ని ఆచరణలోకి తేవాలంటే ఇప్పుడున్న సంఘనిర్మాణవిధానం యావత్తు సమూలంగా మార్చాలి. అహింసమీద నిలబడాలనుకున్న సంఘము, ఇది తప్ప ఇంకొక ఆదర్శాన్ని అవలంబింపజాలదు. ఈ ఆదర్శాన్ని ఈ గమ్యాన్ని మనం పూర్తిగ చేరలేకపోవచ్చు.

---

* ఇది మన సనాతనమైన ఉమ్మడికుటుంబ పద్ధతి యను మాట నిజమే. అయితే దానిని ఈ ఇంగ్లీషుచదువులవల్ల, ఇంగ్లీషు లా వల్ల ఈ విశాల మానవసృష్టి పోయి ఎక్కువ సంపాదించువాడు తక్కువ సంపాదించిన తమ్మునికి వస్తుదికూడ ఇవ్వడానికి ఒప్పుకోవడంలేదు. ( మా. స. )

కాని దీనిని సదామనస్సులో ఉంచుకొని, ఆ ఆదర్శంవైపు నకే ఎడతెగకుండ అడుగులువేస్తూ నడచిపోతూఉండాలి. ఈ గమ్యంవైపునకు ఎంతెంతసమీపముగ నడచిపోతూఉంటే మనకు అంతంత హెచ్చుగ సంతృప్తి, ఆనందము, కలుగుతూ ఉంటుంది: అహింసాసమాజాన్ని అంతంతచేరువకు తెచ్చు కొన్నవాళ్ళమవుతాము.

(హరిజన్ : 25-8-1940)

# 6

## —: ఆదాయంలో సమానత :—

నీకు శక్తిసామర్థ్యాలుంటే వాటిని రూపాయి, అణాలు పైసలులోనికి మార్చుకొనకు; దేశసేవకై ఆ శక్తిసామర్థ్యములు వినియోగించు. నీవు గొప్ప డాక్టరువైతే దేశంలో కావలసినన్ని రోగాలున్నవి; వాటిని నీ వైద్యప్రవీణతచేత మాన్పు నీవు గొప్ప లాయరువైతే దేశంలో బోలెడన్ని తగాదాలున్నవి; వాటిని చక్కగా పరిష్కరించు. అంతేకాని వాటిని మరింత రేపి డబ్బు పోగుచేసుకోబోకు. నీవు పెద్ద ఇంజనీరువైతే మన ప్రజల తాహతుకు, అవసరాలకు సరిపడే చక్కని ఇళ్ళుకట్టు. నిర్మలమయిన గాలిని, ఆరోగ్యాన్ని ఇచ్చేవిగా, మంచినమూనాలు గలవిగాకూడ ఆ ఇళ్ళనుకట్టు. ఈ రీతిగా పరుల మేలుకొరకై నీ శక్తిని వినియోగించడానికి అవకాశాలకేమీ తక్కువలేదు. (ఈ ప్రశ్న అడిగినది ఇంగ్లాండులో ఒక ఛార్టర్డు అకౌంటెంటు. అనగా గొప్ప గణిత

శాస్త్రజ్ఞుడు. గాంధీగా రీతనివంక చూచి ఇంకా ఇలా అన్నారు.) కాంగ్రెసు కమిటీల లెక్కలు చూడడానికి అకౌంటెంట్లు తక్కువగ ఉన్నారు. ఇంకా మా కెంతమం దో కావాలి. నీవు ఇండియాకు రా. నీకు చేతినిండాపనియిస్తా. నీకు తగిన కూలికూడ ఇస్తా. అంటే రోజుకు నాలుగణా లన్న మాట! నాలుగణాలంటే ఏమిటో తెలుసా? ఇండియాలో కోటానుకోట్ల ప్రజలకు ఈ మాత్రం జీవనాధారంకూడ లే దన్నమాట. రోజుకు నీకు పావలా ఇస్తానంటే మా ప్రజల కంటే నీకు ఎక్కువే యిస్తానన్నమాట.

(యంగ్ ఇండియా 5-11-1931)

ప్లీడరీ ప్రాక్టీసు అంటే ఏమిటి? ఉదాహరణకు ఒక గ్రామంలో వడ్రంగి రోజుకు సంపాదించేదానికంటె, ప్లీడరు యెక్కువ తీసుకోరాదన్నమాట.

(హరిజన్ 13-7-1940)

నేను కలలుకంటున్న స్వరాజ్యం పేదవాని స్వరా జ్యము. రాజులు, ధనికులు మున్నగు ధనరాజులతోపాటు జీవితావసర వస్తువులను నీవుకూడ సమానముగ అనుభవించా లన్నమాట. ఇదీ స్వరాజ్యంఅంటే. అంటే ఆరాజులకున్నమాది రిగ పెద్ద మేడలుండాలని కాదు. ఎందుకంటే, సుఖపడడానికి అవి నిజంగా అవసరంకావు. నీబోటినాబోటి బక్కవాళ్ళం ఆ మేడలలో యెక్కడో నలుసులులాగ మునిగిపోతాము. కాని, భాగ్యవంతు డనుభవించే మామూలు జీవితావసరములన్ని

యును నేను తప్పక ఉండాలి. ఈ అవసరములన్నీ నేను తప్ప
కుండ యివ్వగలిగేవరకు, మన స్వరాజ్యం పూర్ణస్వరాజ్యం
మెన్నటికీ కానేరదు. ఇది నా నిశ్చితాభిప్రాయము. ఇందుకు
సందేహ మేమిలేదు. (అహమ్మదాబాదు లేబరు యూని
యన్ వారి యెదుట యిచ్చిన ఉపన్యాస భాగం.)

(యంగ్ ఇండియా : 26-8-1921)

ఒక ప్రశ్నకు గాంధీగారిట్లు సమాధానం చెప్పారు—
ఇండియాను చూచి "అహో" యని మెచ్చుకొని, తా
నింత గొప్పదానిని గాకపోతినే యని లోకం సిగ్గుపడేటట్లు
మనము ఆదర్శప్రాయమయిన స్వాతంత్ర్య జీవితమును నడుపు
కొనవలెనంటే, న్యాయముగ ఒక రోజుకు చేసేపనికి పాకీ
వానికి, డాక్టరుకు, లాయరుకు, బడిపంతులుకు, వర్తకునకు,
తదితరులకు ఒకే కూలి యివ్వాలి. ఇండియాలో మన మీ
ఆదర్శమును యెన్నడూ చేరలేకపోవచ్చుగాక! కాని, ఇండి
యాలో ప్రతివాడు తన జీవితనౌకను యీ ఆదర్శము వైపు
నకే నడుపుకొని పోవునట్లుగ తెరచాప నెత్తవలెను. ఇంకొక
వైపునకు నడుపుకొనగూడదు. ఇండియా సర్వ సౌభాగ్యము
లతో తులదూగవలెనంటె ఇది యొక్కటియే మార్గము.

(హరిజన్ : 16-8-1947)

## 7

### —: వికేంద్రీకరణ :—

అహింసా పథంలో ఇండియా నడవాలంటే నేనొక
మాట చెప్తాను. అనగా, అనేక విషయాలలో వికేంద్రీకరణ

అవసరం మంటాను. ఎంతో సైనికబలం, పోలీసుబలం ఉంటే తప్ప కేంద్రీకరణ పద్ధతి సాగనేరదు. దొంగిలించతగ్గ వస్తువు లేవీ లేని సామాన్యుల కొంపలకు పోలీసుబందోబస్తు లెందులకు? ధనవంతుల మేడలకే బందిపోటు దొంగలనుండి రక్షణ నిమిత్తమై బలమయిన పోలీసుపహరా కావలసి వస్తుంది. అల్లే బ్రహ్మాండమయిన ఫ్యాక్టరీలకు, మిల్లులకుకూడాను. సామాన్యపు గ్రామసీమలుగ నిర్మాణమై యున్న ఇండియాకు పర దండయాత్రల భయమేమీ ఉండదు. ఇండియానంతా పెద్ద ఫ్యాక్టరీలతో, మిల్లులతో నిండిన నగరాలుగా తయారుచేసి, వీటిని కాపాడుకొనడానికై బ్రహ్మాండమయిన సైనిక, నావికా, వాయువిమాన బలములతో నింపుకొన్నప్పుడే పర దండయాత్రల భయముంటుంది.

(హరిజన్ 30-12-1939

ఫ్యాక్టరీల మయమయిన నాగరికముమీద మనము అహింసను నిలబెట్టుకోలేము. కాని స్వయంపోషకమగు గ్రామములమీద నిలబెట్టుకొన గలము. నేనూహించే గ్రామ ఆర్థిక విధానము పరస్వాహరణమును పూర్తిగ వదలుకుంటుంది. హింసయొక్క సారమే పరస్వాహరణము. కనుక నీవు అహింసావలంబివి కాదలచుకుంటే ముందుగా నీవు గ్రామీణ తత్త్వమును అలవరచుకోవాలి. ఆ గ్రామీణ తత్త్వము నీకు వంటబట్టాలంటే రాట్నముపై నీకు విశ్వాసముండాలి.

(హరిజన్ : 4-11-1939)

మనము దృష్టిలో ఉంచుకోవలసిన పరమావధి యేది? సంపూర్ణ మానసిక, నైతిక, వికాసముతో కూడిన మానవ సౌఖ్యము. నైతిక మంటే యిక్కడ ఆధ్యాత్మికమనియే నా ఉద్దేశ్యము. ఈ అర్థములోనే ఆ మాటను నేను ఉపయోగిస్తు న్నాను. ఆ గమ్యమును మనము వికేంద్రీకరణ ద్వారానే చేరగలము. కేంద్రీకరణ మనేది సంఘముయొక్క అహింసా నిర్మాణ విధానమునకే విరోధి.

(హరిజన్ : 18-1-1942)

# 8

## —: అహింసావృత్తులు :—

నిజం మాట్లాడితే యెంత చిన్నపనియైనా సరే, ఎంత చిన్న పరిశ్రమయైనా సరే, హింస అనేది లేకుండ సాగదు. ఏదో కొంత హింసలేనిది అసలు మనం ఊపిరిపీల్చి బ్రతక డానికే సాధ్యము గాదు. కనుక మనం చేయగలిగిన దల్లా అనివార్యమయిన యీ హింసను ఎంత తగ్గించగలిగితే అంత తగ్గించుకోవాలన్నమాట. అసలు ఈ భావం "అహింస" అనే అభావసూచక ( Negative ) శబ్దములోనే ఇమిడియున్నది. జీవితంలో హింస అనివార్యమనిన్నీ, అయితే దానిని వదలు కోడానికి పెనగులాడడంలోనే గొప్ప ఉందనిన్నీ భావం. హింసను తోసివేయడానికి యత్నించడమే "అహింస" అన్నమాట. కనుక అహింసా ధర్మమందు విశ్వాసమున్న వాళ్ళు వీలయినంత తక్కువ హింసయుండే వృత్తులనే చేప

ట్టాలి. ఉదాహరణ:—అహింసలో తనకు విశ్వాస మున్నదని చెబుతూ, కసాయి వృత్తిలో జీవితం గడిపే మనిషి ఉండటం అసంభవం. అయితే, అంతమాత్రంచేత మాంసాహారియైన వాడు అహింసగ ఉండలేడని కాదు. మాంసం తినేవాడు కూడ, తనకు అహింసయందు విశ్వాసముంటే వేటకు బయలు దేరడన్నమాట. యుద్ధాలకుగాని, యుద్ధప్రయత్నములకు గాని దిగడన్నమాట. ఈ రీతిగా, విధిగా హింసకు పాల్పడ వలసి వచ్చే వృత్తులు, వ్యాపారములు అనేకం ఉన్నవి. ఇట్టి వాటిని అహింసావ్రతావలంబి మానుకొనవలెను. ఇక వ్యవ సాయవృత్తి ఉన్నది చూడండి; ఇది లేనిది మనిషి బ్రతక డమే సాధ్య పడదు. అయితే దీనిలోకూడ కాస్తో, కూస్తో హింస లేకపోలేదు. కనుక, ఫలాని వృత్తి మానవుడు చేపట్ట దగినదా? తగనిదా? అను ప్రశ్న పరిష్కరించుకోడానికి, ఒకటే సూత్రం ఉంది. "ఆ వృత్తి హింసనే పునాదిగా చేసికొన్నదా?" అని ప్రశ్న వేసుకోవాలి. ఆ ప్రశ్నకు వచ్చే సమాధానాన్నిబట్టి అది చేపట్ట తగినదో తగనిదో నిర్ణ యము చేసుకోవాలి అంతే. మనముచేసే ప్రతిపనిలో కాస్తో కూస్తో హింస ఉండక తప్పదు. కనుక మనము చేయదగిన దల్లా ఒకటే. ఆ పనిలోవున్న హింసను వీలయినంతవరకు తగ్గించివేయడమే. అహింసాధర్మముమీద హృదయపూర్వక మైన భక్తి విశ్వాసములు లేకపోతే, ఈ హింస తగ్గించివేయు డము కూడ సాధ్యముకాదు. ఒకడు కేవలంగా హింసచేయ డనుకో; కష్టపడి న్యాయంగా పొట్టగడుపుకుంటాడే అనుకో; అయితే యితరుల భాగ్యభోగ్యములజూచి అసూయ (చుప్ప

నాతితనం) పడతాడనుకో. అట్టివాడు అహింసాపరుడనడానికి వీలులేదు. కనుక అహింసావృత్తికి నిర్వచన మేమంటే, అది మూలములో హింసారహితముగా ఉండాలి. ఇతరుల ధనాదికముల హరించడం గాని, ఇతరుల భాగ్యభోగాలు చూచి మనస్సులో అసూయపడడంగాని ఉండరాదు. ఇట్టి లక్షణములు గల వృత్తియే అహింసావృత్తి అనిపించుకుంటుంది.

చరిత్రనుండియైతే నేను ఋజువులు చూపలేనుకాని నా కొక నమ్మకం మాత్రం ఉంది. అదేమంటే, పైన నిర్వచించిన లక్షణములుగల అహింసావృత్తుల ఆధారంమీదనే గ్రామ ఆర్థిక విధానము నిర్మాణమై యున్నకాలము పూర్వమొకప్పుడు మన ఇండియాలో ఉండెనని నేను నమ్ముచున్నాను. అవి మానవుల హక్కుల ఆధారంమీదకాక, మానవుల విధులమీద నిలిచియుండెను. అట్టి వృత్తుల నవలంబించినవారు హాయిగ తమ జీవితమును గడుపుకొనగలిగెడివారు. అంతేకాదు, వారి కృషియావత్తు సంఘశ్రేయమునకు గూడ దోహద మిచ్చేది. ఉదాహరణ :— గ్రామంలో వడ్రంగి ఉన్నాడనంటే అతడు తన ప్రక్కనున్న రైతునకు కావలసిన నాగలి నగయిరా పరికరము లన్నిటిని చేసిపెట్టేవాడు. అతనికి ప్రతిఫలంగా రొక్కం ఇచ్చేవారు కారు. ధాన్యాది వస్తురూపంలో అతనికి ప్రతిఫలం గ్రామస్థులనుండి ముట్టేది. ఈ పద్ధతిలోగూడ అన్యాయానికి తావుండవచ్చు. కాని, అది అతి స్వల్పముగమాత్రం ఉంటుంది. నే నిమాట

మా గుజరాత్ దేశములో అగ్రైయేంట్లక్రింద నున్న పరిస్థితుల గూర్చిన నా స్వానుభవాన్నిపట్టి చెబుతున్నాను. ఇప్పటికంటె ఆనాడు ప్రజల కండ్లలో ఎక్కువ తేజస్సు ఉండెను. వారి సర్వానాళములయందు ఎక్కువ జీవశక్తి తొణికిసలాడుచుండెను. ఆనాటి ప్రజల జీవితము వారికి తెలియకుండగనే అహింసాధర్మముమీద ప్రతిష్ఠితమై యుండెను.

కాయకష్టమే వారివృత్తులకన్నిటికి పునాదిగ ఉండెను. బ్రహ్మాండమయిన యంత్రాగారము లానాడు లేవు. తాను స్వయంగా నాగలి పట్టి దున్నగలిగినంత భూమిమాత్రమే కలిగి దానితోనే సంతృప్తి చెందే మనిషి పరస్వాహరణమునకై యెట్లు గడంగును? పశువులను తనక్రింద బానిసలుగ చేసికొనుట, పరుల కష్టార్జితమును హరించుట అనుదోషములు మన పూర్వకాలపు చేతివృత్తులలో కానరావు. బ్రహ్మాండమయిన యంత్ర పరిశ్రమలవలన సంపద ఒకని చేతిలోనే గుట్టలుగ పెరిగి గడ్డకట్టుకొని పోవడం జరుగుతుంది. ఆతడు మిగతావారి నందరిని తనక్రింద బానిసలుగ చేసుకొని వారి మీద స్వారీచేయడమును జరుగుతుంది. ఆతడు మంచివాడయితే తన పనివాళ్ళకు మంచి వసతులే కల్పించడానికి ప్రయత్నించవచ్చునుగాక. అయినప్పటికీ, యింతచేసినా పరుల కష్టార్జితమును దొంగిలించడమనే దోషము దానిలో ఉండనే ఉన్నది. ఇదికూడ హింసలో ఒకరకము హింసే.

(హరిజన్ : 1-9-1940)

# 9

(పూర్వము ఇండియా సర్వోదయ పంథాలో నడిచింది)

మనము నీతిపక్షమున నడవాలంటే మన మనస్సుమీద ఇంద్రియాలమీద పూరా ఆధిపత్యం సంపాదించుకోవాలన్న మాట. మన మనస్సు విశ్రాంతి, నిలకడ లేకుండ సదా గాలిలో ఎగిరిపోతూ వుండే పిట్టగ మనకు కనిపిస్తుంది. మన చిత్తమునకు విశ్రాంతిలేదు, తృప్తిలేదు. దొరికినకొలదీ ఇంకా యెక్కువ కావాలనే కోరుతూ ఉంటుంది. ఎంత ఎక్కువ లభించినను ఇంకను తృష్ణతీరదు. మనము ఇంద్రియములతో విహరించిన కొలదియు అవి పెచ్చుపెరిగి, హద్దు మీరి విజృంభించుచుండును. కనుక మన పూర్వులు యీ ఇంద్రియ విహారములకు హద్దు లేర్పరచి, అవి కళ్లెములు తెంపుకొని పారిపోకుండ కట్టుదిట్టములు చేసిరి. సౌఖ్యమను నది మనస్సులోనే కలదని మన పూర్వులు గ్రహించిరి. అదియు చిత్తముయొక్క అవస్థాభేదములలో నొకటి యని మన పూర్వులు గ్రహించిరి. సంపదలలో తులతూగువాడు సౌఖ్యముగ నున్నాడని కాని, నిరుపేద దుఃఖముతో నున్నా డని కాని చెప్ప వీలులేదు. అటుగాక, సాధారణముగ ధన ధాన్యరాసులలో మునిగి తేలుభాగ్యవంతులే సదా దుఃఖముతో నుందురు. వారికి ఆనందము లేదు. కాని, నిరుపేద జను డన్ననో సాధారణముగా యెల్లప్పుడు బ్రహ్మానందము ననుభ వించుచుండును. వీనిని మనము ప్రతిదినమును కండ్లార చూచుచునేయున్నాము. ప్రజలలో చాలమంది బీదలుగనే

యుందురు. ఈ యంశముల నెల్ల బాగుగ ఆలోచించియే సంపదలను, భోగములను కోరవద్దని మనపూర్వులు మనలను వారించిరి. ఎన్నియో వేలఏండ్ల క్రిందట పుట్టిన ఆ మోటు నాగళ్ళతోనే మనము వ్యవసాయము చేసుకొని గడుపుకొను చున్నాము. పూర్వమున్న ఆ కుటీరమునే నిలుపుకొన్నాము. పూర్వమునుండి అనుశ్రితముగ వచ్చుచున్న మన స్వజాతీయ విద్యావిధానమును చెడకుండ కాపాడుకొన్నాము. ఒకరిని మించి ఒకరు పరుగెత్తుద మను అహంకారముకాని, పోటీ పందెములుకాని మన పూర్వు లెరుగరు. తృష్ణాపూర్వకమైన ఈ పోటీలవలన మానవ జీవితములో ఉండవలసిన ఆ స్వార స్యము, ఆ ఆనందము సమస్తము మంటగలియుచున్నది. ఎవని వృత్తిని వాడు శాంతముగ చేసికొనుచుండెడివాడు. దానికి తగిన ప్రతిఫలమును పొందుచుండెడివాడు. ఈయంత్ర నిర్మాణము మన పూర్వులకు తెలియకపోలేదు. కాని, మన తలంపుల నిట్టివానిపై పోనిచ్చినచో మనము మన ఇంద్రియ ములకు బానిసలమై, మనలోనుండు ధర్మప్రవృత్తి ( ధర్మ బీజము ) అంతరించుననని మన పూర్వులు బాగుగ గ్రహిం చిరి. కనుక, భగవంతు డిచ్చిన ఈ కాళ్ళ చేతులతోనే, మన మెంతవరకు పోగలమో అంతవరకే పోవలెనని బహు దూర మాలోచించిన పిమ్మట మనపూర్వులు నిశ్చయము చేసుకొ నిరి. భగవంతుడు మన కనుగ్రహించిన కరచరణాద్యవయవ ములను మనము సత్పథమున వినియోగించుకొన్నప్పుడే మనకు నిజమగు ఆనందము, శరీరారోగ్యము కలుగునని మన పూర్వులు గ్రహించిరి. పెద్ద పెద్ద పట్టణము లుండుట అనర్థ

దాయకమనియు, ఇవి నరులను పాప పంకములోని కీచ్చుట కేర్పడిన యొరలవనియు మన పూర్వులు కనుగొనిరి. పెద్ద పట్టణము లన్నియు అనవసరముగ తెచ్చిపెట్టుకొన్న బరువులని వారు కనిపెట్టిరి. పట్టణములలో నుండు ప్రజలకు సౌఖ్యము లేదు. కొంగల దోపిడీగాండ్రు గుంపుల కవి శరణ్యములగును. వ్యభిచారాది దుర్వృత్తులు ప్రబల మగును. ధనవంతులు పేదలను దోచుకొనుట కవకాశము చిక్కును. కనుక మన పూర్వులు చిన్నచిన్న పల్లెలతోడనే సంతృప్తి జెంది యూరకొనిరి. "ధర్మ" మను ఖడ్గము ముందర ఈ చక్రవర్తులుకాని, వారి కత్తులు కఠారులుకాని యెందుకూ పనికిరావని మనవారు పూర్తిగా గ్రహించిరి. అందువలననే ఫకీరులు, ఋషీశ్వరులు మొదలగు తపశ్శాలుర ముందర భూపతులగు రాజు లెంతమాత్రము పనికిరారని చెప్పిరి. ఇట్టి సత్యము గలిగిన మన భారతజాతి ప్రపంచజాతుల కన్నిటికిని ఎక్కువగ గురుస్థానము నాక్రమింప దగియున్నదే కాని, ఒకరియొద్ద శుశ్రూషచేసి నేర్చుకొనవలసిన అవస్థలో లేదు. ఈ దేశములోకూడ పూర్వము కోర్టులు, లాయర్లు, డాక్టర్లు, ఉండేవారేకాని, వారందరు తగిన హద్దులలో నిలిచియుండిరి. అదిగాక, ఈ వృత్తులకు మన పూర్వు లంతగ గౌరవమొసంగి యుండలేదు. పూర్వ మీా వైద్యులును, వకీళ్ళును ప్రజలను దోచుకొనుట యెరుగరు. పేద ప్రజల నాశ్రయించుకొని బ్రతుకుచుండెడివారేకాని, ప్రజలమీాద అధికారమును చెలాయించెడివారు కారు.

న్యాయపరిపాలన చాలవరకు బాగుగనుండెడిది. ప్రజలు సర్వసాధారణముగ కోర్టుల కెక్కెడివారుకారు. ప్రజలను మోసపుచ్చుటకు మధ్యదళారు లుండెడివారు కారు. ఈ దుర్వృత్తియైనను సాధారణముగ పట్టణములలోను తత్పరిసరములలోను మాత్రమే ఉండెడిది. తక్కిన ప్రజా సామాన్య మంతయు హాయిగా స్వతంత్రముగ బ్రతికెడి వారు. ఎవరి వ్యవసాయమును వారు చేసుకొని బ్రతుకుచుం డెడివారు. నిజముగ స్వరాజ్య మనగా అదే! మన పూర్వులు నిజముగ స్వరాజ్యము ననుభవించిరి. – (హింద్ స్వరాజ్)

బి. పారిశ్రామిక యుగము,

# 1

## పారిశ్రామిక విధానము లోకానికి అరిష్టము (కీడు)

పారిశ్రామికవిధానము మానవజాతికి కీడుగ పరిణ మించబోతున్నదని నాభయం. ఈ విధానము ఎదుటివానిని దోచుకొనగలగడంమీద–పరదేశపు మార్కెట్లను కాతాదా ర్లను నీ వశంలో ఉంచుకోగలగడంమీద, నీకు రెండవవాడు పోటీతగలకుండ చేసుకోగలగడంమీద కేవలం ఆధారపడి యున్నది. ఈ మూడుశక్తులు ఇంగ్లండుకు నానాట తరిగి పోవుచున్నవి. అందువలననే ఆ దేశంలో ( జీవనాధారాలు లేని ) నిరుద్యోగులసంఖ్య నానాట కొండంతయెత్తుగ పెరిగి పోతున్నది. ఇండియా అవలంబించిన బ్రిటిష్‌వస్త్రబహిష్కార ణోద్యమము ఇంగ్లండుకు కేవలం చీమకుట్టినంతమాత్రమే.

ఇంగ్లండు స్థితే ఇట్లా (వివాళాగా) ఉంటే, ఇండియావంటి అతివిశాలమైన దేశము ఈ పారిశ్రామిక విధానమువల్ల లాభంపొందుతుందనటానికి ఎట్లావీలు? ఇండియా ఈ రకం పారిశ్రామికవిధానాన్ని అవలంబించితే అది ఇతరదేశాల దోపిడికి మిడత దిగిందన్నమాటే. ఇండియా ఈ రీతిగా ఇతర దేశాలను దోచుకోడానికి పారంభిస్తే, అవి ఇతరదేశాలకు అరిష్టమే (కీడే) అవుతుంది అంటే కాము. లోకానికే పీడఅవుతుంది. ఇట్టి లోకపీడాకరమైన పనికి ఇండియా యెందుకు పూనుకోవాలి? ఎందుకు పారిశ్రామిక విధానాన్ని అవలంబించాలి. (ఇది సుతరాము నాకు ఇష్టములేదు.) లోకంలో ఎట్టి విషాదస్థితి ఏర్పడిందో చూచారా? ఇక్కడ మనం ఇండియాలో ముప్పైకోట్ల జనానికి బ్రతుకు తెరువులు చూపించగలిగి యుండగా. ఇంగ్లండు తన ముప్పైలక్షల మంది జనానికి బ్రతుకు తెరువులు చూపించలేక గిలగిల తన్నుకుంటున్నది. అక్కడ గొప్పగొప్ప విజ్ఞానవేత్తలందరు ఏమిచేయాలో తెలియక తెల్లబోతున్నారు. ఈ పారిశ్రామిక విధానము లోకాన్ని భవిష్యత్తులో ఏ చీకటి కోనలోకి తీసుకొనిపోతుందో ఎరుగరాకున్నది. ఇంగ్లండుకు అమెరికా, జపాన్, ఫ్రాన్స్ జర్మనీ దేశాలు గట్టిగ పోటీ తగులుచున్నవి ఇండియాలో తలలెత్తిన కొద్దివాటి మిల్లులుకూడ ఇంగ్లండుకు చుక్కెదురే. ఇండియా మేల్కొన్నది. దక్షిణాఫ్రికావంటి బ్రహ్మాండ ఖండము త్వరలోనే మేల్కొంటుంది. దక్షిణాఫ్రికాలో అపారమయిన లోహపుగనులు, ప్రకృతిసంపదలు, అసంఖ్యాక మానవకోట్లు వున్నవి. ఇంత గొప్పగా చెప్పుకునే ఇంగ్లండు

బ్రహ్మాండమైన ఆఫ్రికాఖండమానవజాతులముందర చీమలో దోమలోగా కనుపిస్తారు. అయితే ఆ జాతులన్నీ ఉదారమైన బానిసలని మీరు అనవచ్చు. వారు నిజంగా ఉదారులే; కాని బానిసలుమాత్రం కాదు. పాశ్చాత్య దేశాలు తమ సరుకులను ఆఫ్రికాఖండవాసుల నెత్తినవేసి సద్దేరోజులు ఇక కొద్దిలోనే అంతరించబోతున్నాయి. ఈ పారిశ్రామిక విధానము పాశ్చాత్యదేశాలకే ఇట్టి చీకటికోణంలో పడద్రోయబోతూవుంటే ఇక ఇండియా సంగతి వేరే చెప్పవలెనా?

( యంగ్ ఇండియా : 12-11-1931 )

## 2

### —: యంత్రములు :—

యంత్రాలకు ఉచితమైన స్థానము లేకపోలేదు. యంత్రము లోకంలో ఎట్లనో పాతుకొన్నది. అయితే అదివచ్చి అవసరమయిన మానవకృషిని శోషింపజేయనివ్వరాదు. ఇప్పుడున్నదానికంటె ఏదైనా మంచిరకం నాగలి ఉంటే మంచిదే. కాని ఎవడైనా ఒక విపరీతపు యంత్రాయంకని పెట్టి దాని సహాయముచేత ఇండియాలోవుండే భూమినంతా ఒక్కపెట్టున దున్నిపారేసి, దానిలోపండే పంటనంతా తానే కైవశం చేసుకోగలిగేస్థితి వస్తే ఇండియాలోని కోటానకోట్ల ప్రజలకు జీవనాధారంపోయి వారు ఎండినచెర్వులోని చేపల లాగ మాడిచస్తారు. అదికాక చేసే పనిలేక సోమరులై, మంద బుద్ధులై పోతారు. ఇప్పటికే చాలాభాగం అయినారులెండి !

ఇక రానురాను యిట్టివారిసంఖ్య పెరిగిపోయే అపాయంకూడా కనుపిస్తున్నది.

ఇండ్లల్లో కూర్చుని వస్తువులు తయారుచేసుకోడానికి తోడ్పడే యంత్రాలుకనిపెట్టి,వాటిలో మేలురకాలు తయారు చేయడం అంటే నేను ఒప్పుకుంటాను. అది నాకు సంతోషమే. అంతేకాని, పెద్ద యంత్రశక్తిచే నడిపించే వడుకుడు మిల్లులుపెట్టి. చేతి వృత్తులను తోసిరాజుజేసే పద్ధతికి మాత్రము నేను ఒప్పుకోను. ఇండియాలో ఉండే కోట్లకొలది రైతుజనానికి వారివారి ఇండ్లలో ఇంకొక ఉపవృత్తి చూపించకుండ ఏకాయెకిని ఈ రీతిగా యంత్రశక్తిని ప్రవేశపెట్టడం కేవలం వారియెడ మహాపచారం చేయడమేఅవుతుంది.

( యంగ్ యిండియా - 5-11-1925 )

సర్వజనుల యోగక్షేమములకు ఉపకరించ గలిగిన యంత్రమైతే ఫరవాలేదు - దాని ప్రవేశం న్యాయమే.

( యంగ్ యిండియా - 15-4-1926 )

ఇండియా ప్రజల దారిద్ర్యాన్ని, దానివల్లవచ్చే నిస్పృహను, పోగొట్టగలిగిన యంత్రమేదైనా ఉంటే అది యెంత విస్తృతమైనదైనాసరే ఒప్పుకుంటాను. నిరుద్యోగాన్ని, దారిద్ర్యాన్ని, కరువులను, పోగొట్టి, ధనం ఒకేచోట గుట్టలుగా పేరకుండ చేసే తక్షణ తరుణోపాయంగా రాట్నం ఒక్కటే నాకు కనిపించినది. అందుకనే, నేను దానిని సూచించాను.

నిజంమాట్లాడితే రాట్నంకూడ ఒక యంత్రమేకద. అది చాలా విలువైన యంత్రం. ఇండియాయొక్క ప్రత్యేక పరిస్థితులను మనస్సులోపెట్టుకొని ఆ రాట్నయంత్రములో నా బుద్ధికి తోచిన యేవో మెరుగులను దిద్దడానికి విధేయ పూర్వకముగ ప్రయత్నం చేశాను.

( యంగ్ ఇండియా – 3-11-1921 )

ప్రశ్న :- అయితే మీరు అన్ని యంత్రాలకు విరోధు లేనా ?

జవాబు:- కాదు, కాను, ఎంతమాత్రం కాదు; – అయితే, వెనుకముందు యోచన లేకుండ, ప్రతిదానికి యంత్రాన్ని పెట్టడానికి మాత్రము నేను విరోధిని. పైపైకి కనిపించే యంత్రాభివృద్ధుల విజయాడంబరమును, తళుకు బెళుకులనుచూచి, కండ్లు మిరుమిట్లుగొని, అంధుడనవడానికి నేను నిరాకరింతును. వినాశకరమగు యావద్యంత్ర విధానమునకు నేను పరమశత్రువును. అయితే సామాన్యపు పనిముట్లు, పరికరములు, నాకు సమ్మతమే. మనిషియొక్క శ్రమను తగ్గించి, కుటీరములలో అల్లాడు కోట్లకొలది జనానికి దారిద్ర్యభారమును తగ్గించగల యంత్రమేదైనా ఉంటే, దానికిని నాకు సమ్మతమే.

( యంగ్ యిండియా : 17-6-1926 )

నా అభ్యంతరం యంత్రములమీద కాదు. యంత్రముల మీద ప్రజలకున్న మోజుమీద. ఆ మోజు ఏమంటే,

"మనిషితో పనిలేకుండా చేసుకోవచ్చు" అని ఈ రీతిగా మనిషితో పనిలేకుండా చేసుకుంటూ పోగా, పోగా, తుదకు కోటానకోట్ల ప్రజకు పనిలేక, తిండిలేక, బజార్లవెంట అల్లాడుతూ తిరుగుతూ మాడిచావడమే అవుతుంది. కాలమును శ్రమను కూడ తగ్గించాలనే నా కోరిక: అయితే కొంత మందికే కాదు; అందరికిన్నీ. ధనము చేర్చుకోవలసినదే — కాని, కొద్దిమంది చేతులలోనికే కాదు; అందరి చేతులలోనికి ధనము చేరాలి. నేడు యంత్రములవల్ల వచ్చిన అనర్థకమేమంటే, కొద్దిమంది కోట్లకొలది జనాల పీకల మీద ఎక్కి స్వారీచేయడం కలుగుతోంది. యంత్రములను ఉపయోగించాలనే బుద్ధి "అయ్యో! మనిషి పాపం కష్టపడుతున్నాడు, వాడిశ్రమ తగ్గిద్దాము" అనే దయాంతఃకరణాచే కలిగిందికాదు. ఊరికే డబ్బు దోసిళ్ళతో దోచుకుందామనే దురాశే దీనికి మూలము. ఇట్టి దుస్థితిని మాన్పించడానికే నేను నా శాయశక్తుల కృషి చేస్తున్నాను.

"అంటే యంత్రమన్నంతమాత్రంమీద కాదు మీ విరోధము– యంత్రాన్ని దుర్వినియోగపరచడం మీద అన్నమాట."

"తప్పకుండా: అదే నా అభ్యంతరం. ఇంకొకమాటకూడ చెబుతాను. ప్రకృతి శాస్త్రపరిశోధనలు చేయడం, క్రొత్త క్రొత్త సంగతులు కనిపెట్టడం అనేది దురాశను పెంచుకోడానికి సాధనముగ మాత్రం ఉండరాదు. ముమ్ముందుగా ఈ ఉద్దేశాలు మానివేసుకోవాలి. ఈ దురుద్దేశ్యాలు మానుకొని

పనిచేస్తే పనివాళ్ళ యోగక్షేమాలను యజమానులు ఉపేక్ష చేయరు. అప్పుడు యంత్రమనేది మనిషికి సహాయకారియే అవుతుంది కాని హానికరము కాదు. యంత్రాల నన్నిటిని తుడిచివాకెయ్యాలని కాదు నేను పూనుకొన్నది. యంత్రోప యోగాన్ని స్వైరితిగా పరిమితం చేయాలనే నా సంకల్పం.

"అయితే, ఎలెక్ట్రిసిటీ ద్వారా ప్రకృతి శక్తులచేత నడపబడే విస్తృతమైన చిక్కురు బిక్కురు యంత్రాలన్నీ పోవలసినట్లుగానే కనిపిస్తుంది మీ హేతువాదాన్ని బట్టి చూస్తే—" అని ప్రశ్నించా రొకరు.

"పోతే పోవలసే ఉండవచ్చు. కాని, నే నొక మాట స్పష్టంచేయదలచుకున్నా. ఏపని ఎట్లాచేసినా అన్నిటికంటె ముఖ్యమైన ఉద్దేశ్యము మనిషియొక్క యోగక్షేమమే. మనిషే ప్రధానం — తక్కినవన్నీ తరువాతనే. యంత్రము వచ్చి మనిషియొక్క అవయవాలను కుంగదీయసేయరాదు. విచక్షణతో మనం యంత్రాన్ని ఉపయోగించుకోవాలి. ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. సింగర్ కుట్టు యంత్రం ఉంది చూడండి. ఇంతవరకు కనిపెట్టబడిన, పనికివచ్చే, కొద్ది యంత్రాలలో ఇదొకటి మంచిది. దీని నిర్మాణమును గూర్చిన చమత్కారమైన కథాఘట్టంకూడ ఒకటి ఉన్నది. ఒక రోజున "సింగర్" అనే ఆయన తన భార్య ఏవో గుడ్డలు చేతితో కుట్టుకోడానికి మిక్కిలి శ్రమ పడుతున్నట్లు చూశాడు. ఆ పని మహా విసుగుగా కనిపించింది. అదిచూచి సింగరుకు చాలా జాలివేసింది. అప్పుడు కేవలం ఆమెమీద

ఉండే ప్రేమార్ద్రిత చేతనే, ఆమె కీ అనవసరపు శ్రమ తగ్గించాలని ఈ కుట్టుయంత్రాన్ని ఆయన ఆలోచించి నిర్మించాడు. (అదే సింగరు కుట్టుయంత్రమైనది.) ఈ యంత్రము వలన ఆయన తన భార్యా శ్రమనే కాక, లోకంలో ఆ యంత్రాన్ని కొనుక్కోగల ప్రతి మనిషియొక్క శ్రమను గూడ తగ్గించా డన్నమాట.

ప్రశ్న :— అట్లాగయితే ఈ సింగరు మిషనులను తయారుచేయడానికయినా పెద్ద ఫ్యాక్టరీ లుండాలికద! ఆ ఫ్యాక్టరీలను నడపడానికి ఆవిరి, విద్యుత్తు శక్తు లుండాలికద?

జవాబు:—నిజమే, ఉండాలి. అయితే, నేనేమీ సోషలిస్టులకు తీసిపోను. నేనూ సోషలిస్టునే. అటువంటి ఫ్యాక్టరీలు ప్రభుత్వపరంగా ఉండాలి అంటాను (వ్యక్తుల చేతులలో ఉండకూడ దంటాను.) ప్రభుత్వపరంగా ఉన్న ఈ ఫ్యాక్టరీలు ఆదర్శప్రాయమయిన పద్ధతులలో నడవాలి. అంటే లాభాలు తీయటంకోసం కాదు. ప్రజా ప్రయోజనంకోసం పని చెయ్యాలి. దురాశకు బదులు ప్రేమ పనిచెయ్యాలి. పనివాండ్ర దుర్భర పరిస్థితులు మార్పుచెయ్యాలని నాసంకల్పం. ధనం దోచుకోవాలని పరుగెత్తే ఈ పిచ్చి పరుగులన్నీ కట్టిపెట్టాలి. పనివానికి తగు జీవిత భృతి ఇవ్వడమేకాకుండా, అనవసరపు చికాకు, శ్రమ తగ్గించే ఉపాయాలుకూడా చూడాలి. ఇట్టి పరిస్థితు లేర్పడిననాడు యంత్ర మనేది దాని యజమానికి లేక ప్రభుత్వానికి ప్రయోజనకరమైనట్లే. దానిని త్రిప్పే పనివానికికూడ సహాయకారి అవుతుంది. ధనాశకయి

నేడు మనం చూచే ఉన్మత్తపు పరుగులు కట్టుబడిపోతవి. పనివారు, నేను చెప్పినట్లు. ఆకర్షవంతమయిన ఆదర్శప్రాయమైన పరిస్థితులలో పనిచేస్తారు. సింగరు కుట్టుయంత్రి మొక్కటే నే నిట్టి అవాంఛనీయ యంత్రవిధానమునుండి మినహాయిస్తాను. ఎందుకంటే దాని వెనుక ప్రేమప్రేరణ యున్నది. మానవ క్షేమమే దానికి ఏకైక లక్ష్యముగా ఉన్నది. మనిషి పడే శ్రమను తగ్గించడం ఒక్కటే యే యంత్రానికిగాని పరమోద్దేశముగ ఉండవలెను. హృదయ పూర్వకమైన, సత్యమయిన, మానవప్రేమ-ధనదురాశ కాదు-మనకు కావలసింది. దురాశస్థానే ప్రేమను ప్రవేశపెట్టండి. అప్పుడు అన్నీ సైటవుతవి.

(యంగ్ ఇండియా : 13-11-1924)

ప్రశ్న:—"అయితే, ఈ యంత్రయుగానికి మీరు విరోధు లన్నమాట?"

జవాబు:—ఆ మాటంటే, మీరు నా ఉద్దేశాలను అపార్థం చేసుకొని, వక్రీకరింతగ చిత్రించుచున్నారని అర్థమవుతుంది. యంత్రమన్నంతమాత్రం చేతనే నేను దానికి విరోధిని కాను. నా విరోధమల్లా అది మనమీదయెక్కిస్వారి చేయరాదనంతవరకే.

ప్రశ్న:—అయితే మీరు ఇండియాను పారిశ్రామికరం చేస్తారుగా?

జవాబు:—తప్పకుండా చేస్తాను. అయితే "పారిశ్రామికం" అనే మాటకు నా అర్థం వేరు. గ్రామవృత్తులను పునరుద్ధరించడమే నా యీ అర్థము. ఇండియా గ్రామాలు పూర్వం పట్టణాలకు, పెద్ద నగరాలకు కావలసిన వస్తు సముదాయాన్నంత ఉత్పత్తి చేస్తూఉండేది. ఏనాటినుండియైతే మన నగరాలు, పట్టణాలు, విదేశస్థులు తమ సరుకులు అమ్ముకొనే అంగళ్ళయిపోయినవో, పరదేశాలనుండి చవక దనాసరిరకం సరుకులు తీసికొనివచ్చి మన నెత్తిమీద రుద్దుకోవడం ప్రారంభమైనదో, తద్వారా ధనం గ్రామాలనుండి వరదలు గట్టి బయటిదేశాలకు పోవడం సాగిందో, ఆనాటినుండే ఇండియాలో దారిద్ర్యం తాండవమాడనాగింది.

ప్రశ్న:—అయితే మీరు ప్రకృతిసిద్ధమయిన ఆర్థిక విధానం వైపునకు మరలిపోతున్నా రన్నమాట.

జవాబు:—అవును అయితే, గ్రామాలను నేను మరొక విధంగా పారిశ్రామికం చేస్తున్నాను.

(హరిజన్ : 27-2-1937)

ఇప్పుడు ఇండియాలో లేచిన పెద్దపెద్ద మిల్లులు స్వదేశీ పరిశ్రమలని అంటే అందురు గాక. జపాన్, లంకషైర్ మిల్లులతో అవి పోటీ చేస్తే చేయుగాక. అయినప్పటికి ఈ మిల్లులు ప్రజానీకాన్ని పోచుకొని, దేశ దారిద్ర్యాన్ని హెచ్చించేవి అని మాత్రం చెప్పక తప్పదు. ఈ మిల్లులు

ఎంతవరకు ఖాదీని అణచిపెట్టి, ఖాదీపై విజయధ్వజ మెత్తు తవో, అంతవరకు ఇవి ప్రజానీకాన్ని దోచుకుంటూ దేశ దారిద్ర్యాన్ని హెచ్చిస్తున్నవనే చెప్పాలి. దేశాన్ని సంపూర్తిగ బ్రహ్మాండమయిన యంత్రాగారాలతో నింపివేద్దామనే మనవాళ్ళకుండే మోజులో నా మాటలు పిచ్చిమాటలుగ కనపడవచ్చు. వాటి నెవరు పాటించకపోవచ్చుకాక! "యంత్రాగారాలు పెరిగినకొద్ది ప్రజల దారిద్ర్యం హెచ్చక తప్పదు; అది అనివార్యం; అయినప్పటికీ, ఈ దుస్థితిని ప్రజలు అనుభవించక తప్పదు, అనుభవించవలసినదే" అని కూడ మన వారంటున్నారు. ఈ దుస్థితి అనివార్యంకాదు. నివార్యమే. అది అనుభవించవలసిన పనియు లేదు ఈ సంగతిని అఖిల భారత చరఖాసంఘం ఋజువు చేసింది. కేవలం పనిలేని తీరిక సమయాలలో దూది ఏకుట, వడకుట, మొదలయిన పనులను ప్రజలు చేబట్టుటద్వారా ఇండియాకు కావలసిన యావత్తు వస్త్రావసరములను మన గ్రామాలే తీర్చగలవని ఈ చరఖా సంఘము స్పష్టముగ ఋజువుచేసినది.

హరిజన్ : 23-10-1937)

పెద్ద పెద్ద కంపెనీలు పెట్టి బ్రహ్మాండమైన చిక్కురు వాక్కురు యంత్రాలుపెట్టి, పరిశ్రమలను కేంద్రీకరణం చేయడం నా కెంతమాత్రం గిట్టదు. దీనికి నేను వ్యతిరేకిని. ఇండియా ఖద్దరును చేబట్టి దానియందు ఇమిడియున్న సంపూర్ణ భావమును గ్రహించినచో సర్వమూ చక్కబడ గలదు. అనవసరపు శ్రమను తగ్గించుకోడానికి, జీవితావసర

ములను సమకూర్చుకోవడానికి అవసరమైనంతవరకు ఆధునిక యంత్ర సహాయమును ఇండియా తీసికొనవచ్చును. ఖద్దరు తత్వమెరిగి దానిని చేపట్టినచో ఇది యిండియాకు సాధ్యమనియే నా తలంపు. ఈ విషయమై నాకు నిరాశ కాని నిరుత్సాహము కాని లేదు.

(యంగ్ ఇండియా : 24-7-1924)

ఇకనైనా గ్రామాలను దోచుకోవడం మానివేస్తే అవి తిరిగి తలలెత్తడానికి వీలున్నది. బ్రహ్మాండమైన యంత్రాగారముల వల్ల పైకి కనిపించే రీతిగానో, కనిపించనిరీతిగానో, గ్రామస్థులను దోచుకోవడమే విధిగ జరిగితీరుతుంది. ఎందుకంటె, సరుకు విలువల గురించియు పోటీల గురించియు అనేక చిక్కులు ఏర్పడితీరుతవి. కనుక, గ్రామాలను స్వయంపోషకముగ చేయుట మీదనే మనము మనకృషిని కేంద్రీకరించవలెను. ప్రధానంగా మన ఉపయోగాలకొరకే వస్తూత్పత్తిని చేసుకొనవలెను. ఈ గ్రామముయొక్క ఈ తత్వము చెడకుండ, నిలుపుకొంటే ఆధునిక యంత్రములను సైతము—తాము చేసుకోగలవి ఉపయోగించుకో గలవి – గ్రామస్థులు ఉపయోగించుకోడానికి అభ్యంతరంలేదు. అయితే ఇతరులను దోచుకోడానికి ఉపకరణములుగ మాత్రం వాటి నెన్నడును ఉపయోగింపరాదు. అంతే.

( హరిజన్ : 29-8-1936 )

అత్యధికమైన వస్తూత్పత్తి చేద్దామనే ఉన్మాదమే లోకానికి ముప్పుదెస్తున్నదని నేను ఘట్టిగ చెబుతున్నాను.

యంత్రాగారాలవల్ల మానవకోటి యావన్మందికి కావలసిన వస్తువులను ఉత్పత్తి చేయవీలున్నదని ఒప్పుకొన్నప్పటికీ, దానిలో ఒక ప్రమాదం ఉంది. ఎట్లంటే వస్తూత్పత్తి కొన్ని కొన్ని చోట్లలోనే కేంద్రీకృతం అవుతుంది; ఆ చోట్లనుండి ఆ వస్తువులను లోకులకు పంపిణీ చేయడానికి డొంక తిరుగుళ్లుగ ఎన్నో దోవలు తొక్కవలసి వస్తుంది. ఈ మెలికలలో ఎన్నో మోసాలు దగాలు దాగిఉంటవి. అట్లుకాక, ఆ వస్తువు కావలసిన చోటనే దాని ఉత్పత్తికి పంపిణీకి — రెంటికి ఒకేచోటనే - ఏర్పాటుచేస్తే ఎక్కడ ఉత్పత్తయైన వస్తువు అక్కడే పంపిణీఅయి వినియోగపడిపోతుంది. దానంతటది సులభంగా, సాఫీగా జరిగిపోతూఉండే ఇట్టి పంపిణీ పద్ధతిలో డొంక తిరుగుళ్ళు, దాగుడుమూతలు, దగాలు ఉండవు.

లోకంలో వ్యవస్థా విహీనములుగ ఉండి-అనగ తమ ఏర్పాట్లను తాము చేసికోలేక, దుర్బలములని చెప్పబడు ఇతర బక్క దేశాలను నేడు యూరప్, అమెరికాలు దోచుకుంటున్నవి కద, చూడు. ఇక, ఈ బడుగుదేశాలు కొంచం కన్ను తెరచి, ఈ దోపిడీలకు తావు ఇవ్వము అని కనుక నిశ్చయించుకుంటే అమెరికా యూరపుల పని కట్టుబడుతుంది. ఈబక్క దేశాలు తమంతటతామే నిర్మించుకొనగలిగిన వస్తువులతోనే సంతృప్తిచెంది సరిపెట్టుకొన గలుగుతవి.

బ్రహ్మాండమైన యంత్రాగారములద్వారా జరిగే ఈ బహుళవస్తూత్పత్తి అప్పుడు కట్టుబడుతుంది; కనీసము, జీవిత

మునకు నిత్యావసరమైన వస్తునిర్మాణము ఈ రకమైన బహుళ యంత్రోత్పత్తి పద్ధతిగ జరగడమనేది కట్టుబడిపోతుంది.

వస్తూత్పత్తియు తద్వినియోగముకూడ—రెండూ—ఒకే చోట స్థానికముగ జరిగిననాడు, వస్తువులను అపారసంఖ్యగ—యెట్టిదుష్పరిణామములకైనాసరే ఒడిగట్టి— ఉత్పత్తి చేద్దామనే కాంక్ష, వ్యామోహము మాయమైపోతుంది. నేటి ఆర్థికవిధానములో చెలరేగుచున్న అంతులేని కష్టాలు సమస్యలు కూడ సమసిపోతవి.

కొద్దిమంది జేబులలో అసహజముగ పెరిగిపోయే ధనరాసులు ఒకమూల మూలుగుతూ ఉండడం, మరొకమూల మిగతాబహుజనానికి తిండియే లేకపోవడం, అనే విపరీతస్థితి తొలగిపోతుంది. (చుట్టూ జలరాశియున్నా త్రాగడానికి గుక్కెడు నీరు కరవైనట్లు)

ప్రశ్న:- అయితే, బహుళవస్తూత్పత్తి భావి భారత దేశానికి మీరు ఆవశ్యంగా అంగీకరించరా?

జవాబు:- ఓ, తప్పకుండా అంగీకరిస్తాను. అయితే, ఆ బహుళవస్తూత్పత్తి అనేది దౌర్జన్యసాధనమీద మాత్రం ఆధారపడనీయను. నిజానికి నా రాట్నసందేశంఇదే. రాట్నం ద్వారా జరిగేదికూడ బహుళవస్తూత్పత్తియే - అయితే అది వేర్వేరుగ ప్రజలు ఎవరిఇంట్లో వారు చేసుకునే వస్తూత్పత్తి. ఈ రీతిగా కోట్లకొలది వ్యక్తులు తమతమ ఇంట్లో చేసే ఉత్పత్తి

అంతా కలిపితే, అది బ్రహ్మాండమైన సంఖ్యలుగ చేసే వస్తూత్పత్తి కాదా ? అయితే "బహుళవస్తూత్పత్తి" అన్నప్పుడు మీ మనస్సులో ఉన్న అభిప్రాయమేమో నాకు తెలుసులేండి. మిక్కిలి చిక్కురు వొక్కరైన బ్రహ్మాండమైన రాకాసి యంత్రాల సహాయంతో వీలైనంత తక్కువ మంది జనంచేత చేయించే ఉత్పత్తియే "బహుళోత్పత్తి" అని మీ అర్థం ! మీ సంకేతార్థమిదే నాకు తెలుసు. ఈ అర్థం, ఈ భావం, తప్పు అని నా మనస్సు నాకు గట్టిగ చెబుతున్నది. నా ఉద్దేశ్యంలో కూడ ఒకయంత్రం ఉన్నది. అయితే అది చాలా సులభమైనది. కోటానుకోట్ల ప్రజల కుటీరములలో తేలికగ ప్రవేశపెట్టడానికి వీలైనది – ఇదీ నా యంత్రం.

ప్రశ్న :— ఐనగ, యంత్రమనేది వస్తువుల యొక్క ఉత్పత్తిని పంపిణీని రెంటిని ఒకని చేతిలోనే కేంద్రీకరిస్తున్నది కనుకనే – అట్లా కేంద్రీకరించినప్పుడే – మీరు దానికి విరోధులన్నమాట !

జవాబు :— సరిగ్గా అంతే–మీరు చెప్పినది రైటు. ఒకని గుప్పెటలోనే యావద్ధనం ఉండడమనే దానిని నేను అసహ్యించుకుంటాను. ఈ మిరాశీలు నాకు గిట్టవు. తక్కిన యావజ్జనానితో పంచుకోవడానికి వీలుపడని సంపద నా కెంత మాత్రం వద్దు. అది నాకు నిషేధం. అంతే

( హరిజన్ : 2–11–1934 )

## C. మూలధనం — శ్రమ (కాయకష్టము)

## 1

### మూలధనం - కాయకష్టము

ఈ లోకంలో సర్వం మూలధనం (డబ్బు) మీాదే ఆధారపడియున్నదనే భ్రాంతిలో మనం ఉంటున్నాము. కాని, ఒక్కక్షణం జాగ్రత్తగ ఆలోచించిచూడండి. కూలి వాని వద్దకూడ కండబలం అనే మూలధనం ఉంది. ఇట్టి మూలధనం షాహుకారువద్ద యెన్నడూ ఉండదు. శ్రామికుల చేతులలో సాటిలేని మంచి అవకాశాలెన్నో ఉన్నవని "రస్కిన్" అను ఆంగ్లతత్వవేత్త తననాట వక్కాణించియున్నాడు. అయితే, ఆయన చెప్పింది మన బుర్రలకు అందనిదిగా ఉంటూవచ్చింది. కాని నేడు "సర్ డ్యానియల్ హామిల్టన్" అనే ఇంకొక ఆంగ్లేయ తత్వవేత్త ఇందును గూర్చిన ప్రయోగములు క్రియాత్మకంగా చేసి చూపిస్తున్నాడు. ఆయనకూడ బాగా తెలిసిన ఆర్థికవేత్తయే-ఆయన కూడ పెట్టుబడి డబ్బుగల షాహుకారే. అటువంటి ఆయన తాను చేసిన పరిశోధనలను బట్టియు, ప్రయోగములను బట్టియు, సరిగ్గా ఆనాడు "రస్కిన్" తన సహజబుద్ధి విశేషముచే వచ్చిన అభిప్రాయాలకే వచ్చాడు. తద్వారా శ్రామిలోకానికి జీవప్రదమైన సందేశాన్ని అందజేశాడు. "లోహపు ముక్కయే సంపద,ధనం అనుకోవడం తప్పు." అని ఆయన చెబుతున్నాడు. "ఇంతింత వస్తువులకున్నట్లే

సంపద అనుకోవడంకూడ తప్పు" అనియు ఆయన అంటు న్నాడు. అయితే, ఈమాటతోపాటు ఇంకొక మాటకూడ ఆయన చెబుతున్నాడు - ఏమనగా "అసలు మూలంలోకి పోయి విచారించిచూస్తే నిజానికి శరీరశ్రమయే - (కాయ కష్టమే) ధనం, సంపద; అదే పెట్టుబడిదారుల్ని-అదిప్రాణంతో కూడిన ధనం. ఆధనం ఎన్నడూ తరిగిపోయేదికాదు" అని ఆయన అంటున్నాడు.

(ఇండియాకురిగిల స్వరాజ్యర్థత—
1932 - పేజీ 393)

పెట్టుబడిదార్లులకు, కూలీలకు మధ్య సవ్యమైన సంబం ధాలు నెలకొల్పడమే నా సంకల్పం. ఈ ఇరుపక్షాలలో ఒకరిపైన ఒకరికి అధిపత్యం - సవారిచేసే అధికారం- ఉండ రాదని నా ఉద్దేశ్యం. ఈ ఉభయ పక్షాల మధ్య సహజ పర స్పర వైరుధ్యం ఉండదని నేను అనుకోను.

(యంగ్ ఇండియా - 8-1-1935)

డబ్బు బలమైనదంటే, కూలివాని కాయకష్టం కూడ బలమైనదే అంటాను. ఈ రెండుబలాలు మంచికీ ఉపయోగ పడవచ్చు, చెడ్డకీ ఉపయోగపడవచ్చు, ఇవి ఒకదానిపై ఒకటి ఆధారపడియున్నవేకాని, విడిపోతే వేర్వేరుగ నిలువ జాలవు. కూలివాడు తన శక్తినితాను గుర్తించిన తక్షణము నుండి పెట్టుబడిదారైన షాహుకారుతో సమాన భాగస్వామి కాగలడు. అతనికి బానిసగ ఉండనక్కరలేదు. సమాన భాగ

స్వామిగాకాక, సర్వమునకు తానే అధికారిగ, సొంతదారుగా, ఉండాలని కూలివాడు చూస్తే వాడు రోజు రోజు బంగారు గుడ్లను పెట్టే కోడిని ఒక్కనాడే కోసుకుతిన్నవా డవుతాడు.

(యంగ్ ఇండియా : 26-3-1931)

## 2

—• ధనమును కేవలం సొంతానికి ఉపయోగించు కోవడానికి ఎవనిక్నీ నైతికమైన హక్కు లేదు •—

ప్రశ్న :— ఐహిక ధనమునుగాని, నైతిక ధనమును కాని, ఎవడైనా సంపాదించుకుంటే అది అతడు తన తోడి మానవుల సహకారంవల్ల మాత్రమే సంపాదించుకో గలుగుతున్నాడు కదా. అట్టి సందర్భంలో ఆత డీ ధనములో దేనినైనా కాని, కేవలం తన-సొంత ప్రయోజనానికే వినియోగించుకోడానికి ఆతనికి నైతికమైన హక్కు ఉన్నదా ?

జవాబు — లేదు, లేదు. ఎంతమాత్రం లేదు—

(హరిజన్ : 16-2-1947)

## 3

—• ధర్మకర్తృత్వము ("ట్రస్టీ" విధానం) •—

ప్రశ్న :— భాగ్యవంతులు ట్రస్టీలుగా ఉండాలని మీరన్నారు. అంటే వారు తమ ఆస్తిపై సొంతహక్కు వదలుకొని "లా" ప్రకారం చెల్లదగిన ట్రస్టుగ దానిని నిర్మించి

పదకు ట్రస్టీల ఆమోదంతో దానిని నిర్వర్తింపవలె ననియా మీ ఉద్దేశ్యం? అప్పుడు ఆ ధనవంతుడు మరణించినపిమ్మట ఆ ఆస్తికి వారసు లెవరవుతారు?

జవాబు:— ఈ ప్రశ్నకు జవాబుగా లోగడ తానిచ్చియున్న అభిప్రాయమునే మరల గాంధీగారు స్పష్టంగా చెప్పారు. అది ఇది:— ఈ లోకంలో ప్రతివస్తువూ భగవంతునికే చెందియున్నది అది భగవంతుని నుండియే వచ్చియున్నది కనుక ఆ వస్తువు భగవంతుని బిడ్డలందరికి చెందవలసిందేకాని ఏ ఒక్క వ్యక్తికో కాదు తనకు రావలసిన వంతుకంటెఎక్కువ సంపద ఎవరి వద్దనైన ఉండుట తటస్థించే యెడల, ఆ యెక్కువ సంపదకు ఆతడు తనతోడి తక్కిన దేవుని బిడ్డలందరి తరపున ట్రస్టీగ, లేక ధర్మకర్తగ అవుతున్నాడు.

భగవంతుడు సర్వశక్తిమంతుడు. ఆయన ఒక్కసారే వస్తువులు తయారుచేసి కూడబెట్టుకోనక్కరలేదు. ఏ రోజుకు కావలసినవి ఆరోజే ఆయన తయారు చేసుకోగలడు. అలాగే తయారు చేసుకుంటాడు. కనుక మనుష్యులుకూడ ఆ సిద్ధాంత రీత్యా తమకు కావలసిన వస్తువులను ఏరోజు ఆరోజే తయారు చేసుకోవాలికాని, ఒకసారే స్టోరు చేసుకోకూడదు. (పేర్చి పెట్టుకోకూడదు) ఈ సత్యమును ప్రజలందరు సర్వసాధారణ స్థితిగా అవలంబిస్తే, అదే ప్రభుత్వ శాసనమైపోతుంది. ఇదే 'లా' ప్రకారంగా ట్రస్టీవిధానమై పోతుంది. ఈ ట్రస్టీ విధానమే ఇండియా మిగతా లోకానికి ఇచ్చే ధార్మికసందేశంగా

ఉండాలని నా కోరిక. ఇట్టిస్థితి ఏర్పడితే లోకంలో దోపిడీ విధానం అదృశ్యమైపోతుంది. ఇప్పుడున్నట్లుగ తెల్ల జాతి వారికిన్ని, వారి సంతతివారికికూడ, ఆస్ట్రేలియా మొదలగు ఖండాలలో మిరాశీ భూములు ఉండజాలవు. ఇట్టి మిరాశీ భూములు వ[illegible]రాలలోనే ఇక భవిష్యత్తులో ఎన్నో ప్రపంచ యుద్ధాలకు బీజాలున్నవన్నమాట. ఇకముందు రాబోయే ఈ యుద్ధాలు గతరెండు ప్రపంచయుద్ధాలకంటెకూడ భయంకరంగా ఉండగలవుకూడ

ఇక, వారసు డెవడవుతాడన్న సంగతికి సమాధానమేమంటే; ప్రభుత్వాన్ని "లా" కు లోబడి, అప్పటికున్న ట్రస్టీయే దానికి వారసును నియమించుకొనుటకు హక్కు గలిగి ఉంటాడు. (హరిజన్ : 23-2-1947)

నా యీ ట్రస్టీ సిద్ధాంతం ఏదో తాత్కాలికపు అతుకుగ చెప్పిందికాదు; ఏదో కప్పిపుచ్చడానికి చెప్పింది కూడ ఎంతమాత్రంకాదు. మిగతా సిద్ధాంతాలు ఎన్ని గతించిన, ఇది మాత్రం స్థిరంగా నిలబడుతుందని నా గట్టి నమ్మకం. దీని వెనుక సత్యబలం, ధర్మబలం, అండగఉన్నది. ధనం కలవారు ఈ సిద్ధాంతానికి అనుగుణంగ వర్తించడం లేదనే సంగతి వేరు. అంత మాత్రంచేత ఈ సిద్ధాంతం తప్పుయినట్లు ఋజువుకాదు. ఈ సిద్ధాంతం ప్రకారం ధనికులు వర్తించకపోతే, అది వారి దౌర్బల్యమే అవుతుంది కాని, సిద్ధాంతం మాత్రం తప్పుకాదు. అహింసానుసారియైన సిద్ధాంతం ఇదికాక వేరొకటిలేదు. (హరిజన్: 16-12-1939)

ప్రశ్న :— ట్రస్టీయైన ఆస్థిపరుడు ఒకడు మరణించిన తరువాత ఆ ఆస్థికి అతని పిమ్మట యెవడు వారసు (ట్రస్టీ) అవుతాడు ? తన వారసుని పేరు తాను ప్రతిపాదించడం వరకు మాత్రమే హక్కు ఉంటుందా? పిమ్మట దానిని స్థిరపరచే హక్కు ప్రభుత్వానికి ఉండాలా ?

జవాబు:—(దీనికి లోగడనే గాంధిగారు జవాబు చెప్పియుండిరి. అదేదనగా) :- ప్రప్రథమంలో ట్రస్టీగాయైన వాడు వారసుట్రస్టీని నియమించడానికి అవకాశం ఉంటుంది; అయితే ఈ నియామకం ప్రభుత్వంచేత స్థిరపరుపబడవలెను. ఇట్టి నిబంధన అటు వ్యక్తికి ఇటుప్రభుత్వానికి కూడా సవ్యపునడకకు కల్లిముగ ఉంటుంది.

ప్రశ్న :— మీ "ట్రస్టీ"సిద్ధాంతంద్వారా "ప్రయివేటుఆస్థి" అనేదిపోయి దానిస్థానే "పబ్లిక్ఆస్థి" ఏర్పడినప్పుడు ఆ ఆస్థి యొక్క స్వామ్యత్వముఅనగ (సొంతదారీ తనమనేది) ప్రభుత్వానికి సంక్రమిస్తుందా ? మరి, అయితే ప్రభుత్వాలు అనేవిహింసామూలకములుగదా!అట్టిహింసామూలక ప్రభుత్వాలకుకాక ఐచ్ఛికముగ ప్రజలచే ఏర్పరచుకొనబడే గ్రామ సంఘాలు, మునిసిపాలిటీలవంటి సంస్థలకు ఈ స్వామ్యతం సంక్రమిస్తుందా ? ఈ ఐచ్ఛిక ప్రజాసంస్థలైనా కొసకు పైనున్న ప్రభుత్వం చేసిన చట్టాల మూలకంగా కదా పాదుకొల్పబడతవి?

జవాబు :— మీ ప్రశ్నల భావంలో కొంత తబ్బిబ్బు కనిపిస్తున్నది. నా ట్రస్టీసిద్ధాంతం ప్రకారం ఆస్థిస్వభావం

మార్పు చెందినప్పుడుకూడ దానియొక్క "స్వామ్యత్వం" సొంతదారీతనం అనేది "లా" దృష్టిలో ఆ ట్రస్టీలోనే నిలిచి యుంటుంది. ప్రభుత్వానికి సంక్రమించదు. వ్యక్తియొక్క ఆస్తిని ప్రభుత్వం లాగివేసుకోవడమనే స్థితిని తప్పించడానికే నా యీ ట్రస్టీసిద్ధాంతం అసలువచ్చింది. అసలు యజమానికి ఉన్న స్వామ్యత్వపు హక్కులు నిలుపుకోగలగడానికే ఈ ట్రస్టీసిద్ధాంతం ఏర్పాటైనది

ఇంకొకసంగతేమంటే, ప్రభుత్వమనేది శాశ్వతంగా హింసమీదనే విధిగ ఆధారపడి ఉండాలనే మాటలేదు. సిద్ధాంతరీత్యా ప్రభుత్వం హింసామూలకం కావచ్చుకాక; కాని, క్రియలో ప్రభుత్వం చాలవరకు అహింస మీదనే నడవవలసి ఉంటుంది.

(హరిజన్ – 16-2-1947)

# 4

## గాంధిగారి ట్రస్టీ సిద్ధాంతం

### (ప్యారీలాల్‌గారి వ్యాసం)

జైలునుండి విడుదలకాగానే లోగడ ఆగాఖాన్ మందిర నిర్బంధవాసకాలంలో మేము ఆలోచిస్తూ ఉండిన ట్రస్టీ సిద్ధాంతాన్ని గూర్చి మరల ఆలోచన సాగించాము. కిశోరలాల్ భాయి, నరహరిలాల్ భాయిలుకూడ మాఆలోచనలలో చేరారు. మేమంతాకలిసి ఈ ట్రస్టీసిద్ధాంతానికి విశిష్టమైన,

విశిష్టమైన రూపురేఖలు దిద్ది బాపూజీముందు పెట్టాము. ఆయన దానిలో కొన్నిమార్పులు చేశారు. తుదకు స్థిరపరచిన రూపం ఈ దిగువరీతిగా ఉన్నది:—

(1) ఇప్పుడున్న సాహుకారీ (పెట్టుబడి) విధానాన్ని పరస్పర సహకార విధానముగ మార్చివేయడానికి ట్రస్టీ సిద్ధాంతం ఒక సాధన అవుతుంది. సాహుకారితనానికిది చోటివ్వదు. కాని, ఇప్పుడున్న ఆస్తిపరులు తమంతటతాము (ఈసహకార పద్ధతిలోనికి) మార్పుచెందించుకోడానికి వారికి ఒక అవకాశం ఇస్తుంది

"తనలోపమును ఎన్నటికైనాసరే దిద్దుకోకనపోవడమనేది మనిషి స్వభావంలో లేదు" అనే నమ్మకంమీద ఈసిద్ధాంతం ఆధారపడియున్నది. (నేడుకాకున్నా మనిషి తనలోపమును రేపైనా దిద్దుకొని తీరుతాడు)

(2) సంఘం స్వశ్రేయస్సు నిమిత్తం యెంతవరకైతే అనుమతిస్తుందో అంతవరకే తప్ప అంతకుమించి ఆస్తిలో ఏ వ్యక్తికీకాని ప్రయివేటు (సొంతదారీ) హక్కు ఉండనేరదు. నిర్నిబంధమైన సంపూర్ణ స్వామ్యత్వమును (హక్కును) ఈ సిద్ధాంతం ఏవ్యక్తికికాని ఆస్తిపై అంగీకరించదు.

(3) ఆస్తిపై స్వామ్యత్వమును గూర్చియు, దాని వినియోగమును గూర్చియు ప్రభుత్వము తనశాసనముల ద్వారా నియమములు యేర్పరచినడిపించవచ్చును. దానికి అభ్యంతరములేదు.

(4) ఈ రీతిగా ప్రభుత్వశాసనములద్వారా నడిపించ బడు ట్రస్టీసిద్ధాంతము జనములోనికి వచ్చినప్పుడు, ఏవ్యక్తి కాని తన ఆస్తిని -సమిష్టిసంఘ (శ్రేయముతో) నిమిత్తం లేక్ - తన ఇష్టమువచ్చినట్లు తన స్వార్థతృప్తికై వినియోగించుకోడానికి ఎంతమాత్రం వీలుండదు.

(5) సర్వసామాన్యమైన కనీసపు జీవనభృతిని నిర్ణయింపదలచి నట్లే, ఏవ్యక్తికిగాని "ఇంతకుమించిహెచ్చు ఆదాయం ఉండ కూడదు" అనే నిర్ణయం కూడ చేయవలెను. ఈ "కనీసపు" జీవనభృతికిని, ఈ "హెచ్చు" ఆదాయమునకు నున్న వ్యత్యాస తేడా అట్టే ఉండరాదు. ఆ తేడా యేదైనా ఉంటే అది న్యాయమునను సహేతుకముగాను ఉండాలి; మరియు అప్పటి ప్పటికి మార్పుచెందదగినదిగ ఉండాలి అనగా, కొనకు ఈ తేడాయే కాలక్రమమున నశించు ధోరణిలో ఉండాలి.

(6) వస్తూత్పత్తి సంఘావసరములను బట్టి ఉండవలెనే కాని, వ్యక్తియొక్క దురాశకుగాని, కయ్యాళికిగాని, అనుగు ణ్యముగా ఉండునదిగా ఉండరాదు. గాంధిగారి ఆర్థికవిధా నములో ఉండే స్థితి ఇది. (హరిజన్ 25-10-1952)

## D. భూస్వామి రైతు:

# 1

—• ఆదర్శప్రాయుడైన జమీందారుడు •—

రైతు నేడు భరించుచున్న బరువును ఆదర్శప్రాయు డైన జమీందారుడు చాలభాగం వెంటనే తగ్గించివేస్తాడు.

అట్టి జమీందారుడు తన రైతులతో సన్నిహితసంబంధం ఏర్పరుచుకొంటాడు. వారికష్టసుఖాలు, వారి అవసరాలు గుర్తిస్తాడు. కేవలం వారి బ్రతుకనే హరించే నిరుత్సాహమును తొలగించి దానిస్థానే ఉత్సాహమును నవజీవితాశను, పూరిస్తాడు. పారిశుద్ధ్యమును గూర్చియు ఆరోగ్య నియమాలను గూర్చియు వారికి నేడున్న అజ్ఞానమును ఆ జమీందారుడు "తనకేమీ పట్టనట్లుగ" చూస్తూ ఊరుకోడు. ఈపరిస్థితిని మార్చడానికి అతడు ప్రయత్నిస్తాడు. వైద్యావసరములను తన రైతులకు కల్పించడానికేగాక, అతడు తానై పేదరికమునే వరిస్తాడు. తనవైపు. ఆ స్థితిని పరిశీలిస్తాడు. వారి పిల్లలకు పాఠశాలలు ఏర్పరుస్తాడు. ఆ పాఠశాలలలోనే రైతుపిల్లలతోపాటు వారిసరసనే తనపిల్లలను కూడా కూర్చోపెట్టి చదువు చెప్పిస్తాడు. తన జమీ గ్రామాలలోనున్న చెరువులను, కాల్వలను బాగుచేయిస్తాడు. వీధులు ఊడ్వడం, పాకీదొడ్లుపరిశుభ్రంచేయడం మొదలు తానే స్వయంగాచేసి చూపించి తన రైతులకు ఆ ప్రకారం చేసుకోవడం బోధిస్తాడు. ఇటువంటి పనులు జీవితానికి అత్యవసరమనుకొనక రైతులు స్వేచ్ఛగా ఉపయోగించుకోవడానికిగాను ఇట్టిజమీందారుడు తనతోటలను దొడ్లను యథేచ్ఛగా వదలివేస్తాడు. కేవలం తన భోగంకోసమై అట్టిపెట్టుకొన్న అనవసరపు భవంతులను మేడలను అన్నింటిని ఆస్పత్రులక్రింద, స్కూళ్ళక్రింద, మార్చివేసేస్తాడు. ధనికవర్గం కాలగతులనుగమనించి, తమ ఆస్తిపై హక్కు భగవంతుడే తమకిచ్చాడనే పిచ్చిధోరణిని మార్చుకొంటే, తక్షణమే ఇండియాలో నేను "గ్రామము

లనే పేరుతో చెలామణి యగుచున్న పెద్ద లక్షల సొంతకుప్ప లన్నీ శాంతి, సౌఖ్య నిలయములుగా మారిపోగలవు. మనము ఊహించలేనంత స్వల్పకాలంలోనే ఈ మార్పు జరుగగలదు.

(యంగ్ ఇండియా 5-12-1929

జమీందారుడు, ఒకానొక సాంఘిక విధానములో ఒక ఉపకరణముగా మాత్రము ఉన్నాడు. పాపం, అతడేమి చేయగలడు! ప్రస్తుతః జమీందారుడున్నంతమాత్రాన పాపికాడు. కనుక అతనిమీదకి ప్రత్యేకంగా దండయాత్ర సాగించవలసినపని లేదు. రైతుల యెడ సద్భావంతో వర్తించుచున్నంతకాలము మనకు జమీందారులతో (జమీందారు లన్నంతమాత్రం చేత) తగాదాయేమీ లేదు.

(యంగ్ ఇండియాలో 26-11-1931)

# 2

## — ♦ జమీందారులకు ఒక మాట ♦ —

సన్యాయమైన కారణం లేకుండ, కలవారి ప్రయివేటు ఆస్తిని ఊడగొట్టించడానికి నేను ఒప్పుకోనని మీకు హామీ ఇస్తున్నాను. మీ హృదయాన్ని ప్రబోధించి మిమ్మల్ని మార్పు చెయ్యాలని నేను చూస్తున్నాను అంతే. అంటే మీ ప్రయివేటు ఆస్తి అంతా మీ రైతులకుగాను మీరు ట్రస్టీలుగా (ధర్మకర్తలుగా) ఉండి, ప్రధానంగా మీ రైతుల శ్రే

యుష్నకొరకే వినియోగించేటట్లు మీ హృదయాలు మార్చాలని నా సంకల్పం. అంతే. ఈ సమస్యాపరిష్కారం న్యాయంగా సవ్యంగా నిర్దిష్టంగా మన భారత ప్రజాకోట్లయొక్క వోటు తీసికొనేట్టయితే కలవారి ఆస్తులన్నింటిని ఏకదమ్ ఊడగొట్టివెయ్యాలని ఎవరూ కోరరని నా నిశ్చితాభిప్రాయము. ధనికులయు కూలివారి మధ్యనున్న - భూస్వాములయు రైతులయు మధ్యనున్న - సద్భావసహకారాలు, సమన్వయం ఏర్పడటానికే నేను చేసే కృషి అంతా.

అయితే నేనొక హెచ్చరిక మాత్రం చెయ్యాలి. మిల్లు యజమానులతో నేనెప్పుడూ ఏమి చెబుతున్నానంటే 'అయ్యా ఈ మిల్లులన్నీ కేవలం మీ స్వంత ఆస్తిగాదు! మీతో సమానంగా కూలీలకు కూడ ఈ మిల్లులలో స్వామ్యత్వపు హక్కు ఉన్నది' అని చెబుతూ ఉంటాను. అదే రీతిగా జమీందారులైన మీకు నేను చెబుతున్నా. ఈ భూములకు మీరొక్కరే కాదు స్వంతదారులు - మీతోపాటు రైతులకున్ను అట్టి హక్కు ఉన్నది. కనుక, వానిమీద వచ్చే రాబడిని మీ ఇష్టం వచ్చినట్లు మీ భోగలాలసలకోసం తగుల బెయ్యడానికి మీకు వీలు లేదు. ఆ రాబడిని రైతుల క్షేమం నిమిత్తం మీరు ఖర్చు పెట్టాలి. మీతోపాటు, మీ రైతులు కూడ ఏక కుటుంబంలోని వారే అనే భావం మీరు గనుక వారిలో ఒకసారి కలిగించగలిగారా - ఈ కుటుంబంలో వారి శ్రేయస్సుకు మీ చేతుల్లో ఏమీ దెబ్బతగలదనే విశ్వాసం మీరు వారికి కలిగించగలిగారా - ఇక, మీకూ వారికీ మధ్య యెన్నడూ

ఘర్షణఅనేది రానే రాదు- వర్గపోరాట మనేది యెన్నడూ పొడసూపనే పొడసూపదు. ఇది నిశ్చయమని నమ్మండి.

మీ భయాలు, మీ అనుమానాలు అన్నీకూడ కేవలం మీరు తెచ్చిపెట్టుకొన్న ఊహలే - దోషయుక్తమైన మీ మనస్సులో పుట్టిన ఊహలే. తెలిసియో తెలియకనో మీరు చేసియున్న అన్యాయాలనన్నింటిని తుడిచివేయండి. రైతులకు మీనుండి ఏమికావాలి? శాంతిగా స్వేచ్ఛగా బ్రతకాలనే వారికోరిక. కష్టానికి తగ్గ-అంతకెక్కువేమీ లేదు. ఆస్తిని కనుక వారి క్షేమంకోసం మీరు వినియోగపరుస్తూ ఉంటే, ఆ ఆస్తి మీ చేతులలో ఉండిపోయిందనే చుప్పనాతితనం, అసూయ రైతులకేమీ ఉండదు. మీచేతులలోనే ఉండనీ అంటారు.

(అమృత బజార్ పత్రిక 2-8-1934)

## 3

### -: భూమిపై హక్కు :-

నిజమైన "సోషలిజము"ను మనపూర్వులే ఎన్నడో చెప్పారు. దానిని పరంపరగా మనకుప్రసాదించారు. వారన్నదేమి? "భూమిఅంతా గోపాలునిది" అన్నారు. ఇక, "ఇది నాభూమి" అని హద్దులు, కొండిగట్లు వేసుకోవడం ఎలా పొసగుతుంది? మానవుడే ఈ గట్లు పెట్టుకున్నాడు. కనుక మానవుడే ఈ గట్లను తెగదీసిపారెయ్యవచ్చు - అన్నారు. గోపాలుడనే శబ్దానికి అర్థం గోవులను పాలించేవాడని.

అంటే, భగవంతుడని కూడ అర్థమే. నేటిపరిభాషలో "ప్రభుత్వము" అని అర్థం. అంటే "ప్రజలు" అని అర్థం. నేడు భూమి ప్రజలచేతుల్లో లేదనేమాట నిజమే కాని. ఈతప్పు మన పూర్వులిచ్చిన సందేశంలో లేదు. మనమే ఈ దోషాన్ని చేతులారా తెచ్చిపెట్టుకున్నాం. మనపూర్వుల ఉపదేశం ప్రకారం నడుచుకోనక మనమే ఈ దోషాన్ని తెచ్చిపెట్టుకున్నాం ఈ దోషం మనలో ఉందికాని, మనపూర్వుల ఉపదేశంలో లేదు.

ఈ ఉపదేశానికి చేరువగా ప్రపంచంలో ఏ దేశం ఎంతవరకు వెళ్ళగలుగుతుందో అంతదూరం మనమూ వెళ్ళగలం. మన మేమీ తీసిపోము. ఇందులో రష్యాను కూడ మనం తీసిపోము. అయితే, మనది అహింసామార్గం ఇదొక్కటే వారికీ మనకూ తేడా. అహింసామార్గంగానే మన మీ ఆదర్శమును చేరగలము అనే విషయమైనా నాకెట్టి సందేహము లేదు.

( హరిజన్,- 2-1-1937 )

# 4

## —: రైతులు, భూస్వాములు :—

"జమీందారు కేమీ లేదు, ఈ భూములన్నింటిపైన హక్కు పూర్తిగా మాదే" అనే సిద్ధాంతాన్ని రైతులు నిరాకరించవలెను. రైతులు, జమీందారులు కలిసి ఒకే సమిష్టి కుటుంబంగా ఉండాలి. జమీందారు ఆ కుటుంబానికి తలగా

ఉండి పరులువచ్చి రైతుల హక్కులను దురాక్రమణ చేయ కుండ, కాపాడుతూ ఉంటాడు. దీని విషయమై 'లా' యే ప్రకారంగా ఉన్నప్పటికి, జమీందారీపద్ధతి అనేది జాయంటు కుటుంబపద్ధతిలో నడవాలి. అట్లా ఉంటేనే దానిని సమర్థించ డానికి వీలవుతుంది— (కాకపోతే, కాదు.)

## 5

### —: సహకార సేద్యము :—

గాంధిగారు ఒక ప్రశ్నకు సమాధానం చెబుతూ ఇల్లా అన్నారు :— రైతులంతా కలిసి భూమికి సహకార పద్ధతిగ హక్కు గలిగిఉంటారు. అట్టి సహకారపద్ధతినే దున్నడం, సేద్యం చేయడం కూడ జరుగుతుంది. ఇలా చేస్తే పెట్టుబడిలో, కూలీలో, పరికరములలో చాలా రాయితీగా ఉంటుంది. రైతులంతా కలిసి సహకారంగా పనిచేసు కుంటారు. పెట్టుబడి, పరికరములు, విత్తనములు, పశువులు, వగైరాసమస్తమునకుసహకారపద్ధతిని హక్కు (స్వామ్యత్వం) గలిగి ఉంటారు. నా యీ ఉద్దేశ్యాల ప్రకారం కనుక సహ కారసేద్యం జరిగితే, దేశము యొక్కరూపమే మారిపోతుంది. అనగ దారిద్ర్యం సోమరితనం అనేవి మటుమాయమైపోతవి. ప్రజలు ఒకరికొకరు స్నేహంగాఉండి, ఏకకుటుంబముగ నడు చుకొన్ననాడే ఇదంతా సాధ్యమవుతుంది.

(హరిజన్ : 9-8-1947)

# సర్వోదయము

## నాల్గవ భాగము

## ( సాంఘిక విధానము )

### A. సంకుచిత సంఘం—మానవుడు

## 1

### —♦ అహింస - ఇదియు ఒక సాంఘిక ధర్మమే ♦—

అహింస అనేది కేవలం ఒక వ్యక్తికి మాత్రమే సంబంధించిన ధర్మం కాదు. ఇది సమిష్టిమీద సంఘం అనుష్ఠింపవలసిన ధర్మం. ఇతర ధర్మాలవలెనే, దీనిని కూడ సంఘం అనుసరించాలి. మానవులు పరస్పరం జరుపుకొను వ్యవహారములలో చాలాభాగం అహింస ద్వారానే జరుపుకొంటారు. నేనిప్పుడు కోరే దేమంటే, దానినే ఇంకా విశాల రంగంలోకి విస్తరింపజేయమంటాను. మొత్తం దేశం యావత్తుకు సంబంధించిన వ్యవహారాలలోకి—ప్రపంచంలో ఒకజాతికి ఒకజాతికి మధ్య నడిచే యావత్తు అంతర్జాతీయ వ్యవహారంలోకి కూడ—ఈ అహింసాధర్మాన్ని ప్రవేశపెట్టండని నేను కోరుతాను.

## 2

### —♦ వ్యక్తి - సంఘం ♦—

వ్యక్తి స్వాతంత్ర్యానికి నేను విలువ ఇస్తాను; కాని మనం ఒక సంగతిమాత్రం మరచిపోరాదు మానవుడు

ప్రధానంగా సంఘజీవి. తన వ్యక్తిత్వాన్ని తనచుట్టునున్న తోడిమానవ సంఘంయొక్క అవసరాలతో సరిదిద్దుకుంటూ నడుస్తూనే మానవుడు నేటి కి ఈ (ఉన్నత) స్థితికి వచ్చాడు. హద్దూపద్దూ లేని వ్యక్తిస్వాతంత్ర్య మనేది అడవిమృగా లవ లంబించే ధర్మము. వ్యక్తి స్వాతంత్ర్యానికి, సంఘ నియమా లకు మధ్య సమాధానమార్గం,సమన్వయమార్గం-తొక్కడం మనం నేర్చుకోవాలి. తన చుట్టునున్న యావత్తు సంఘ సమిష్టి శ్రేయస్సు కొరకై మన వ్యక్తిత్వాన్ని ఇచ్ఛా పూర్వకంగా తగ్గించుకోవడం మనం నేర్చుకోవాలి. ఇట్లా చేస్తే వ్యక్తికీ లాభం, తనసంఘానికీ లాభం, ఉభయతారకం.

(హరిజన్: 27-5-1939)

## 3

### —• అంటరానితనమనేదానికి చోటేలేదు. •—

"ఈశావాస్యం ఇదంసర్వం" ఈఉన్న సర్వమున్ను ఈశ్వరునిచే వ్యాప్తమైయున్నదనికదా మన వేదములు చెప్తు చున్నవి. అంటే, బ్రాహ్మణుడు, భంగీ (పాకీవాడు), పండి తుడు, పామరుడు, మాల, మాదిగ, ఎవరైనాకాని, ఏ కులపు వాడైనాకాని, వీరందరు ఈశ్వరునిచే వ్యాపింపబడినవారే యైతే, ఇందు ఎక్కువెవరు, తక్కువెవరు? అందరూ సమా నులేకదా; అందరూ భగవంతుని బిడ్డలే కనుక అందరూ సర్వత్రసమానులే.

(హరిజన్: 30-1-1937)

# 4

## వర్ణాశ్రమములు.

నాకు తెలిసినంతవరకు "వర్ణము" అనే మాటకు అర్థము చాలా సులభమైనది. ఆలోచిస్తే ఇంత సులభమా అనిఅనిపిస్తుంది. దాని అర్థమిది :— అది ప్రధానంగా నీతికి విరుద్ధం కానంతవరకే ఎవరి మట్టుకువారు మన పూర్వులు అవలంబించిన వృత్తిని, మనమందరం అవలంబించడమే అదిన్నీ మన జీవనానికి సంపాదించుకోవడానికి మాత్రమే అవలంబించడమే "వర్ణము" అనేమాటకు అర్థము. ఈ వర్ణధర్మమును కనుక మనమందరం అవలంబిస్తే, ఐహిక వాంఛలను మనము విశేషపరచుకోనివారమవుతాము. తద్వారా మనశక్తియుక్తులు నిరాఘాటంగా భగవంతుని తెలుసుకోడానికి త్యాగం చేసుకొన్నవారమవుతాము.

(యంగ్ ఇండియా: 20-10-1927)

మానవుడు తాను ఈ లోకంలో ఏ ధర్మమును నిర్వర్తించవలెనో దానిని చెప్పేదే వర్ణాశ్రమవిధానము. ఉదయం లేచిందిమొదలు డబ్బెల్లా సంపాదిద్దామా, ధనరాసులెల్లా పేర్చిపెట్టుకుందామా, ఎన్నెన్నిరకాలుగా ఉదరంభరిత్వపు మార్గాలు వెతుక్కుంటూ కూర్చుందామా అనే ఆలోచనలో మునిగి ఉండడానికి కాదు మానవుడు ఈ లోకంలో పుట్టింది. తానెవరో, తానెక్కడనుండి వచ్చాడో, తన సృష్టికర్త యెవరో, తెలిసికోడానికి నిరంతరం తనశక్తిలో

ప్రతి అణువును ఈజిజ్ఞాసపక్షంలో నడిపించుకోవడమే మానవ జన్మయొక్క పరమావధి. ఉందుకనే కేవలం దేహధారణకు సరిపడునంతవరకుమాత్రమే మానవుడు సంపాదించుకొనవలె సుమా (అంతకుపైకి పోకూడదని) చెప్పుటకే ప్రతివాడు తన తాతతండ్రులవృత్తిలోనే పరిమితుడై యుండవలెనని మన వర్ణాశ్రమధర్మము మనకు బోధించినది. ఇదే వర్ణాశ్రమ ధర్మమంటే. ఇంతకెక్కువాకాదు, తక్కువాకాదు.

(యంగ్ ఇండియా: (27-10-1927)

## వర్ణమే కులము.

ఆర్థికదృష్టిలో చూస్తే, వర్ణవిభాగము ఒకప్పుడు బాగా పనిచేసింది. వంశపారంపర్యంగా వచ్చే ప్రావీణ్యత నది దృఢపరిచింది. స్పర్ధను తగ్గించివేసింది, దారిద్ర్యనిర్మూలన కది దివ్యౌషధమైనది. ఈ నాటి కార్మిక సంఘాల విధానములో ఉన్న మేళ్ళన్ని ఈ వర్ణాశ్రమ విధానములో ఉండెను. కొత్తకొత్తసంగతులు కనిపెట్టి క్రొత్తక్రొత్త త్రోవలను త్రొక్కే సాహసప్రవృత్తిని అది ఎక్కువగ ప్రోత్సహించి పెంపొందించకపోయినప్పటికీ, దాని కది అడ్డు మాత్రం యెన్నడూ తగులలేదు.

చారిత్రికదృష్టితో చూడగ, కుల మనేది సంఘనిర్మాణ పద్ధతిలో ఒక ప్రయోగముగ కన్పించుచున్నది. మనుష్యులకు సంఘంలో ఒకరికొకరికి పరస్పరం ఉండదగిన ప్రశస్తసంబంధ శైలిటో కనిపెట్టి నిర్ణయించుటకై మనవారు తమ "సాంఘిక

పరిశోధనాగారములో చేసిన పరిశోధనల ఫలితమే ఈ కుల విభాగము. ఈ పద్ధతి సత్ఫలవంతమైనదని మనము ఋజువు చేయగలిగినట్లయితే దీనినే లోకంలో సర్వదేశములకు మనం మంచిమందుగా సప్లయి చేయువచ్చు. కూ్రరము, నిర్దాక్షిణ్యము నైన పోటీల పద్ధతిచే నేడు లోకం క్షోభించుచున్నది. అమితధనతృష్ణచే అంతులేని దురాశచే మానవసంఘుం విరిగి ముక్కలై పోయింది ఈ దోషముల కన్నింటికి మన వర్ణ విభాగపద్ధతిచే దివ్యౌషధమును మనము లోకానికి అందించ వచ్చును

(యంగ్ ఇండియా: 5-1-1921)

ప్రతివాడు తనకు సహజమైన కొన్నికొన్ని విశిష్ట ప్రవృత్తులతో విశిష్టలక్షణములతో ఈలోకంలోకి పుట్టుకు వస్తారు. ప్రతివాడు తన శక్తియుక్తులకు కొన్నికొన్ని విస్పష్ట మైన పరిమితులతోనే పుడతాడు. ఆ పరిమితుల నతడు దాటలేడు. ఈ పరిమితుల ఆవరణాలను బహుసూక్ష్మముగ జాగ్రత్తగ పరిశోధించి, పరిశీలించినదాని ఫలితముగానే, వర్ణ ధర్మము మనవారిచే నిరూపింపబడినది. ఆ యా విశిష్ట ప్రవృత్తులుగల ఆ యా మనుష్యులకు తదనుగుణములైన ఆ యా వృత్తిరంగములను కేటాయించి ఇచ్చారు. ఇట్టి కేటా యింపులవల్ల పరస్పర దుష్టమైనపోటీలకు స్పర్ధలకు తావు లేకుండ చేశారు. వర్ణాశ్రమ విధానమనేది ఆ యా మను ష్యుల శక్తియుక్తులలో గల భేదాలను, పరిమితులను గమ నిస్తూ ఉండినప్పటికి, ఒక వర్ణము హెచ్చు, ఒక వర్ణము

తక్కువ కుల భేదాలు మాత్రము ఎన్నడూ ఒప్పుకోలేదు. పైగా, ప్రతివాడు తన స్వాతంత్ర్యమును కాపాడు - రెండవవాని పోరు పొక్కుకోకుండ-స్వేచ్ఛగా అనుభవించడానికి గ్యారంటి చేసింది. రెండో దాన్ని తన మీదికి పోటీకి రాకుండ నిషేధించింది. అంతేకాక, తానుకూడ ఆ రెండవవాని మీదికి పోటీకి పోవద్దని చెప్పింది. ఇట్టి మహోన్నతమైన వర్ణ విధానము కాలక్రమమున భ్రష్టమొనర్పబడి, చెడ్డపేరులోకి వచ్చింది. అయితే నా దృఢవిశ్వాసమేమంటే, - ఈ వర్ణ విధానములోని పరమ ధర్మాంశములను మనము పూర్తిగ అర్థముచేసికొని, అమలులో పెట్టుకొన్నట్లయితే ఆదర్శప్రాయమైన సంఘవ్యవస్థ ఏర్పడగలదు.

( "మోడరన్ రివ్యూ" పత్రిక [illegible] పేజీ 413 )

# 6

## అంతర్వర్ణ వివాహములు

ఆ యా వర్ణముల వారిమధ్య సహపంక్తి భోజనములు అంతర్వర్ణ వివాహములు పూర్వము మన వర్ణవిధానములో నిషేధింపబడలేదు; అట్టి నిషేధం ఉండకూడదనియే నా అభిప్రాయమున్ను. భోజనములు, పెండ్లిండ్లు ఈ రీతిగా నిషేధింపబడకపోయినప్పటికి, ఇవి జరిగితీరాలనే బలవంతం కూడ లేదు; బలవంతం ఉండకూడదు. ఇట్టి విషయాలు ఆ యా వ్యక్తులకే వదలవెయ్యాలి. వర్ణాశ్రమధర్మం అవలం

బిస్తే, వివాహానికి సంబంధించినంతవరకు వారు వారు ఆ యా వర్ణములలోనే పెండ్లిండ్లు చేసుకోవాలనే కోరిక, ధోరణి, సహజంగా ఉంటుంది.

( హరిజన్: 16-11-1935 )

ఇది నా కులమని, ఇది నా రాష్ట్రమని ప్రతివాడు రెండేసి ప్రాకారపు గోడలను తన చుట్టూ కట్టుకున్నాడు. ఈ రెండు గోడలూ కూలగొట్టాలి. ఇండియా యేకము, అఖండము అయినట్లయితే, ఇట్టి కృత్రిమపు గోడలు ఉండరాదు; ఒకరితో ఒకరు భోజనాలు చేయమని పెండ్లిండ్లు చేసుకోమని చెప్పే అనేకమైన చిన్నచిన్న వర్గాలు ఉండరాదు.

( హరిజన్ 25-7-1936 )

ప్రశ్న:- కులాలమధ్య పెండ్లిండ్లు ఉండాలని మీరంటున్నారు కదా, అయితే ఇండియాలో భిన్నమతాలవారి మధ్య కూడ పెండ్లిండ్లు ఉండవలెనంటారా మీరు ?

జవాబు:- మొదటినుంచీ తనకిది అభిప్రాయం లేకపోయినప్పటికీ, ఇటీవల, చాలాకాలంగా, ఈ పద్ధతికి తాను సుముఖంగా ఉంటున్నట్లు గాంధీగారన్నారు. ఎక్కడైనా అట్టి వివాహాలు జరిగినప్పుడు అది మంచిదే అని ఆయన అభిప్రాయపడుతూ వచ్చారు. అయితే, గాంధీగారు దాని కొక్కటే షరతు పెట్టారు. అట్టివివాహము తుచ్ఛ కామవ్యామోహ పరిణామముగ జరిగినది మాత్రం కాకూడ

దన్నారు. ఇట్టి వ్యామోహఫలితంగా జరిగిన పెండ్లి పెండ్లే కాదని వారంటారు. అదికూడని వ్యభిచారమే. పెండ్లిఅంటే అనేక పవిత్రమైన సంస్కారమని వారి అభిప్రాయము కనుక, అట్టి స్త్రీపురుషుల మధ్య అన్యోన్యమైన, నిర్దుష్టమైన ప్రేమ, స్నేహభావము ఉండాలి. ఒకరిమతమునెడ ఒకరికి సమానమైన గౌరవభావం ఉండాలి. పెండ్లికోసమని మతం మార్చుకోవడమనే ప్రసక్తే ఉండరాదు. ఈ రెండు మతాలలో ఏ మతానుసారంచేతనైనా సరే ఈ వివాహసంస్కారము జరిపింపబడవచ్చు. ఒకరిమతమునెడ మరొకరు విరోధమును మానివేసి, ప్రపంచములోని సర్వమతములయెడ గౌరవభావము అలవరచుకొన్నప్పుడే ఇట్టి శుభపరిణామము లోకంలో జరుగగలదు.

(హరిజన్: 16-3-1947)

## 7

### సంఘములో స్త్రీల స్థానము.

స్త్రీయు, పురుషుడును, ఒకే రీతిగా జీవిస్తారు ఒకే రకం భావాలు కలిగియుంటారు. ఒకరి కొకరు సంపూరణముగా ఉంటారు. ఒకరిసహాయం లేనిది ఇంకొరు బ్రతుకలేరు.

కాని, ఎట్లనో, యుగయుగాలుగ పురుషుడు స్త్రీపై ఆధిపత్యం చెలాయించడం జరుగుతోంది. అందువల్ల, "తానుతక్కువదాన్ని" అనే న్యూనతాభావం స్త్రీలో ఏర్పడి

యున్నది. స్త్రీ తనకంటె తక్కువదని పురుషుడు స్వార్థబుద్ధితో చెప్పేమాటలన్నీ నిజమని స్త్రీ నమ్మడంసాగించింది. కాని, సత్యదర్శులగు పురుషులందరు స్త్రీకి తమతోగల సరిసమానహోదాను గుర్తించియే యున్నారు.

అయితే, మొత్తంమీద స్త్రీపురుషులిద్దరి దోవలు ఎక్కడో వేర్వేరై చీలిపోయినవనుటలో సందేహంలేదు. వస్తుతః స్త్రీ పురుష వ్యక్తులు ఒకటే అయినప్పటికీ, శరీర నిర్మాణవిధానములో మాత్రం ఉభయులమధ్య స్పష్టమైన తేడా ఉన్న దను మాటకూడ పరమసత్యమే. అందువల్ల ఉభయకర్మక్షేత్రములుకూడ వేర్వేరుగానే ఉండాలి. మాతృత్వవిధి ప్రపంచంలో దాదాపు యావన్మందిస్త్రీలు వహించేదే ఇట్టి విధినిర్వహణకు కొన్నికొన్ని విశిష్టలక్షణములు అవసరములవుతవి. ఇట్టి లక్షణములు పురుషులకు ఉండనవసరములేదు. స్త్రీది సాత్త్విక ప్రవృత్తి. పురుషునిది రజోప్రవృత్తి. స్త్రీ ప్రధానంగా గృహరాణి, పురుషుడు బయటతిరిగి సంపాదించి తెచ్చి ఇంట్లో పడేసేవాడు. తెచ్చిన దానిని జాగ్రత్తపరచి, సద్వినియోగపరచి, అందరికీ పెట్టి చక్కగా ఇల్లుదిద్దుకునేది స్త్రీ. * గృహసంరక్షకురాలనే మాట స్త్రీకి ముమ్మాటికి చెల్లుతుంది.

మానవలోకానికి పనికివచ్చే బిడ్డలను సాకి, లోకానికి ప్రసాదించే భాగ్యం ఆమెకు ఒక్కదానికే చెల్లుతుంది. ఆ

---

* "గృహిణి" అనేమాట కిదే అర్థం: "గృహిణీ గృహముచ్యతే" గృహమే గృహిణి. ఇల్లు, ఇల్లాలు అనేవి రెండూ ఒకటేమాట- (మా.స.)

కళాకౌశలం, ఆ నేర్పరితనం ఆమెకు పెట్టనిసొమ్ములు. ఆ అధికారం, ఆ సామ్రాజ్యం ప్రత్యేకం ఆమెదే. మగవానికి ఆ సౌభాగ్య ప్రాప్తి లేదు. ఆమె ఆదరణ లేనిది మానవజాతి అంతరించవలసినదే.

గృహిణియైన ఇట్టి స్త్రీని, "గృహము వదలివేసి, తుపాకీ భుజాన వేసుకొని, దేశరక్షణకై బయటికి రా" అని పిలవడం, వచ్చేటట్లు ప్రోత్సహించడం, స్త్రీకి పురుషునికి కూడ అవమానకరమని నా ఉద్దేశ్యం. ఇది మానవలోకం మరల అనాగరిక పరిస్థితికి జారిపోవడం అన్నమాట. సృష్టి అంతానికిది ప్రారంభమన్నమాట. పురుషు డెక్కే గుర్రాన్ని స్త్రీ యెక్కాలని చూడడంలో స్త్రీ తననేకాక, పురుషుణ్ణికూడ హీనపరుచుకున్నట్లే. ఆమెకు ప్రత్యేకముగ నియమింపబడిన పనిని అనగ గృహనిర్వహణ కార్యమును వదలివేసి బయటికి వచ్చివేయవలసినదని పురుషుడు తన సహచరిని నిర్బంధించిన, లేక, ప్రోత్సహించిన పాపము ఆ పురుషుని నెత్తిమీదికే వచ్చిపడుతుంది. పరదండయాత్రలనుండి దేశాన్ని రక్షించుకొనడంలో ఎంత పౌరుషం, ప్రతాపం, గొప్పతనం ఉందో, ఇంటిని సరిదిద్దుకొనడంలో కూడ అంతటి పౌరుషప్రతాపాలే- అంతటి గొప్పతనమే- ఉన్నది. అవేవీ తక్కువైనవని అనుకోవలసిన పనిలేదు.

కోట్లకొలది రైతులు సహజప్రకృతి పరిసరములలో పని చేస్తూఉండడం నేను చూశాను. ఈ చిన్నపల్లెటూరు సేవా

గ్రామంలోను చూస్తున్నాను. చూడగాచూడగా, స్త్రీ పురుషుల మధ్య వారివారి కర్మక్షేత్రముల విభాగము ఎంత సహజముగ ఏర్పడియున్నదో నాదృష్టికి గాఢముగ తగిలింది. ఆడకమ్మరులు. ఆడవడ్రంగులు నాకెక్కడా కనిపించలేదు. కాని. పొలాలలో పురుషులు స్త్రీలుకూడ పనులు చేస్తూ ఉండడం కనిపించింది. అక్కడ ఎక్కువైనపనులు మొగాళ్లే చేస్తున్నారు. స్త్రీలు ఇల్లు దిద్దుకుంటూ ఉంటారు తమ కుటుంబానికి వచ్చే స్వల్పాదాయానికి చేదోడుగ స్త్రీలు కూడ ఏదో కొంత సంపాదించి చేర్చుతూ ఉంటారు. కాని, ప్రధానంగా కుటుంబానికి సంపాదనపరుడు మొగవాడుగానే ఉంటున్నాడు స్త్రీ పురుషులకు వారివారి కర్మక్షేత్రములు ఒకరీతిగా వేర్వేరుగ కేటాయింపబడియున్నప్పటికి, ఉభయులకు ఉండవలసిన సామాన్య లక్షణాలు, బుద్ధివిశేషాలు, సంస్కారములు సమానముగానే ఉన్నవి.

ఈ క్లిష్టసమస్యకు నేను చెప్పుచున్న పరిష్కారమార్గమేమిటంటే, జీవితంలో ఎట్టి రంగంలోనైనా సరే సత్యము, అహింస, అను సూత్రములనే అనుసరించవలసినదని నా మతము. నేను చూపించు దోవ ఇదే. ఇది వ్యక్తులకేకాక, మొత్తం జాతులకు జాతులకే కూడ వర్తిస్తుంది. లోకాన్ని ఈమార్గాన నడిపించడంలో స్త్రీ నిస్సందేహంగ అగ్రగామి కాగలదని నేనెంతో ఆశపెట్టుకొనియున్నాను. మానవ సమాజ పరిణామంలో ఈ రీతిగా స్త్రీ తనదగు మార్గదర్శకత్వ స్థానమును గుర్తించిననాడు ఆమె మనస్సులో న్యూ

డున్న "తక్కువతనము" అనే భావాన్ని తొలగించుకొనగలదు.

స్త్రీ అహింసయొక్క అవతారమని నేను (హరిజన) పత్రికలో చెప్పియున్నాను. అహింస అనగా అంతులేని ప్రేమ. అంటే, అంతులేని కష్టసహన భావమన్నమాట. కష్టసహనమును, ఓర్పును, మాతృమూర్తియైన స్త్రీ తప్ప ఇంకెవరు ఇట్టి అంతులేనిరీతిగా చూపించగలరు? శిశువును నవమాసములు తన గర్భమున మోసి, తన రక్తముచే ఆ శిశువును ఆ నవమాసములు పోషించడంలో ఆమె చూపే కష్టసహనమునకు అంతున్నదా? ఆ కష్టములోనే ఆనందమును పొందే ప్రకృతి లోకంలో తల్లికి కాక మరెవరికి ఉండగలదు? నవమాసముల అనంతరముకూడ ఆ ప్రసవ వేదనలో పడే బాధకు మించిన బాధ లోకంలో ఊహింప తరమా? కాని, ఒక్కక్షణంలో, ఆ బాధ ఆమె మరచిపోయి, కన్నబిడ్డనుచూచుకొని పడేఆనందానికి–ఆ జీవసృష్ట్యానందానికిన్ని అంతున్నదా? తరువాత శిశువు దినదినప్రవర్ధమానము కావలెనని ఆమె క్షణక్షణము పడే యాతనలకున్న అంతున్నదా? అట్టి యాతన తల్లి కాక ఇంకెవరు ఓర్చుకోగలరు? ఆ ప్రేమను స్త్రీ తన శిశువుమీద వలెనే లోకమంతటిమీద ప్రసరింపజేయునీ! తాను "పురుషుని కామతృప్తికైన వస్తువను" అనే సంగతిని స్త్రీ మరచిపోగాక! "అట్టి తుచ్ఛవస్తువు తానెన్నడూ అయియుండలేదు, ఇక ముందునూ కాబోను" అనే సంగతిని ఆమె గమనించుకొనును గాక! అప్పుడు, ఆమె పురుషుని సరసను సమాన గౌరవ

ప్రకృతిశక్తులతో పురుషునికి తల్లిగా, సృష్టికర్తగ, ఆడంబరము లేక సహించుకొనిపోవు మానవమార్గదర్శిగ, సగర్వముగ వెలయగలదు. నేడు ప్రపంచము యుద్ధాగ్నికుండములో పడి, కొట్టుకొనుచు, శాంతి శాంతి యను అమృతమునకై అంగలార్చుచున్నది. ఇట్టి పరితప్తలోకమునకు శాంత్యమృతము వడ్డింపగల నేర్పు బోధింపగల ప్రావీణ్యత, స్త్రీకొక్కదానికే కలదు. ఇది ఆమె సొమ్ము. సత్యాగ్రహధర్మ నిర్వహణమున ఆమె నాయకురాలు కాగలదు. ఇందుకై, పెద్ద పెద్దపుస్తకాలుచదువనక్కరలేదు. కష్టసహనము, ఆత్మవిశ్వాసములవల్ల లబ్ధమగు దృఢమనస్కత ఉంటే చాలు. అదే ముఖ్యంగా ఉండాలి.

కొన్ని సంవత్సరాలక్రింద నేను పూనాలో "సెసూన్ ఆస్పత్రిలో" రోగిగ పరుండియుండగ, నాకు ఉపచారం చేసే నర్సు (ఆమె చాలామంచిది) నాకొక చక్కని కథ చెప్పింది. ఒకనాడు ఆ ఆస్పత్రిలో ఒక గర్భిణీ స్త్రీకి ఏదో ఆపరేషన్ చేయవలసిరాగా మత్తుమందు ఇస్తామన్నారట. ఆ మందు నేను పుచ్చుకోనన్నదట ఆ స్త్రీ ఎందుకంటె, ఆ మందు పుచ్చుకుంటే, తన కడుపులో ఉన్న శిశువుకు ప్రాణాపాయం కలుగునని ఆమె భయపడిందిట. "మత్తుమందు లేకుండ ఆపరేషన్ చెయ్యండి; ఆ బాధకు నేను ఓర్చుకుంటాను; అంతేకాని, నా కడుపులో బిడ్డకు హాని కలగడానికిమాత్రం నే నెంతమాత్రం ఒప్పుకోను" అందిట! బిడ్డతీపి అట్టిది!! స్త్రీయొక్క ఓర్పు కష్టసహనశక్తి అట్టిదికదా! ఆమె పుచ్చు

కున్న మాతృత్వం వల్లా తన గర్భస్థశిశువుపై తనకున్న ప్రేమయే. ఆ శిశువు ప్రాణాన్ని కాపాడుకోడానికి ఆమెకు తనబాధ యెంతైనా లెక్కలేకపోయింది. (అది ఆమె వీరత్వం కాదా!) ఇట్టి వీరమాతలు స్త్రీలలో లెక్కలేనన్ని మంది యున్నారు. కనుక, స్త్రీ లెవరుకాని "అయ్యో, నేను ఆడదాననై పుట్టానే" అని తమన్నుతాము హీనపరుచుకొనకుందురుగాక! "అయ్యో, నేను మొగవాడినై పుట్టకపోతినే" యనియు దిగులుపడకుందురుగాక! ఈ కథలోని ఆ వీరమాతను తలచుకున్నప్పుడల్లా స్త్రీకి లభించిన (ఆమెకు పెట్టనికోటయైన) ఇట్టి మహోన్నతస్థితి నాకు లేకపోయెనే యని నేను అసూయపడుచుందును. కాని, స్త్రీలుమాత్రమిట్టి సత్యము గ్రహించకపోవడం ఒక్కటే లోకంలో లోటుగా ఉంది. నిజంగా వారీ సత్యాన్ని కనుక, గ్రహిస్తే వారు తమనుగూర్చి తామింత హీనంగా భావించుకొనరు! "తాము పురుషులుగా పుట్టకపోతిమే" అని స్త్రీలు అనుకోడానికి యెంతకారణమైతే ఉందో, పురుషులుసైతము "అయ్యో, మేము స్త్రీలుగా పుట్టకపోతిమే" అని కోరుకోడానికిన్నీ కూడ అంత కారణమున్నది. కాని, ఈ కోరికలన్నీ గొంతెమ్మకోరికలు – నిష్ఫలములు. మనం ఎట్లాగో అట్లా పురుషుడుగానో, స్త్రీగానో పుట్టాము. ఆ స్థితిలోనే హాయిగా ఉందాము. ప్రకృతి మనను ఏరకంగా పుట్టించి, ఏ ధర్మానికై మనను నియమించిందో, ఆ ధర్మాన్ని సక్రమంగా నెరవేస్తూ ఉందాము అంతే మనవిధి.

( హరిజన్ :- 24-2-1940 )

# 8

## స్త్రీపురుషులకు సమానహక్కులు.

ఒక పురుషునికి ఒక భార్య; ఒక స్త్రీకి ఒకభర్త- ఇది సామాన్యమైన ధర్మము. అయితే, పై కులాలని చెప్పబడే కులాలలో, భర్తచనిపోతే స్త్రీ విధిగా విధవరికం అనుభవించ వలసినదే అనే ఆచారం ఏర్పడింది. స్త్రీలు తమ కిది పరి హార్యమైన విధ యని యనుకోనడం జరుగుతోంది. అయితే, ఈ విధి పురుషులకుమాత్రం పెట్టలేదు! ఇది చాలా లజ్జా కరము. అయితే, సంఘ మిట్టి దయనీయస్థితిలో ఉన్నప్పుడు, "ఏమిచేస్తాము, బాలవితంతువులు పెండ్లిచేసుకోనని" అని గాంధిగారు అంగీకరించారు. స్త్రీ పురుషుల మధ్య సమా నత ఉండాలని వారి ఉద్దేశ్యం. కనుక, పురుషుల కెట్టి హక్కులో స్త్రీలకుకూడ అట్టి హక్కులుండాలని వారు చెప్పారు. ఇంకొక రీతిగా వారు ఆలోచించ జాలరు కద.

(హరిజన్: 16-3-1947)

# 9

## వి వా హ ము.

భార్య భర్తకు బానిస కాదు: భర్తకు ఆమె సహ ధర్మచారిణి. తనలో భాగమైన అర్థాంగి, సహాయకురాలు. సుఖదుఃఖములలో సమానభాగస్వామి. తనమార్గమును తా ననుసరించుటకు భర్త కెంత స్వాతంత్ర్య మున్నదో, భార్య కున్ను అంత స్వాతంత్ర్యమున్నది.

(గాంధిగారి ఆత్మకథ: 1948 ప్రచురణ: పేజీ 313)

బాల్యవివాహములంటే నాకు అసహ్యం. బాలవితంతువును చూస్తే నేను జాలిచే వణికిపోతాను. భార్యపోయిన మర్నాడే, మళ్ళా పెళ్ళికొడుకుగ తయారైన మొగవాణ్ణి చూస్తే, నాకు కోపం భగ్గున యెగవేసుకువస్తుంది. పోయిన భార్యయెడల ఇంత పశుత్వంగా ఉపేక్షభావం వహించడమా! తమ ఆడపిల్లలను కేవలం అజ్ఞానులుగ, నిరక్షరాస్యులుగ ఉంచి, ఏ కలిగినవాళ్ళకొడుక్కో ఇచ్చి ముడిపెట్టడానికి మాత్రమే పెంచుకున్న తలిదండ్రుల ఉపేక్షాభావం చాలా ఘోరాపచారం. ఇది చూస్తే నాకెంతో విచారం వేస్తుంది.

యంగ్ ఇండియా: (21-7-1921)

పసిపిల్లల సంగతిలో "కన్యాదాన" మనే మాటకు అర్థమేమిటి? పిల్లలు వస్తువులా దానమిచ్చివేయడానికి! తల్లిదండ్రుల కిట్టి హక్కు పిల్లలపై కలదా? తండ్రి బిడ్డకు సంరక్షకుడా, లేక ఏదో వస్తువుకు సొంతదారుడైనట్లు సొంతదారుడా? పిల్లలు తనచేతిలో ఏవో ప్రాణరహితమైన వస్తువులుగా ఉన్నారు కదా యని తలచి, వారి ఇచ్ఛాస్వాతంత్ర్యములను లెక్కచేయక, యీ రీతిగా వారిని యెవరికో కట్టబెట్టితే, సంరక్షకుడుగ తనకుండవలసిన హక్కును తండ్రి కోల్పోయినట్లే. ఇది అతడు తన అధికారమును, హక్కును, దుర్వినియోగ పరచడం అన్నమాట!

పసిపిల్లను కాటికి కాళ్ళు చాచిన యే ముసలివాడికో ఇచ్చికాని, లేక, ముక్కుపచ్చలారని యే మొగకుర్రవానికో

ఇచ్చికాని, పెళ్ళిచేయడానికి పాల్పడి, తన విధ్యుక్తధర్మమును తప్పిపోయి, తన అధికారమును దుర్వినియోగపరచిన తండ్రి, తాను కనీసధర్మంగా చేయవలసిన విధాయక కృత్యమేమంటే, కర్మంజాలక ఆపిల్ల విధవరాలైతే, ఆ పిల్లకు మరల వివాహంచేసి, లోగడ తాను చేసిన పాపాన్ని కడిగివేసుకోవడమే. ఈ రీతిగా, ముసిలాళ్ళకు, ముతకాళ్ళకు పసిపిల్లల నిచ్చి చేసిన పెండిండ్లు, అసలు పెండిండ్లుకావనియే "లా" ప్రకటించి చెప్పవలెను. అట్టివి 'లా' దృష్టిలో మొట్టమొదటినుంచికూడ చెల్లనేరవనియే చెప్పాలి. ఈ అభిప్రాయమును నేను లోగడ నొకానొక వ్యాసంలో స్పష్టంగా వెల్లడించియే యున్నాను. (యంగ్ ఇండియా: 11-11-1926)

వివాహ మనేది జీవితంలో కేవలం సహజమైనస్థితి. అది గౌరవహీనమని, ఏదో అవమానమని, నామోషీపనియని, ఏదోవిధముచేతనైనాసరే స్త్రీ అనుకోవడం కేవలం తప్పు. వివాహము పవిత్రమైన సంస్కారమని భావించవలెను. ఇదే అవలంబనీయమైన ఆదర్శం. కనుక, వివాహం చేసుకొని, గృహిణిగ నిగ్రహమైన గృహస్థ జీవితమును స్త్రీ గడపవలెను. (హరిజన్: 22-3-1942)

# 10

## వైధవ్యం.

గతించిన భర్తయెడ భక్తి ప్రేమభావములు కలిగి, ఇచ్ఛాపూర్వకముగ సంపూర్ణవ్యక్తిత్వముతో స్త్రీ అవలంబి

బించే వైధవ్యం, జీవితమునకు గొప్పతనమును, సౌభాగ్యమును చేకూర్చుతుంది. గృహమును పవిత్రించేస్తుంది; మతధర్మములనే మహోచ్చస్థితికి లేవనెత్తుతుంది. మతనిబంధనల వల్లకాని, ఆచారనిబంధములవల్లకాని, పైనుంచి బలవంతంగా రుద్దబడే వైధవ్యం, స్త్రీకి భరింపరాని మెడకాడిఅవుతుంది. రహస్యపాపప్రవర్తన లేర్పడి గృహమునే అపవిత్రపరుస్తుంది; మతధర్మమనే నీచస్థితికి దిగజార్చుతుంది.

మనం పవిత్రులము కావాలనుకుంటే, హిందూ మతాన్ని మనం సంరక్షించాలంటే, ఇట్టి బలాత్కార వైధవ్య పద్ధతిని మనం మానివెయ్యాలి. ఈ మార్పు ముందుగ బాల వితంతుబిడ్డలుగల తలిదండ్రులు ప్రారంభించాలి. వారు ధైర్యంచేసి ఈపనికి దిగాలి. తమ అధీనములో ఉన్న బాల వితంతువులకు చక్కగా, సక్రమంగా వివాహములు చెయ్యాలి. ఇట్టివి నిజంగా అసలు "వివాహము"లేకాని, "పునర్వివాహములు" కావు. నిజానికి, అట్టి బిడ్డలకు లోగడ యెన్నడూ పెండ్లికానట్లే లెక్క. ఇట్టివి 'అసలుపెండిండ్ల' క్రిందకే వస్తవికాని, "మళ్ళీపెళ్ళిళ్ళ" క్రిందకురావు.

(యంగ్ ఇండియా: 5–8–1926)

# 11

## విడాకులు.

తమ కలయిక వాంఛనీయమని స్త్రీపురుషులిరువురు ఏకాభిప్రాయులైనప్పుడు, వారి ఇష్టప్రకారం కలుసుకునే

హక్కును, లోకంలో తదితరులందరిని మినహాయించి, తామిరువురుమాత్రమే కలుసుకునేహక్కును, వివాహమనే సంస్కారం ధృవపరుస్తుంది. ఈఇరువురిలో ఒకరికిమాత్రమే ఇచ్ఛయుండి, తన ఇచ్ఛకు రెండవవారు ఒప్పుకొనితీరాలని బలవంతం చేయడానికి ఇరువురిలో ఏ ఒక్కరికికూడ హక్కు లేదు. దంపతు లిరువురిలో ఒకరి ఇచ్ఛననుసరించి రెండవ వారు, (నైతికకారణములచేతనో, మరొకకారణంచేతనో), అనువర్తించజాలకపోతే, ఏమిచెయ్యాలి అనే ప్రశ్న వేరే ప్రశ్న. అట్టిస్థితిలో, విడాకు లొక్కటే తప్ప వేరే మార్గం లేదనుకుంటె, ఆ ప్రకారమే చేసుకోవచ్చునని చెప్పడానికి నేను సందేహించను. నన్నడిగితే నేను చెప్పే మాట ఇది. దంపతు లిరువురిమధ్య నైతిక పురోభివృద్ధిని భంగపరచుకోనివ్వడంకంటె, ఈ విడాకులే మంచి దంటాను. కేవలం నైతిక కారణాల చేతనే నే నింత నిగ్రహంగా చెబుతున్నాను.

(యంగ్ ఇండియా: ౮-10-1925)

# 12

## సంతాననిరోధ పద్ధతులు.

ఇండియాలో జనాభా పెరిగిపోతోంది కనుక, దేశానికి సంతాననిరోధం అవసరమని ఎవరన్నా అంటే, అది నేను ఒప్పుకొనను. పై వాదము ఎన్నడూ ఋజువుపరుపబడలేదు. మన భూమివిధానమును చక్కబరుచుకొని, వ్యవసాయమును క్షేమకరముగ చేసికొని,వ్యవసాయానికి చేదోడుగ ఉపవృత్తుల్ని

కల్పించుకుంటే, ఈ మన భరతఖండము ఇప్పుడున్న జన సంఖ్యకంటె రెట్టింపు జనసంఖ్యను చక్కగా పోషించగల దనయే నా అభిప్రాయం (ఇందుకోసమని సంతాననిరోధం చేయించుకోవడం అనవసరము)

( యంగ్ ఇండియా: 2-4-1925 )

ప్రశ్న:- ఎక్కువ కాన్పులవల్ల ఆరోగ్యం చెడిపోయిన తల్లులకోసం, అంతేకాకుండా ఆ పుట్టిన బిడ్డలకోసమైనా, కృత్రిమపద్ధతులు చేనైనా సంతాననిరోధం చేసుకోవడం మంచిదంటారా కాదా? కేవలం ఆత్మనిగ్రహంవల్ల సంతాననిరోధం చేసుకోవడం ప్రశస్తమైన మొదటిపక్షమే కావచ్చుకాక. అది చేయలేనివారికి, కృత్రిమసాధనల నవలంబించడమన్నా రెండవపక్షంగా మంచిదికాదా?

జవాబు:- ఇట్టిస్థితిలో, స్త్రీలు పురుషులకామకాంక్షను ఎదిరించవలెనని చెబుతాను. కృత్రిమసాధనలు ఉపయోగిస్తే ఘోరమైన దుష్పరిణామాలు పుట్టుకువస్తవి: స్త్రీపురుషులిక కేవలం కామోపభోగమున కయియే జీవించే నికృష్టులై పోతారు; వారిమేధస్సు చెడిపోతుంది. మతిభ్రష్టులైపోతారు. నీతిభ్రష్టులైకూడాపోతారు.

ప్రశ్న:- అందరిస్త్రీల విషయంలో కాకపోయినా, పోనీ కేవలం కాన్పులుభరించలేని దుర్బలస్త్రీల విషయంలోనైనా ఈ కృత్రిమసాధనలు ఉపయోగపరుచుకోరాదా?

లేక, స్త్రీ పురుషులలో ఏ ఒకరైనా రోగిష్టివాళ్ళయి నప్పుడైనా ఈసాధనలు ఉపయోగించుకో నివ్వరాదా?

జవాబు:- కూడదు; పై పరిస్థితులలో భార్యాభర్తలు వేర్వేరుగ నివసించడం మంచిదంటాను. పురుషులను నపుం సకులనుగ, ఖోజ్జాలనుగత యారు చేసియుంచే శాసనం కేవలం అమానుషమైనదని నాతలంపు అయితే, వెన్నంటివిడువని రోగాలవల్ల పీడింపబడే పురుషులను, (వారు ఒప్పుకొనేలట్ట యితే) ఖోజ్జాలనుచేసి కూర్చుండబెట్టడం వాంఛనీయమే. ఖోజ్జాలనుచేసే ఈ పద్ధతికూడ ఒకవిధమైన సంతాననిరోధక పద్ధతియే; స్త్రీల విషయంలో సంతాననిరోధపద్ధతి పనికిరాదని నేనుచెప్పినా, పురుషులవిషయంలోమాత్రం వారిని ఖోజ్జా లుగ చేసికూర్చుండబెట్టడమనే పద్ధతికి నే నంత అభ్యంతరం చెప్పను. ఎందుకంటె, ముందుగ దురాక్రమణదారుడు పురుషుడేకనుక. (అమృతబజార్ పత్రిక: 12-1-1935)

నేను ఇంకా బ్రతికియుంటే ఈ జీవితకాలంలో, "మీరు స్వతంత్రులు సుమా" అనే పరమసత్యమును నేను స్త్రీల మనస్సులకు బాగా నాటచెప్పగలిగితే మనకు ఇండి యాలో ఈ సంతాననిరోధసమస్యయే ఉండదు; అయితే భర్తలు కామవాంఛతో తమవద్దకు వచ్చినప్పుడు, "వద్దు" అని భార్యలు వారికి చెప్పడం నేర్చుకోవాలి. చెప్పగలిగి ఉండాలి. ఇంతమాత్రంచాలు. దీనితో సంతాననిరోధ సమస్యయే ఇండియాలో తలయెత్తదు...... కాని, అసలు రహస్య మేమంటే, స్త్రీలు ఈరీతిగా తమ భర్తలను ఎది

రించడానికి కోరుకోను. కనుక, ఈ సమస్య సారాంశం యావత్తు ప్రబోధంమీద ఆధారపడియున్నది. పురుషుల నీ రీతిగా "వద్దు", "వల్లకాదు" అని నిరోధించి, ఎదిరించేహక్కు స్త్రీలకు ప్రాథమికహక్కుగా సహజముగ ఉన్నది. ఈ హక్కును ఉపయోగించుకోవడం వారు నేర్చుకోవాలి (అల వర్చుకోవాలి), అని నే నంటాను. అట్టిహక్కు తనకు లేదని స్త్రీ అనుకొంటున్నది! "ఈ హక్కు మీకు ఉన్నదరా?" అని భారత దేశంలోని స్త్రీలకు నచ్చచెప్పలేకపోతున్నాము. ఇదికష్టమైనపని అయినా చెప్పితీరాలి. "కృత్రిమసంతాన నిరోధాలు చేసుకోండి" అని నేను చెప్పడం సాగిస్తే ఇక, పై రీతిగా వారిహక్కులను వారికి నచ్చచెప్పి, వారిని సవ్యమైన త్రోవలో ప్రబోధించే అవకాశమే పోగొట్టుకున్నవాణ్ణి అవుతాను.

"కృత్రిమనిరోధపద్ధతులలో హానికరమైన సాధనాలు ఏవైనా కనబడితే వాటిని సవరిద్దాములెండి" అని మీరంటే వాటికి బదులుగ ఇంకొకరకం సాధనాలు కనిపెట్టడానికి మీరు ఆలోచిస్తూఉంటారు. అంతేకాని, అసలు కృత్రిమ పద్ధతినే మానివేయడం కలుగదు. కనుక, నే చెప్పేదేమంటే అసలు ఈకృత్రిమపద్ధతే మానివేసెయ్యండి అంటాను. అసలు సమస్యాపరిష్కారానికి, సవ్యమైన మార్గాలు బోలెడుఉన్నవి. అప్పుడవి మనకు కనబడతవి.

("మార్గరెట్ స్యాంగర్" అనే ఆమె "ఆసియా" అనే పత్రికలో 1935 నవంబరు నెలలో వ్రాసిన ఒకానొక వ్యాసమునుండి)

## ఏ విశాలసంఘము – తిర్యక్ జంతువులు.

## 1

### గో సం ర క్ష ణ.

గోసంరక్షణ యనునది మానవజాతి పరిణామములో అత్యద్భుతమైన ఒకానొక పరిణామఘట్టముగ నాకు కనిపించుచున్నది. అది మానవుని తన స్వజాతికి అతీతమైన ఉన్నత ఘట్టమునకు లేవనెత్తుచున్నది. 'గోవు' అనగ యావత్తు తిర్యక్ సృష్టిజాలమని నా అర్థము. మానవుడు గోవుద్వారా సృష్టిలోని యావత్ ప్రాణికోటితో తన అభేదమును, ఐక్యతను గుర్తించవలయునని ఈశ్వరాదేశము. గోవునే దైవస్వరూపముగ ఆదర్శముగా ఏల నిర్దేశించవలెనను ప్రశ్నకు సమాధానము నా మనస్సునకు స్పష్టముగానే కనిపించుచున్నది. ఇండియాలో గోవు మానవునకు అత్యంతసన్నిహితమైన మిత్రముగా సహవాసిగ ఉండినది; సమస్తసౌభాగ్యభోగ్యములను వర్షించు దాతగ ఉండినది. గోవు మనకు పాలు ఇచ్చుటయేకాక, అసలు వ్యవసాయకృషినే మనకు సాధ్యము చేసినది. గోవు ఒక కరుణాగీతము. పరమసాధువు ఈజంతువు. దీనిని చూచినంతనే మనలో కరుణారసము ఉబుకుతుంది. కోటానుకోట్ల భారతీయులకు గోవు తల్లి. గోమాత అంటాము దాన్ని. గోసంరక్షణ అంటే నోరులేని యావత్తు ప్రాణికోట్లసంరక్షణయే అని అర్థము. మన పూర్వఋషి, సత్యద్రష్ట, అతడెవరు కానిండు, ఈ నోరులేని జంతుజాలమునకు ప్రతినిధిగ ప్రప్రథమముగ గోవును దర్శించినాడు.

ఈ తిర్యక్ప్రాణికోట్ల మొర మన హృదయములను మరింత ఘాటిగా చీల్చుకుపోతుంది. ఎందుకంటె, ఆ మొరకు నోరు లేదుకనుకనే.

(యంగ్ ఇండియా: 6-10-1921)

గోవును సంరక్షించే హిందువుడు, ప్రతి ఇతరజంతువునుకూడ సంరక్షించవలెను. "అయితే, ఇతరజంతువులను నీవు రక్షించడంలేదు. కనుక, గోవునుమాత్రి మెందుకు రక్షిస్తావు" అని ఎవరుకాని, ఆతనిని ఎక్కిరించకూడదు. మొత్తంమీద సాధకబాధకములన్నీ విచారించిచూస్తే అతని యందిదొక తప్పుగ ఎంచరాదు. కనుక, మనము ఆలోచించవలసిన సమస్య ఏమంటే, అతడు అసలు గోరక్షణకు పూనుకోవడమే సైటా, తప్పా, అని మాత్రిమే ఆలోచించాలి. అహింసయందు, నమ్మకమున్నవానికి జంతువులను చంపకుండుటయే సర్వసాధారణమైన విధాయకకృత్యమని ఎంచే పక్షంలో, అతడు గోసంరక్షణకు పూనుకొనుటలో తప్పేమియు ఉండజాలదు. ప్రతి హిందువుడు- అంతయేల- ఏ మతానుయాయియైనాసరే గోరక్షణచేస్తాడు. ప్రాణికోటిని చంపకుండ ఉండడమనేద ప్రతివానికి విధాయకమైన సాధారణధర్మముగ ఉండాలి. అందువల్లనే, వాటిని రక్షించడం ప్రతివానికి విధికృత్యముగ ఉండాలి. ఇది నిర్వివాదమైన విషయముగా అంగీకరించాలి. హిందూమతము గోరక్షణ నొక విధాయక ధర్మముగ అవలంబించిందంటే, అది మెచ్చుకోతగ్గవిషయమే. ఇతర జంతువులనుకూడ సంరక్షించుటకు

శక్తివంతుడై నప్పుడు- అట్టి అవకాశము తనకు ఉన్నప్పుడు- వానిని సంరక్షించక ఉపేక్షించి, ఒక్క ఆవునే రక్షిస్తానని చెప్పే పహింసువుడుకాని నిజమైన హింసువుడు కాజాలడు. అతను దనాగరికం హింసువుడన్నమాట. గోవు యావత్తు తిర్యక్ జంతుజాలమునకు ఒక చిహ్న మన్న మాట. కనుక గోరక్షణ అనునది అతని కనీసధర్మము మాత్రమే.

(యంగు ఇండియా: 11-1-19-6)

ఇంకా సూక్ష్మంగా ఆలోచిస్తే ఆధ్యాత్మికార్థం విచారిస్తే 'గోసంరక్షణ' అనగ ప్రతిప్రాణిని కూడ సంరక్షించడమే అని అర్థం తెలుస్తుంది. మనపూర్వులు లోక అత్యద్భుతమైన సత్యమును కనిపెట్టారు. (రోజురోజు దీనిని తలచుకున్న కొద్దీ 'ఆహా అది యెంత గాఢమైన సత్యము అని నా మనస్సుకు అనిపిస్తూ ఉంటుంది) అదేమంటే అహింస, సత్య. సాధనలయందు ఏ మనిషి ఎంతదూరం పోగలుగుతాడో, అంతదూరం వరకే మన పవిత్రగ్రంథములలోని వాక్యాలు, ఈశ్వర ప్రేరితమైన వ్రాతలు అతనికి అర్థమవుతవి. తమ అర్థమును అవి అతనికి అంతవరకే ప్రసాదిస్తవి. సత్యమును, అహింసను అతడెంతఎక్కువగా సాధించుకోగలుగుతాడో అతనికి ఆ వేదాది వాక్యాలలోని వెలుతురు తేజస్సు అంత ఎక్కువగా అగుపిస్తుంది. ఇట్టి ఋషులే చెప్పారు, ఏమని, గోరక్షణ ప్రతిహిందువుయొక్క ధర్మమని; గోరక్షణచేసిన వానికి మోక్షం వస్తుందని. అయితే ఒక్కసంగతి: గోవును సంరక్షించినంతమాత్రంచేతనే మోక్షం వచ్చిపడుతుందని

నమ్మడానికి నేను సిద్ధంగాలేను. మోక్షం పొందాలంటే, ఎవరైనాకాని మున్ముందుగా .కామక్రోధాది అరిషడ్వర్గము లను పూర్తిగ వదలించుకోవలెను. కనుక. మోక్షంఇస్తుం దనిచెప్పే గోరక్షణలక్షణం మామూలుగా అందరూ అను కునే రకం గోరక్షణకాదు; అది అంతకంటె చాల విశా లార్థంతో కూడుకొన్నది; అది మిక్కిలి విస్తృతమైనది. మోక్షము నివ్వగలరకం'గోరక్షణ'లో స్వభావసిద్ధంగ సమస్త ప్రాణికోటిసంరక్షణకూడచేరియేఉన్నది.'బాధ' అనేదిఉండే ప్రతిప్రాణియొక్క సంరక్షణకూడ 'గోరక్షణ' అనే ఈ ఒక్క మాటతో స్పష్టముగ ఇమిడియున్నది. అట్టిరకం గోరక్షణే మోక్షంఇస్తుందని చెప్పేది. కనుక. అహింసాధర్మము నకు ఏమాత్రపు స్వల్పభంగం కలిగించినా, అనగా కఠినపు మాటలచేత (వాక్పారుష్యముచేత) ఏపురుషునికి కాని, స్త్రీకి కాని, పసిబిడ్డకుకాని కష్టంకలిగించినా, ఈ భూమిమీాద తిరు గాడే యే అల్పప్రాణికైనాసరే బాధకలిగించినా, అదంతా గోరక్షణాధర్మమును భంగించినట్లే- గోమాంసభక్షణ అను మహాపాపకర్మమును చేసినట్లే. తేడాఅల్లా కేవలం గోమాంసం తినకపోవడ మొక్కటే కావచ్చుకాని, అసలుతత్వతః పాపం యొక్క రకంలో ఏమీా తేడాలేదు.

(యంగ్ ఇండియా: 29–1–1935)

## 2

క్రోధముచేకాని, స్వార్థబుద్ధితోకాని, ఏప్రాణికికాని, నొప్పికలిగించుట, ప్రాణముతీయుట, లేక చెడుపుకోరుటసహా

'హింస' క్రిందికే వస్తుంది. ఇక, అట్లు కాక, కేవలం నిష్క-
ల్మషమైన మనస్సుతో, స్వార్థరహిత బుద్ధితో, ఒకనొక
ప్రాణికి భౌతిక బాధనివారణకో, లేక, ఆధ్యాత్మిక లాభం
కలిగించు నిమిత్తమో ప్రశాంత నిర్మల విచక్షణంతో
నొప్పికలిగించుటకాని, లేక, దాని ప్రాణమును అంతమొం
దించుటకాని, నిర్మలమైన అహింసయే కావచ్చును. అట్టి
ప్రతికేసు విషయంలో దానియొక్క మంచి చెడ్డలనుబట్టి
తీర్పు చెప్పవలసియుండును. ఒకపని హింసయా, లేక అహిం
సయా అని నిర్ణయించడానికి తుదగీటురాయి ఆ పనిని ప్రేరే
పించిన మనోభావమే.

( యంగ్ ఇండియా : 4-10-1928 )

నా అహింస నిర్వచనం నాడే జంతువులను చంప
కూడదను సిద్ధాంతము పూర్తిగ - నూటికి నూరుపాళ్లు- నేను
అంగీకరింపజాలకున్నాను. మనుష్యులకు హాని కలిగించే, లేక,
మనుష్యులను మ్రింగివేసే జంతువుల ప్రాణాలు కాపాడాలని
నా కేమీ లేదు అట్టివాని సంతానవృద్ధి చేయడానికి తోడ్ప
డం తప్పని నా అభిప్రాయం. కనుక, నేను చీమలకు, కోతు
లకు, కుక్కలకు, హాని వేస్తూఉండను. వాటి ప్రాణాలు
రక్షించడానికికోసం నేను మనుష్యుల ప్రాణాలు బలిచేయ
డానికి ఎన్నడూ అంగీకరించను.

ఈ రకమైన భావపరంపరలననుసరించి నేనొక నిశ్చ
యానికి వచ్చాను. అంటే మానవుల శ్రేయస్సుకు పీడాకర

మైనపట్ల కోతులను అంతమొందించడం తప్పకాదు. క్షంత వ్యమే అనే నిశ్చయానికి వచ్చాను. అప్పుడు వాటిని అంతమొం దించడం నా విధికూడాను. అయితే పీడాకరములైన కోతు లను చంపడం ధర్మమే అయితే, పీడాకరులైన మనుష్యు లను మాత్రమేల చంపకూడదు అనే ప్రశ్న రావచ్చును. కోతులకు వర్తించే సూత్రమే మానవులకు కూడ ఏల వర్తిం చదు అంటే, "వర్తించ జాలదు" అనే నేను అంటాను. ఎందుకంటే, మనుష్యులు ఎంతచెడ్డవారైనా, వారూ మన వంటి వారే. మంచి చెడ్డలను విచక్షణ బుద్ధితో వేరు పరచి చూచుకునే శక్తిని భగవంతుడు మానవునకు ఇచ్చి యున్నాడు. తదితర జంతువులకు ఇవ్వలేదు.

( హరిజన్ : 5-5-1946 )

# 3

## —◆ విశ్వమానవ సౌభ్రాతృత్వము ◆—

స్వచ్ఛమైన హిందూమత మేమని చెబుతున్నదంటే, బ్రాహ్మణుడు, చీమ, దోమ, ఏనుగు, కుక్క మాంసం తినే వాడు – అందరూ సమాన స్థితిలో వారే అని చెబుతున్నది. ( శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే, గవి, హస్తిని, శునిచైవ. శ్వపాకేచ పండితాః సమదర్శినః" ) సౌభ్రా తృత్వం తోటిమానవులతోనే కాక, తక్కిన యావత్ ప్రాణి కోటితో సహా ఉండాలని హిందూ మతం చెబుతున్నది. ఈ ఆదర్శాల తలచుకుంటే తల తిరిగిపోతున్నది; అది మన బుర

లకు అందనిదిగా ఉన్నది. అయినా, ఈ ఔన్నత్యాన్ని చేర డానికి మనం సాధన చెయ్యాలి. క్రమంగా మనిషికీ మనిషికీ మధ్య నిజమైన, సజీవమైన, సమానత్వం ఏర్పరుచుకొన్న ఉత్తర క్షణంలోనే, ఇక, తక్కిన సృష్టిజాలముతో సహా ఏర్పరచుకోగలము. అట్టి మంచిరోజు వచ్చినప్పుడు, ఈ భూలోకంలో మనకు పరమశాంతి ఏర్పడుతుంది. మానవుల మధ్య సుహృద్భావం నెలకొంటుంది.

(హరిజన్ : 28-2-1946)

## 4

## జంతు బలి

జంతుబలిని వేదం అంగీకరించిదంటున్నారు. అగు గాక. అది సత్యము, అహింస అనే మూల సూత్రాల గీటురాతి పరీక్షకు ఆగజాలదు. మనము గమనించవలసిన దింతే. వేదముల పాండిత్యం నాకు లేదని తక్షణమే ఒప్పుకుంటున్నాను. కాని, నా యీ పాండిత్యంలేని లోపం – ఈ జంతుబలి సంగతికి సంబంధించినంత వరకు–లోప మని చింతించను. ఎందుకంటె, వేదకాలంనాటి సంఘంలో జంతుబలి యుండెనని స్పష్టముగ ఋజువు చేసినప్పటికీ, అహింసా వాది నవత కది నే డొక ప్రమాణముగ గైకొన బడజాలదు.

("ఎరవాడా మందిరం నుండి"
1945 ప్రచురణ : పేజీ 53, 54)

# సర్వోదయము

## ఐదవ భాగము

## ( రాజకీయ స్థితి )

### A. సర్వోదయ సమాజము

# 1

### — మనిషి నడతయే పునాది —

నిజంగా స్వరాజ్యమంటే, తనను తాను నియమించుకొనుటయే. అనగ ఆత్మనిగ్రహం అని అర్థం. ఎవరికి ఈ ఆత్మనిగ్రహశక్తి ఉంటుంది ? ఎవరైతే నీతిధర్మాలను పాటిస్తారో, ఎవరైతే సత్యాన్ని తప్పరో, ఎవరైతే లోకులను వంచన చేయరో, ఎవరైతే తమ తల్లిదండ్రులయెడ తమ దారా పుత్రాదులయెడ, తమ నౌకర్లయెడ, ఇరుగుపొరుగు వారియెడ తమ విధ్యుక్తధర్మములను తప్పక నెరవేరుస్తారో అట్టివారే ఆత్మనిగ్రహశక్తి కలిగియుంటారు. అట్టివాడు తాను ప్రపంచంలో ఎక్కడున్నా సరే, స్వరాజ్యమును అనుభవించుచున్నాడన్న మాటే. ఇటువంటి మంచి లక్షణాలుగల పౌరులు హెచ్చుమంది తన దేశంలో కలరని ఏ దేశము సగర్వముగ చెప్పుకోగలదో, ఆ దేశమే, ఆ రాజ్యమే - నిజమైన స్వరాజ్యము ననుభవించుచున్న దేశం కాగలదు.

బ్రహ్మాండమైన పెద్దఫ్యాక్టరీలు నిర్మించుకొనుటవల్ల కాదు స్వారాజ్యం లభించేది. బంగారు, వెండి గుట్టలుగ మనం పేర్చిపెట్టుకోవచ్చునుగాక, కాని, స్వారాజ్యస్థాపన కది మార్గం చూపజాలదు. ఈ సంగతిని "రస్కిన్" తత్వవేత్త ఖచ్చితంగా ఋజువుపరచి యున్నాడు. పాశ్చాత్య నాగరికత నిన్నమొన్న పుట్టిన శిశువు. అది పుట్టి 50, లేక నూరు ఏండ్లయినా కాలేదు అయినా, అది యూరపుఖండాన్ని ఎంతో జాలికరమగు హీనస్థితికి దిగదీసింది. ఇట్టి హీనస్థితికి దిగజారిపోయే కర్మ ఇండియాకు పట్టకుండును గాక యని మనమందరము భగవంతుని ప్రార్థిద్దాము. యూరప్ ఖండ దేశాలు ఒకరిపై ఒకరు ఎప్పుడు దూకుదామా అని సిద్ధంగా కూర్చున్నాయి ప్రస్తుతానికి నిశ్శబ్దంగా ఉన్నయ్యంటే, ఆయుధాలు పేర్చిపెట్టుకోవడం ఇంకా బాగా పూర్తి కాలేదన్నమాట. ఉండి ఉండి ఎప్పుడో ఒక్క క్షణంలో కుండ బ్రద్దలౌతుంది అప్పుడు యూరపు ఖండము ఖచ్చితంగా భూలోక నరకమే అయి కూర్చుంటుంది. ప్రపంచములో నున్న శ్వేతేతర జాతులన్నీ తమకు భగవంతుడు మింగ నిచ్చిన కబళములేయని యూరపులోని ప్రతి రాజ్యం భావించుకొంటున్నది. పరుల సంపదలను హరించడమనేదే తమను నడిపించే ప్రధాన ప్రవృత్తిగ మానవుల హృదయాలలో రాజ్యం సాగిస్తున్నచోట్ల ఇట్టి పరిణామములు కాక, వేరొకటి ఎట్లు సంభవించగలదు? ఒక మాంసపు ముక్కను చూడగానే కాకులెట్లు అగాంతంగా వచ్చి దానిమీద పడతవో, ప్రపంచంలో ఎక్కడైనా సరే కాస్త భూభాగం కంటబడగానే

యూగోస్లావియా ఖండ రాజ్యాలు అలా వచ్చి దానిమీద పడతవి. దీని కంతకు కారణము ఆ రాజ్యాలు నిత్యము తమఫ్యాక్టరీలద్వారా తయారుచేసే అధికవస్తూత్పత్తియే యని నాకుతోచుచున్నది.

ఇండియాకు స్వరాజ్యం తప్పక రావలసిందే. కాని, అది సధర్మమైన మార్గాలద్వారా రావాలికాని, దుర్మార్గమైన మార్గాలద్వారా కాదు. మనది నిజమైన స్వరాజ్యంగా ఉండాలి. అట్టి నిజమైన స్వరాజ్యం హింసాపద్ధతుల వల్లకాని, బ్రిటిష్ వంతమైన పరిశ్రమా గారాల వల్లకాని, రాచేరదు. ఇండియా ఒకప్పుడు సువర్ణభూమిగా ఉండెను; ఎందుకంటే, ఇండియా ప్రజలు అనాడు సువర్ణమయ హృదయములను కలిగియుండిరి. ఇప్పుడుకూడ అప్పుడున్న భూమియే యున్నది, కాని నేడిది ఎడారియైనది; కారణం మనం దుష్టులమైనాము కనుకనే. మరల తిరిగి మనభూమి సువర్ణభూమియే కాగలదు; ఎప్పుడు? నేడు తుచ్ఛలోహముగ ఉన్న మనజాతి యొక్క నడత బంగారముగా మార్పు చెందినప్పుడే. "పరుసవేది" యను ఒకానొక రాయి కలదట. అది తుచ్ఛలోహములను బంగారంగా మార్చివేయగలదట. మన హృదయములనే తుచ్ఛలోహములను బంగారంగా మార్చివేసే అద్భుతమైన పరుసవేది యొకటి కలదు. దానికి రెండే అక్షరములు గల చిన్నపేరు కలదు. అదే "సత్యమ్". ప్రతి భారతీయుడు సత్యమును తప్పక అంటిపెట్టుకొని యుంటే, స్వరాజ్యం దానంతటది వచ్చి పడుతుంది మనకు.

( "అంటు దిస్ లాస్ట్" అను గ్రంథానికి గాంధిగారి సంక్షిప్తానుసరణము నుండి పేజీలు 61-64 )

నిజమైన ప్రజారాజ్యం, అనగా. ప్రజానీకానికి స్వరాజ్యం హింసా పద్ధతులవల్ల, అసత్య మార్గాల వల్ల ఎన్నడూ రానేరదు. కారణము సులభ గ్రాహ్యమే; హింసను అసత్యమును అవలంబించడం వల్ల వచ్చే సహజ పరిణామ మేమంటే, ఎదుటివారిని అణచివెట్టియో, లేక సర్వనాశనం చేసివేసియో, ఇక తమకు ఎదురులేదని చెప్పుకోవడమే జరుగుతుంది. ఇలా చేయడం వ్యక్తిస్వాతంత్ర స్థాపన కానేరదు. ( వ్యక్తి స్వాతంత్ర్యం లేనిది స్వరాజ్య మెక్కడ ? ) కత్తి లేని అచ్చపు అహింస రాజ్యంచేస్తున్నప్పుడే వ్యక్తి స్వాతంత్ర్యం సంపూర్ణ వికాసం పొందగలదు.

( హారిజన్ : 27-5-1939 )

## 2

### సర్వోదయ ప్రజారాజ్యం.

సర్వోదయ ప్రజారాజ్య నిర్మాణము అసంఖ్యాకములగు గ్రామసంస్థలచే జరుగుతుంది. ప్రాతిపదికలైన ఈ గ్రామ సంస్థలనుండి మరొకరకం సంస్థలు ఒక క్రమమునననుసరించి నిర్మాణమవుతూవుంటవి. అంటె, ఒకసంస్థ నెత్తిపైన ఇంకొక సంస్థయెక్కడమనే క్రమములో కాదు; ఒకసంస్థకంటె మరొక సంస్థ సమానలెవెల్ లోనేఉంటూ అంతకంతకు వైశాల్యం పొందుతూ, అన్నిటికి ఒకే కేంద్రం కలిగియుండే పద్ధతిగా ఈ సర్వోదయరాజ్యనిర్మాణం జరుగుతుంది. అడుగున వెడల్పయిన సంస్థలుండి, అవన్నీకలసి పైననెత్తిననున్న

శిఖరసంస్థను మోస్తూఉండడంకాదు. అట్టిదగుగున వెడల్పు, పైకి పోనుపోనుసన్నగా తేలిపోయే కోణ ("పిరమిడ్")పద్ధతిగా ఉండదు.

కదలికలేని ఒక చెరువునీళ్ళల్లో ఒక రాయి వేశామనుకొనండి. అప్పుడేమవుతుంది? ఆ రాయిపడిన కేంద్రంనుండి గుండ్రటి అలలు ఒకదానివెంట ఒకటి అసంఖ్యాకములుగ ఒకదానికంటె మరొకటి విశాలమైనవిగ బయలుదేరి చెరువు యొక్క నలుదిగంతములకూ వ్యాపిస్తవికద. వీటికన్నిటికి కేంద్రము ఒకటిగానే అనగా రాయిపడిన ఆ చోటుగానె ఉంటుందికద. సర్వోదయము ప్రజారాజ్య నిర్మాణపద్ధతికూడ చెరువునీళ్ళలోని ఏకకేంద్ర తరంగవలయములను Concentric Circles) పద్ధతిగానే ఉంటుంది. ఈ వలయముల కన్నింటికి కేంద్రము - తటాక తరంగములకు వలెనే - ఒకటిగానే ఉంటుంది. అదే మానవ వ్యక్తి. అనేకమంది వ్యక్తులు చేరినదే కద గ్రామము. వ్యక్తియను కేంద్రమునుండి బయలుదేరే ప్రథమ వలయ తరంగమే గ్రామ మన్న మాట. ఈ గ్రామ క్షేమమునకై ఆ వ్యక్తి తాను బలియగుటకు సదా సిద్ధంగా ఉంటాడు. అట్లే ఒక గ్రామము, అంతకంటె విశాలమైన పెక్కు గ్రామముల సమూహమనే విశాలసంస్థ శ్రేయస్సుకై బలి అవడానికి సిద్ధముగా ఉంటుంవి. ఈ క్రమముగా ఒక దానికొరకై ఒకటి బలి యగుటకు సంసిద్ధ పడుతూ పోగా పోగా, మొత్తమంతయు ఏక కేంద్రమునుండి - అంతకంతకు విశాల వలయములలో స్పందించుచు - విస్తృతి జెందునవైక

మానవ జీవిత విధానముగ పరిణితి పొందగలదు. ఒకరిపై ఒకరు ఎన్నటికి దురాక్రమణ చేసికొను దురహంకారముగా కాక, సదా విస్తృతి నొందుచుండు సముద్ర తరంగముల వైశాల్యతలో, - తామే అవినాభావసంబంధ భాగములుగ పరిణమించిన అభంగతరంగముల వైశాల్యతలో, గభీరతలో, వినమ్రభాగస్వాములుగ మానవులు తాదాత్మ్యమును పొందగలరు.

కనుక కొట్టకొసనున్న బయటి వలయము లోపలనున్న వలయములకు అణచివేయుటకు అధికారమును చెలాయించదు; పైగా, వాని కన్నింటికీ బలమును చేకూర్చుతుంది. అంతేకాదు, వాటినుండి బలమును సేకరించుకుంటుంది. "ఇదంతా పట్టి గాలి మేడలన్న్యా నీవు కట్టేది" అని ఎవరైనా నన్ను వెక్కిరిస్తే వెక్కిరించనీయండి - వీటిని గురించి ఒక్క క్షణంకూడ ఆలోచించ పనిలేదని కూడ తోసివేయనియ్యండి; ఫరవాలేదు. అయితే, ఒక సంగతి ఆలోచించాలి. "యూక్లిడ్" అను వాస్తుశాస్త్రజ్ఞుడు నిర్వచించిన * "బిందువు" (పాయింట్, అనునది నిజంగా ఏ మానవుడు కాని లిఖించ గలిగినదేనా ? కాదుకద. అయినప్పటికి మన జీవితములో దానికి అమూల్యమై, ఎన్నటికి చెడని, విలువయున్నదికద. ప్రత్యక్షముగ ఏ మానవునకు కాని లిఖింప సాధ్యమెంతమాత్రము కాని యూక్లిడ్

* "బిందువు" నకు పొడవులేదు, వెడల్పులేదు, మందము లేదు- ఇవే వీ లేని చుక్క ( బొట్టు ) నిర్మించుటెట్లు ? దీనిని లిఖించుట మానవ సాధ్యమైన పనియా ?

నిర్వచిత విందువునకు క్రియలో ఇంత విలువయున్నప్పుడు నేను లిఖించిన సర్వోదయరాజ్య చిత్రణమునకేల అంతటి విలువరాదు ? మానవజీవితగతి కది ఎన్నడూ చెడని విలువ నాపాదిస్తుంది ఇదే సవ్యము, సత్యమునైన చిత్రణము. నూటికి నూరుపాళ్లు ఈ చిత్రణానుసారముగ మానవులు ఇచ్ఛితముగ ప్రవర్తించలేకపోయినప్పటికి, ఈ ఆదర్శము వైపునకు భారతీయులు తమ జీవితములను నడిపించుకొందురుగాక యని కోరుచున్నాను. మనకేది కావలెనని కోరుకుంటామో దాని నిజమైన స్వరూపమైనా మన కండ్ల యెదుట కన్పించ నక్కరలేదా? అప్పుడే కదా దానిని సుమారుగానైన మనము చేరగలుగునది ? ఇండియాలో ప్రతి ఒక్క గ్రామము ఒక్కొక్క ప్రజారాజ్యముగ ఏర్పడడమనే మంచిరోజు వచ్చినప్పుడు నా యీ సర్వోదయ ప్రజారాజ్యచిత్రణము సత్యమై ప్రత్యక్ష మవుతుందని నేను గట్టిగ చెప్పగలను. ఇట్టి రాజ్యములో ఆఖరివాడు మొదటివానితో సమానంగా ఉంటాడు; అనగ, మొదటి వాడనే వాడెవడూ ఉండడు; — అట్లే చివరి వాడనే వాడెవడూ ఉండడు.

( హరిజన్ : 28-7-1946 )

నిజమైన ప్రజారాజ్యం ఏ ఇరవైమందో కూడి ఒక కేంద్రంలో కూర్చుని నడిపించేది కాదు. అది ప్రతిగ్రామములో ఉండే ప్రజానీకముచేత అట్టడుగునుండి నడిపింపబడేదే. అదే ప్రజారాజ్యం అవుతుంది.

(హరిజన్ : 18-1-1948 )

అహింస అనే పునాది మీద మనము స్వరాజ్య సౌధమును నిర్మించాలనుకుంటే, గ్రామాలకు పైన చెప్పిన రీతిగా మనము ఉచిత స్థానమును ఇవ్వవలెను.

# 3

## గమ్యస్థానము.

అహింస పునాదిగా గల స్వరాజ్యం ఎట్లుండవలెను? ఈ రాజ్యంలో ఒకనికి ఇంకొకడు ఎన్నటూ శత్రువుగ ఉండజాలడు. ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ కూడా సమష్టి శ్రేయముకై తమవంతు శ్రమను సమర్పిస్తారు. అందరికీ చదువను వ్రాయను వస్తుంది. రోజురోజూ వారి విజ్ఞానం పెంపొందుతుంది. రోగములు అరిష్టములు బాగా తగ్గిపోతవి. లేనివాడనే వాడెవడూ ఉండడు; కష్టించేవాడికి కెప్పుడూ పని కొరత లేకుండ దొరుకుతుంది. ఇట్టి రాజ్యంలో జూదము, త్రాగుడు, వ్యభిచారము, అవినీతి, కులజాత వర్ణవిద్వేషములు ఉండవు. వీటికి తావే ఉండదు; ధనవంతులు తమ ధనమును వివేకముతో ప్రజోపయోగకరముగ వినియోగిస్తారు; తమ డాబు దర్పములకు, భోగవిలాసములకు దుర్వినియోగము చేయరు. కొద్దిమంది భాగ్యవంతులు రత్నాల మేడలలో కులుకుతూ ఉంటే, కోట్లకొలదిజనం గాలి వెల్తురు కూడ చొరని ఘోర దుర్భర కూపాలలో యాతనలు పడడమంటూ ఉండదు, హిందూ - ముస్లిమ్ విభేదములు, అస్పృ

శ్యత, ఒకడు హెచ్చు ఒకడు తగ్గు అనే వ్యత్యాసాలు ఉండవు.

(రాజకోట ప్రజలకు గాంధిగారు చేసిన విజ్ఞప్తి నుండి

( హరిజన్ : 25-3-1939 )

# 4

## ఇండియా స్వరాజ్యంలో గవర్నర్ ఎలా ఉంటాడు ?

(1) స్వరాజ్యంలో మన గవర్నర్ ముందుగ తాను తాగుబోతుగ ఉండరాదు; చుట్టుపట్టుల ఎవరినీ తాగనివ్వరాదు. ఇట్టి నియమం లేనిది, ఇప్పటి సారాయి వగైరాల నిషేధం దాదాపు తలంపులో కూడ అసాధ్యమే అయిపోతుంది

(2) నోరులేని భారతీయమానవకోట్లతో తమ ఐక్యభావమునకు ప్రత్యక్షచిహ్నముగ గవర్నరున్ను, అతని చుట్టునున్న వారు కూడ చేతి రాట్నాలమీద వడుకుతూ ఉండాలి. "కాయకష్టము చేసి తిండితిను" అనే సూత్రావశ్యకతను నిరూపించుట కీ ప్రత్యక్ష చిహ్నము అవసరము. నేడు సంఘము సంఘటితమైన హింస మీద నిర్మాణమై యున్నది. దీనిని నిర్మూలించుటకు సంఘటితమైన "అహింస" అవసరమని నిరూపించుటకు కూడ గవర్నర్లు తమ సిబ్బందితో సహా ఈ రీతిగా రాట్నములు వడుకుచుండవలెను.

(3) అందరికి అందుబాటులో ఉండేటందుకై మన గవర్నర్లు సామాన్యకుటీరములలోనే నివసించవలెను. తమ

విధికృత్యములకు అంతరాయము కలుగకుండా కొంచెం తెర వేసుకోవచ్చును. బ్రిటిష్ గవర్నర్ పద్ధతి వేరు. ఆతడు బ్రిటిష్‌వారి బలోద్ధతికి ప్రతినిధిగా ఉండియుండెను. కనుక, అతనికి సైన్య బలరక్షితమైన పెద్దకోటలు, కోటగోడలు అవసరమయ్యెను. అంతేకాక, అతని సామ్రాజ్యమును బుజాలపైన మోసే అసంఖ్యాక సామంతులకు పెద్దపెద్ద సౌధరాజములును అవసరమయ్యెను. అయితే, మన స్వరాజ్యంలో గవర్నర్ల స్థితి వేరు. వారు బ్రిటిష్‌గవర్నర్ల మాదిరిగ ఉండడానికి వీలు లేదు. కావలిస్తే, మహారాజులను, పరరాజ్యముల రాయబారులను చూచునిమిత్తమై ఒకమూలకు దాంబికపు బిల్డింగులను ఉంచుకుంటే ఉంచుకోవచ్చును కాక. ఈ రీతిగా, మన గవర్నర్లు "సర్వసమానత్వము" ( అంటు డిక్లాస్టు ) అంటే ఏమిటో తమకు అతిథులుగావచ్చిన పరరాజ్యరాయబారులందరకు ప్రత్యక్షముగ చేసిచూపించు వారైయుండాలి. మనగవర్నర్లు ఖరీదైన సామగ్రిలను సోఫాలువగైరాలను పెట్టుకోరాదు. అవి విదేశీవైనాసరే, స్వదేశీవి అయినాసరే పెట్టుకోరాదు. నమ్రమైననడత. ఉన్నతమైన భావాలు అతనిని నడిపించే ప్రమాణవాక్యాలుగా ఉండాలి. అంటే ఈ వాక్యాలు బోర్డు మీద వ్రాసి తనగుమ్మంమీద వేలాడగట్టుకోడానికి కాదు; ఇవన్నీ అతని నిత్యజీవితపు నడకలో ప్రత్యక్షంగా కనబడాలి.

(౪) ఏ రూపంలోగాని మనగవర్నర్ అస్పృశ్యతను పాటించరాదు; కుల, మత, వర్ణ వివక్షత అతని కుండరాదు. అన్నిమతముల ఉత్తమబోధలకు ఆతడు ప్రతినిధిగ ఉండవలెను. అట్లే ప్రాచ్య, పాశ్చాత్య, సంస్కృతులలోని ఉత్తమ

లక్షణములను ఆతడు తననడతలో ప్రతిబింబించేటట్లు ఉండాలి. ఇండియాకు పౌరుడంటే, యావత్ప్రపంచమునకుకూడ పౌరుడే అనిపించుకోవాలి. ఈ ఉన్నతాదర్శములతో ప్రత్యక్షముగ జీవించిన మహామహులగురించి మనముగ్రంథములలో చదువుతూఉంటాముకద. కోట్లకొలది ధనరాసులు తనపాదాల క్రింద మూలుగుచుండిన "ఒమర్‌ఖాలిఫ్" అనుమహమ్మదీ ప్రభువు ఈ ప్రకారంగా నడుచుకున్నారు. పూర్వం మన దేశంలో జనకమహారాజుకూడ ఇట్లే నడుచుకున్నాడు. ఇట్లే ఇంగ్లండులో "ఈటన్" విశ్వవిద్యాలయాధ్యక్షుడు నడచుకొనడం నేను ప్రత్యక్షంగా చూశాను అయనచుట్టూ ఎల్లప్పుడూ ఇంగ్లాండులోని రాజకుమారులు, ప్రభుకుమారులు మూగి ఉండేవారు. అట్టివారిమధ్య ఈ విద్యాగురువు సామాన్యుడుగ కాలంగడిపేవాడు. తిండిలేకకృశించుచున్న కోట్లకొలది భారతప్రజానీకానికి గవర్నర్‌గ ఉండే మన స్వరాజ్యపు గవర్నర్ ఇంతమాత్రం చేయడా.

(5) తాను గవర్నర్‌గఉన్న రాష్ట్రప్రజలు ఏ భాష మాట్లాడుతారో గవర్నర్ ఆ భాషమాట్లాడగలిగియుండాలి; అంతేకాదు ఇండియాకంతకు సామాన్య భాషయైన హిందూస్థానీకూడ ఆతడు మాట్లాడగలిగి ఉండాలి. అది నాగరి లేక ఉరుదు లిపిలో వ్రాయబడాలి. సామాన్యపు భాషగ ఉండే హిందూస్థానీ అనేది సంస్కృత మయమైన హిందీగానూ, ఉండరాదు, పరిషియన్‌భూయిష్టమైన ఉరుదుగానూ ఉండరాదు. వింధ్య, పర్వతములకు ఉత్తరముననున్న కోట్లాది

జనులు మాట్లాడేదే "హిందూస్థానీ" అంటే. ఇదే దాని నిశ్చయమైన అర్థము.

మనస్వరాజ్యపు గవర్నర్ల కుండవలసిన సల్లక్షణాల జాబితా ఇంతటితో పూర్తి కాదు. పై లక్షణాలుకొన్ని ఉదాహరణకుమాత్రం చెప్పాను.

(హరిజన్. 24:8-1947)

## 5

నాదృష్టిలో రాజకీయాధికారమనేదే పరమావధికాదు. ప్రజలుఅన్నిరంగములలోను తమ జీవితములను మేలురకముగ బాగుపరుచుకొనుటకు ఉన్న అనేక సాధనలలో రాజకీయాధికారమనేది కేవలం ఒక సాధనముమాత్రమే. మానవులు తమ సంఘము యొక్క నడకను తమ ప్రతినిధులద్వారా సవ్యమార్గాలో నడిపించుకొనే శక్తి గలిగియుండడమే రాజకీయాధికారమంటే. సంఘము తనంతటతానే పూర్తిగ సవ్యమార్గాలో నడిచేటంత ఉత్తమస్థితికి వచ్చిననాడు ప్రతినిధులూఅక్కరలేదు, రాజ్యాంగమూ అక్కరలేదు, శాసనమూ అక్కరలేదు. తేజోవంతమైన * రాజ్యరహితరాజ్యం విరాజిల్లుతుంది.

ఇట్టి సమాజంలో ప్రతివాడు తనకుతానే నియంతగ ఉంటాడు. అనగ, పైనుండివచ్చిపడే ప్రభుశాసనంతో పని

* దీనినే శాసనముక్త సమాజమని వినోబా గారంటున్నారు.

లేకుండ, తానంతటతానే సన్మార్గాలలో నడుస్తాడన్న మాట. అనగ తనపొరుగువానికి ఎన్నడూ ఎట్టిహానిచేయడు, ఆతని అభివృద్ధికి అటంకముగ ఉండడు. ఇట్టి ఆదర్శ సమాజంలో రాజకీయాధికారమనేదే ఉండదు. ఎందుకంటె రాజ్యమనేదేఉండదుగా!దానితో పనే ఉండదుగా.అయితే.ఈ ఆదర్శాన్ని జీవితంలో పూర్తిగా మనం అందుకోలేక పోవచ్చుగాక అందుకనే, "థోరో" అనే ఒక తత్వవేత్త ఏమన్నాడంటే, "ఎంతతక్కువగా పాలించే రాజ్యమైతే, అది అంత ఎక్కువమంచిరాజ్యమవుతుంది" (That Government is best which governs the least)

(యంగ్ ఇండియా 2-7-1931)

"స్టేటుకు" (గవర్నమెంటుకు) అధికారం ఎక్కువ యెక్కువగ సక్రమించడం చూస్తే నాకు భయమేస్తుంది. ఎందువల్లనంటే, దోపిడీవిధానాన్ని తగ్గించి మేలుచేస్తున్నట్లు పైకికనిపించినప్పటికి, అదివ్యక్తులవ్యక్తిత్వమును నశింపజేసి మానవకోటికి గొప్పహానిచేస్తుంది. మానవుని వ్యక్తిత్వమే కద సమస్తపురోభివృద్ధికి మూలకందం (అదిపోతే ఇక అభివృద్ధి యెక్కడ ?)

సంఘటితమై, గడ్డకట్టిన హింసకు చిహ్నమే "స్టేటు" "(గవర్నమెంటు)" అంటె. వ్యక్తికి ఆత్మ అనేది ఒకటి ఉంటుంది; కాని "స్టేటు" అనేది ఆత్మలేని మొద్దుయంత్రం. అసలు, దాని ఉనికికే కారణభూతమైన హింసనుండిఅది మెప్పు

విముఖముకాగలదు ? ఎట్లు విడివడగలదు ? దానిబ్రతుకే హింసమీద ఆధారపడియున్నదికదా! షాహుకారీపెట్టుబడి విధానాన్ని గవర్నమెంటు కనుక హింసాపద్ధతులచే అణచి వేసేస్తే, ఆ గవర్నమెంటు ఇక హింసయను విషపుచుట్టలలో తానే తగుల్కొని విడివడలేక చిక్కుపడి పోతుంది. ఇక ఆ గవర్నమెంటు ఎన్నటికీ అహింసను వికసింపజేసికొననేలేదు. ఇది నాదృఢాభిప్రాయము.

ఇట్టి స్థితిలో ఏమి చెయ్యాలో అడిగితే నా ఇష్టము నిచ్చట కొంత వివరిస్తాను. అధికారమును గవర్నమెంటు చేతిలో కేంద్రీకరించడం కాదు; ట్రస్టీ విధానమును విస్తరింప చేయడం నాకు ఎక్కువ ఇష్టము. ఎందుకంటె, స్టేటుచేసే హింసకంటె ప్రయివేటు షాహుకార్లు చేసే హింస తక్కువ హానికరంగా ఉంటుందని నా నమ్మకం. అయినప్పటికి, తప్పని సరి అయ్యే పక్షంలో కొద్దిపాటి గవర్నమెంటు స్వామ్యత్వ మును (స్టేటు ఓనర్‌షిప్పును) నేను ఒప్పుకుంటాను.

నేను ఒప్పుకొననిది అల్లా ఒక్కటే - ఏమంటే బల వంతం మీద ఆధారపడ్డ ఏనిర్మాణము కాని నాకు ఇష్టము లేదు. గవర్నమెంటు - స్టేటు- అనేది బలప్రయోగం మీద ఆధారపడ్డ నిర్మాణమేకదా. బలవంతంమీదకాక, స్వేచ్ఛా పూర్వకంగా జరిగే నిర్మాణమే దేనికైనాగాని ఉండాలి.

(మాడరన్ రివ్యూ : 1935; పేజీ 412,

నేను నిరూపించుకునే ప్రజారాజ్యంలో- అనగ - అహింసవల్ల స్థాపనఅయ్యే ప్రజారాజ్యంలో - అందరికీ

సమాన స్వేచ్ఛ ఉంటుంది. ప్రతివాడు తనకు తానే నియంతగ ఉంటాడు.

(గాంధిగారు గవర్నమెంటుతో నడిపిన ఉత్తర ప్రత్యుత్తారాల నుంచి 1942 - 44—పేజీ 78 )

# 6

## స్వపరిపాలన

తినడానికి, తాగడానికి, ఊపిరిపీల్చడానికి ప్రతి దేశానికి ఎలా అర్హత యున్నదో, అలాగే ప్రతిదేశం తన వ్యవహారాలు తానే - ఎంత చెడుగానో అగుగాక - నిర్వహించుకొనుటకు అర్హత కలిగి యున్నది.

(యంగ్ ఇండియా - 15-10-1931)

'స్వపరిపాలన' అంటే, గవర్నమెంటు కంట్రోలు నుండి విడివడి ప్రజలు తమంతటతామే వ్యవహారములు నడుపుకొనుటకు నిరంతరం యత్నంచేస్తూ ఉండడమే - ఆ గవర్నమెంటు విదేశీయమైనది కానిండు, స్వదేశీయమైనది కానిండు - ప్రజలు తమ నిత్యజీవిత వ్యవహారములను- ప్రతి దానిని -నడుపుకొనడానికి చీటికిమాటికి గవర్నమెంటువంక చూస్తూ కూర్చుండే పద్ధతిస్వారాజ్యం పనికి మాలిన స్వారాజ్యమన్నమాట.

( యంగ్ ఇండియా - 6-8-1925 )

స్వరాజ్య మంటే నా అర్థం ప్రజల అనుమతితో నాగేదని. ఈ అనుమతి తెలిసికొనుట యెట్లనగా -యావన్మంది వయోజనుల వోట్ల మూలంగా - వారు స్త్రీలు కాని, పురుషులు కాని, ఈ దేశంలో పుట్టినవారైనా, లేక, ఇక్కడ స్థిరనివాస మేర్పరచుకొనవారైనా కాక. వీరంతా తమ శరీరకష్టముచే దేశ సౌభాగ్యమునకు తోడ్పడినవారై యుండాలి; మరియు వోటర్ల జాబితా రిజిష్టరు చేయించుకొన్న వారై యుండాలి. నిజమైన స్వరాజ్యం ఎట్లా వస్తుంది ? ఏ కొద్దిమందియో అధికారాలు చేజిక్కించుకొని కూర్చుండటంవల్ల కాదు; అట్టి అధికారాలు దుర్వినియోగం చేయబడినప్పుడు దానిని ఎదిరించటానికి యావన్మంది ప్రజలు శక్తి సంపాదించుకొన్న నాడే నిజమైన స్వరాజ్యం మనకు వస్తుంది. ఈ సంగతి నేను ప్రత్యక్షంగా ఋజువు చేయాలని ఆశించుచున్నాను. దీనినే ఇంకొక విధమైన మాటలతో చెబుతున్నాను: ప్రభుత్వాధికారమును నియమించి నడిపించగల శక్తి తమ కున్నదని ప్రజానీకానికి ప్రబోధం కలిగించిననాడే నిజమైన స్వరాజ్యం వస్తుంది.

(యంగ్ ఇండియా - 29-1-1925)

'రాజకీయ స్వాతంత్ర్యం' అంటే నా అర్థం బ్రిటిష్ పార్లమెంటరీ పద్ధతిని అనుకరించటం కాదు; రష్యావారి సోవియట్ పద్ధతిని కాపీ చెయ్యడం కాదు; ఇటలీవారి "ఫాసిస్టు" ధోరణిని, జర్మనీవారి "నాజీ" విధానాన్ని కాపీ చెయ్యడమున్నూ కాదు; వారి ప్రకృతికి అవి సరిపోతేసరిపోయియుండును కాక; మన ప్రకృతికి సరిపడినవి మనకు కావాలి. అదెట్లా

ఉంటుందంటే, నేను ఎక్కువగ వర్ణించజాలను. అది 'రామ రాజ్యం' అని వర్ణించి యున్నాను. కేవలం నీతిబలం మీద ఆధారపడియుండే ప్రజాస్వామ్యాధికారం అన్నమాట.

( హరిజన్ : 2-1-1937 )

# 7

## అల్ప సంఖ్యాకుల హక్కులు.

"మెజారిటీ రూల్" సాగాలనడం కేవలం స్వల్ప విషయాలకే - అల్పమైన తప్పిదాలకే - వర్తిస్తుంది కాని, ముఖ్య సిద్ధాంతాలకు కాదు; ఇట్టి స్వల్పవిషయాలలో — ముఖ్య సిద్ధాంతములతో సంబంధంలేని వాటిలో - ప్రతివారు మెజారిటీకి తల ఒగ్గవలసిందే కాని, సమస్తవిషయాలలో - మెజారిటీ తీర్మానం బాగుగా ఉన్నా, ఓగుగా ఉన్నా సరే - దానికి తల ఒగ్గాలనడం కేవలం బానిసత్వమే అవుతుంది. ప్రజారాజ్యమంటే గొర్రెలమందరాజ్యం కాదు. ప్రజా రాజ్యంలో వ్యక్తుల యొక్క భావస్వాతంత్ర్యం, క్రియా స్వాతంత్ర్యం, బహుజాగరూకతతో, - అప్రమత్తతతో - కాపాడబడుతుంది. కనుక కాంగ్రెస్‌లో మైనారిటీలో ఉన్న వారికి మెజారిటీలో ఉన్న వారికంటె భిన్నముగా ప్రవర్తించడానికి స్పష్టమైన హక్కు కలదని నా విశ్వాసం. అయితే ఆ మైనారిటీ వారు కాంగ్రెస్ పేరుతో వర్తించడం మాత్రం కూడదు.

( యంగ్ ఇండియా—2-3-1922 )

మనస్సాక్షికి సంబంధించిన విషయాలలో మెజారిటీ రూల్ వర్తించనేరదు.

(యంగ్ ఇండియా – 4-8-1920)

# 8

## వోటు హక్కు.

ఇరవై ఒక్క సంవత్సరముల వయస్సు కలిగినవాళ్ళ కందరకు – ఇంకా పద్దెనిమిదేండ్ల వాళ్ళకుకూడ స్త్రీ–పురుషుల కందరికి వోటు ఉండాలని గాంధిగారు నిక్కచ్చిగా ప్రమాణం చేశారు. తనబోటి ముసలివాళ్ళను మినహాయించవచ్చునన్నారు. వోటర్లుగ వారివల్ల ఏమీ ప్రయోజనం లేదని గాంధిగారంటారు. చావుకు సిద్ధంగా ఉన్న వాళ్ళకు ఇండియా యెందుకు! అసలు ఈలోకం ఎందుకు! వారికి కావలసింది ఈ లోకంనుంచి దాటిపోవడమే. పడుచు వాళ్ళది ఈ బ్రతుకంతా. కనుక 18ఏండ్లకు లోబడిన వారిని మినహాయించినట్లే, ముసలాళ్ళనుకూడ (అంటే యాభై యేండ్లు దాటిన వాళ్ళనందాము) – మినహాయిస్తే మంచిదని గాంధిగారి అభిప్రాయం.

ఇట్టి వయోజన వోటింగు అధికారంతోపాటు — ఇంకా దానికి ముందుగానే – అందరికి విద్య ఉండాలి అంటే కేవలం అక్షరజ్ఞానం మాత్రమే కాదు; అక్షరాస్యత అనేది ఉంటే ఏదో సహాయానికి ఉంటే ఉండుగాక. పుష్టివంతమైన

భాషలద్వారా తగినంత విజ్ఞానం ప్రజలకు యివ్వాలని వారి సంకల్పం. ఈ విజ్ఞానం ఏ దేశానికైనాసరే, గర్వకారణమైనదిగ ఉండాలి. ప్రజలు నిజాయితీపరులై, ఆసక్తి కలిగియుంటే పౌర సత్వ హక్కులకు సంబంధించిన విజ్ఞానం వారు సంపాదించు కొనడానికి ఎంతో కాలం పట్టదు.

# 9

## ప్రాంతీయాభిమానము

అన్ని ప్రాంతాలవారు మొత్తం యావత్తు ఇండియాకు సంబంధించినవారే యావత్తుఇండియా అన్నిప్రాంతాలవారికీసంబంధించినదే. అయితేఒకటేమరతు:-ఒకప్రాంతం వారు ఇంకొకప్రాంతంవారి సంపదను దోచుకోడానికిగాని, వారిపై అధికారం చలాయించడానికిగాని, వారిప్రయోజనాలనుఏవిధంగానైనాసరే భంగపుచ్చడానికిగాని పరాయిప్రాంతాలకుపోయి తిష్టవేసుకొనికూర్చుండరాదు. అందరు భారత మాతకు సేవకులే-అందరూ ఆ సేవాభావముతోనే బ్రతకాలి.

(హరిజన్: 7-9-1947)

బీహార్ ప్రాంతస్థుడుకానివాడు బీహార్‌లో ఉండదలచుకుంటే, ఆ ప్రాంతానికి ఉపకారంచేయడానికే ఉండాలి కాని, దానిని దోచుకోడానికికాదు.

ఇక, ఉద్యోగాలలో ఉండేవారి మాటఏమిటి? సర్వతోముఖంగా అన్నిప్రాంతాలు సమానంగా వృద్ధిపొందాలంటే

చాలావరకు ఆయాప్రాంతస్థులకే అక్కడి ఉద్యోగా లివ్వాలి. ఇది మొత్తం ఇండియాకు శ్రేయస్కరము.

ఒకప్రాంతంవారు వచ్చి, ఇంకొక ప్రాంతంలో స్థిరపడిపోయినవారి మాటఏమిటి? వారు ఆ ప్రాంతంలో ఏదో పరదేశస్థులన్నట్లుగ కేటాయింపుగ వలసలు ఏర్పరుచుకొని ఉండరాదు. "రోమ్ దేశములో ఉన్నప్పుడు, నీవు రోమ్ దేశస్థులవలెనే ప్రవర్తించుము" అన్న మాటెంత మంచిదే. ఇది సామాన్యబుద్ధికికూడ తోచునదే. అయితే, రోమన్ దేశస్థుల దుర్గుణాలనుమాత్రం అలవరచుకో కూడదు. ఆ యాప్రాంతాలలోనున్న చెడును విసర్జించి, మంచిని స్వీకరించడమే శ్రేయస్కరమార్గము. భరతఖండము అఖండ భారతంగా క్రమేపి విలీనమైపోవడం ఈ మార్గాననేజరగాలి. నేను గుజరాతీని; నేను బెంగాలులో ఉండదలచితే, బెంగాలులో మంచిదిగా ఉన్న యావత్తును నేను సత్వరమే నాదిగా చేసుకోవాలి; అక్కడచెడ్డగా ఉన్నదానిని తాకనైనా తాకరాదు. నేను సదా బెంగాలుకు సేవయే చేయుచుండవలెనుగాని, స్వార్థపరుడనై దాని సంపదలను హరింపజూడరాదు. నేడు మనకు దాపరించిన పీడంతా కేవలం సంకుచితమైన ప్రాంతీయాభిమానమే. నా ప్రాంతమనే భావన యావత్ భారత దేశపుటంచులవరకు విస్తృతిచెందినదై యుండాలి. పోనుపోను తుదకు, యావత్ భూగోళపుటంచులవరకు వ్యాప్తిచెందునదై యుండాలి ఇట్లుకానిచో, నా ప్రాంతమే నాశనమైపోతుంది. (హరిజన్ 21-9-1947)

# 10

## ప్రభుత్వం మతాతీతమైనదిగ ఉండాలి

ప్రభుత్వం మతాతీతమైనదిగా ఉండాలి. దీనికి సందియ మెంత మాత్రములేదు. తాను ఈ భూభాగమునకు సంబంధించిన సామాన్య శాసనముల కన్నింటికి విధేయుడై వర్తించునంతకాలము ప్రతిపౌరుడు ఎవరివల్లకాని ఎట్టినిర్బంధముకాని నిరోధము కాని లేకుండ, స్వేచ్ఛగ తన మతానుసారం తనజీవితాన్ని నడుపుకొనడానికి సంపూర్ణహక్కు కలిగిఉండాలి. (హరిజన్. 24-8-1947)

## B. పరదేశములతో సంబంధము.

# 1

## బ్రిటన్‌తో భాగస్వామ్యము

బ్రిటన్‌తో సమానభాగస్వామినై, ఆ దేశపుసుఖ దుఃఖాలలో సమానముగ పాల్గొంటూ బ్రతకాలని నాకు ఇష్టము. అయితే, ఈ భాగస్వామ్యమనేది ఉభయులకు సరి సమానప్రతిపత్తిమీదనే నిలిచిఉండాలి. అంతే.

ప్రశ్న:— ఇండియా తన భాగ్యభోగ్యాలను అవినాభావ సంబధంగా ఏకంగా ఇంగ్లండుతో కలియబోసుకుంటుందా ?

జవాబు:— ఓ, తప్పక; ఇండియా సమాన భాగస్వామిగా ఉన్నంతవరకే ఈ కలియబోసుకోవడం ఉంటుంది. కాని, ఈ భాగస్వామ్య మనేది 'బ్రహ్మాండమైన ఒకరాక్షసికి, చిన్న

పనికూనకు మధ్య ఉండే భాగస్వామ్యమువా' అవి గుర్తించిన నాడు, ఇండియా ఈ భాగస్వామ్యమును తప్పక విడగొట్టు కుంటుంది. లేదా, ఈ భాగస్వామ్యము ప్రపంచంలోని ఇతర దేశాలను దోచుకోడానికే ఉపయోగ పరుపబడిన నాడు కూడ, ఇండియా ఈ భాగస్వామ్యాన్ని తక్షణమే విడగొట్టుకుంటుంది. ఇంతకు పరిపూర్ణ లక్ష్యము ప్రపంచం లోని అన్ని దేశముల సముష్టి క్షేమమే తప్ప, ఇతరము కాదు. అది జరుగకపోతే, ఎప్పుడుగాని ప్రతి దేశమూ ఒంటరిగా ఉండిపోవడానికే ఒప్పుకుని ఉంటారు కాని తొందరపడి ఏదో అసహజమైన భాగస్వామ్యమును అతుకులబొంతగ కుదుర్చుకొనను. (యంగ్ ఇండియా. 12-11-1931)

భాగస్వామ్యమంటే, ఇంగ్లండు ఇండియాను దోచు కోవడం ఆగిపోవాలన్నమాట. దోపిడీ విధానాన్ని ఇంగ్లండు మానివేయకపోతే, ఇండియా ఇంగ్లండుతో పూర్తి తెగ తెంపులు చేసుకుంటుంది.

అయితే, దక్షిణాఫ్రికా వలసలమాట ఏమిటి? మనము ఇంగ్లండుతో భాగస్వామ్యమును కుదుర్చుకోవడానికి ముందుమర తుగ బ్రిటిష్ వారి వలసలతోటి సంబంధంలో మార్పు చేసు కోవాలని నేను నిశ్చయించివేయను. అయితే, ఈ దక్షిణాఫ్రికా జాతుల విముక్తికై నేను తప్పక పనిచేయవలసి ఉంటుంది. వీరందరు యూరపియన్ రాజ్యాల కాళ్ళక్రిందపడి నలిగి పోతున్నారు. ఈ సంగతి నాకు స్వానుభవంవల్ల తెలుసు.

* మనవిముక్తి వారి విముక్తి కాగలదు. కాని ఇదిజరుగకపోతే. బ్రిటన్‌తోటిపొత్తు ఉండాలనడంలో నాకేమీ ఇష్టముండజాలదు: అది ఇండియాకు లాభమైనాసరే. దోపిడీ విధానమునుండి ప్రపంచజాతులకు విముక్తి కలిగించేపద్ధతితో--అట్లువిముక్తి కలిగిస్తామనిమనముమాటయిమ్మిచ్చేపద్ధతితో-ఇంగ్లండుతో పొత్తుకలిగియుండడం నాకు ఇష్టము. ఇట్టిది మన ఇండియాకు గర్వకారణమైన గొప్పగ ఉండగలదని నా ఉద్దేశ్యము. అట్టి పొత్తును నేను సదా నిలుపుకుంటాను. అంతేకాని, దోపిడీ విధానానికి ఎప్పుడు కాని ఏరూపంలో కాని ఇండియా కట్టుబడజాలదు.

( యంగ్ ఇండియా 19-11-1931)

# 2

## తదితర దేశాలతోటి సంబంధాలు.

నా దేశాభిమానము సంకుచితమైనదికాదు. అది పరదేశాలకు హానిచేసేదికాదు, పైగా. ప్రపంచంలోని అన్ని దేశాలకు నిజమైన మేలుచేసేదే. నామనస్సులో ఉన్న స్వతంత్రభారతము లోకానికి పీడాకరంగా ఎన్నటికీ ఉండజాలదు. (యంగ్ ఇండియా, 3-4-1924)

ఇండియా స్వాతంత్ర్యముతోను, బలముతోను విరాజిల్లుచుండగా చూడాలని నాకోరిక. ఎందుకీ బలము?

---

( స్వయంతీర్ణ, పరాన్ తారమతి. )

ఈ స్వాతంత్ర్యము లోకశ్రేయస్సునిమిత్తమై తనను తాను ఇచ్ఛాపూర్వకంగా. ఉత్తమమైన బలిదానముగా, సమర్పించుకోగలగాలి. వ్యక్తి సమష్టికై తనకుటుంబమునిమిత్తమై బలికావాలి; కుటుంబము గ్రామమునిమిత్తమై బలికావాలి; గ్రామము జిల్లానిమిత్తమై, జిల్లా రాష్ట్రము నిమిత్తమై, రాష్ట్రము యావద్భారతమునిమిత్తమై, భారతము యావద్విశ్వమునిమిత్తమై, బలియగుటకు సిద్ధపడాలి

(యంగ్ ఇండియా: 17-9-1925)

పూర్ణస్వరాజ్యమంటే నా ఉద్దేశ్యం "నన్నుముట్టుకొనకు నామాలకాకి" అని కేటాయింపుగ ఉండిపోయే స్వరాజ్యం కాదు. ఇతర దేశాలతో, గౌరవప్రదముగ, కల్మష రహితంగా ఉండే పరస్పరాశ్రయమే (నాఉద్దేశ్యంలో) పూర్ణ స్వరాజ్యం అవుతుంది.

(యంగ్ ఇండియా: 26-3-1931)

స్వరాజ్యం ద్వారా మనము యావత్ప్రపంచానికి సేవ చేయగలుగుతాము, చేస్తాము.

(యంగ్ ఇండియా: 16-4-1931)

బాధగువారికి సేవచేయడంలో మనకు ఈ దేశము ఆ దేశము అనే సరిహద్దులు, పొలిమేరలు లేవు. ఈ గీతలు, ఈపొలిమేరలు భగవంతుడేర్పరచినవికావు, మనిషేఏర్పరుచు

కున్నాడు. పనులను సేవ చేయడంలో ఈ గీతలను, ఈసీమలను అంతులేకుండా దాటిపోతాము మనము.

(యంగ్ ఇండియా: 31-12-1931)

# 3

## శాంతికై అంతర్జాతీయసంస్థ.

అంతర్జాతీయసంస్థ అనేది అందున్న జాతులన్నీ, చిన్నవి కాని, పెద్దవి కాని, పూర్తిగ స్వతంత్రములయినప్పుడే ఏర్పడ గలదు. ఏ జాతి కాని అహింసను ఎంతవరకు జీర్ణంచేసుకొని అవలంబిస్తుందో, దాన్నిబట్టి ఆ జాతియొక్క స్వాతంత్ర్య లక్షణము. దాని నిజస్వభావము నిర్ణయమవుతుంది. అయితే ఒక్కసంగతిమాత్రము స్పష్టము. అహింసయను పునాది మీద నిలిచియున్న సంస్థలో అతిచిన్న దేశంకూడ అతిపెద్ద దేశంతో సమానురాలనని భావించుకోగలుగుతుంది. ఒకటి గొప్పది, ఒకటి చిన్నది అనే భావమే పూర్తిగా మాసిపోతుంది. (హరిజన్: 11-2-1939)

ప్రశ్న:—ప్రపంచం ఎన్నటికైనా (వివిధదేశాలప్రతినిధులతోకూడిన) ఏకైక ప్రభుత్వంక్రిందికి రాగలుగుతుందని మీరు భవిష్యత్తులో వారు చూడగలరా?

జవాబు:—ప్రపంచం నిలవాలంటే, అదొక్కటే ఉపాయం, (అదొక్కటే మరతు) (హరిజన్: 8-6-1947)

# సర్వోదయము

## ఆరవభాగము

( చెడును ఎదురించు శైల్లు )

---

### అ సత్యాగ్రహ మార్గము

### 1

### — ప్రేమపాత్ర —

నేను కత్తిని ఆవలపారవేశాను. కనుక, నన్ను ఎదురించువారి చేతికి ఏమి యివ్వగలను ప్రేమపాత్రతప్ప? ఈ ప్రేమపాత్రి నర్పించుటద్వారానే, నేను వారిని నాదగ్గరకు చేర్చుకో జూడగలను.

( యంగ్ ఇండియా - 2-4-1931 )

నా గమ్యము యావత్ప్రపంచముతో మిత్రత్వమే కనుక, దుష్టత్వమునకు మారొడ్డి తీవ్రప్రతిఘటనతోపాటు, మహోదారమైన ప్రేమకూడ నేను * జోడించగలను.

( యంగ్ ఇండియా : 10-3-1920 )

“దుష్టత్వమును ఎదిరించడం ఎందుకులే.” అని తప్పించుకొని పారిపోవడంకాదు నా అహింస. దుష్టత్వాన్ని

* హాలాహలంతోపాటు, అమృతమునుకూడ జోడించి వర్షింపగలను.

నిజంగా ఎదిరించి, తీవ్రంగాపోరాడేదే నా అహింస. దెబ్బకు దెబ్బ కొట్టడం కాదు నాఅహింస. దుష్టత్వము నీ రీతిగా దుష్టత్వంతో ఎదిరించడంవల్ల వచ్చే సహజపరిణామము ఆ దుష్టత్వము మరింత హెచ్చడమే. కనుక, దుష్టత్వాన్ని నైతికంగా ఎదిరించడం నా తలంపు. ఇది మానసికమైన ప్రతిఘటన. దుష్టుని కత్తివాడిని పూర్తిగ మొక్కపోగొట్టడం నా సంకల్పం - ఎట్లా? వాని కత్తికంటె ఎక్కువ పదునైన కత్తితో కొట్టడం వల్ల నా? కాదు. వాని ఆశను నిరాశ చేయడం మూలంగా! అంటే? నేను వానికత్తిని మరల నా ఉక్కుకత్తితోకొట్టుతాననిఆతడుఆశిస్తాడు అట్టిఆశను నేను వమ్ముచేస్తాను. నేను ఎదురొడ్డేకత్తి మామూలు ఉక్కు కత్తికాదు; 'ఆత్మశక్తి' అనే కత్తిని నేను వానికి ఎదురొడ్డుతాను. దాంతో వాడు దంగైపోతాడు. ఏమిచెయ్యాలో తెలియక నిర్ఘాంతపోతాడు; మొదట నిర్ఘాంతపోయినవాడల్లా నెమ్మదిగ తెప్పిరిల్లి, తుదకు నాశక్తిని గుర్తిస్తాడు. ఈ గుర్తింపు అతనిని హీనపరచదు; పైగా, ఆతనిని మహోన్నతునిగ లేవనెత్తుతుంది.

(యంగ్ ఇండియా : 8-10-1925)

## 2

### — సత్యాగ్రహము —

సత్యాగ్రహ మనేదానిలో ఎదుటివానికి హాని చెయ్యాలనే భావము ఏకోశానా ఉండదు. తాను బాధ

పడియే ఎదుటివానిని జయించాలని "సత్యాగ్రహము" చెబుతుంది.

( 1928 సం॥ జనేవరి 13-15 తేదీలలో సబర్మతిలో జరిగిన 'అంతర్జాతీయ మిత్రసంఘ' సమావేశ నివేదిక పేజీ 179 నుండి )

క్రోధములేకుండ, కాలుష్యములేకుండ, ఒకడు అనుభవించే బాధ అనే ఉదయభానుని ముందు ఎంతటి పాషాణహృదయమైనా కరిగి నీరై పోతుంది; ఎంతటి దట్టమైన అజ్ఞానాంధకారమైనా పటాపంచలై పోతుంది.

( యంగు ఇండియా : 19-2-1925 )

అహింస యనునది బుద్ధిపూర్వకముగ బాధననుభవించుటగా దాని తీవ్రస్ఫురితగతిలో వ్యక్తమవుతుంది. దుష్టుని ఇచ్ఛకు నోరుమూసుకొని లొంగిపోవడం కాదు 'అహింస' అంటే. తన యావదాత్మశక్తిని దుష్టుని ఇచ్ఛకు మారొడ్డి ఎదిరించడమే 'అహింస'. ఇట్టి జీవితసూత్రాను సారముగ వర్తించేయెడల, ఒకే ఒకవ్యక్తి అధర్మసామ్రాజ్యముయొక్క బ్రహ్మాండమైన యావద్బలమును నిరాఘాటముగ ఎదిరించగలడు. ఎదిరించి తన గౌరవమును, తన మతమును, తన ఆత్మను సంరక్షించుకొనగలడు; మరియు, అట్టి దుష్ట సామ్రాజ్యమును పతన మొదించగలడు; లేక, పునీతమొనర్పగలడు.

యంగ్ ఇండియా 11-8-1920

సత్యాగ్రహియొక్క ధర్మము సుస్పష్టమే. నలుముఖముల తననుచుట్టి చకామకా, ఇటునటూ, వీచుచున్న వివిధ తరంగములమధ్య ఆతడు చలింపక స్థాణువువలె నిలువవలెను. అంధ పురాణాంప్రదాయములజూచి ఆతడు సహనమును కోల్పోవరాదు. అణిచిపెట్టబడిన జనుల అవిశ్వాసమును చూచి, చికాకుపడరాదు గడ్డగట్టిరాయియైపోయిన మత్తోన్మాదియొక్క ఘోరపాషాణహృదయముసైతము సత్యాగ్రహి బుద్ధిపూర్వకముగ పడుచున్న బాధనుచూచి కరిగితీరుతుంది అని సత్యాగ్రహి యెరుంగవలెను. 'ఇక ఆశలేదు, అంతాఅయిపోయింది' అని ఘోరనిరాశ, నిస్పృహకలిగిన చరమస్థితిలోనే మనకు కష్టనివారణ ప్రత్యక్షమవుతుంది. ఎందుకంటె, భగవంతుడు "క్రూరదయామయుడని" చెప్పాలి. అది భగవంతుని లక్షణము. భగవంతుడు క్రూరుడు దయామయుడుకూడ. భగవంతుడు తనభక్తుని మున్ముందుగ తీవ్రమైన, క్రూరమైన అగ్నికొలిమిలోపడేసి పరీక్షచేస్తాడు. అతని గర్వమును, అహంకారమును దుమ్ముదుమ్ముచేస్తాడు ఇది భగవంతునకు ఆట, లీల, సంతోషం: ఈ అగ్నికొలిమినుండి తదుపరి లేవనెత్తి తన దయామృతమును భక్తునిపై వర్షిస్తాడు. ఇట్టిది సుమా భగవల్లీల! (యంగ్ ఇండియా : 4-6-1925)

# 3

## : పిరికితనానికి చోటులేదు :

నా 'అహింస' శక్తివంతమై,సదా నిర్నిద్రముగా స్పందించునదేకాని, స్తబ్ధమైనదికాదు. అదియొక మహాశక్తి,

పిరికితనానికి, దౌర్బల్యానికి దానిలో యెక్కడా తావులేదు. హింసాపరుడు ఎన్నడైనా అహింసామార్గానికే వచ్చే ఆశ యున్నది; కాని, పిరికివానికి అదిలేదు. కనుక, నేను ఈ పత్రికలో అనేకసార్లు వ్రాసిందే ఇక్కడ మరల చెప్తు చున్నాను; ఏమంటే, కష్టసహిష్ణుతద్వారా, అనగ, 'అహింస' ద్వారా మనము మనలను, మన స్త్రీలను, మన దేవాలయములను సంరక్షించుకోవడం, ఎలాగో తెలుసుకోలేకపోతే మనము పౌరుషవంతులమే అయితే కనీసము పోరాటము ద్వారానైనాసరే మనము పీటిని రక్షించుకోగలిగి ఉండాలి)

( యంగ్ ఇండియా : 16-6-1927

సంరక్షణకు రెండుమార్గాలున్నవి. వానిలో ప్రశస్తమైనదీ, మిక్కిలి ఫలవంతమైనదీ యేదంటే, అసలు సంరక్షణకు పూనుకోకుండానే, తన నియమితస్థానములో స్థాణువు వలె నిలుచుని, యెట్టి అపాయమునకైనాసరే తన శరీరాన్ని ఆహుతిగా వదలివేయడం. దీని తరువాత మెరుగైనది-అయినా మొదటిదానితో సమాన గౌరవప్రతిపత్తి యేగలది-ఏదంటే ఆత్మరక్షణకై ఎదుటివానిపై చెయ్యిచేసుకొని దెబ్బతీయడం; అత్యంతము అపాయకరములైన స్థానములలో జంకక తన ప్రాణమును ఎదురొడ్డి నిలవడం.

( యంగ్ ఇండియా : 18-12-1924 )

అహింస, పిరికితనము:, అనేవి రెండూ కలిసి ఒకచోట ఉండలేవు. ఆపాదమస్తకము పైకి కత్తులు కఠారులు ధరించి

యున్న మనిషికి లోపల పిరికిగుండె ఉండవచ్చు. ఇన్ని ఆయుధాలు ధరించి ఉండడం భయానికి ఒక చిహ్నము; పిరికితనానికికూడ చిహ్నముకావచ్చు. కాని, నిజమైన అహింసాపరునకు ఆయుధాలతో పనేలేదు. పిరికితనపు ఛాయ కూడా ఏకోశానా కన్పించని నిశ్చలనిర్భీతిలేనిదే నిజమైన అహింస అసంభవము.

( హరిజన్ : 15–7–1939 )

పిరికితనంగా ప్రవర్తించడమూ, లేక, దౌర్జన్యానికి పూనుకోవడమూ అనే సమస్య వచ్చినప్పుడు, ఈరెండు మార్గాలకుతప్ప ఇతర మార్గాలకు అవకాశంలేనప్పుడు, దౌర్జన్యమే చేయవలసిందని నేను చెబుతాను. ఇండియా పిరికిపందయై తనపై పడు అవమానములను నిస్పృహతో దిక్కుతెలియక సహిస్తూ దేబెవలె చూస్తూ ఉండడంకంటె, తన గౌరవరక్షణకై కత్తిపట్టడమే మేలని నేను చెబుతాను.

కాని, హింసకంటె అహింసయే ఎన్నోరెట్లు ప్రశస్తమైనదని నామతము. శిక్షించుటకంటె క్షమించుట పౌరుష లక్షణము. క్షమాగుణము వీరునికి అలంకారము. అయితే శిక్షింప సమర్థుడైయుండియు, సహించి ఊరుకొన్నప్పుడే అతనిది నిజమైన క్షమాగుణమవుతుంది "(చెల్లియుండియు సైరణ సేయునతడే" క్షమావంతుడు). దుర్బలుడు చేతకాక ఊరుకుండి, "నేను క్షమించానంటే" అది అర్థములేనిమాట. అయితే, ఇండియా చేతకాని అసమర్థురాలని నేనుతలంపను;

నేను సహా అసమర్థుడనని అనుకోను. బలమనేది కండ బలంలోనుంచి రాదు; అజేయమగు ఇచ్ఛాశక్తిద్వారానే అదివస్తుంది.

(యంగ్ ఇండియా: 11-8-1920)

# 4

## ఎవరినీ బలవంతం చేయవద్దు.

అపరాధిని ఇరుకులో పెట్టడం సత్యాగ్రహి ఉద్దేశ్యం యెప్పుడూ కాదు. అతనిలో భయాన్ని కలిగించడం కాదు. ఆతనిహృదయాన్ని ప్రబోధించడమే జరగాలి. సత్యాగ్రహమంటే అదే. సత్యాగ్రహి సంకల్పం అపరాధిని మార్చడమేకాని, ఇరుకునపెట్టి ఇబ్బందిపెట్టడంకాదు. సత్యాగ్రహి తనచేయుపనులలో కృత్రిమత్వం యెంతమాత్రం చోరబడనీయరాదు. ఆతడు స్వాభావసిద్ధంగానే పనిచెయ్యాలి; అంతరంగమందుగల నిజమైన విశ్వాసముతో పనిచెయ్యాలి.

(హరిజన్ : 25-3-1939)

ఏ విషయమును గురించియైనాసరే ఎదుటివాడు ఎలా ఆలోచిస్తాడో, మనముకూడ అలాగే ఆలోచించడం మొదలు పెట్టినతక్షణమే, మన మా యెదుటివాని యెడల పూరా న్యాయముగ ప్రవర్తించగలుగుతాము. (ఆ తగాదావిషయము ను పూర్తిగ అర్థంచేసుకో గలుగుతాము). దీనికి ఎంతో నిర్మమత్వం, నిరహంకారం కావాలని నేననుకుంటున్నాను. ఇట్టి

స్థితిని చేరడం చాలా కష్టంకూడాను. అయినప్పటికీ, సత్యాగ్రహికి ఇది అత్యవసరము. ఎదుటివాని స్థానంలో మనం నిలుచుంటే – వాని దృక్పథమేమో మనము బోధపరుచుకుంటే– ప్రపంచంలో నేడున్న అపోహాలు, యమయాతనలు, ముత్పాతిక ముప్వేసం అదృశ్యమైపోతవి. అప్పుడు మనం మన ఎదుటివానితో సత్వరమే అంగీకరిస్తాము. లేదా, అతనిని గురించి ఔదార్యముతో ఆలోచించగలుగుతాము.

కొన్నికొన్ని భావాలు యుగయుగాలనుండి మానవులను అంటిపెట్టుకొని యున్నప్పుడు, ఆ భావాలు మత ప్రామాణికధర్మములని యెంచబడుచున్నప్పుడు, వాటిని త్రిప్పడానికి కేవలం హేతువాదాలు పనిచేయవని నేనుకనిపెట్టాను. హేతువాదానికి ఉపబలంగా మన బాధాసహిష్ణుతనుకూడా జతచెయ్యాలి. మనలోని ఈ బాధాసహిష్ణుతయే ఎదుటివాని ప్రబోధ నేత్రాన్ని తెరుస్తుంది. కనుక, ఎదుటివానిని బలవంత పెట్టడమనేది ఈషణ్మాత్రముకూడ పనికిరాదు. మనము ఎంతో ఓర్పుగలిగియుండవలెను; చిరాకుపడకూడదు, సమానము కోల్పోకూడదు. మనము అవలంబించుపద్ధతిలో మనకు చెక్కుచెదరని విశ్వాసం ఉండాలి.

(యంగ్ ఇండియా: 19–3–1925)

మన కొక్కటే సూత్రం ఉంది. నెమ్మదిగా ఎదుటివానికి చెప్పి బోధించి, నిరంతరం వాని హృదయానికీ, మేధస్సుకు నచ్చేటట్లుగా మారిపోస్తూఉండడమే మన పని. కనుక,

మనతో ఏకీభవించని ఎదుటి వారియెడల మనమెంతో మర్యాదతో, ఓర్పుతో సదా ప్రవర్తించాలి.

(యంగ్ ఇండియా: 29-9-1921)

సత్యాగ్రహి భయమనేదానికి స్వస్తిచెబుతాడు. కనుక, ఎదుటివానిని నమ్మడానికి తానెన్నడూ భయపడడు. ఎదుటివాడు తనను ఇరవైసార్లు మోసగించినాసరే, మరల ఇరవై ఒకోసారి నమ్మడానికి సత్యాగ్రహి సిద్ధంగా ఉంటాడు. ఎందుకంటే మానవస్వభావముపై తిరుగులేని విశ్వాసం ఉంచడమే సత్యాగ్రహిసిద్ధాంతం యొక్క సారము.

(1923 సం॥ జనవరి, 13 - 15 తేదీలలో సబర్మతీలో జరిగిన అంతర్జాతీయమిత్రసంఘసమావేశ నివేదిక, పేజీ 46 నుండి)

# 5

## సత్యాగ్రహబలము ఎలా పెంపొందుతుంది?

"యద్భావం తద్భవతి", మనము ఎట్లా భావిస్తామో అట్లా అవుతాము. అట్టిది భావనాబలము. మనము సత్యాగ్రహులమై "మనము బలవంతులము" అను భావముతో సత్యాగ్రహముచేస్తే, దానినుండి రెండుసత్ఫలితాలుకలుగుతవి. బలమనేభావనను సదామనస్సున సంస్మరించుచుండుట వల్ల, మనము దినదినము నిజముగ బలవంతులమే అవుతాము.

మనబలము పెరిగినకొలదీ, మనము చేయు సత్యాగ్రహము కూడ అంతకంతకు ఫలవంతమవుతుంది. "అబ్బ, ఇది ఎప్పుడు వదలివేద్దామా" అనే విసుగు మన కెన్నడూ కలుగదు. వదలివేయడానికి ఏదైనా సాకు దొరుకుతుందా అని అటునిటు చూస్తూ ఉండము.

(సబర్మతీ సమావేశనివేదిక: పేజీ :78)

అన్ని ధర్మయుద్ధములలోను క్రమాభివృద్ధిగ విజయముకలుగుతూ ఉంటుంది. స్వానుభవమువల్ల నాకీ సూత్రము గోచరించింది. తత్రాపి, సత్యాగ్రహయుద్ధములలో ఈసూత్రము స్వయంప్రకాశమానముగానే వెలుగొందుచూఉంటుంది. సత్యాగ్రహయుద్ధం సాగిపోతున్నకొద్దీ; ఇంక అనేక ఇతర తేజఃప్రభాతరంగములు వచ్చి దానిలో చేరి ఆ బలప్రవాహమును మరింత ఉప్పొంగచేస్తూ ఉంటవి. అనుకోనని సత్ఫలితములు నిరంతరము కొల్లలుగ వచ్చిపడుతూ ఉంటవి. ఇందులో ఆశ్చర్యములేదు. ఇట్లు కాక మరెట్లుండగలదు? ఇది అనివార్యస్థితి, సత్యాగ్రహ మూలసూత్రములోనే ఇది ఇమిడియున్నది. అసలు సత్యాగ్రహయుద్ధము లోనికి దిగడమనేది ఒకానొక కనీసఫలితము కోరకే సంకల్పింపబడుతుంది. తక్కువలోతక్కువ ఫలితము కోరియే సత్యాగ్రహి యుద్ధంలోకి దిగుతాడు, నిజానికి అతడుకోరే, "తక్కువలోతక్కువ" అనేదానికీ, "ఎక్కువలో ఎక్కువ" అనేదానికి తేడాలేదు. రెండూఒకటే. "తక్కువలో తక్కువ" అన్నప్పుడు మరిదానిని ఇంకాతగ్గించడమనే ప్రసక్తే

లేదు. కనుక, ఈ యుద్ధములో వెనుకకుపోవడమనేదే లేదు. పోతే, ముందుకేపోవడం ఉంటుందికాని, వెనుకకుపోవడమనేది ఉండజాలదు, (ప్రకోగమనమేకాని.తిరోగమనంలేదు). ఇతరరకం యుద్ధాలలో (అవి ధర్మయుద్ధాలేఅగుగాక), అసలు అనుకొన్న కోర్కెలకంటె ఇంకాకొంచెం హెచ్చుగ ప్రకటించడం జరుగుతుంది; పర్యాయితీని తగ్గించే బేరానికి సందు ఉంచుకోడానికై ఇట్టి పెద్దబేరాలు ముందుగ చెబుతారు. ఈకారణంచేత సత్యాగ్రహయుద్ధానికి వర్తించేక్రమవృద్ధి విజయ మనే సూత్రం తదితర రకం యుద్ధాలకు సర్వత్ర (మినహాయింపులేకుండ) వర్తించదు.

( సబర్మతీసంఘ సమావేశ నివేదికనుండి, పేజీ 819 )

## 6

### సత్యాగ్రహ నియమములు.

1. సత్యాగ్రహులలో సామాన్యపు నిజాయితీ నెలకొనియుండాలి,

2. తమ నాయకుని యెడల హృదయపూర్వకమైన విశ్వాసం కలిగి, క్రమశిక్షణకలిగి ఉండాలి. మనస్సులలో ఏవేవో ఇతరభావాలు పెట్టుకొని ఉండరాదు.

3. సర్వంపోగొట్టుకోడానికి సత్యాగ్రహులు సదా సంసిద్ధులుగా ఉండాలి, తమ దేహస్వాతంత్ర్యమే కాదు, తమ ఇల్లువాకళ్ళేకాదు, భూమి, ధనం, వగైరాలే కాదు; తమ

కుటుంబీకుల స్వాతంత్ర్యమును సంపదలనుకూడ పోగొట్టుకో డానికి సిద్ధపడాలి. తుపాకిగుండ్లను, తుపాకిమడమపోట్లను, సహించాలి ఇంకా, చిత్రవధలవల్ల క్షణక్షణయాతనలుపడి ప్రాణాలుకోల్పోవడానికిసైతము తయారుగా ఉండాలి.

4. మనస్సులోకాని, వాక్కులోకాని, క్రియలోకాని 'శత్రువు' అనే వానియెడకాని, తమలో ఒకరియెడమరొకరు కాని, సత్యాగ్రహులు హింస తలంపరాదు.

( హరిజన్ : 28–10–1938

## 7

### నమ్రత

నమ్రత అనేది లేకపోతే, అతడు సత్యాగ్రహి కానే కాడు. నీచ బుద్ధితోనో, ఏదో మతమనే సాకుతోనో, ఏదో శాస్త్ర త్యాగంచేస్తే, (నమ్రత అనేది ఉంటే) తను చేసిన త్యాగం ఎంత అల్పమో సత్యాగ్రహికి త్వరలోనే తెలిసిపోతుంది. త్యాగపథంలో మనము ప్రయాణంసాగిం చడం మొదలుపెట్టితే మన మెంత స్వార్థబుద్ధులమో క్రమేపి మనకే తెలుస్తుంది. అప్పుడు ఇంకా ఇంకా ఎక్కువగ త్యాగం చేయడానికి పూనుకుంటాము. పోగాపోగా తుదకు, మనకుగల సర్వస్వం అర్పించివేసేదాకా మనకు నిద్రపట్టదు.

( యంగ్ ఇండియా, 29–9–1931 )

# 8

## ఉ ప వా స ము లు

ఆమరణాంతఉపవాసం (ప్రాయోపవేశం) అనేది సత్యాగ్రహ కార్యక్రమంలో విడరానిభాగం కొన్నికొన్నిపరిస్థితులలో అతి అత్యంతము పటిష్టమైన ఆయుధము. తగినశిక్షణ లేనిది ఎవడుపడితేవాడు ఈ ఆయుధాన్ని ఉపయోగించడానికి వీలులేదు.

ఇట్టి ఉపవాసం ఏట్టిపరిస్థితులలో చేయవచ్చునో, దానికి ఏమేమిశిక్షణకావాలో, ఆ వివరములతో ఈ వ్యాసమును నే నిప్పుడు నింపదలచలేదు. "అహింస" అంటే 'హింస కాదు' అని చెప్పడమే అవుతున్నది. ఏది "కాదో" దానినే చెబుతున్నది పదము. దానికంటె ఏది "అవునో" దానిని చెప్పడం అవసరముకదా కనుక, అహింస అంటే 'శ్రేయస్సు చేకూర్చడం' అని చెబుతాను. 'ప్రేమ' అనే పదాన్ని ఉపయోగించను ఎందుకంటె, ఆ పదానికిప్పుడు చెడ్డపేరువచ్చిందికదా. పరశ్రేయస్సు దృష్టిలోచూస్తే అహింస అనేది మహా పటిష్టమైన శక్తి ఎందుకంటె తనకు అపకారంచేసిన యెదుటివానికి శారీరకముగగాని, మరొకవిధముగగాని హాని చేయకుండ, హాని తలపెట్టనైనా తలపెట్టకుండ సత్యాగ్రహి తానే బాధపడడానికి అంతులేని అవకాశాన్ని అతనికి అహింసాశక్తి యిస్తుంది. కనుకనే అది మహా పటిష్టమైన శక్తి అని చెబుతున్నాను. సత్యాగ్రహి సంకల్పం

సదా ఏమంటే, ఎదుటివానిలోనున్న అత్యుత్తమ ప్రకృతిని మేల్కొల్పడమే. దెబ్బకు దెబ్బకొట్టడమనేది ఎదుటివానిలోని నికృష్ట ప్రకృతిని లేవగొట్టినట్లే. సత్యాగ్రహి స్వయంగా తానే బాధపడడమనేది ఎదుటివానిలోని అత్యుత్తమ ప్రకృతిని లేవగొట్టుతుంది. సక్రమమైన పరిస్థితులలో ఉపవాసం అనేది అమోఘమైన ప్రబోధాస్త్రము. రాజకీయ వ్యవహారాలలో ఈ అస్త్రమును ప్రవేశపెట్టడంలోగల ఔచిత్యమును రాజకీయవేత్తలు గ్రహించడంలేదంటే ఇట్టి సున్నితమైన అస్త్రప్రయోగవిధానము వారికి క్రొత్తదిగ కనిపించుచున్నది కనుకనే.

(హారిజన్ : 26-7-1942)

ఉపవాస మనేది అహింసాపథానువర్తికి గల ఆయుధాగారములో ఆఖరు ఆయుధం. మానవుని స్వయంప్రజ్ఞ పని చేయజాలనప్పుడు అహింసాపరుడు ఉపవాసం చేస్తాడు. ఈ ఉపవాసం అతనిని ప్రార్థనోన్ముఖునిగా చేస్తుంది. అంటే, ఉపవాసమనేది ఆధ్యాత్మిక ప్రక్రియ. అందుకనే ఉపవాసి తన ప్రార్థన భగవంతునిగూర్చి చేస్తాడు. * తన మనస్సును భగవంతుని చెంతకు చేరుస్తాడు. ఇట్టి ఉపవాసంవలన ఇతర ప్రజలమీాద కలిగే ప్రభావ మేమిటి? అసలు "ఈ ఉపవాసం చేస్తున్న మనిషి ఇట్టివా"డని ఆ ప్రజలకు తెలిసినవాడై

* ఉప=సమీాపమందు (భగవంతుని సమీాపమునందు) వాసః=ఉండుట. కనుక, ఉపవాసమనగ మనస్సును భగవంతుని సమీాపమునకు, భగవంతుని చెంతకు చేర్చుట అని శబ్దార్థము.

యుంటే, అప్పుడు వారిలో నిద్రించుచున్న ఆత్మస్ఫూరణ మేల్కొంటుంది. అయితే, దీనిలో ఒక అపాయంకూడ ఉంది. తమకు ఇష్టుడై ప్రియుడైన మనిషి "అయ్యో, చచ్చిపోతాడే" అని పొరపాటుజాలిచేత ఆతని ప్రాణాన్ని కాపాడాలనే ఉద్దేశ్యంతో ప్రజలు తమయిచ్ఛకు వ్యతిరేకంగా నడవడమనే ప్రమాదం దీనిలో ఉంది. కాని ఏం చేస్తాము? ఇది సహించవలసిందే. తాను చేసేపని సరియైనదని తనకు నిశ్చయమైనప్పుడు ఎవరుకాని అట్టి సరియైన పని చేయడానికి వెనుకాడకూడదు. నలుముఖముల పరిస్థితుల నన్నిటిని బహు జాగరూకతతో పారజూచి మరీ ఉపవాసమునకు పూనుకొనవలసి ఉంటుందనిమాత్రం పైన పేర్కొన్న అపాయం సత్యాగ్రహిని హెచ్చరిస్తుంది. అంతే. అంతరాత్మ ప్రేరణకు విధేయుడై మాత్రమే సత్యాగ్రహి ఇట్టిఉపవాసదీక్ష పూనుతాడు. కనుక అది తొందరపాటు కలుగనీయదు.

(హరిజన్ : 21-12-1947)

# 9

## గుమ్మానికి అడ్డంగా పడుకోవడం

ఇదొక పురాతన పద్ధతి. ఇది రాక్షసిపని. దీనిని ఇటీవల కొందరు విద్యార్థులు అవలంబించడం సాగించారు. ఇది "రాక్షసిపని" అని ఎందుకంటున్నానంటే ఎదుటివానిని బలాత్కరించడానికి ఉపయోగించే మోటతనం ఇది. ఇది పిరికితనంకూడాను. ఎందుకంటే, "గుమ్మంలోఅడ్డంగా పడుకున్న

మనిషి మీదుగ గృహస్థు తొక్కుకుంటూ పోదుగా" అనే కిటుకు వానికి తెలుసు. ఈ పని దౌర్జన్యపు పని అవలేము కాని, అంతకంటె నీచమైనదని మాత్రం నిశ్చయంగా చెప్ప వచ్చు. ఎదుటివానితో దెబ్బలాడబూనినప్పుడు తిరిగి వాడు మనను దెబ్బకొట్టడానికి వాడికి మనం కనీసం అవకాశాన్నైనా ఇచ్చినవాళ్ళ మవుతున్నాము. ఇక గుమ్మానికి అడ్డంగా పడుకోవడంలో అర్థ మేమిటి? "వాడు మనను తొక్కుకుంటూ వెళ్ళతు" అని నిశ్చయంగా మనసులో యెరిగివుండి "నన్ను తొక్కుకుపో" అన్నట్లు పడుకోవడం ఏమి పౌరుషము? ఆ గృహస్థుని ఇరుకున బెట్టి, అవమాన పరచడమే కాదా? ఇది వంకరమార్గం. ఈ విద్యార్థులు ఏదో మితిమీరిన ఉత్సాహంతోనే ఈ పని చేశారని నే నెరుగుదును. అదెంత క్రూరమైన పద్ధతియో, వారు ఈ ఉత్సాహంలో తెలిసికొనలేక పోయినారు. ఆలోచించలేకపోయినారు. ఆత్మ ప్రేరణకు విధేయుడై నడిచే మనిషి, భీషణ పరిస్థితులమధ్య ఏకైక వ్యక్తిగ నిలబడేశూరుడు, ఇట్లు ఆలోచనారహితముగ ప్రవర్తింప కూడదు కనుక, నాన్-కో-ఆపరేషన్ (అసహాయోగం అవలంబించేవారు తాము చేయు ప్రతి చిన్నపనిని బహు జాగరూకతతో ఆలోచించి చేయవలసి యుందురని హెచ్చరించుచున్నాను. అసహాసం ఉండరాదు. మోటుతనం ఉండరాదు. పొగరుబోతుతనం పనికిరాదు. అనవసరంగా వత్తిడి పెట్టగూడదు.

(యంగ్ ఇండియా : 2-2-1921)

# 1[illegible]

## బలవంతం వద్దు - అసహనం కూడదు.

మన యిచ్ఛను ఇతరులమీద రుద్దితే, ఈ మన పీడ కొద్దిమంది ఇంగ్లీషు అధికారులు చేసే పీడకంటె యెన్నో రెట్లు ఘోరంగా దుర్భరంగా ఉంటుంది. ఇంగ్లీషువారు చేసే భీభత్సము కేవలం బహుసంఖ్యాకులగు విరోధులమధ్య బ్రతకటానికి తన్నుకులాడే ఏ కొలదిమందియో చేసే భీభత్సము మాత్రమే. ఇక, మనం చేసే భీభత్సం, కలిగించే పీడ, బహుసంఖ్యాకులు చేసేది. కనుక, దానికిక తిరుగు ఉండదు. అది ఇంగ్లీషువారు చేసే పీడకంటె బహు ఘోరంగా ఉంటుంది. నిజంగా రాక్షసత్వమే అవుతుంది. కనుక, బలవంతమనేది ఏ రూపంలో కాని, మన పోరాటంలో రాకుండా చూచుకోవలెను. "నాన్-కో ఆపరేషన్" సిద్ధాంతాన్ని ఇచ్ఛాపూర్వకంగా అవలంబించే మనము ఏ కొలదిమంది మాత్రమో అయినా ఫరవాలేదు; ఇతరులను మన సిద్ధాంతంలోకి రప్పించుకునే యత్నంలో కొద్దిమందిమైన మనము ఆహుతి కావలసి వచ్చినా కావచ్చును. అప్పుడు మనము ఆ సిద్ధాంతానికి ప్రత్యక్ష ప్రతినిధులమై దానిని నిలబెట్టినవాళ్ళ మవుతాము. అట్లుకాక, మన ఉద్యమంలోకి మనుష్యులను బహుసంఖ్యాకులను బలవంతంగా లాక్కువచ్చి, చేర్చుకుంటె, మన మా సిద్ధాంతానికే కాక భగవంతునికికూడా అపచారం చేసినవాళ్ళ మవుతాము. తత్కాలానికి మనము జయంపొందినట్లు కనిపించినను, లోగడకంటె మరింత భయానకస్థితిని కల్పించిన వారమే అవుతాము.

ఇతరుల అభిప్రాయాలను అసహనంచేత మనము అణచి పెట్టేటట్టయితే, మన ఉద్యమాన్నే వెనుకకు నెట్టుకున్నవాళ్ల మవుతాము. ఎందుకంటె, అట్టిస్థితిలో నిజంగా (హృదయ పూర్వకంగా) మన తరఫుననున్న వాళ్ళెవరో, మనకు వ్యతిరేకులుగ ఉన్నవాళ్ళెవరో ఎన్నడూ తెలిసికొనేలేము. కనుక జయంపొందడానికి మనం తప్పకుండ చూచుకోవలసిన షరతేమంటే, ఇతరులు తమ అభిప్రాయాలను వెల్లడించడానికి వారికి సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఇవ్వడమే. ఇట్టిదానిని ప్రోత్సహించవలెనేకాని, నిరుత్సాహపరువరాదు, అణచిపెట్టరాదు. మనపై రాజ్యంచేస్తున్న ఇంగ్లీవారి పనులనుండి మనము నేర్చుకోవలసినది కనీసము ఇదే. అంటే, తమకు ఇష్టములేని అభిప్రాయాలు కలిగినవాళ్ళను శిక్షించడానికి వారి "పీనల్‌కోడ్"లో ఎన్నో సెక్షనులు ఉన్నవి. ఈ శాసనాలను బట్టి మనదేశంలో ఎందరినో పెద్దపెద్దవాళ్ళను, కేవలం తమకు వ్యతిరేకమైన అభిప్రాయాలు వెల్లడించారనే కారణంగా అదొక నేరంగా ఎంచి జైళ్ళల్లోపెట్టారు. ఇట్టిపద్ధతినే కదా తీవ్రంగా, బహిరంగంగా ఎదిరించడానికి మనము "నాన్‌కో ఆపరేషన్" ఉద్యమము లేవదీశాము. "ఇతరుల అభిప్రాయాలు అణచిపెట్టకూడదు" అని మనం ఒకమూల ఇంగ్లీషు వారితో పోరాడుతూ, మనమే ఇట్టి అపచారానికి పూనుకో వచ్చునా?

(యంగ్ ఇండియా: 27-10-1921)

# 11

## సత్యాగ్రహం ఎట్టివారు చెయ్యాలి ?

బాధపడుతున్నవారు మాత్రమే సత్యాగ్రహం చేయాలి. సత్యాగ్రహ సిద్ధాంతసారమిదే. బాధపడే వానికి సానుభూతిగ తదితరులు తాముకూడ సత్యాగ్రహం చేయువల సివచ్చే పరిస్థితులు కొన్నిరావచ్చును. సత్యాగ్రహమునకు మూలమయిన ప్రధానోద్దేశ మేమంటె తప్పుచేసేవాని మనసు మార్చడమే. న్యాయబుద్ధి వానిలో మేల్కొల్పటమే. తా నెవరికైతే అపరాధం చేస్తున్నాడో అట్టివాని తోడ్పాటు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తనకు లేకపోతే తా నుద్దేశించిన దుష్కార్యం ఎన్నడు తాను చేయనే లేడనికూడ అతనికి ప్రత్యక్షంగా చూపడం. తాము పూనిన ఈ ధర్మము నకై తామే బాధపడుటకు, బాధసహించుటకు సిద్ధముగా లేనియెడల బయటినుండి ఏ రూపమున సత్యాగ్రహముచే నైనాసరే వచ్చే సహాయం వారి కేమియు లాభించదు, దాని వల్ల వారికి నిజమైన నివారణ కలుగదు.

( హరిజన్ : 10-12-1938 )

# 12

## సత్యాగ్రహం చేసే తీరు ఏది ?

సత్యాగ్రహోద్యమం నడపడంలో యుద్ధములోవలెనే కొన్నికొన్ని ఎత్తుగడలు (tactics) ఉన్నవి. ముందుకు వడ్డ

వడం - అవసరమైతే వెనుకకు నడవడం - శాసనోల్లంఘనం చేయడం - లేదా నిర్మాణకార్యక్రమం ద్వారానో, కేవలం నిస్స్వార్థమగుమానవసేవద్వారానో అహింసాబలమును పెంపొందించుకొనడం-ఇవన్నీ సత్యాగ్రహ సమరంలోని ఎత్తుగడలే. ఎప్పుడే ఎత్తు వేయవలెనో, ఆ యా అవసరపరిస్థితులనుబట్టి నిర్ణయించుకోవలసి ఉంటుంది. ఏ ఎత్తు వేయవలెనో, ఏ వ్యూహము పన్నవలెనో తనకు నిర్ణయమైన పిమ్మట సత్యాగ్రహియైనవాడు దానిని శాంతగంభీరమైన నిశ్చయముతో ఉద్రేకమునకుగాని: నిరుత్సాహమునకుగాని గురికాకుండ సాగింపవలసినదే.

( హరిజన్ : 27-5-1939 )

అహింసాసమరపు ఎత్తుగడలలో క్రమశిక్షణకు తావున్నది. అంతకంటె, ఇంకా మరొక అంశమునుకూడ సత్యాగ్రహ వీరుడు గమనించాలి. సత్యాగ్రహయుద్ధంలో ప్రతివాడు తానే సైనికుడు, తానే నౌకరుకూడ. ఇంకేమంటే క్లిష్టపరిస్థితి వచ్చినప్పుడు ప్రతిసత్యాగ్రహసైనికుడు తనకు తానే నాయకుడుగను, సైన్యాధ్యక్షుడుగను అయిపోవాలి. కేవలం క్రమశిక్షణ ( పైనున్న సైన్యాధ్యక్షుడు చెప్పినట్లు ముక్కుకు సూటిగ క్రమంతప్పకుండ నడవటం ) ఒక్కటే నాయకత్వానికి చాలదు. నాయకత్వమంటే తనకు స్వయముగా ఆత్మవిశ్వాసం, విశాలదృష్టి ఉండాలి. ఇవి వుంటేనే నాయకత్వం సిద్ధిస్తుంది.

( హరిజన్ : 28-7-1940 )

అయినతరువాతనే, అవి ఫలించకపోతే, ఆఖరుకు ఇక గత్యం తరం లేక, అతడు సత్యాగ్రహానికి పూనుకుంటాడు అయితే అంతరాత్మప్రబోధంకలిగి, "లే, ముందుకుసాగు" అను పిలుపు అంతరాత్మనుండి తనకు వినవచ్చినప్పుడు, ఆ పిలుపు విని సత్యాగ్రహానికి దిగినప్పుడు ఇక సత్యాగ్రహికి వెనుకంజ లేదు; ఆతడు తన సర్వస్వమును అగ్నికుండములో ఆహుతిచేసివేసు కొనియే బయులు దేరుతాడు.

(యంగ్ ఇండియా: 20-10-1927)

## B.- ఆర్థిక అసమానత :

# 1

## నాన్ - కో - ఆపరేషన్.

షాహుకారునకు, కూలీవానికి మధ్య ప్రధానముగ సమా నతఉన్నది. దానిని నేనుగుర్తించితీరాలి. గుర్తించి తీరుతాను. ఇట్లుగుర్తించిన నేను షాహుకారును నాశనం చేసివేయడానికి ఎలా పూనుకుంటాను? ఆతనిని మంచిగా మార్పుచేయడా నికే పూనుకోవలసి ఉంటుంది. నేను ఆతనిపై ప్రయోగించు "నాన్‌కోఆపరేషన్"వల్ల ఆతని జ్ఞాననేత్రము తెరుచుకుం టుంది; తాను చేయుచున్నతప్పును ఆతడు అప్పుడు చూడ గలుగుతాడు. షాహుకారును నాశనంచేయడమంటే, తుదకు కూలీని కూడ నాశనం చేయడమే. ఈసంగతి సులభంగా ఋజువుచేయవచ్చు. "ఏ డిక బాగుపడడు" అనునంత దుర్మార్గుడెవడూ లోకంలో లేడు. "నీవు రవ్వంతకూడా

మచ్చలేని మహాపురుషుడు" అని చెప్పతగ్గమనిషి కూడ లేడు. "ఎదుటివాడు నాకంటికి నూరుపాళ్ళు దుర్మార్గుడే" అని అనుకోవడం పొరపాటు; అట్లా అనుకొని, "నేను పవిత్రుడను, వాడు పూర్తిగ దుర్మార్గుడు; కనుక, నేను వానిని నాశనం చేయవచ్చు, చేస్తాను" అని అనుకోవడం ఎంతటివానికైనా సరే చాలాతప్పు. ఇది కూడదు.

(యంగ్ ఇండియా: 26-3-1931)

ఇంగ్లీషుభాషలో మిక్కిలి పటిష్ఠమైన పదం ఒకటి ఉన్నది. ఫ్రెంచిభాషలోనూ ఉంది. ప్రపంచంలో అన్ని భాషల లోను ఉంది. అదే "నో" "No" కాదు; లేదు 'నై'— అనే పదము. ఈ మాటమీదుగ ఒక రహస్యం కనిపెట్టాము. ఏమంటే— షావుకారువచ్చి "అవును" అనమంటే కూలి వానికి అది ఇష్టము లేకపోతే కూలీవాడు అవును (యస్) అని బుర్రఊపకుండా "నో" అనాలి. ఇట్లా అనగలిగినప్పుడు కూలివానికి వానిశక్తి గుర్తింపునకు వస్తుంది. అనగ 'యస్' అనదలుచుకొన్నప్పుడు 'యస్' అనడానికి, 'నో' అనదలుచు కొన్నప్పుడు 'నో' అనడానికి తనకు హక్కుకలదని కూలి వాడప్పుడు స్పష్టంగా తనశక్తిని తాను తెలుసుకుంటాడు. అప్పుడు కూలివాడు షావుకారుయొక్క నిర్బంధమునుండి విముక్తి పొందుతాడు. షావుకారే అప్పుడువచ్చి కూలివానిని బ్రతిమాలుకోవలసివస్తుంది. షావుకారు చేతిలో తుపాకులు, విషవాయువులు ఉంటే వుండుగాక. వాటివల్ల ఏమీ ప్రయోజనము లేదు. కూలీలుకనుక "నో" అనే తమ మాటను చెల్లిం

మెచ్చలేని మహాపురుషుడు" అని చెప్పతగ్గమనిషీ కూడలేడు. "ఏమటివాడు నాటికి కూరుపాళ్ళ దుర్మార్గుడే" అని అనుకో వడం పొరపాటు; అట్లా అనుకొని, "నేను పత్రిత్తును, వాడు పూర్తిగదుర్మార్గుడు; కనుక, నేను వానిని నాశనం చేయ వచ్చు, చేస్తాను" అని అనుకోవడం ఎంతటివానికైనా సరే చాలాతప్పు. ఇది కూడదు.

(యంగ్ ఇండియా: 26-3-1931)

ఇంగ్లీషుభాషలో మిక్కిలి పటిష్టమైన పదం ఒకటి ఉన్నది. ఫ్రెంచిభాషలోను ఉంది. ప్రపంచంలో అన్నిభాషల లోను ఉంది. అదే "నో" "No" కాదు; లేదు 'నై'— అనే పదము. ఈ మాటమీదుగ ఒక రహస్యం కనిపెట్టాము. ఏమంటే— షావుకారువచ్చి "అవును" అనమంటే కూలి వానికి అది ఇష్టము లేకపోతే కూలీవాడు అవును (యస్) అని బుర్రఊపకుండా "నో" అనాలి. ఇట్లా అనగలిగినప్పుడు కూలివానికి వానిశక్తి గుర్తింపునకు వస్తుంది. అనగ 'యస్' అనదలుచుకొన్నప్పుడు 'యస్' అనడానికి, 'నో' అనదలుచు కొన్నప్పుడు 'నో' అనడానికి తనకు హక్కుకలదని కూలి వా డప్పుడు స్పష్టంగా తనశక్తిని తాను తెలుసుకుంటాడు. అప్పు డు కూలివాడు షావుకారుయొక్క నిర్బంధమునుండి విముక్తి పొందుతాడు. షావుకారే అప్పుడువచ్చి కూలివానిని బ్రతి మాలుకోవలసివస్తుంది. షావుకారు చేతిలో తుపాకులు, విష వాయువులు ఉంటే వుండుగాక. వాటివల్ల ఏమీ ప్రయోజ నము లేదు. కూలీలుకనుక "నో" అనే తమ మాటను చెల్లిం

చుకోగలిగి తమ గౌరవమును తప్పక నిలుపుకో గలిగితే ఈ ఫిరంగులేమీ పనిచేయలేవు. షాహుకారు కేవలం నిస్సహాయుడై పోతాడు. కూలీలు ఎదురుతిరిగి దెబ్బకొట్టవక్కరలేదు తుపాకిగుండ్లకు బెదరక తమ ప్రయోగాన్ని నిశ్చలంగా ఎదుర్కొంటూనే సిగ్గుబడి ఇంకా "నో నో" అంటూనే తమ మాటను వదలక ఉద్ఘాటిస్తూవుంటే చాలు.

కూలీలు తరుచుగ పరాజయం పొందుతున్నారంటే దానికి కారణం ఇక పోలేదు నేను పైనచెప్పిన పద్ధతిగ షాహుకార్లను నిస్సహాయులనుచేసి కూర్చోబెట్టటానికి బదులుగ కూలీలే షాహుకారు డబ్బును చేజిక్కించుకొని తామే అంతకంటె హీనస్థితిగల షాహుకార్లయి కూర్చుందామని కూలీలు సంకల్పిస్తున్నారు.

అసలు మొత్తం కారణమిది. ఈసంగతులన్నీ నేను కూలీగానే మాట్లాడుతున్నాను. కనుక కూలీలను ఓడించటానికి షాహుకారుకు-బాగా అంగబలం, అర్థబలం ఉన్న షావుకారుకు-మంచి సందు దొరుకుతున్నది. అనగ తనవలెనే షాహుకార్లు కావలనుకొన్నవాళ్ళు కూలీలలోకూడా ఉన్నారని కనిపెట్టి ఆ షాహుకారు వాళ్ళను చీలదీసి మొత్తం కూలీ ఉద్యమాన్నంతను అణచివేస్తున్నాడు. మనమంతా యిట్టి భ్రాంతి వాతావరణంలో నిజంగా మునిగివుండకపోతే ఈ సమస్యకంతకు మూలకారణమైన ఈ రహస్యమును సులభముగ గ్రహించగలుగుతాము.

(ఇండియాకుగల స్వరాజ్యార్హత : పే॥ 354)

ఆలోచిస్తూవుంటే నాకు ఈ అహింసాపూర్వకమైన "నాన్ కో-ఆపరేషన్" మార్గము తట్టింది. శాసనోల్లంఘనం "నాన్ కో-ఆపరేషన్" (సహాయనిరాకరణము) ఇవే సరియైన దోషరహితమైన అమోఘమైన మార్గాలుగా నాకు కనిపించినవి. పేదవాని సహకారంలేనిది భాగ్యవంతుడెన్నడూ భాగ్యము పేర్చి పెట్టుకోలేడు. ఈ రహస్యముకనుక పేదవాళ్ళకు బాగా తెలిసి వారిలో వ్యాపిస్తే వాళ్ళు మహాబలవంతులవుతారు. అంతేకాదు. తమకు దాదాపు మృత్యుసమానమైన దుస్థితి తెచ్చిపెట్టి తమ్మును అణచిపెట్టుచున్న 'అసమానతా' పీడనుండి అహింసామార్గమున తమ్మును తామెట్లు విముక్తి నొందించుకోగలరో అదికూడ తెలుసుకుంటారు.

(హరిజన్:- 25-8-1940)

భూమిని సేద్యముచేసే రైతులు తమలో ఎంతశక్తి నిగూఢమై యున్నదో గ్రహించిన ఉత్తరక్షణమందే జమీందారీపీడావిధానమునిర్వీర్యమైపోతుంది. "మేమూ, మాపిల్లలు శుభ్రంగా తిండితిని, మంచిబట్ట కట్టుకొని చక్కగా చదువుకోటానికి తగినంత ప్రతిఫలం ఇస్తేకాని మేము మీ భూమిదున్నము" అని కనక రైతులు అంటే పాపము జమీందారేమి చేయగలుగుతాడు ? నిజానికి కష్టపడేవాడిదేకదఫలము. కష్టజీవులంతా తెలివితేటలతో ఏకమైతే ఇక వారిబలం ఎవరుకాని ఎదిరించలేనంత బలమవుతుంది. వర్గపోరాటంయొక్క అవసరం నాకు కనిపించడంలేదని నేనుచెప్పడానికి హేతువిదే.

నిజంగా అది అవసరమే అని నాకు తోచేటట్లయితే దానిని నేను బోధించటానికి, బహిరంగంగా చెప్పటానికి జంకను.

(హరిజన్ : 5-12-1936)

# 2

## -: వర్గపోరాటము :-

వర్గపోరాటమనేది అసలు మన భారతీయ ప్రకృతికే సరిపడని విషయము. అందరికీ సమానన్యాయం కలిగేపద్ధతిగా అందరికీ ప్రాథమిక హక్కులతో కమ్యూనిజమును రూపొందించడం ఎలాగో మన భారతీయ ప్రకృతికి తెలుసు. నేను కలలుకంటున్న రామరాజ్యం రాజుకు పేదకుకూడా సమాన హక్కులను గ్యారంటీ చేస్తుంది.

ఇండియాలో వర్గపోరాటం రాకుండ నివారించడానికి నా యావచ్ఛక్తిని వినియోగిస్తానని మీరందరు గట్టిగ నమ్మండి.

సోషలిజం, కమ్యూనిజం అనే మాటలగురించి మన కున్న భావాలకు, పాశ్చాత్యులకున్న భావాలకు అసలు పునాదిలోనే తేడావున్నది. వారి భావాలలో ముఖ్యమైన దొకటి ఏమంటే అసలు మానవస్వభావమే ప్రధానముగ స్వార్థపరమని. దీనికి నే నెంతమాత్రం ఒప్పుకొనను. కారణం చెబుతాను వినండి. మనిషికి పశువుకు ఒక ముఖ్యమైన తేడా

ఉన్నది. అదేమంటే మనిషి తనలో ప్రసన్న అంతరాత్మ ప్రేరణను గుర్తించి తదనుసారంగా నడవగలడు. తనకు పశువులకు సమానముగానే కొన్ని ఇంద్రియవాంఛ లున్నప్పటికీ మనిషి. వాటిని నిగ్రహించుకొని వాటిని అణచిపెట్టి వానికంటె ఉన్నతస్థాయికి లేవగలడు. అంటే స్వార్థపరత్వాన్ని హింసాప్రవృత్తిని క్రిందికి తొక్కివేసి తాను పైకి ఉత్తమస్థితికి లేవగలడు.

హింస, స్వార్థపరత్వము అనే ప్రవృత్తులు పశువుల లక్షణములే కాని, అనశ్వరమగు మానవాత్మ లక్షణములు ఎంతమాత్రము కావు. హిందూధర్మముయొక్క మూల సిద్ధాంతమిదే. ఎన్నోయుగముల తపస్సుయొక్కయు నియమనిగ్రహముల యొక్కయు ఫలితముగానే ఈ సత్యమును మనవారు కనిపెట్టి, సాధించినారు. ఇది ఊరికే అంతసులభముగ సాధించిన ఫలితముకాదు. దాని వెనకాల ఎందరి మహామహుల తపస్సో నియమనిగ్రహాలో, అండగ నిలచి యున్నవి. ఆత్మశక్తియొక్క నిగూఢసత్యమును పరిశోధించి తెలిసికొనుటకయియే ఎందరెందరో మహానుభావులు తమ శరీరములను తపోగ్నియందు తపమొనర్చి, కృశింపజేసి, ప్రాణములనుకూడ ఆహుతిచేసికొన్నవారు మన భరతఖండమున కనిపించుచున్నారు. కనుక, మనము రూపొందించే సోషలిజం కమ్యూనిజం కూడ అహింసయను పునాదిమీదనే రూపొందించాలి. అనగా కూలివారు, షాహుకారు-రైతు, భూస్వామి వీరందరిమధ్య సమన్వయపూర్వకమగు సహకారమును పునా

పైన చెప్పుకొనియే ఏ 'ఇజము'నకాని మనము రూపొందించు కోవాలి.

(అమృతబజార్ పత్రిక – 2-8-1934)

విద్యార్థులడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా గాంధిగారిలా అన్నారు.

భూస్వాములను, ధనికులను, ప్రజలసేవకై ఉపయోగించాలని నా కోరిక. ధనికులకోసం పేదలు చేయుచున్నను భంగపరుపరాదు, వారి మెత్తుగడల కనుకూలంగా మనముకూడ ప్రవర్తించరాదు. తమసంపదను ప్రజాసేవకై అర్పణచేయగల శక్తి వారికి కలిగినంతవరకు మనము వారిని నమ్మాలి. ఉన్నతభావాలను ప్రేరేపిస్తే, వారు దోవకు రాకపోరు. ఒక మంచిమాట – ఒకదయగలమాట – వారి హృదయంలో ప్రోత్సాహకారిగా పనిచేస్తుంది ఇది నా సదా అనుభవం. వారికి నచ్చచెప్పి విశ్వాసముకలిగించి వారిమనస్సులలో భీతి పోగొట్టి నెమ్మది కలిగించేటట్లయితే వారు తమ సంపదలను క్రమక్రమంగా ప్రజాసంఘంతో పంచుకోడానికి విముఖులు కారని మనకు గోచరించగలదు.

అదిగాక మనకుమనమే ఇంకొకప్రశ్న వేసుకొని చూద్దాము. సామాన్య ప్రజానీకంతో ఐక్యభావం పొందటానికి మనముమాత్రము ఏమిచేశాము? కొంచెం ఆత్మపరీక్షచేసి చూసుకుందాము. కోటానకోట్ల(పేద) ప్రజలకు మనకు మధ్య నున్న భేదమును తొలగించుకున్నామా? "గాజుయిండ్లలో

కాపురమున్న మనకు ఇతరులమీద దాక్షిణ్యము వహించటము గాక!" పేదప్రజానీకం ఎలా జీవిస్తున్నారో, అదేమాదిరిగ వారి సుఖదుఃఖాలలో పాల్గొంటూ మనము నివసిస్తున్నామా? నాగరికతకు లేను అభివృద్ధి రాలేదని తక్షణం ఒప్పుకుంటున్నాను. ధనికులు ఎట్టి భోగలాలసలో జీవిస్తున్నారని మనము వారిని నిందిస్తున్నామో. అట్టిభోగలాలసాభ్యాసములను మనము మట్టుపెట్టి మన నిత్యజీవిత విధానములో పూర్తిగ మానుకున్నామా ?

విగ్రహారాధన అనే మాట నాకు బొత్తుగ గిట్టదు. అహింసా సందేశమును మనము పూర్తిగ అర్థంచేసుకుంటే ఈ ఇండియాలో విగ్రహారాధనం అనివార్యము కాకపోవుటయే కాక నివార్యముకూడ. 'విగ్రహారాధనము తప్పదు' అనేవారు అహింసా ధర్మములోని నిగూఢభావములను పూర్తిగా అర్థంచేసుకోలేదన్నమాట. లేదా పైపైన ఏదో అర్థంచేసుకున్నా మంటున్నారన్నమాట.

పాశ్చాత్యదేశాలనుంచి దిగుమతియైన ఏవో కేకలు నినాదాలు చెవికి ఇంపుగవున్నవని విని భ్రమింపకుందుము గాక! మనకు మాత్రము విశిష్టమైన ప్రాచ్యసాంప్రదాయాలు లేవా ? ధనికులకు పేదలకు మధ్య విభేదాలు పరిష్కరించుకొనడానికి మార్గాలు మనము కనిపెట్టలేమా ? దీనికోసం పాశ్చాత్యదేశాలవంక చూడాలా ? మన వర్ణాశ్రమధర్మమేమిటి ? పేదవానికి ధనికునకు మధ్య — షాహుకారునకు కూలీకి మధ్య-విభేదాలు లేకుండ సమన్వయించే విధానము

కాదా మన వర్ణాశ్రమ విధానము ? ఈ సమస్యపై పాశ్చాత్య దేశాలనుండి దిగుమతిఅయ్యే విధానాలన్నీ హింస యను పద్ధతి మీద వ్రాయబడినవై యున్నవి ఇవి మన కెంతమాత్రము పనికిరావు వీటికి నేను గట్టిగ అభ్యంతరము చెబుతాను. ఎందుకంటే ఈ విధానాలు తుదకు కెట్టి వినాశమును తెచ్చిపెడుతవో నేను పాశ్చాత్య దేశాలలో కళ్ళారా చూచాను. నేను పాశ్చాత్య దేశాలలోకూడ వివేచనాపరులైన బుద్ధిమంతులు తమ దేశాలు ఏ గోతులో పడబోతున్నవో గ్రహించి చూచి విభ్రాంతపోతున్నారు. నాకు పాశ్చాత్య దేశాలలో ఏమయినా పలుకుబడి వుంటే దానికి కారణము నేను ఈ సమస్యను పరిష్కారం చేయటానికి అహింసద్వారా నిరంతరం కృషిచేస్తున్నాను కనుకనే. ఒకళ్ళు దోపిడీచేయడం, రెండవవారు దానికి ప్రతిగా దౌర్జన్యం చేయడం, ఈరీతిగా విషవృత్తం గిరగిర పాశ్చాత్యదేశాలలో తిరుగుచున్నది. ఈ విషచక్రపు సుడిలో తగుల్కొని పాశ్చాత్య దేశాలుబయటపడ లేకున్నవి. నాఅహింసాపద్ధతి తమ్మునీచక్రపు సుడినుండి తప్పించి బ్రతికించగలదని ఒక ఆశ వారికి స్ఫురించుచున్నది. ఇదే నాకు పాశ్చాత్యదేశాలలోగల ఆ పలుకుబడికి కారణం. పాశ్చాత్యుల సాంఘికవిధానమెట్టిదో తెలిసికొనటానికి సానుభూతితో నేను కృషిచేసినవాడనే. వారి మనస్సులలో నిండి నిబిడీకృతమై వారిని వేధించుచున్న ఈ తృష్ణాతాపజ్వరమునకు అట్టడుగున విరామములేని సత్యాన్వేషణతాపముకూడ కలదని నేను కనిపెట్టాను. ఇట్టి సత్యాన్వేషణతత్పరత్వమునకు నే నెంతో విలువ

యున్నాను. వారివలె వ్యక్తిసత్యాన్వేషణ తత్పరతతోనే మనము కూడ మన వారిచ్చిన శాస్త్రీయ విధానములను పరిశీలించు కొనవలెను. అప్పుడు లోకమింతవరకు కలలోకూడ ఊహింపని నిజమైన సోషలిజమును, నిజమైన కమ్యూనిజమును మనము రూపొందించగలము. ప్రజల పేదరికమును పోగొట్టడానికి పాశ్చాత్యుల ఏకమైన సోషలిజము, కమ్యూనిజములే తప్ప వేరులేవని తలచుట చాలా పొరబాటు.

( అమృతబజార్ పత్రిక : 3-8-1954 )

ఒక వర్గాన్ని ఇంకొక వర్గంమీదికి ఉసికొల్పటం కాదు అసలు సమస్యా పరిష్కారమార్గము. నిజమయిన తమ యొక్క ఉత్కృష్టత యెందున్నదో కార్మికులకు బోధపరుచుటయే అసలు సవ్యమయిన మార్గము. నిజానికి లోకంలో ధనికులు పట్టుమని గుప్పెడుమంది లేరు. కార్మికులు తమ శక్తిని గుర్తించి-గుర్తించియు ధర్మపథంలో నడవడం సాగించిన క్షణమునుండియే ధనికులుగూడ ధర్మపథానువర్తులవుతారు. కూలీలను ధనికులమీదికి ఉసికొల్పి రేగగొట్టటం వర్గవిద్వేష విషజ్వాలలను నిరంతరం ఎగసనదోయటమే అవుతుంది. దానివల్లవచ్చే దుష్ఫలితాల నన్నిటిని పేర్చిపెట్టుకోవడమే అవుతుంది. ఈ పోరాటం అంతులేని, తుదామొదలు లేని-విషచక్రం. ఇట్టి సుడిగుండంలో పడకుండ ఏమైనాసరే మనం తప్పించుకోవాలి. దౌర్జన్యపూరితమైన ఈ వర్గపోరాటము రేపెట్టడం కార్మికులు తాము తక్కువవారమనే భావ

వల్లో తామే పడినట్లు నిదర్శనం మాత్ర మవుతుంది. అది వారి దౌర్బల్యమునుమాత్రం సూచిస్తుంది. నిజంగా తాము బలవంతులమని తోస్తే వారు దౌర్జన్యం చేయవలసిన పని యేమి ? తమ బలమును తమ ఘనతను కార్మికులు నిజంగా గుర్తించిన తక్షణమే ధనికులుగూడ సరియైన దోవకేవస్తారు. ( వారిపై దౌర్జన్యం చేయనక్కరలేదు. వారిని ద్వేషించ నక్కరలేదు. ) ధనికులు సరియైన దోవకు వస్తారనగా వారు తమ ధనమును కార్మికుల శ్రేయస్సు నిమిత్తమే ట్రస్టుగ మార్చివేస్తారు. ఎందుకంటె కార్మికశక్తియే డబ్బుకంటె ఎక్కువ ఘనమైనది కద.

( హరిజన్ : 16-10-1945 )

ధనికులు ప్రజానీకానికి విరోధులనేబోధ నేనుచేయను. నిజానికి, తమకు తామే విరోధులని నేను ప్రజానీకానికి బోధిస్తాను.

(యంగ్ ఇండియా : 26-11-1931)

# 3

## కార్మి సంఘాలు :

### :- కార్మికులను సంఘటిత పరచవలసిన ఆవశ్యకత :-

ఒకచోట కార్మికులతో ప్రసంగిస్తూ గాంధిగారిలా అన్నారు:-

నేను ఇంతకాలంనుంచి ఎన్నోసంవత్సరాలనుండి చెప్తూనే ఉన్నమాట ఏమంటే, కార్మికశక్తి, ధనశక్తికంటె చాలా

హెచ్చయినదని. ఈ రెంటికి తాళిబొట్టుకట్టాలని నా కోరిక. రెండూ కలిసిఉంటే మహాద్భుతకార్యాలు చేయవచ్చు. కార్మికులు వివేకవంతులై తమలోతాము కలిసిఉండగలిగిన నాడే - మరియు తదుపరి, సమానగౌరవప్రతిపత్తితో ధనిక వర్గానికికూడ తమ సహకార హస్తము చాచగలిగిననాడే- ఇట్టి మహాద్భుతకార్యాలు జరగడానికి సాధ్యమవుతుంది. ధనికులు కార్మికులను తమ చెప్పుచేతలలో ఉంచుకోగలుగుతున్నారంటే, కారణము తమలోతాము కలిసికట్టుగ ఉండడం ఎలాగో ధనికులకు తెలుసు. అందువల్లనే వారు కార్మికులను తమవశంలో ఉంచుకోగలుగుతున్నారు. నీటి బొట్లు విడివిడిగా ఉంటే, ఎక్కడివక్కడే ఇగిరిపోతవి; కాని, అవన్నీ ఒకచోటకలిసిఉంటే, మహాసముద్రం అవుతుంది; ఆ సముద్రం తన విశాలమైన వీపుమీద పెద్దపెద్ద ఓడలనే మోసుకొనిపోగలుగుతుంది. అదేవిధంగా ప్రపంచంలో ఏ మూలనున్నవారైనాసరే, కార్మికులందరు ఏకమైయుంటే, వారు గతిలేనివారై అల్పవేతనాలకు ఆశపడిపోరు. ఎవరికో హెచ్చుకూలీఇస్తామంటే ఎగబడి తక్కువవారిని వదలివేసి, పోరు. నిజమై, అహింసతో కూడిన కార్మికుల కలయిక సూదంటురాయివలె పనిచేస్తుంది. అంటే, ఎంత డబ్బుకావలసివస్తేఅంత డబ్బును తన చెంతకు ఆకర్షించుకుంటుంది. అప్పుడు ధనికులు కేవలం ట్రస్టీలుగమాత్రమే ఉండగలరు. అట్టి సుదినం ఉదయించిననాడు ధనికులకు కార్మికులకు మధ్య తేడాయే ఉండదు. కార్మికులకు కడుపునిండా తిండి, ఒంటి నిండాబట్ట, మంచిపరిశుభ్రమైనకొంప, తమపిల్లలకు చక్కని

చదువు, కాను చదువుకోడానికి విశాలమైన విశ్రాంతి, సరియైన వైద్యసహాయం, ఒకటేమిటి అన్నివస్తవి.

( హరిజన్ 7-9-1947 )

పరిష్కరించవలసిన విషయాన్నిగురించి ఒక్కమాట చెబుతాను. ధనికవర్గముతో విరోధపడడంకాదు కావలసింది. వారినుంచి కార్మికులకు రావలసిన ఉచిత భాగమును తీసుకోవడమే - అంతకెక్కువకాదు. ఇదికూడ ఎట్లాతీసుకోవాలి? ధనికవర్గాన్ని ధిక్కారంచేసివేసికాదు; కార్మికులు తమలోతాము సవ్యమార్గాన సంస్కరించుకొని, తమ స్వశక్తిని పెంపొందించడం ద్వారానే ఈ పని జరగాలి. అదీకాక కార్మికులసమస్యలతో నిజంగా సంబంధంలేక, కేవలం తమ రాజకీయప్రయోజనాలకై ఎత్తులువేసే కార్మికనాయక నామధేయులు మూకలేర్పరుస్తుండటంవల్ల, వంకరఉపాయాల వల్లనూ ఈసమస్య సంక్లిష్టమయ్యేది. కార్మికులు తమ నాయకత్వాన్ని, తమనాయకులను, తామే స్థాపించుకొనేటట్లు వారికి ప్రోత్సాహం చెయ్యడంవల్ల-తమస్వశక్తిమీద ఆధారపడి నెలకొల్పబడి నడిచే కార్మిక సంఘాలనిర్మాణంవల్ల మాత్రమే ఈసమస్య పరిష్కారం కావాలి. వాటి ప్రత్యక్షోద్దేశము రాజకీయములు ఎంతమాత్రముకాదు. తమ ఆంతరంగిక సంస్కరణము, తద్వారా ఆంతరంగికబలాభివృద్ధి - ఈ రెండేవారికి ప్రత్యక్షోద్దేశములుగ ఉండవలెను. ఈ విధమైన వికాసమే వస్తే అది సంపూర్తివికాసమే అయితే- అట్టి సంపూర్తివికాసమనేది జరగడమనే సుదినమే వస్తే దానివల్లవచ్చే పరోక్ష

లాభం సహజంగా బ్రిటన్ పొందదగిన రాజకీయలాభంకూడా అయితీరుతుంది.

కార్మికవర్గము ఈ రీతిగా స్వశక్త్యాధారమున బలపడి నిలిచినప్పుడు, దానిని ఏదో ప్రత్యేక ప్రముఖ రాజకీయ ప్రయోజనానికై సంఘటితపరిచి, వాటంవారీగా ఉపయోగించుకుందామనే భావము నా మనస్సులో ఏకోశానాలేదు. రాజకీయపు చదరంగపాళీలో కార్మికవర్గములెన్నడు రాజకీయవాదుల చేతులలోని అచ్చనగాయలుగా మారిపోరాదు. కేవలం తనస్వశక్తిచేతనే కార్మికవర్గము ఈచదరంపుగళ్లాలను యావత్తు తనచేతులో పెట్టుకొని ఆడించాలి, అంతేకాని, అందులో అచ్చనగాయ కాకూడదు.

“ ఇండియా పరిస్థితివేరా? Is India different” అనే కరపత్రములో 1927 మే 10 వ తేదీన గాంధిగారు ప్రకటించిన ఒకానొక లేఖనుండి—సక్లత్ వాలా అనే ఆయనకు గాంధిగారికి మధ్య నడిచిన జాబులలో ఇదిఒకటి. 1927 సం॥ లో లండన్‌లో “ కింగ్‌స్ట్రీట్ ” 16 వ నంబరు గృహము నుండి బ్రిటిష్ కమ్యూనిష్టుపార్టీ వారు ప్రచురించిన కరపత్రిం 25 వ పేజిలో వున్నది.

—: మిల్లుకూలీలకు ఉపవృత్తులు :—

మిల్లుకూలిబ్రతుకు దినదినగండం. కూలిడబ్బు పొదుపుగా వాడుకుంటే కూలీ పని కొంత నయమే అనుకోండి. ఇదికూడా లేకపోతే వానిపని మహాఘోరం. వాడు చేసేది

మహాఅపచారమన్నమాట. ఇక కూలిడబ్బులు పొదుపుగ వాడుకుంటేకూడా అది అతనికి ఎంతదూరమో సహాయపడదు. ఎందుకంటే వారికి వచ్చేదే తక్కువ. పొట్టకూ, బట్టకు చాలకుండానే ఎల్లప్పుడూ గించుకుంటూ ఉంటారు మన మిల్లుకార్మికులు చాలమంది. కూలీదొరకని రోజులలోగాని సమ్మెకట్టిన రోజులలోకాని కూలీపని మరింత అధ్వాన్నంగా ఉంటుంది. ఇంట్లో గోళ్లుగిల్లుకుంటూ కూర్చుండటానికిపీలా? ఇట్టి బలాత్కారపు నిర్వ్యాపారత అతని ఆత్మగౌరవానికి, అతని సత్యప్రవృత్తికి హాని కలిగిస్తుంది. ఇంతకంటె అపాయకరమైనస్థితి ఇంకొకటి వుండబోదు. ఇట్టిక్లిష్టసమయాలు వచ్చి పడ్డప్పుడు బ్రతకటానికి ఏదో ఇంకొక ఉపవృత్తి- తప్పకుండా వారిని బ్రతికించగల ఇంకొక ఉపవృత్తి- వారికి ఉండడం చాలాఅవసరము. వారి వుండేలుబద్దకు- విల్లుకు - ఈ రెండవనారి (అల్లెత్రాడు) కూడా వుంటే తప్ప కూలీలు నిశ్చింత కలిగి, ఆత్మవిశ్వాసమును సంపాదించుకొని, బలపడలేరు.

1918 సం॥ లో అహమ్మదాబాదు మిల్లుకూలీలు 23 రోజులు సమ్మెకట్టిన ఆ వాడావిడిరోజులలో నాకీ ఆలోచన మొట్టమొదటగ కలిగింది. ఆ మిల్లుకూలీలకు ఏదైనా ఉపవృత్తి చూపించకపోతే ఎలా అని. ఈ సమ్మె జయప్రదం కావాలంటే సమ్మెరోజులలో కూలీలు కొంతకు కొంతైనా బ్రతకటానికి ఏదో ఉపవృత్తి వుండాలని నా కప్పుడు తట్టింది. వారూ వీరూ యిచ్చే ముష్టిమీద కూలీలు ఆధారపడరాదని తోచినది. సమ్మెరోజులలో చాలమందికూలీలు ఏవో పొట్టు

కూలీపనులలో చేరారు. అంతకంటె మంచిఉపవృత్తి ఏదయినా నేర్పితేబాగుండదా అనే సూచనను నేను అప్పుడు చేశాను. కాని మరల తిరిగి రెండవసారి సమ్మెవచ్చేదాకా నా సూచన క్రియారూపం దాల్చకుండా అలాగే వుండిపోయింది. అప్పుడు అనగ రెండవసారి సమ్మెకాలంలో ఏదో కొంత ప్రారంభంచేశారు. కాని ఒక్కసారిగ ఇట్టిఉపవృత్తిని పెద్దస్కేలుమీద ఏర్పాటుచేయడమంటే కష్టమే. రెండవ సమ్మె ఎట్లో అంతంపొందగా ఇక నేచెప్పిన సూచనను మరల తలపెట్టినవారే లేరు.

అహమ్మదాబాదులోని "లేబర్ యూనియన్" వారు ఇందువిషయమై ఏదో కొంతప్రయత్నం ఇప్పుడుచేస్తున్నారు. తీరికగా ఇండ్లలోవున్న ఖాళీసమయాలలో ఏదో ఒక ఉపవృత్తి నేర్చుకోవలసినదిగా వారికి బోధిస్తున్నారు. ఏవో రెండుమూడు రకాల ఉపవృత్తులు సూచిస్తున్నారు. వాటిలో ఎవరికినచ్చింది వారు చేపట్టి నేర్చుకోవచ్చును. అవేవనగా పత్తి గిలకపట్టి గింజలుతీయుట, పత్తిబాగుచేయుట, ఏకుట, వడుకుట, నేయుట, బట్టలుకుట్టుట, సబ్బులుచేయుట, కాగితములు తయారుచేయుట, అచ్చుఅక్షరాలు కూర్చుట మొదలైనవి.

ఇట్టి రకరకాల ఉపవృత్తులు నేర్చుకొని వుండటం కూలీలకు చాలా లాభం. ధనవంతునివద్ద రకరకాల డబ్బు వెండి బంగారు లోహాలు ఉన్నట్లే! అయితే ఇప్పుడున్న చిక్కేమి టంటే ధనికులు బాగా సంఘటితులై ఎవరు కాని

తమ్మును కదిలించలేని గట్టిస్థితిలో నున్నారు. కాని కార్మికులు అలా లేరు. కూలివాని మెదడంతా ఆత్మస్పందనంలేని బండమొండిపనులు యంత్రంలాగ చేయడంలోనే నిమగ్నమై ఉంటున్నది. వాని మనోవికాసమునకు ఎక్కడా అవకాశమే లేకుండా పోతున్నది. తన ఉన్నతిని, తన శక్తిని పూర్తిగ అవగాహన చేసికొనుటకే వీలులేకుండ వానికీ బండ పనులు అడ్డుగా వుంటున్నవి. తనకు కూలి ఎంతఇవ్వాలో మిల్లుయజమానియే నిర్ణయించాలికాని "నేనింతయిస్తేగాని పనిచేయను' అనే స్థితి కూలికి లేకుండపోయినది. ఉండవలసిన తీరే ఇదిగా కూలీనమ్మేటట్లుగ బోధ జరుగుచున్నది. ఈ అవాంఛనీయస్థితి తొలగాలంటే ఒక్కటే మార్గమున్నది. కార్మికులు సవ్యమైన మార్గాలలో సంఘటితం కావాలి. తమ బుద్ధి విశేషములను సున్నితము చేసుకోవాలి. రకరకాలైన ఉపవృత్తులు నేర్చివుండాలి. ఇవన్నీ చేసిననాడు కార్మికులు, నిశ్చింతగా, ధైర్యంగా తలయెత్తుకొని గౌరవంగా తిరుగగలరు. బ్రతుకు తెరువు లేకపోతుందేమో అన్న భీతి లేకుండ ఆతడు హాయిగా బ్రతకగలడు

( హరిజన్:- 3-7-1937 )

## 4

### ప్ర భు త్వ చ ర్య.

-: ప్రభుత్వశాసనంద్వారా ఆస్తులు ఊడలాక్కోవడం. :-

ధనికులవల్ల, భూస్వాములవల్ల, పైతరగతులని చెప్పబడేవారివల్ల, పిమ్మట మహాచారచక్రంగా అతిప్రవీణతతో

బ్రిటిష్‌పాలకులవల్ల దారిద్ర్యపంకంలోకి త్రొక్కివేయబడిన దిగువవర్గములవారిని, పడిపోయినవారిని పైకి లేవనెత్తుటకు గాను ఇక భవిష్యత్తులో కొన్ని ఏండ్లవరకు నూతనశాసనముల నిర్మాణములలో ఇండియా నిమగ్నమై యుండునని నేను భావించుచున్నాను. ఈ బురదలోనుంచి వీరిని లేవనెత్తవలెనంటె తన ఇల్లు చక్కబెట్టుకొనవలెనంటె, ఈ అణగారిపోయిన తరగతులవారికి చాలకాలం తప్పకుండ ప్రత్యేక సౌకర్యములు కలిగించుట స్వరాజ్యప్రభుత్వముయొక్క విధాయకమైయుండును. మరియు, వారి నిప్పుడు అణచిపెట్టియుంచుచున్న బరువులనుకూడ వారిమీదినుండి తీసివేయవలసి యుండును. భూస్వాములు, జమీందారులు, ధనాఢ్యులు, నేడెన్నో సౌకర్యములను హాయిగ అనుభవించుచున్నవారందరు - వారు యూరపియనులైనాసరే, ఇండియనులైనా సరే - నేను లెక్కచేయను. ఇట్టి శాసనములవల్ల తమకు ఏదో పోతున్నదని, తమకు అన్యాయముచేస్తున్నారని వీరు గునిస్తే నేను వారియెడ జాలిపడనే గలను గాని, వారికి నేమియు సహాయపడజాలను. ఒకవేళ సహాయముచేయడం నాకు సాధ్యమైనప్పటికీ, చేయజాలను. ఎందుకంటె ఈ పతితవర్గాలను పైకితీసికొనిరావడంలో నేనే ఈ ధనికవర్గాలనుండి సహాయము కోరవలసిఉంటుంది; కోరుతాను; కనుక వారికి నేను చేసే సహాయమేమి ఉంటుంది? వీరి సహాయంలేనిది ఈ పతిత జనాన్ని దారిద్ర్యపంకంలోనుండి పైకి లేవనెత్తడం సాధ్యం కాదుకద. అందుకని, ఎదురు వారిసహాయమే నాకు కావలసి ఉంటుంది.

ఉదాహరణకు "అంటరానివారి" సంగతి చూడండి. ప్రస్తుతం వారికి భూమిలేదు; పైకులాలవారి దయాదాక్షిణ్యం మీాద, సర్కారువారి కరుణాదృష్టిమీాద, వారు కేవలం బ్రతుకుతున్నారు. వారిని అటుఇటూ పోపొమ్మని, తరిమితే కూడ వారు ఇప్పుడు నోరెత్తడానికి వీలులేదు.

"లా" వచ్చి ఇప్పుడు వారి కేమియు సహాయం చేయడంలేదుకద. ఇట్టి వారికి తోడ్పడడానికిగాను, రేపు, "లా" వచ్చి మైళ్ళకొలది ప్రదేశాన్ని భూములను వాళ్ళకు కట్టిపెడుతుందనుకోండి. అప్పుడు స్థితేమిటి ఆలోచించండి. (ఇది వల్లకాదని నేనెలా అంటా? ఈ విషయంలో కలవారికి సేవ చేసే సహాయం ఏమిఉంటుంది కనుక.) సంఘంలోని హెచ్చుతగ్గులు కొంతవరకు సమానతలోకి తీసికొని రావడానికిగాను, ఈ 'లేని వారికందరికీ భూములు ఉచితంగా ఇచ్చేటట్లు చూడడానికే స్వరాజ్యంలో ప్రభుత్వంచేసే మొట్టమొదటి శాసనం ఉంటుంది.

లేనివారికి ఇచ్చే ఈభూములన్నీ ఎక్కడనుండి వస్తవి? ఎవరి జేబులలోనుండి తీసుకోవాలి? స్వర్గదేవత జేబునుండి కాదుకద! మన గవర్నమెంటుకోసం స్వర్గదేవత ఈ భూములను ఆకాశంనుండి పడవేయదుకద? కనుక, ఈభూములు సహజంగా కలవారినుండే రావాలి? వారు యూరపియను లైనాసరే.

నా దగ్గిర ఇంకొక సూత్రం కూడా ఉంది. అది కొంచం తొందరగా వ్రాశాను. ఎందుకంటె, ఈ (రొండు

టేబుల్ సభలో) ప్రస్తావింపగాను, సర్ తేజ్ బహదూర్ సప్రూగారు మాట్లాడుతుండగా, వింటూ వ్రాశాను. ఇప్పుడు కలవారి హక్కులగురించే వ్రాశాను దీన్ని. అదేమంటే:—

"ఇప్పుడు వారి వారికికల హక్కులలో న్యాయార్జితమైనవి, భారతజాతి మొత్తంమీద ఉత్తమశ్రేయస్సులకు విరోధము కానట్టివి అయిన వానిలో వేటితోను — జోక్యముకలిగించు కోరాదు. అనగా, అట్టి శ్రేయస్సులకు వర్తింపజేయతగ్గ చట్టమునను సరించి కాక, వేరు విధముగ జోక్యముకలి గించుకోరాదు"

"నేను బ్రిటిష్‌గవర్నమెంటు శాశ్వతపరిచి మోయుచున్న బరువులన్ని (అప్పులు, కంట్రాక్టులు వగైరా లన్ని) కాబోయే స్వరాజ్యప్రభుత్వముకూడ తన నెత్తిన వేసుకొని మోయాలా అక్కరలేదా" అనే సమస్యను గురించి కాంగ్రెస్ లోగడ చేసియున్న తీర్మానంలోని అంశమే, నా మనస్సులో ఇప్పుడున్నది. నిశ్చయముగ దీనిని దృష్టిలో పెట్టుకొనియే నే నిప్పుడీ సూత్రము ఉల్లేఖించినాను. వీటిని మనం ఒప్పుకొని, నెత్తినవేసుకొనబోయేముందు, వీటిలోని న్యాయాన్యాయములను నిష్పాక్షికులైన మధ్యవర్తులచే పరిశీలింపజేయాలని ఎట్లుకోరుచున్నామో, అట్లే నేడుమన దేశంలో కలవారందరి హక్కులనుకూడ, అవసరంవచ్చినప్పుడు, న్యాయ పరిశీలనకుపెట్టాలి కనుక, ఇందులో ఒకరిఆస్తిని అన్యాయంగా ఊడలాగుకోవడమనే ప్రశక్తే లేదు. ఉన్నవల్లా ఆయా హక్కుల లోని న్యాయాన్యాయాలను పరిశీలించి తెక్కతేల్చి మరి

ఒప్పుకోవాలని చెప్పడం మాత్రమే. యూరోపియనులు ఇండియాలో అనుభవించుచున్న సౌకర్యములను, మిరాశీ హక్కులను గురించి వివరంగా పరిశీలించిన వారు కొందరు మన వారిక్కడ ఉన్నారు. అయితే, ఒక్క యూరోపియనుల హక్కులనేకాదు మనం పరీక్షించవలసింది, ఆడిట్ చేయించవలసింది; ఇట్టి మిరాశీలు, హక్కులు, కలవారు మన ఇండియనులలోకూడ ఉన్నారు. వారి హక్కులుకూడ మనం పరీక్షకుపెట్టాలి. వారిని వదలిపెట్టడానికివీలులేదు. అట్టివారు చాలామంది నిస్సంశయంగా నా మనస్సులోకూడ ఉన్నారు. ఉదా:— తమకు కట్టిపెట్టబడిన భూములుకల పెద్దమనుష్యులు కొందరు మనలోనూ ఉన్నారు. వీరు భారతజాతికి చేసిన మేలుకు ప్రతిఫలంగా కాదు వీరికి భూములు కట్టిపెట్టడంజరిగింది; పోనీ, గవర్నమెంటుకు చేసిన లాభంకోసమా అంటే, అందుకూ కాదు. నిజానికి గవర్నమెంటుకు లాభించింది కూడా ఏమీ లేదు. మరెందుకు ఈ భూములు కట్టిపెట్టబడినవి? ఏదో ఏ ఉద్యోగస్థునికో ఆ పెద్దమనిషి చేసియున్న లాభానికి ప్రతిఫలంగానే ఇవ్వి కట్టిపెట్టబడినవి! ఇట్టి హక్కులను మిరాశీలను రాబోయే స్వరాజ్యప్రభుత్వం పరీక్షించి చూడకూడదంటే, ఇక, ఏమనాలి? పేదలపట్లను— హక్కులు హరింపబడిన వారిపట్లను— లేనివారి శ్రేయస్సుకొరకై— స్వరాజ్యప్రభుత్వయంత్రాన్ని నడపటమే అసాధ్యమౌతుంది. అందువల్లనే నేనుపైన ఉల్లేఖించిన సూత్రములో ప్రత్యేకముగ, "యూరపియను"లను పదమునే వదలివేశాను. ఈ సూత్రం అటు యూరపియనులకూ వర్తిస్తుంది,; ఇటు సర్ పురుషోత్తమదాస్కు

ఠాకూర్ దాస్. సర్ ఫిరోజిషామెహతాల వంటి భారతీయులకూ వర్తిస్తుంది. ఈ మన భారతీయపెద్దమనుష్యులు ఆ నాటి ఏ ఉద్యోగికో ఏదో లాభంకలిగించి— తద్వారా వైశ్యకొలది స్థలాలను భూములను ఉచ్చనంగా తమ చేతచిక్కించుకొని అనుభవిస్తున్నట్లు పరిశీలనలో తేలితే, సరే, ఇక నాకే గనుక ప్రభుత్వాధికారం ఉంటే, వెంటనే ఆ పొలాలు స్థలాలు ఆస్తి ఊడలాగేస్తాను. వారు మన ఇండియనులు కదా అని చూడను ఇక "సర్ హార్ట్బ్రుకాన్" "జెంతాల్" వంటి యూరోపియనుల స్థలాలు పొలాలు హక్కులుకూడ ఇట్లాగే ఊడలాగివేస్తాను. వారు గొప్పవారు కావచ్చు; నాకు స్నేహితులుకూడా కావచ్చు కాక! నేను లెక్కచేయును శాసనమంటే శాసనమే— అందరికీ సమానమే. గొప్పవాడని, స్నేహితుడనీ ఏమీ చూడను. ఈ మాట నేను గట్టిగ, నిర్మొగమాటంగా, హామీగా, చెప్పుతున్నా. ఇంతకంటె నే నేమిచెప్పగలను? పైసూత్రములో నేను ఉల్లేఖించిన "న్యాయార్జితము" అనే పదానికి నిజంగా ఇదే అర్థము. ఇప్పుడు కలవారికున్న ప్రతిహక్కు కల్మషరహితమైనదై యుండాలి; అనుమానానికి కూడ తావుండరాదు, రాజుగారిభార్యాశీలమువలె వేలెత్తి చూపించుకోడానికికూడా ఆస్కారం ఉండరాదు. కనుక, మా స్వరాజ్యప్రభుత్వపునోటీసులోకివచ్చే ప్రతి కలవారి హక్కునుకూడ ఈ రీతిగా శల్యపరీక్షచేసి తీరుతాము అని అందరు గుర్తించుకోవాలి.

అయితే, ఇక "భారతజాతిమొత్తంమీద ఉత్తమ శ్రేయస్సులకు విరోధముకానట్టిహక్కులు" అనే వాక్యము

ఉన్నదికద. వాటికేమంటారా! నా మనస్సులో సంగతులు చెబుతాను వినండి కొన్నికొన్ని హక్కులు, పెరాకేలు. విప్లవకరముగా వాదువాద న్యాయముగ సంపాదించుకొన్నవే అయియుండవచ్చునుగాక. కాని, భారతజాతి యొక్క ఉత్తమ శ్రేయస్సుకు విరోధముగ పరిణమించదగినవికూడ వాటిలోకొన్ని ఉండవచ్చును. దీనికి నేనొక ఉదాహరణ చెబుతాను చూడండి. ఈ ఉదాహరణ మీ కందరికీ కొంచెం వినోదంగాకూడ కనిపించవచ్చు; అయినా చెబుతాను. ఎందుకంటె, అది సహజస్థితియే. "కొత్తఢిల్లీ"- "న్యూఢిల్లీ" అనే నగరాన్ని బ్రిటిష్‌గవర్నమెంటువారు నిర్మించారు. ఇదొక పెద్ద తెల్లఏనుగ. కోట్లు దీనికై ఖర్చయినయి. ఇప్పుడే స్వరాజ్యగవర్నమెంటు, "మనకీ తెల్లఏనుగ ఎందుకు, ఊరికే దీన్ని మేపడం ఎందుకు, దీనిని ఏదైనా ఇంకొక మంచిపనిలో పెడదాము" అని అనుకుంటుందనుకోండి. ఇట్టిస్థితిలో "పాతఢిల్లీలో" ఏదో ప్లేగో, కలరాయో, మహామారియో చెలరేగుతున్నదనుకోండి; పేదవాళ్ళ కందరికీ అప్పుడు ఆస్పత్రులు కావాలనివస్తుంది. అప్పుడేమిచేస్తాము? వీరందరికీ తగినన్ని ఆస్పత్రులు వగైరాలు, స్వరాజ్యగవర్నమెంటు కట్టిస్తూకూర్చుండగలదా? అదెంతమాత్రంకాదు. ఈ కొత్తఢిల్లీలో ఉన్న పెద్దపెద్ద బిల్డింగులన్నీ స్వాధీనంచేసుకొని, ప్లేగురోగులనందరిని వాటిలో పెడతాము. వాటిని ఆస్పత్రులుగ ఉపయోగిస్తాము. ఎందుకంటె, ఇంతపెద్ద బిల్డింగులు, "భారతజాతియొక్క ఉత్తమ శ్రేయస్సుకు విరోధంగా" ఉన్నవి కనుక. ఇదీ నావాదన. ఈ బిల్డింగులు భారత

ప్రజానీకముయొక్క నిజస్థితిని ప్రతిబింబించు చిహ్నములుగా లేవు. ఈ "రౌండ్ టేబుల్" చుట్టూకూర్చున్న ధనికుల కవి చిహ్నములుగా ఉంటే ఉండవచ్చుగాక. ఘనతవహించిన ఈ భోపాల్ నవాబుగారికీ, పురుషోత్తమదాస్ ఠాకూర్ గారికీ, లేక సర్ ఫిరోజిషా సెత్నాగారికీ, లేక సర్ తేజ్ బహద్దూర్ సప్రూగారికీ, అవి చిహ్నములుగా ఉంటే ఉండవచ్చుగాక. తలదాచుకోడానికి చారెడుస్థలంకాని, ఒకపూటతిండి కొరకు కబళంకాని. కరవైన పేదప్రజానీకానికి కవి చిహ్నములుకావు. అట్టి బిల్డింగ్ ఏదైనా అనవసరమని తోచేటట్లయితే, దానికి సంబంధించి ఎవరికి ఏ హక్కులు, మిరాశీలు ఉన్నప్పటికి లెక్కచేయక, స్వరాజ్యప్రభుత్వం దానిని ఆ పెద్దమనిషినుండి ఊడలాక్కుంటుంది; ఊడలాక్కోవడంలో '(కంపెన్ సేషన్)' నష్టపరిహారమనేది ఇవ్వడంకూడ లేకుండ ఊడలాక్కుంటుం దని చెబుతున్నాను. ఎందుకంటె, నష్టపరహారమే స్వరాజ్య గవర్నమెంటు ఇవ్వాలనేటట్టయితే, కాకులనుకొట్టి గద్దలకు వెయ్యవలసివస్తుంది. ఇది అసంభవం.

నేను చెప్పిన ఈమందు చేదుమాత్ర. అయినా, కాంగ్రెస్ ఊహించే స్వరాజ్యమే కనుక వస్తే, కలవారు ఈచేదుమాత్రను మింగక తప్పదు.

(లండన్ రౌండుటేబుల్ మహాసభలో గాంధి గారిచ్చిన ఒక ఉపన్యాసంనుండి. 1932 సం॥లో ప్రచురమైన, "ది నేషన్స వాయిస్", "The nations voice" అనే పత్రిక 71 వ పేజీ)

## C. సంఘ వ్యవస్థ.

# 1

## దొమ్మీలు - శాంతిసేన

దొమ్మీలను శాంతియుతంగా అణచివేయవలెనంటే, మన హృదయంలో నిజమైన అహింస ఉండాలి. తప్పుగా ప్రవర్తించుచున్న రౌడీనికూడా ప్రేమతో కౌగలించుకో గల అహింస మనహృదయంలో ఉండాలి. అట్టి మనస్థితిని మనము సాధనచెయ్యాలి. ఎంతో కాలం, ఎంతో ఓర్పుతో, దొమ్మీలులేని ప్రశాంతప్రదేశాలలో, ఈసాధన చేస్తేకాని మనకట్టి మనస్థితి రాజాలదు. శాంతిసేనలో చేరదలచుకున్న సైనికుడు, తన ఇరుగుపొరుగుననున్న 'రౌడీ' లనబడే వారితో సన్నిహిత పరిచయము, స్నేహము ఏర్పరుచుకోవాలి. వారందరు తనకు తెలిసిఉండాలి; వారికి తాను తెలిసి ఉండాలి. ఆదరపూర్వకమైన, నిస్వార్థమైన సేవద్వారా తాను వారి హృదయములను చూరగొనాలి. "ఛీ, ఈ నీచులతో స్నేహమా" అని ఏవగించుకొనిగాని మనము అసహ్యించుకోరాదు. 'రౌడీ' లనబడేవారు ఆకాశంనుండి దిగివచ్చినవారుకారు పాతాళంనుండి భూతాలవలె పైకి ఉబికివచ్చినవారున్నుకారు. సంఘంలోఉండే అవ్యవస్థవల్లనే వారు రౌడీలుగ తయారవుతారు కనుక, ఇట్టివారు పుట్టుకు వస్తున్నారంటే, ఆతప్పు సంఘానిదే. అంటే, మన సంఘ శరీరంలో ఉన్న కుళ్ళునకు వారు చిహ్నముగ మాత్రమున్నారని గ్రహించవలెను. ఈ కుళ్ళు తొలగించుకొన

ణానికి, అసలు మూలకారణమేమిటో మనము పరిశీలించాలి. రోగకారణం తెలిస్తే, మం దేమి వెయ్యాలో సులభంగా అదే తెలుస్తుంది.

( హరిజన్ : 15-9-1940 )

శాంతిసేనలో చేరడమంటే కేవలం అక్షరాలా నూటికి నూరుపాళ్ళు తమ నిత్యజీవితాలలో అహింసను పాటించే వాళ్ళొక్కళ్లే పనికివస్తారు, ఇతరులు పనికిరారు, అనుకోరాదు. అసలు అహింసాసిద్ధాంతంలో ఉన్న విశేషములేమిటో అవి తనకు నచ్చితేచాలు; మరిన్నీ, వాటిని అనుష్ఠించడానికి తాను నిరంతరం తంటాలుపడేవాడై తేచాలు. నూటికి నూరుపాళ్ళు అహింసను అనుసరించేవాళ్ళు శాంతిసేనకు సరిపడ్డంత మంది దొరకడం సాధ్యంకాదు; నిజాయితీబుద్ధితో, మన స్ఫూర్తిగ అహింసననుసరించడానికి ప్రయత్నంచేసే వాళ్లతో శాంతిసేన ఏర్పాటుచేయబడుతుంది. అంతే.

( హరిజన్ : 21-7-1940 )

మామూలుగా ఆయుధాలుధరించి పనిచేసే సేన దొమ్మీలు జరిగే కాలంలోనే పనిచేస్తుంది. ఇక, మన శాంతిసేనయో, అన్నికాలములలో, దొమ్మీలు జరుగుతున్నరోజులలో, జరగనిరోజులలోకూడ పనిచేస్తుంది. వారు నిరంతరము నిర్మాణకార్యక్రమ కృషిలో నిమగ్నులై ఉంటారు. దానివల్ల అసలు దొమ్మీలు జరగటమనేదే అసంభవమవుతుంది. దెబ్బలాడుకునే వర్గాలవారంతరు దెబ్బలాడుకో

కుండా కలిసిమెలిసిఉండేటట్టు చేసే అవకాశాలు, అవసరాలు అన్ని నిరంతరం అన్వేషిస్తూ వుండటం ఈశాంతిసేన యొక్క పని. శాంతిని బోధించడం, శాంతిని ప్రచారంచెయ్యడం ఆ చుట్టుపట్లవుండే ప్రతిమనిషితో, పిన్నలతో, పెద్దలతో, స్త్రీలతో పురుషులతో కలిసిమెలసివుండి చక్కగా పనిచేసుకునే కార్య క్రమాలు ఏవో కనిపెట్టి,కల్పించి వారిచే అప్రకారం చేయిం చడం- ఇవన్నీ శాంతిసైనికులు నిత్యాము చేయవలసిన విధా యక కృత్యములు. ఎప్పుడైనా మితిమీరి దెబ్బలాటలు, దొమ్మీలు చెలరేగితే అట్టి సమయాలలో ఈ శాంతిసేన వాటి నెదుర్కొని శాంతింపచేయుటకు సదా సంసిద్ధంగా ఉండాలి. మూకల ఉన్మాదం శాంతింపచేయడానికి తగినంత మంది శాంతిసైనికులు తమ ప్రాణాలను అర్పించటానికిసూడ సిద్ధంగా వుండాలి. కొద్దివందలమంది, అవసరమైతే కొద్దివేల మందియొక్క ఇట్టి నిష్కల్మషములైన చావులు, దేశంలో దొమ్మీలిక యెన్నడూ జరుగకుండ స్వస్తి చెప్పివేయుగలవు. ఈ రీతిగా కొద్దివందలమంది యువకులు, యువతులు సహా ఉన్మాదపుమూకల భీభత్సాగ్ని జ్వాలలమధ్యకు దూకి బుద్ధి పూర్వకముగా తమ ప్రాణాలను అక్కడ ఆహుతిచేసివేస్తె ఎంతో మేలు. పోలీసులయు, మిలిటరీ యొక్కయు, బలప్రద ర్శన ప్రయోగాలకంటె ఈ పద్ధతి ఎన్నటికిగాని ఎంతో మేల యినది. ఎంతో పరాక్రమవంతమయినది. ఎంతో చవకయి నది. ( అంటే తక్కువ ధన, మాన, ప్రాణ నష్టముతో పోయేది. )

( హరిజన్ : 26-3-1938 )

(27)

దౌమిన్యాలను,ముఖ్యంగా మతో దేకముచే చెలరేగే దౌమిన్యాలను. ఆపడానికిగాను, తమ ప్రాణాలు అర్పించే శాంతిసైనికులతో ఒక శాంతిసేనను ఏర్పాటు జేయాలని నే నొకప్పుడు సూచించాను. పోలీసులతో పనిలేకుండ, మరి మిలిటరీతోగూడ పనిలేకుండ ఈ శాంతిసేనయే పనులు నిర్వహించాలని నా ముఖ్యోద్దేశం.

కనుక ఈ శాంతిసేనలో చేరదలుచుకున్న వా రెట్టివా రయి వుండాలో చూద్దాము—

(1) ఈ శాంతిసైనికునకు (స్త్రీకిగాని, పురుషునకుగాని) అహింసలో ఎన్నడూ తిరుగులేని విశ్వాసంవుండాలి. ముందుగ యిట్టి గట్టి విశ్వాసం భగవంతునిపై వుంటేతప్ప ఇది సాధ్యంకాదు. భగవంతుని శక్తివల్ల తప్ప, ఆయన యిచ్ఛవల్లతప్ప అహింసాపరుడెన్నడూ ఏ పనియు చేయనేలేడు. ఈశ్వరశక్తి తనలో లేకపోతే అహింసావాది క్రోధంలేకుండ, భయంలేకుండ, ప్రతీకారబుద్ధి లేకుండ తనప్రాణాన్ని బలి ఇవ్వటానికి సంసిద్ధుడు కాలేడు. ఇట్టి సంసిద్ధత, ధైర్యము సాహసము భగవంతుడు అందరి హృదయములలోను ఉన్నాడనే గట్టినమ్మకం లేకపోతే రాదు. అందరి హృదయాలలోను సర్వత్ర భగవంతు డున్నప్పుడు, అంతయు భగవత్ సాన్నిధ్యమే అయినప్పుడు అట్టి భగవత్సన్నిధిలో భయమెందుకు? భగవంతుడు సర్వవ్యాపిఅని తెలిసికోవడమంటే 'విరోధులు, గుండాలు, రౌడీలు,' అని చెప్పబడే వాళ్లల్లోగూడ భగవంతుడున్నాడని తెలుసుకోవడమేకద. కనుక అట్టివారి ప్రాణాల

ఎడలకూడ మనము భక్తిశ్రద్ధలు చూపవలసినదేయని మనం తెలుసుకోవాలన్నమాట. మనిషిలోనున్న పశుప్రవృత్తి ప్రకోపించి మనిషిని ఉన్మాదవశుని చేసినప్పుడు శాంతిసైనికుడు అతనిని అడ్డుకొనవలసినది అతని ఉన్మాదమును శాంతింపచేయటానికే అని తెలుసుకొనవలెను.

(2) ఈ శాంతిదూతకు ప్రపంచములోగల అన్నిమతములయెడ సమాన గౌరవము ఉండాలి. ఉదాహరణకు-అతడు హిందువైతే ఇండియాలోనున్న తదితర మతము లన్నింటి యెడల గౌరవము చూపుతాడు. కనుక ఆయా మతములలో గల సామాన్యధర్మముల నన్నింటిని శాంతిసైనికుడు తెలుసుకొనియుండాలి.

(3) సాధారణంగా ఈ శాంతికార్యక్రమమంతా ఆయాచోట్ల ఆయాచోట్లనున్న స్థానికులే చేయవలసివుంటుంది.

(4) ఈపనిని ఒక్కొక్కరే ఎవరికివారు చేయవచ్చును; లేదా ముఠాలుగా చేరి చేయవచ్చును. కనుక ఇతరులు రాలేదేయని ఎవరుకాని ఎదురుచూస్తూ ఊరికే కూర్చుండనక్కరలేదు. అయినప్పటికీ చుట్టుపట్టులనున్న వారిని తనకు తోడుగా చేసికొని ఒక శాంతిసేనను. శాంతిదళమును తయారుచేసుకోటానికి ఎవరుకాని ప్రయత్నించడంలో అసహజమేమీలేదు

(5) తనచుట్టుపట్టులనున్న ప్రజలకు, స్థానికులకు తాను స్వయముగా సేవచేస్తూ ఈశాంతిదూత వారందరితో చక్కని

పరిచయం ఏర్పరచుకుంటాడు. దొమ్మీల సమయాలలో విపరీతపు వికారసందర్భము లేర్పడిన స్థితిలో ఈశాంతిమాత దొమ్మీలాడుకునే ఆ జనానికి కంటబడ్డప్పుడు అతడు వారికి ఎవరో అనుమానపు కొత్త మనిషిలాగ- తమమధ్యకు దూకిన ఎవరో అయిష్టుడయిన పరాయివాడులాగ- కనుపించడు.(అతనిని చూచి వారు సిగ్గుపడి వెనుకకు తగ్గవచ్చు. /

(6) ఇక శాంతిమాతయొక్క ప్రవర్తన ఎట్టినిందలకు గాని, అపవాదులకుగాని దూరమైనదిగా వుండాలని వేరే చెప్పనక్కరలేదు ఆతడు నిజంగా నిష్పక్షపాత బుద్ధికలవాడని అందరికీ ఖచ్చితంగా తెలిసినవాడైకూడ వుండాలి.

(7) దొమ్మీలు రాబోతున్నవని కొంచెంముందుగానే సూచనలు సాధారణంగా కనుపిస్తవి. ఇట్టివి కనిపించినప్పుడు అవి వచ్చిపడేదాకా శాంతిసేన చూస్తూ కూర్చుండరాదు. ముందుగానే వాటిని వారించటానికై ప్రయత్నంచెయ్యాలి.

(8) శాంతిసేనోద్యమం పెరగాలంటే తమ పూర్తి కాలం దీనికే వినియోగించే కార్యకర్తలు ఉండడం మంచిదే అనుకోండి. కాని ఇట్టిది కేవలం వుండితీరాలిసిన పనిలేదు. వీలయినంత హెచ్చుమంది మంచివారు (స్త్రీలు, పురుషులు సహా ) తయారై వుంటేచాలు. ఎవరిపనులువారు మామూలుగా చేసుకుంటూ వుండి తమ చుట్టుపట్ల జనంతో స్నేహభావములు పెంపొందించుకొనడానికి తగిన తీరిక, ఓపిక ఉన్నవారు ఉంటేచాలు. శాంతిసైనికుని కుండవలసిన యోగ్యతలు

కలవారయినాకూడ వీరు వుండాలి. రకరకాలయిన వృత్తులలో ఉన్నవారినుండి కట్టి శాంతిమూకలను తయారుచేసి పెట్టుకోవడం మంచిది.

(9) ఈ మన శాంతిసైనికులకు ప్రత్యేకరకమైన దుస్తులుండడంకూడ అవసరమే. కొంతకాలమయ్యేటప్పటికి, ప్రజలు వీరిని సులభంగా గుర్తించగలుగుతారు.

ఇవన్నీ సాధారణసూచనలుమాత్రమే. వీటి ఆధారం మీద, ఎక్కడికక్కడ వారు తమకు అనుకూలమైన వ్యవస్థను నిర్మాణంచేసుకోవచ్చును.

(హరిజన్: 18-6-1938)

నా సూచనమీద ఒకటొకప్పుడు శాంతిదళములు ఏర్పరుచుటకై కొంతప్రయత్నం జరిగెను కాని, దాని కేమీ కార్యరూపందాల్చలేదు; పనిజరగకపోవడానికి కారణమేమో తెలిసికోవడం మాత్రం జరిగింది. ఇట్టి శాంతి దళాలలో చేరడానికి వచ్చేవారిసంఖ్య హెచ్చుగ ఉండజాలదు. ఇదిసహజమే. దానికిపెట్టిన నియమములే ఇందుకు ముఖ్యకారణములు. పాశ్చాత్యపద్ధతులు ఉపయోగించే మామూలు సేనలో అయితే,ఇట్టినియమాలు ఉండవు.ఆసేనలోచేరేవాడికి ముఖ్యంగాకావలసిందిమంచి కండబలం,ఒడ్డూపొడుగూ,ఉండేచాలు. వాడిగుణగణాలతో ఆక్షేపణలేదు! వాడు తప్పుచేస్తే వాడిమీద బలప్రయోగంచేసి, చక్కబరుస్తారు. మామూలుసేనను పటిష్టంగా నడిపించే పద్ధతులివ్వి! ఇక మన శాంతిసేన కివ్వేవి

పనికిరావు కదా. ఇందులో చేరే సైనికునకు ప్రధానంగా కావలసింది వాని సహనశక్తి, ఆత్మశక్తి: కండబలం రెండోపక్షం. ఇట్టి మనుష్యులు హెచ్చుమంది దొరకడం కష్టం. అందువల్లనే, శాంతిదళం చిన్నసైజుదై ఉంటుంది. అప్పుడే అది పటిష్టంగా పనిచేయగలదు. ఇట్టిదళాలు అన్నీ ఒకచోటనే ఉండనక్కరలేదు. ఎక్కడికక్కడ వేర్వేరు చోట్ల ఉండి పని చేస్తూ ఉంటవి. గ్రామానికొకటి చొప్పుననో లేక వార్డుకొకటి చొప్పుననే ఉండవచ్చును. శాంతిదళములోని వారు ఒకరికొకరు బాగా ఎరిగున్నవారై యుండాలి. ఏదళానికి ఆదళం తన నాయకుని ఎన్నుకుంటుంది. అందలి సైనికులకందరికి సమానమైన హోదాయే ఉంటుంది. నిజానికి అందరూ సమానులే. ఒకరు హెచ్చూకాదు, మరొకరు తగ్గూకాదు. అయితే, అందరూ కలిసి సమిష్టిగా ఒకపని చేయదలచుకున్నప్పుడు, దానిని నడిపించడానికి వారిలో ఒకరు నాయకుడుగ ఏర్పడకతప్పదు. లేకపోతే, అసలుపనే పాడవుతుంది. రెండుమూడుదళాలు పనిచేయవలసినచోట్ల దళనాయకులు సంప్రతించుకొని ఉమ్మడిగ కలిసి పనిచేసే మార్గమేదో నిర్ణయించుకోవాలి. పని జయప్రదంగా జరగడానికి ఇదే సూత్రం.

పై పద్ధతులమీద శాంతిదళాలేర్పడితే ఎక్కడ ఉపద్రవాలు జరిగినా తేలికగ ఆపివేయవచ్చు. తాలింఖానాలలో నేర్పే కసరత్తులన్నీ ఈ శాంతిసైనికులకు నేర్పవలసిన పనిలేదు. వాటిలో ఏ కొద్దివో నేర్పితే చాలు.

ఈ శాంతిసైనికుల కందరికి సర్వసామాన్యధర్మంగా ఉండవలసిన నియమ మొకటున్నది. అదే భగవంతుని యందు తిరుగులేని విశ్వాసం. ఆ భగవంతుడే అందరికి అండ. అన్నిపనులు చేయించేది, చేసేదీ, వాడునే. ఈ భక్తివిశ్వాసాలులేనిది ఈ శాంతిదళాలు ప్రాణాలులేని శవాలే అవుతవి. ఆ భగవంతునికి ఎవరే పేరు పెట్టుకొన్నా ఫరవాలేదు. అయితే, ఎవరుకాని ఆభగవంతుని శక్తిద్వారాతప్ప ఇంకొక ద్వారా ఏపనీ చెయ్యనే చెయ్యలేడు. ఈ సంగతి మాత్రం ప్రతి ఒక్కరు గ్రహించాలి. అట్టి శాంతిసైనికుడు అట్టి వ్యక్తి ఇంకొకమనిషియొక్క ప్రాణాన్ని ఎలా తీయగలడు? అవసరమైతే తననే ఆహుతిగా మృత్యుదేవతకు బలి ఇచ్చుకుంటాడు. ఈ రీతిగా అతడు మృత్యుంజయుడై చిరంజీవి అవుతాడు.

ఎవరైతే తన ఇహలోకయాత్రలో ఈ ధర్మమును సాధించి తనదిగా చేసుకుంటాడో, అట్టివాని మనస్సు క్లిష్ట సమయాలలో బెదిరి కంగారుపడదు. కర్తవ్యతా మూఢత్వమును చెందదు. తాను తొక్కవలసిన సరియైన మార్గమేదో అతనికి తక్షణమే, స్వతసిద్ధముగానే దానంతటఅదే తెలిసిపోతుంది.

నేను పైన అనేక సంగతులు చెప్పాను. అయినా నా అనుభవంలో నాకు తోచిన మరికొన్ని నియమాలు కూడ ఈ దిగువ ఉటంకిస్తాను.

(1) శాంతిసైనికుడు తనవద్ద ఆయుధాలు ఉంచుకోరాదు.

(2) ఈ శాంతిసైనికులు అందరిచే సులభంగా గుర్తు పట్టబడగలిగి ఉండాలి.

(3) ప్రతిసైనికుని దగ్గర గుర్తింపునకు ఒక బిళ్ళ (బ్యాడ్జి) ఉండాలి. కత్తెర,సూది, దారం, చిన్నబాకువగైరాలుండాలి. దెబ్బలుతిన్నవారికి కట్లు వగైరాలుకట్టి ప్రథమ చికిత్స చేయడానికి ఇవి అవసరము.

(4) దెబ్బలుతిని పడిపోయినవారిని జాగ్రత్తగ ఎత్తుకొని, సురక్షితస్థానాలకు చేర్చడం ఏలాగో ప్రతి శాంతిసైనికునికి తెలిసిఉండాలి.

(5) నిప్పుమంటలు ఆర్పడం ఎల్లాగో-తాను ఒళ్ళు కాల్చుకోకుండా, మండేచోట్ల ప్రవేశించడం ఎలాగో - ఎత్తుచోట అపాయంలో చిక్కుకుపోయిన మనిషిని రక్షించడానికిగాను అట్టి ఎత్తుచోటికి ఎక్కడం ఎలాగో, మరి అక్కడనుండి ఆ మనిషితో తిరిగి జాగ్రత్తగ దిగడం ఎలాగో, - అదిసాధ్యం కాకపోతే తానొక్కడే సురక్షితంగా దిగి రావడం ఎలాగో- ఇవన్నీ శాంతిసైనికునికి తెలిసి ఉండాలి.

(6) తన ఇరుగుపొరుగు జనాన్నందరిని శాంతిసైనికుడు బాగా ఎరిగిఉండాలి. ఇదే ఒక రకమైన సేవకూడ.

(7) తా నెప్పుడూ తనహృదయంలో నిర్విరామంగా రామనామం జపిస్తూ ఉండాలి. దాని యందు నమ్మకం ఉన్న వాళ్ళకూడా అలాజపిస్తూ ఉండేటట్లు ప్రోత్సహించాలి.

చిలకపలుకులులాగ మనుష్యులు కొందరు భగవన్నామం ఉచ్చరిస్తూఉండి దానితోనే ఫలితం రావాలని ఆశిస్తూఉంటారు. కాని, నిజమైన సత్యాన్వేషికి నిజమైన భక్తి ఉండాలి. చిలుకపలుకులవల్ల ఫలితంవస్తుందనే అసత్యమును, భ్రాంతిని, అతడు తన మనస్సునుండి పారద్రోలుకొనుటయేకాక, తదితరుల మనస్సునుండికూడ పారద్రోలుటకు ప్రయత్నించాలి.

( హరిజన్ : 5-5-1946 )

## —: మతంపేర ఖూనీలు పనికిరావు :—

ఖూనీకి ప్రతీకారం ఖూనీకాదు. నష్టపరిహారం తీసికోవడమున్నూ కాదు. ప్రతీకారవాంఛ లేకుండ, తనంతట తాను ఆత్మార్పణ చేసుకోవడమే ప్రశస్తమైన ప్రతీకారం. ఖూనీకి ఖూనీచేయడం, డబ్బునష్టపరిహారం తీసుకోవడం ఆ వ్యక్తికి కొంత సంతృప్తి ఇస్తే ఇవ్వవచ్చుకాక—కాని మొత్తం సంఘానికది శాంతినికాని, ఉన్నతినికాని ప్రసాదింపజాలదు.

(హరిజన్ : 18-8-1946)

(28)

:— పోలీసు బలం :—

అహింసా రాజ్యంలోకూడ పోలీసుబలం అవసరమైతే కావచ్చు. ఇది నాఅహింసయొక్క అసంపూర్తికి మాత్రమే చిహ్నమని చెబుతాను. ఈ మాట నేను ఒప్పుకుంటాను. సైన్యం అక్కరలేదని చెప్పగలిగినంతధైర్యం, పోలీసు బలం అక్కరలేదనిచెప్పడానికి నా కింకా ధైర్యంచాలదు. పోలీసులతోకూడ అవసరంలేకుండ గవర్నమెంటు సాగించ వచ్చుననే స్థితి నేను నామనస్సులో చిత్రించుకోగలను, చిత్రించుకుంటున్నానుకూడ. అయితే, ఇట్టిస్థితిని మనం క్రియారూపంలో సాధించగలమో లేమో అనే సంగతి భవిష్యత్తే చెప్పగలదు.

అయితే, నేను చిత్రించుకునే పోలీసుబలం, ఈ నాడున్న మామూలు పోలీసుబలం మాదిరిది కాదు; అది దీని కంటె పూర్తిగాభిన్నమైనది. నా పోలీసుబలంలో ఉండే వారందరుఅహింసయందునమ్మకంఉన్నవారే ఉంటారు. వారు ప్రజలకు యజమానులుగా ఉండరు. సేవకులుగానే ఉంటారు. ప్రజలు వారికి స్వతస్సిద్ధప్రేరణచేతనే తోడ్పడుతూ ఉంటారు. ప్రజలు ఈపోలీసులుకలిసి అన్యోన్యసహకారంవల్ల దొమ్మీలను సులభంగా అణచివేయగలుగుతారు. ఇవి అందువల్ల నానాట నాటంతటవే తగ్గిపోతూ ఉంటవి. వారిచేతిలో ఏదో రకమైన ఆయుధం ( సాధన ) ఉంటుంది. అయితే దానిని అంతగా ఉపయోగించవలసిన అవసరం ఉండదు. ఎప్పుడో అంత మీదుమిక్కిలివస్తే సకృత్తుగ ఉపయోగించబడుతుంది.

నిజానికి, నా పోలీసులు సంఘాన్ని సంస్కరించేవారుగానే ఉంటారు. వారి డ్యూటీ ప్రధానంగా దొంగలమీద దోపిడీగాండ్రమీదనే పరిమితమై ఉంటుంది. కార్మికులకు, ధనికులకు మధ్య తగాదాలు, సమ్మెలు, అహింసా రాజ్యంలో బహు తక్కువగా ఉంటవి. అహింసాపరులైన మెజారిటీ సంఖ్య జనంయొక్క పలుకుబడి చాలా హెచ్చుగా ఉంటుంది. కనుక సంఘంలో ప్రధానవర్గాలకు వారంటే చాలా గౌరవం ఏర్పడుతుంది. అదేరీతిగా మతోద్రేకపు దొమ్మీలకుకూడ తావుండదు.

( హరిజన్ 1-9-1940 )

# 2

## :— చోరీలు :—

దిట్టంగా ఆయుధాలుధరించి యున్న ఒకానొక దోపిడీగాడు నీ ఆస్తిని దొంగిలించినాడు. వాణ్నేమీ చేయలేక ఈ సంగతిని నీవు నీమనస్సులోనే కసిగ పెట్టుకొని ఉన్నావు. నీ ఒళ్ళంతా క్రోధంతో నిండి మండిపోతూ ఉంటుంది. ఆ 'దొంగవెధవను' తప్పక శిక్షించాలని కోరుకుంటావు. నీకోసంకాదు, నీ చుట్టునున్న సంఘంయొక్క క్షేమంనిమిత్తమే వాణ్ని పట్టి శిక్షించవలసిన ధర్మం ఉందని నీకు నీవు అదొక ధర్మంగా నిరూపించుకుటావు. అందుకని, కొంతమంది ఆయుధధారులైన మిత్రాను సమకూర్చుతావు, ఆ 'దొంగవెధవ' ఇంటినిముట్టడించి పట్టుకోడానికి బయలు దేరు

తావు. ఈ సంగతి ఆ దొంగకు ఎలాగో తెలుస్తుంది. వాడు ఇంట్లో ఉండకుండ ముందుగానే పారిపోతాడు. వాడికి కోపం చేత ఒళ్ళు మండిపోతూ ఉంటుంది. వాడు తనతో డిదొంగల ముఠాను సమకూర్చుకుంటాడు. "చూడండి, నేను పట్టపగలే దోపిడీ సాగిస్తాను; నా తడాఖా చూచుకోండి, మీరేమి చేయగలరో చూస్తాను" అని మీ ముఠాకు ఖాసందువ్వి సవాల్ పంపిస్తాడు.

మీ ముఠా బలమైనదికనుక మీ రా బెదరింపులకు జంకరు. "సరే! రా" అని సిద్ధమౌతారు ఈలోగా దొంగలు మీ యిరుగుపొరుగువారి నందరిని నానా యాతనలు పెట్టడం సాగిస్తారు ఆ జనం అంతా వచ్చి నీముందు గగ్గోలు పెడతారు. "నేనిదంతా నా ఆస్తిపోయినందుకు కాదండీ! నాది పోతే పోనీయండి. నేను లెక్క-చెయ్యను. ఇదంతా మీ అందరి క్షేమం నిమిత్తమే చేస్తున్నానండీ!" అని నీముందు గగ్గోలుపెట్టే నీ యిరుగుపొరుగు జనానికి జవాబు చెప్పుతుం టావు అప్పుడు వారేమంటారంటే "అయ్యో! ఈదొంగ ఇంతకుపూర్వం మమ్ముల నెన్నడు బాధించలేదండి. మీరు వాడిమీద దాడి ప్రకటించినప్పటినుండియే మా కొంపల మీదపడి రావటం సాగించాడు. ఇదెక్కడి బెడద తెచ్చిపెట్టా రయ్యా మీరు మాకు!" అని వారు బదులుచెపుతారు. నీ పని ఇరుకున పడుతుంది. ముందుపోతే గొయ్యి, వెనక్కు-పోతే నుయ్యి. నీ యిరుగుపొరుగు జనాన్ని చూచి నీవు పాపం! నిజ ముగా జాలిపడటం సాగిస్తావు. "వాళ్ళుచెప్పేదీ నిజమే!"

చూస్తుంటావు. ఇక అప్పుడు నీకు గత్యంతరమేమిటి! ఇట్టి స్థితిలో దొంగను స్వేచ్ఛగా వదిలివేస్తే నీకు నామోషీ కాదా! అందువల్ల నీ యిరుగుపొరుగు జనానికి ఏమని చెబుతావు! “ ఫరవాలేదు రండి. నా డబ్బే మీ డబ్బు. ఇదుగో తీసుకోండి. ఇవిగో కత్తులు. కానుకలు మీకు యిస్తున్నాను. రండి; ఇవి ఎట్లా ఉపయోగించాలో మీకు నేర్పుతాను. “ ఆ దొంగవెధవ ” ను ముట్టడించి పట్టుకొని చావచితక కొడదాము పదండి. వాడిని వదిలిపెట్టవద్దు “ అని వారిని హెచ్చరించి తయారుచేస్తావు దాంతో యుద్ధం ప్రారంభమవుతుంది. దొంగలముఠాలు అంతకంతకు హెచ్చి మరీ చెలరేగుతవి. నీ యిరుగుపొరుగు జనము ఆ దొంగలముఠాలను ఇరుకున పెట్టడం వల్లనే వాళ్ళు మితిమీరి చెలరేగటం కలుగుతుంది. ఆ దొంగమీద కసితీర్చుకుందామని నీవు కోరిన కోరికకు తుదకు పర్యవసానం ఇట్లుగా తేలుతుంది. అనగా నీవు నీ మనశ్శాంతిని కోల్పోయినవాడవగుటయే కాక నీయిరుగుపొరుగు వారినికూడా అవస్థపెట్టినవాడవవుతావు. ఏ నిముషమందు నీ కొంప దోచుకుంటారో, నీ మీద వచ్చిపడతారో అని నీవు క్షణక్షణం భీతావహంతో చచ్చిపోతూ ఉంటావు. నీ ధైర్యము పటాపంచలై నీలో పిరికితనం ప్రవేశిస్తుంది. ఓపికతో పై సంగతులన్నీ నీవు పరిశీలించి చూచుకుంటే నేనుచెప్పింది అతిశయోక్తి కాదని నీకే గోచరమవుతుంది. ఈ దొంగల సమస్యను పరిష్కరించటానికి నీవు అవలంబించినది ఒకపంథా కదా.

ఇక వేరొకపంథా ఏదైనా ఉందేమో ఆలోచించి చూద్దాము. నీ మనస్సులో ఈ దిగువరీతిగా ఆలోచనలు సాగిస్తావనుకో, ఏమని—

"ఆదొంగ అజ్ఞానియైన నా సోదరుడే; అనుకూల సమయంచూచి వానితో మంచిగ వాదించి చూద్దాము. వాడూ నావంటి మనిషే. వానికి ఈ దొంగబుద్ధి యెందుకు కలిగింది చెప్పుమా! కనుక, దొంగిలించడానికి వానిని ఏ కారణం ప్రేరేపించిందో తెలుసుకొని ఆ కారణాన్ని తొల గించటానికి ప్రయత్నం చేస్తాను" అని నీలోనీవు అనుకుంటు వుండగా ఆ దొంగమరల వస్తాడు దొంగిలించటానికి వాడిని. చూస్తే నీకు కోపంరావడానికిబదులుగా వానిపై జాలికలుగు తుంది. "దొంగిలించడం అనేది పాపం! వీడిలో ఏదో జబ్బు లక్షణం; అంతేకాని వేరుకాదు." అని జాలిపడతావు ఇక అప్పటినుంచి నీవు నీ యింటి తలుపులూ, కిటికీలు మూసుకో కుండా బార్లాగా తెరిచే వుంచుతావు. నీవు మామూలుగా పడుకునే జాగ్రత్తైనచోటు మానేసి బహిరంగంగానే రాత్రి పడుకుంటావు. నీ వస్తువులన్నీ దొంగకు బాగా చేజిక్కేటట్లు గానే పడేసి వుంచుతావు దొంగ వస్తాడు. చూస్తాడు. ఇదం తా ఏమిటని ఆశ్చర్యపడతాడు. నిర్ఘాంతపోతాడు. ఇదంతా వాడికేదో కొత్తగ ఉంటుంది. అయినాసరే అని నీ వస్తువులు చేతపుచ్చుకొని పోతాడు. కాని, వాడిమనస్సుమాత్రంఆందో ళనలో, ఆలోచనలో పడుతుంది. నీ సంగతి ఏమిటని ఊళ్ళో విచారించుకుంటాడు. ప్రేమపూరితమైననీవిశాలహృదయాన్ని

గూర్చి విని తెలిసికొని గ్రహిస్తాడు. వానికి మనస్తాపం కలుగుతుంది. మీ క్షమాపణ కోరుతాడు. ఆ వస్తువులు తిరిగి ఇచ్చివేస్తాడు. దొంగఅలవాట్లు మానేస్తాడు. వాడు నీకు సేవకుడే, భక్తుడే అయిపోతాడు. వానికి నీవు ప్రాణప్రదమయిన జీవనప్ర వృత్తి ఏదో చూపిస్తావు. ఇదీ నా పంథా. ఈ రీతిగా ప్రత్యేక పంథాలవల్ల ప్రత్యేకఫలితాలు కలుగుచున్నవి కదా!

దీనినిబట్టి దొంగలందరు ఈ ప్రకారమే ఎల్లప్పుడు ప్రవర్తింతురని అనుకొనుటకు వీలులేదు. అదిగాక ఆ దొంగ మొదల నీకున్నంత దయ, జాలిఅందరికీవుండుననుటకును వీలులేదు. ఇంతకూ నేను చెప్పదలచుకున్న దేమనగా సత్యాగ్రహము వలననే సత్ఫలితములు కలుగును కాని మరి ఇతరసాధనములవల్ల కలుగజాలవు. అన్ని విషయములలో కాకపోయినా ఈ లోకంలో చాలావరకు భుజశక్తికంటె ప్రేమశక్తియే చాల ఉత్తమమైన దనుట నిర్వివాదాంశము. మోటుబలమును ప్రయోగించినందువలన హాని కలుగును కాని, ప్రేమబలమును ప్రయోగించినందు వల్ల ఎన్నడును అపాయము కలుగ నేరదు.

ప్రశ్న :— తన నౌకరొకడు దొంగతనానికి అలవాటుపడి, సాత్వికంగా బుజ్జగించి చెప్పినా, బెత్తంతో కొట్టి చెప్పినా మానడనుకోండి. అప్పుడు యజమాని ఏమి చెయ్యాలి ?

జవాబు :— యజమానికి నా సలహా ఏమంటే :— దొంగతనానికి వాణ్ణి పురికొల్పే ఆశలు, అవకాశాలు వానికి

అందుబాటులో లేకుండా చెయ్యాలి. వాడు నీ తమ్ముడే అయితే ఎలా చూస్తావో అలా వాణ్ని చూడాలి. ఎంత చేసినా ఎంత దయగా చూచినా వాడు దొంగ అలవాటు మానక పోతే, "అబ్బాయి ఇక నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళిపో" అని వాణ్ణి వదలించుకోవాలి. ఇటువంటి స్థితిగా నా తమ్ముడే ఉంటే వాణ్ణి "నేనేమి చేస్తాను" అని నీకు నీవు ప్రశ్నించుకో. ఇదీ నేను యజమానికి చెప్పే సలహా.

(హరిజన్ : 21-7-1946)

"ఉర్లీ" అనే చోట ఒకరోజు సాయంకాలం ప్రార్థన అయిన తరువాత గాంధిగారిలా అన్నారు :—

దొంగపైన లేక ఏ నేరస్థుని పైనకాని విద్వేషం వహించి వాడిని శిక్షింపచేయాలని చూడడం కంటె, అసలు వాడి మనస్సులో మనం దూరి చూడాలి. ఈ నేరం చేయడానికి వాడిని ప్రేరేపించిన అసలు మూలకారణం ఏమిటో మనం అవగాహన చేసుకొని దానిని తొలగించడానికి ప్రయత్నం చెయ్యాలి. ఒక ఉదాహరణ చెబుతాను వాని కేదో వృత్తి నేర్పి నిజాయితీగా బ్రతకటానికి వాని కేదో దోవ చూపించి వాడి జీవితపంథానే మార్పుచేయుటానికి మనం ప్రయత్నించాలి. "దొంగ అనే వాడు కూడ మనవంటివాడే. వాడు మనకంటె భిన్నమైనవాడు కాడు" అని మనం గ్రహించాలి. నిజానికి కొగడాను మన హృదయాల వైపునకే త్రిప్పు కొని పరీక్ష చేసి చూచుకుంటే ఆ దొంగకూ, మనకూ ఉన్న

తేడా వస్తుతః తేడాగా కనిపించదు. "వారు పెద్ద వారంగ; మనం చిన్నవారంగ; అంతే" అని స్పష్టమవుతుంది.

(11-8-1946)

## 3

### —: స్త్రీలపై దౌర్జన్యం :—

ఎక్కడ అహింసా వాతావరణం ఉంటుందో, ఎక్కడ నిరంతరం అహింసా ధర్మం ప్రబోధింపబడుతూ వుంటుందో అక్కడ స్త్రీ తనకు తాను దుర్బలురాలనని కాని, దిక్కులేని దానననికాని; పరాధీనురాలనని కాని అనుకోనదు. నిజానికి పవిత్రురాలయిన స్త్రీ అబలకాదు. ఆమె పవిత్రతయే ఆమెకు బలం యిస్తుంది. స్త్రీయొక్క యిచ్ఛకు వ్యతిరేకంగా ఆమెను చెరపడం ఎవరికీగాని సాధ్యంకాదని నా మతం. ఆమె భయానికి లోబడ్డప్పుడో, తన నైతికబలాన్ని తాను గుర్తించనప్పుడో మాత్రమే ఇట్టి చెరుపు జరుగుతుంది. తనమీదికి వచ్చే మోటువాని మోటుబలాన్ని ఎదిరించటానికి తగిన మోటుబలం తనకు లేకపోతే ఆమె పవిత్రతయే ఆమె శీలమును కాపాడజాలివుంటుంది. అనగ వాడు తన శీలమును భంగపుచ్చడంలో కృతార్థుడు కాకమునుపే ఆమె తన ప్రాణాలను బలిఇచ్చుకొనుటకు తగినంత బలమును ఆమెకు ఆమె పవిత్రతయే ప్రసాదిస్తుంది.

సీతామ్మవారి సాదృశ్యం చూడండి. రావణాసురుని మోటుబలంముందు ఆమె ఎంత? అయినప్పటికి ఆమె పవిత్ర

శీలమే వాడి మోటుబలాన్ని అణచివేయగలిగింది. అనేక మైన ఆశలుపెట్టి ఆమెను తన వశం చేసుకోవాలని రావణాసురుడు చూశాడు. అంతేకాని ఆమె అనుమతిలేక ఆమె వంటిమీద తన కామస్పృశ్య హస్తమును ఉంచలేక పోయినాడు. అట్లుకాక ఏ స్త్రీ అయినా తన మోటుబలంమీదకాని, తన చేతిలో ఉన్న ఆయుధబలంమీదకాని ఆధారపడితే ఆ బలం తరిగిపోయినప్పుడు ఆమె తప్పకుండ పరాజయం పొందితీరుతుంది.

తండ్రికాని, సోదరుడుకాని మిత్రుడుకాని, తన రక్షణలోనున్న స్త్రీ పైకి ఏ దుర్మార్గుడైనా వస్తే ఆ దుర్మార్గునికి ఆ స్త్రీకి మధ్య ఆ తండ్రియో ఆ సోదరుడో, ఆ మిత్రుడో అడ్డంగా నిలబడాలి. ఈ క్రూరకార్యం చేయరాదని ఆ దుర్మార్గునితో చెప్పి మాన్పించనైనా మాన్పించాలి. లేదా ఆ రక్షణకార్యంలో * తనుబలియైనాఐపోవడానికి సిద్ధపడాలి. ఇలా తన ప్రాణాలు బలిఇస్తే ఆతను తన విధిని నెరవేర్చినవాడగుటయేగాక తాను రక్షించవలసిన స్త్రీకి క్రొత్తబలమును కూడ ఇచ్చినవాడవుతాడు. అనగా— ఆమెకూడ తన మానమును ఆ బలియైనవాని వలెనే తన ప్రాణాలు బలియిచ్చుట ద్వారా కాపాడుకో గలుగుతుందన్నమాట.

( హరిజన్ : 1-9-1940 )

“ తన శీలమే తనకు తిరుగులేని రక్ష ” అనే ధీరతతో వున్న స్త్రీని ఎవడుకానిచెరుపనేలేడు. ఇది నా దృఢవిశ్వాసం.

---

* జటాయువు సీతరక్షణకై తన ప్రాణాన్ని బలి యిచ్చినట్లు.

ఆ దుర్మార్గుడు ఎట్టి మోసపుటెత్తులైనా కానీ కాక - కళ్ళుమిరుమిట్లు గొలుపు ఆమె పాపశీల తేజోజ్వాల ముందర నిలువలేక, సిగ్గుపడి, తలయెత్తలేకపోతాడు. ఈ ఆధునికయుగంలో కూడ తమ శీలమును ఆ రీతిగా సంరక్షించుకున్న స్త్రీలు ఉన్నారు. ఈ వ్యాసంవ్రాస్తూవుంటె అట్టి ఉదాహరణలు నాకు రెండు జ్ఞాపకం వచ్చినవి. కనుక ఈ వ్యాసం చదివే స్త్రీలందరు ఈరీతిగా వుండాలని నేను కోరుతున్నాను. ఈరీతిగ నిర్భీతిని అలవరుచుకోవాలని కోరుతున్నాను. అట్లు నిర్భీతులయితే దుర్మార్గులను తలచుకొని ఏ స్త్రీ కాని ఇప్పుడు వణకిపోతున్నట్లుగా వణకిపోదు. తల్లిదండ్రులు, భర్తలు, స్త్రీలకట్టి నిర్భీతిని బోధించాలి. ఈ నిర్భీతిని అలవరుచుకోవడానికి భగవంతునియందు ఎన్నటికి చెదరని విశ్వాసముతో ఉండడమే ప్రశస్తమయిన మార్గం భగవంతుడు మన చర్మచక్షువులకు కనిపించకపోయినా - ఆతడే మనకు గతితప్పని సంరక్షకుడు. అట్టి గట్టి విశ్వాసమున్నవాడే అందరికంటె ధైర్యశాలి; నిర్భీతుడు.

అయితే అట్టివిశ్వాసంకాని, అట్టిధైర్యంకాని, ఒక్కరోజులో రాదు. ఈ సాధనచేస్తూనే, ఇతర రక్షణమార్గాలు కూడా ఆలోచించాలి. ఎవడైనా దుర్మార్గుడు స్త్రీపైకి వచ్చినప్పుడు ఆమె "హింసయా, అహింసయా" అని శంకిస్తూ కూర్చోరాదు. ఆమె ప్రప్రథమకర్తవ్యం ఆత్మరక్షణ. ఏపద్ధతి చేతనైనాసరే తనశీలమును రక్షించుకోడానికి ఆమెకు స్వేచ్ఛయున్నది. ఆ సమయానికి ఆమెకు ఏమితోస్తే, ఆ పద్ధతిగా

ఆమె తన శీలరక్షణచేసుకోవచ్చును. అభ్యంతరంలేదు. దేవు డామెకు గోళ్ళు, పళ్ళు, ఇచ్చాడు కద. తనబలంకొద్ది ఆమె ఈ తనగోళ్ళను, పళ్ళను, ప్రయోగించవచ్చు. అవసరమైతే, ఆ ప్రయత్నంలో, ప్రాణంబలిఇచ్చినా ఇవ్వవచ్చు. మృత్యుభీతి వర్జించిన పురుషుడుకాని స్త్రీకాని తనకు తాను రక్షించుకోగలగడమే కాక, ఇతరులనుకూడ, తనప్రాణబలిదానంవల్ల రక్షించగలుగుతాడు.

స్త్రీ చేయవలసినపని ఇది. అయితే, ఇక స్త్రీ పై దుర్మార్గం జరుగుతుండగ, చూస్తున్న మగవా డేమి చేయ్యాలి? దీనికి జవాబు పైనచెప్పిన మాటలలోనే ఉన్నది. ఆతడు ఊరికే చూస్తూ ఊరుకుండరాదు. ఆ స్త్రీ రక్షణకై ఆతడు దూకాలి. పోలీసువాళ్ళకోసం పరుగెత్తరాదు.

రైలుప్రయాణంలో ఈదుర్మార్గం జరుగుతుంటే, ఊరికే రైలుగొలుసు లాగడంతోటే, తృప్తిపడి ఊరుకోరాదు. అహింస అతనికి అలవాటైతే, ఆ స్త్రీని రక్షించడంలో తన ప్రాణాలనైనా ఒడ్డి రక్షిస్తాడు. అహింసయం దతని కంత నమ్మకంలేకపోతే—అహింసగా తా నక్కడ వర్తించలేకపోతే—తన మోటుబలానైనా సరే యావత్తు ఉపయోగించి ఆమెను కాపాడాలి. కొనకు ఏ పద్ధతిఅవలంబించినా ఆ మొగవాడు, తన ప్రాణాలను బలియివ్వడానికై సంసిద్ధుడయ్యే ఉండాలి.

( హరిజన్ 1-3- 942 )

D. రాజకీయపు దౌష్ట్యములు.

# 1

## దుష్ట ప్రభుత్వం
## శాసనోల్లంఘనం

నూటికినూరుపాళ్ళు సాత్త్వికనిరోధియైన వాడు తన పైన ప్రభుత్వ మనేది ఉన్నదనే సంగతినే లెక్క-చేయడు. నీతిబాహ్యమైన ప్రతి ప్రభుత్వ శాసనమును ఉల్లంఘించడానికి తనకు హక్కున్నదనిన్ని, అందుకని తాను ప్రభుశాసనమునకు అతీతుడననిన్ని ఆతడు భావిస్తాడు: ఉదాహరణ:- ఆతడు 'పన్నునివ్వను' అనవచ్చును. నిత్యవ్యవహారములలో ప్రభుత్వాధికారమును "అంగీకరించను, పో" అనవచ్చును. 'ఫలానిచోట కాలుపెట్టకూడదు' అనే శాసనాన్ని ఉల్లంఘించి మిలిటరీ బారకీసులలో ప్రవేశించి, సైనికులకు బోధచేయవచ్చును; పికెటింగ్ చేయవచ్చు. అన్నిజాగాలలో పికెటింగ్ చేయవచ్చును. ఈ పనులన్ని చేయడంలో అతడు దౌర్జన్యమును ఉపయోగించడు. తనపై జరుపబడు దౌర్జన్యాన్ని ప్రతిఘటించడు అంతయేల, "నన్ను జైలులో పెట్టండి", "నాపై మీ ఇష్టంవచ్చిన దౌర్జన్య చెయ్యండి," అని సవాల్ చేసి చెబుతాడు. ఇదంతా ఎందుకు చేస్తాడు? తన భౌతికశరీరం అనుభవిస్తున్నట్లు పైకి భ్రమగా కనుపడే స్వాతంత్ర్యం అనేది తనకు నిజముగ భరింపరాని బరువుగ తోస్తోంది కనుక. భరింపరాని బరువుగతోచినప్పుడు అతడే

పనులన్నీ చేస్తాడు. తన నిబంధనలకు లోబడ్డంతవరకే ప్రభుత్వం తన పౌరునకుఅటూ ఇటూ మెసలడానికిస్వాతంత్ర్యం అంగీకరిస్తుంది. ప్రభుత్వం తనపౌరున కిట్టి స్వాతంత్ర్యం ఇవ్వడమూ-దానికి ప్రతిఫలంగా పౌరుడు ప్రభుత్వానికి విధేయత చూపడమూ- ఈ రెండు ఇచ్చిపుచ్చుకోడాలుగా జరుగుతవి. కనుక పూర్తిగానో, చాలావరకూనో అన్యాయమైనటువంటి ప్రభుశాసనానికి విధేయత చూపడమంటే పౌరుడు నీతిబాహ్య పద్ధతిగ తనస్వాతంత్ర్యమును అమ్మివేసుకోడమే అవుతుంది. ఈ రీతిగా సాత్వికనిరోధియైనపౌరుడుభావించుకొని, అన్యాయమైన ప్రభుత్వశాసనాలకు విధేయత చూపడం మానివేసేస్తాడు. ఇట్టి దుష్టస్వభావమును ప్రభుత్వమందు గుర్తించిన పౌరుడు, ఎలాగైనాసరే ప్రభుత్వానికి లొంగి బ్రతికిఉండామని అనుకోడు. అట్టి హీనప్రు బ్రతుకుతో అతనికి సంతృప్తి ఉండదు. అందువల్ల అతడునీతికి భంగంకలిగించకుండ, ప్రభుశాసనాన్ని ఉల్లంచి, "నన్ను అరెస్టుచేసుకో" అని ప్రభుత్వానికి సవ్వాల్ చేస్తూ ఉంటాడు. అతని భావములయందు విశ్వాసములేని వారు "హీ దెక్కడివాడురా, మన సంఘాన్నంతను ఖరాబుచేస్తున్నాడు." అని విసుగుకోనవచ్చుగాక. ఈ రీతిగా ఆలోచించిచూస్తే, సాత్వికనిరోధ మనేది సత్పురుని హృదయావేదనను తెలియపరచే తీవ్ర సాధన. 'దుష్ట ప్రభుత్వాన్ని సాగనియరాదు' అని గొంతెత్తి చాటి చెప్పే ప్రతిఘటనా విధానము. ఇట్టి సాత్వికనిరోధముతో కూడిన శాంతిసేనకు ఉద్రేకాలుపనికిరావు; ఉద్రేకాలుఉండవు. ఎందుకంటె, "దెబ్బకుదెబ్బకొడదామనే" ప్రతీకారవాంఛ

నానికి ఉండదుకనుక. అందువల్ల ఈ సేనలో సైనికులసంఖ్య చాలా తక్కువగానే ఉంటుంది. నిజానికి, ధర్మం అధర్మం కూడ చేసే యుద్ధంలో జయం సాధించడానికి స్వచ్ఛమైన సాత్త్వికవిరోధి ఒక్క డుంటేచాలు.

( యంగ్ ఇండియా: 10–11–1921 )

తమ మతధర్మమునకుగాని, తమ మనస్సాక్షికిగాని హానికరము కానంతవరకు ప్రభుత్వము విధించే శాసనాలకు ( అవి యెంత యిబ్బందికరమైనవైనాసరే ) ఇచ్ఛాపూర్వకముగ విధేయత చూపుటయందు నమ్మకమున్నవారే శాసనోల్లంఘనమునకు పూనుకొనటానికి అర్హులు. అంతేకాదు. ఇట్టి అవిధేయతకు విధింపబడే శిక్షలను బుద్ధిపూర్వకముగ అనుభవించడానికికూడ సిద్ధంగా వున్నవారే ఈ శాసనోల్లంఘనోద్యమంలో చేరడానికి అర్హులు. శాసనోల్లంఘనోద్యమం సాత్త్వికంగా వుండాలంటే అది పూర్తిగ దౌర్జన్యరహితంగా ఉండాలి. దీని కంతకు పునాది ఏమంటే తాను బాధ భరించడంవల్ల (అనగా ప్రేమార్ద్రితవల్ల) ఎదుటివానిని తనమార్గమునకు త్రిప్పుకొనడం అన్నమాట.

( యంగ్ యిండియా : 3–11–1921 )

◆— దౌర్జన్యం వచ్చినాసరే శాసనోల్లంఘనం తప్పనిసరియైన స్థితిరావచ్చును. ◆—

" ఏమైనాసరే శాసనోల్లంఘనం మానడానికి వీలు లేదు " అనేస్థితి ఒకానొకప్పుడు రావచ్చు. "తప్పక రక్తపా

తము అయితీరుతుంది అనే స్థితి వచ్చినాసరే, ప్రతి ప్రభుత్వ శాసనమును ఉల్లంఘించి తీరవలసినదే " అనేకాలం రావచ్చునని నాకు స్పష్టముగా కనుపించుచున్నది. అంతరాత్మ ప్రేరణను నిర్లక్ష్యంచేయడమంటే భగవంతునే తోసి రాజనేస్థితి యేర్పడ్డప్పుడు ప్రభుత్వ శాసనోల్లంఘనం అనివార్యమైన విధాయకకృత్యమే అయితీరుతుంది.

( యంగ్ యిండియా : 4-8-1921 )

నేను కొన్నిసందర్భాలలో శాసనోల్లంఘనం మాన్పించినమాట వాస్తవమే. ఎందుకని ? దేశంలో దౌర్జన్యకార్యాలుచెలరేగినవి కనుక కాదు బాగా సంగతులన్నీ తెలిసియుండవలసిన కాంగ్రెస్ వారే ఇట్టి దౌర్జన్యచర్యలు తామే ప్రారంభించడమో, లేక ఇతరులు చేసేటట్లు ప్రోత్సహించడమో జరిగినట్లు నేను కనిపెట్టాను. కనుకనే ఉద్యమం ఆపేశాను. అంతే. ఏదో ఎక్కడో జరిగే ప్రతీదౌర్జన్యం శాసనోల్లంఘన విరమణకు హేతువుకాజాలదు. ఉదాహరణ:మలబారులో మాప్లాతిరుగుబాటు జరిగింది కద. అది కారణంగా శాసనోల్లంఘనాన్ని నేను ఆపానా ? (లేదుకద) కాని "చౌరీ చౌరా" అనేచోట జరిగిన దౌర్జన్యాలు మాత్రము శాసనోల్లంఘన విరమణకు కారణమైనవి. ఎందుకంటె ఆ దౌర్జన్యాలలో కాంగ్రెస్ వారే పాల్గొన్నారుకనుక.

(యంగ్ ఇండియా ; 29-10-1925)

—: పన్నుల ఎగవేత :—

“ పన్నులు ఇవ్వకుండ ఎగవేయమని చెప్పితే ప్రజలందరు ఎగవేయవచ్చునన్న అవకాశం కనబడుతోంది ” అనే మాటను పట్టుకొనే మన మీా పన్నుల ఎగవేత ఉద్యమం ప్రారంభించరాదు. మాటమాత్రంచేత పన్నులు ఎగవేసే సంసిద్ధత రైతులలో కనబడటం మన నోరు ఊరించవచ్చు కాక. కాని ఇది చాలా ప్రమాదకరమైన ఆశ. ఇట్టి పరిస్థితులలో చేసే పన్నుల నిరాకరణోద్యమం సాత్వికంగా ఉండజాలదు. సౌజన్యసహితంగాను ఉండనేరదు. అది అసాధుత్వంలోకి హింసాత్వంలోకి దిగుతుంది. స్వరాజ్యానికి బాగా హానితీస్తుంది. పన్నుల ఎగవేతలోవుండే హేతువులు, దాని సుగుణలక్షణాలు రైతులుబాగా అవగాహనచేసుకొని, వంటబట్టించుకొని, తమ పొలాలు, ఇళ్లు, వాకిళ్ళు, గొడ్డూ-గోడ, చెంబు-తెప్పాల, అన్నీ వేలంవేసుకొని లాక్కుపోతూవుంటే నిశ్చలమైన మనస్సుతో ఉదాసీనంగా చూస్తూ ఊరుకునే (స్థితప్రజ్ఞస్థితి ) రైతులకు వచ్చేవరకు మనము వారికి ఈ పన్నుల ఎగవేత సలహా యివ్వరాదు.

( యంగ్ యిండియా ; 26-1-1922 )

—: జైలు శిక్షలు :—

సత్యాగ్రహి జెయిలుకుపోవడం ఎందుకు ? గవర్నమెంటును యిరుకునపెట్టటానికిగాదు. తన నిర్దోషత్వాన్ని నిరూపించుటద్వారా అధికారులలో మార్పు తేవటానికే.

జైలుకుపోవటానికి తగిన నైతికార్హత నీకు వుండాలని సత్యాగ్రహసూత్రాలు విధించుచున్నవి. అట్టి నైతికార్హతను నీవు సంపాదించుకునేవరకు నీవు జెయిలుకుపోయి లాభంలేదని నీవు గ్రహించాలి. అట్టిఅర్హత సంపాదించుకోకుండ నీవు జెయిలుకు పోవటం శుద్ధ దండుగ అని నీవు తెలుసుకోవాలి. దానివల్ల నీకు కలిగే మేలేమీ వుండదు. చివరకు నీకు మిగిలేది నిస్పృహాయే

( హారిజన్ : 5-11-1938 )

-: జనం మూకలు దౌర్జన్యరహితంగా ఉండగలరా ? :-

ప్రశ్న:- జనం మూకలు క్రోధం, ద్వేషం, ఇతరుల చెరుపు కోరడం మొదలైనవాటికి లోబడిపోయేవారని మనకు తెలిసినదేకద. అట్టి సందర్భంలో వారు అహింసను సాధన చేయగలరని నీ వెలా అనుకుంటావయ్యా ! స్వల్పసంగతులకే వారు దొమ్ములాడుకుంటారుకద.

జవాబు:- నిజమే. అయితే సమిష్టిలాభంనిమిత్తము వారు దౌర్జన్యరహితంగా ఉండటం సాధనచేయగలరని నే ననుకుంటాను. ప్రభుత్వ శాసనానికి వ్యతిరేకంగా ఉప్పు పోగు చేసిన వేలాది స్త్రీలు వున్నారుకద. వారికి ఎవరిమీద కాని ద్వేషంవుందని మీరు చెప్పగలరా ? "కాంగ్రెసు, గాంధీగారు ఏదో చెయ్యమన్నారు;" అనిమాత్రంవారికి తెలుసు. అంతే. ఆ మాటల నమ్మకంమీద, ఆశమీద వారాపని చేశారు. అంతేకాని ఎవరిమీదా ద్వేషంచేత చేసిందికాదు వా రా

అవసరమయ్యే విస్పష్టమయిన కార్యవిధానాన్ని బోధించ టానికి నాకు తగినంత ఉర్వాత, యోగ్యత ఉందని నేను అనుకో వడంలేదు. అంత ఉన్నతస్థితికి నేను చేరలేదు. మానవ స్వభావానికి సంబంధించిన ఇంద్రియోద్రేకములు, తదితర దౌర్బల్యములు ఎన్నో నాలో కూడా ఇంకను నిండియే యున్నవి. ఆ ఆదర్శస్థితిని దర్శించి ఆ సందేశాన్ని శ్రుతి గోచరంచేసుకోడానికిగాని, ఆ ఉద్యమాన్ని నడిపించడానికిగాని తగినశక్తిని నే నింకా సంపాదించియుండలేదు. కనుక, క్రియలో నూటికినూరుపాళ్లు అహింసామార్గమును దేశానికి నేడే చూపించడానికి నాకు సాధ్యముకాకుండా ఉంది

(యంగ్ యిండియా 17-11-192

-: అహింసచేత పరదండయాత్రలను నివారించవచ్చునా? :-

మామూలు యుద్ధభటులకు, అహింసాసమరభటులకు సామాన్యముగ వర్తించేవి రెండు సంగతులున్నవి. నేను స్విట్జర్లండు దేశపు పౌరుడనో లేక ప్రెసిడెంటునో అయియుంటే నేను మొట్టమొదలుగ చేసే పనేమంటే, దేశంమీదికి వచ్చే పరసేనకు సప్లయిలు చేరకుండా నిరాకరిస్తాను. ఇక రెండవదేమంటే, పూర్వం గ్రీకుదేశంలో "థర్మాపొలీ" యుద్ధంలో జరిగినగిట్లు చేయిస్తాను. అంటే స్త్రీలు, పురుషులు బిడ్డలు యావన్మంది దోనకడ్డంగా గోడగానిలబడి "మా శవాల మీదినుండి నడిచిపోండి" అని పరసేనకు చెప్పడం. ఇదొక మార్గం. మానవలోకంలో ఇట్టిది ఎన్నడూ జరిగినది

కాదని మీరు అనవచ్చును. ఆమాట నేను ఒప్పుకోను: ఇట్టిది జరగడం సాధ్యమే. నిరుడే గుజరాతు దేశంలో లాఠీ చార్జిల మూలంగా స్త్రీ పురుషులు గోడలవలె నిలబడి, నిశ్చలంగా ఎదుర్కొనలేదా? పెషావరులో వేలకొలదిజనం నిలబడి తాము ప్రాతికూల్యంచేయకుండ, ఫిరంగిగుండ్ల వర్షధారలను తమపై కురిపించుకొనలేదా? ఇట్టి స్త్రీపురుషులే దేశంమీదికి వచ్చేపరసేనల త్రోవలో గోడలులాగ నిలబడతారనుకోండి. 'ఆసేన వీళ్ళందరిని బహుక్రూరంగా త్రొక్కుకుంటూ దేశంలో ప్రవేశిస్తుందని' మీరు అనవచ్చు. అయినా ఫరవా లేదు, ఈ రీతిగా అనేకులాత్మబలియగుటకు ఒప్పుకోవడం ద్వారా, ఆ పౌరులు తమ కర్తవ్యమును తాము తప్పక నెరవేర్చినవారే యై ధన్యులవుతారని నా మతం. నిర్దోషులగు స్త్రీ పురుష బాలుర శవాలమీదుగ నడిచిపోవ సాహసించిన పరసైన్యం, మరల అట్టిసాహసకార్యములు చేయుట కెన్నడును పాల్పడజాలదు. "జనసమూహాలకు ఇట్టి ధైర్యస్థైర్యాలు వుంటవని నేను నమ్మను" అని నీ వంటే అందువుగాక అంటే దాని అర్థమేమి! "అహింస" యనగ అంత అల్పమైన వస్తువు కాదు; అ రెంతో గట్టిది సుమ్మా అని నీవు ఒప్పుకున్నట్లే కద. కనుకనే, అహింస అనేది దుర్బలుల ఆయుధంకాదు. అత్యంత ధైర్య స్థైర్యములుగలవారిదే ఆ ఆయుధం. వారి ఉపయోగంకొరకే ఈ అహింసాస్త్రం పుట్టింది.

( యంగ్ ఇండియా 31-12-1931 )

ప్రశ్న:- పరదేశస్థులెవరయినా ఇండియామీదికి దండెత్తివస్తే వారిని "నాన్‌కో ఆపరేషను" ద్వారా ఎదుర్కొన డానికి మీరేదో క్రొత్త ప్లాను వేసుకు కూర్చున్నారని ఈ మధ్య "హరిజన్" పత్రికలో ఒక రిపోర్టు పడ్డది. అదేమిటో కొంచెం చెబుతారా ?

జవాబు:- అది తప్పు. నా మనస్సులో ప్లానేమీ లేదు. ఉంటే తప్పకుండ మీకు చెప్పేవాడినే. చెప్పేదంతా ఇదివరకే చెప్పేశాను. ఇప్పుడు క్రొత్తగా చెప్పే దేమీ లేదు. స్వచ్ఛమైన అహింసాపూరితమైన నాన్‌కోఆపరేషనే అన్నిటికీ మందు. ఇండియాప్రజలు యావన్మంది ఈ నా సందేశమునాలించి ఏకగ్రీవంగా ఆచరిస్తే ఒక్క నెత్తురుచుక్క కూడ రాల్చకుండానే జపాన్‌వారినేకాదు, ప్రపంచమంతా ఏకమైవచ్చినా సరే వారి దండయాత్రను నిర్వీర్యంచేసి కూర్చుండబెట్టవచ్చును. అంటే, ఏ విషయంలోగూడ "పగుల కింత చోటివ్వము" అనే దృఢనిశ్చయం ఇండియా చేసుకో వాలన్నమాట. అంతేకాదు. కోట్లకొలది జనాన్ని బలి యిచ్చుకోటానికిగూడ ఇండియా కృతనిశ్చయురాలై యుండా లన్నమాట. ఇంత బలియివ్వడమంటే అది చాలా మనకు చవకబేర మన్నమాటే ఇంత చవకగా సంపాదించుకొన్న విజయం చాలా యశోవంతమైనదికూడ అని చెబుతాను. ఈరకం ఖరీదు యివ్వటానికి ఇండియా సిద్ధంగా లేదనేమాట నిజం కావచ్చు. ఆ మాట నిజంకాకుండావుంటే బాగుండు ననే నా ఆశ. సరిగ్గా ఈరకం ఖరీదు కాకపోయినా ఏదో ఒక ఖరీదును—ఇట్టి జనబలినే—ఏ దేశంకాని తన స్వాతంత్ర్యరక్షణ

కై ఇచ్చుకొనక తప్పదుకదా. లెక్కచూస్తే యింతవరకు ఈ (రెండవ ప్రపంచ యుద్ధములో) రష్యనులు, చీనావారు పెట్టిన నరబలికి అంతున్నదా ! ఇంకా ఇంకా మనుష్యులను బలి ఇవ్వడానికి వారు తయారుగానే వున్నారుకదా. తమ సర్వస్వం అర్పించడానికి వారు వెనుకముందూ చూస్తున్నారా? ఇతర దేశాలుకూడ ఈమహాప్రపంచ సంగ్రామంలో తాము దండెత్తేవారైనా, స్వరక్షణలో వుండేవారైనా -ఇట్లే కోటానుకోట్ల జనాన్ని బలియిచ్చుకొంటున్నారుకదా. వారు తమతమ స్వాతంత్ర్య రక్షణకై ఎంతెంత ఖరీదు తెల్లించుకుంటున్నారో చూడండి. కనుక నా అహింసామార్గంలోకూడ ఆ ఇతర దేశాలకంటె ఎక్కువబలి ఇవ్వవలసిందని నేను కోరడంలేదు. ఇండియా దేశాన్ని హింసాపద్ధతులలో రక్షించుకో దలుచుకున్నప్పటికి ఇంతకు తక్కువమందిని బలిపెట్టడంతో సరిపోతుందా ?

( హరిజన్ : 24-5-1942 )



# సర్వోదయము

## ఏడవ విభాగము

### కార్యకర్తలు - కార్యకర్తల కార్యప్రణాళిక -

### A. కార్యకర్త.

# 1

—: సర్వోదయ కార్యకర్తలకు ఉండవలసిన లక్షణాలు :—

(ఈ దిగువ ఉల్లేఖించిన లక్షణాలు గాంధిగారు సత్యాగ్రహినిగురించి చెప్పినవి. సర్వోదయ కార్యకర్తకూడ, వారి మతప్రకారం, నిజమైన సత్యాగ్రహిగానే ఉండాలికనుక ఇవి సర్వోదయ కార్యకర్తకు కూడ వర్తిస్తవని ఎంచుకోవచ్చును. )

(1) అతనికి ఎన్నటికీ చెడని భగవద్భక్తి ఉండాలి. ఎందుకంటె భగవంతుడే అతని అండ.

(2) సత్యమును, అహింసను తన మతముగ ఆతడను ష్ఠించవలెను. కనుక, మానవస్వభావము స్వతస్సిద్ధముగ మంచిదనియే ఆతెడు నమ్మవలెను. తాను బాధఅనుభవించుట ద్వారా వ్యక్తమయ్యే సత్యమువల్ల, ప్రేమవల్ల, ఆ మానవ

మైన వ్యక్తినని అనుకోవడం భగవంతునికీ నాకు మధ్య పెద్ద అడ్డుగోడ కట్టుకోవడమే. నేను భిన్నమైన వ్యక్తిననే భావన మానివేయడం భగవంతునిలో లీనమైపోవడమన్నమాటే. మహాసముద్రములో ఉన్న నీటిబిందువు ఆ మహాసముద్రము యొక్క గంభీరతలో తనకు తెలియకుండగనే భాగస్వామి అవుతుంది. అట్లాకాక మహాసముద్రమునుండి ఆ బిందువు విడి పడి " నేను స్వతంత్రించాల " నని ఇవతలికి వచ్చివేస్తే ఒక్క క్షణంలో అది ఎండి చక్కాపోతుంది

పరసేవా పరాయణమయిన జీవితము వినమ్రజీవితమై ఉండాలి. ఇతరులకోసం తనప్రాణా లర్పించటానికి సదా సంసిద్ధంగావున్న మనిషి ప్రత్యేకంగా తనకొక స్థానమును ( ఇది నా సొంతం అని ) కేటాయించి (రిజర్వుచేసుకొని) ఉంచుకోటానికి ప్రసక్తెక్కడ ఉంటుంది ?

( ఏకనాథా మందిరంనుండి : 1945 పే॥ 46-47 )

:— నిర్విరామ కృషి :—

నిజమైన నమ్రత అంటే కేవలం మానవసేవకై విసుగు విరామం లేకుండ సదా కృషిచేస్తూ ఉండడమన్నమాటే. ఒక్కక్షణంకూడ విరామంలేకుండా భగవంతుడు సదా పని చేస్తూనేఉంటాడు. భగవంతుని సేవించాలన్నా లేక, ఆయనలో లీనముకావాలన్నా మనకృషికూడ భగవంతునికృషి వలెనే నిర్విరామంగా ఉండాలి. సముద్రమునుండి విడివడిన నీటి

బిందువుకు ఒక్క క్షణం విరామమనేది ఉంటే ఉండుగాక, కాని, సముద్రంలో లీనమైయున్న బిందువుకు విరామంలేదు. ఎందుకంటెసముద్రము విరామము నెరుగదుకద. మన సంగతి కూడఅంతే. భగవంతుడనేసముద్రంలోమనము లీనమైపోయిన క్షణమునుండి మనకు విశ్రాంతి విరామమనేదే ఉండదు. నిజానికి మనకు అట్టి విశ్రాంతియొక్క అవసరంకూడా ఉండదు. మనము పోయే నిద్రకూడ పనికిందే లెక్క. ఎందుకంటె. మన హృదయాల్లో భగవంతుని తలపులతోనే నిద్రపోతూ ఉంటాము. ఈ నిర్విరామతయే నిజమైన విశ్రాంతి. ఈ అంతులేని స్పందనమే అనిర్వాచ్యమైన శాంతికి కీలకము.

(ఎరవాడా మందిరంనుండి, 1945: పేజీలు 47, 48.)

-: మౌనము :-

* సత్యప్రియునకు మౌనము ఆతని ఆధ్యాత్మిక సాధనలో ఒకభాగము. అతిశయోక్తిగ మాట్లాడడం – ఇచ్ఛాపూర్వకంగానో, అనిచ్ఛాపూర్వకంగానో సత్యాన్ని అణచి మూసిపెట్టడం, లేక మార్పుచేసిచెప్పడం – ఇవన్నీ మనిషికి ఉండే సహజదౌర్బల్యాలు. వీటిని అతిక్రమించాలంటే, మౌనం అవసరం. మితభాషి యోచనలేకుండ మాట్లాడడం సాధారణంగా ఉండదు. తాను మాట్లాడే ప్రతిమాట తూచితూచి మాట్లాడుతాడు.

( గాంధిగారి ఆత్మకథ 1940 పేజీ 84 )

---

* “సత్యాయ మితభాషిణాం” కాళిదాసు రఘువంశం

:— సత్ శీలము :—

కామ వికారమును జయించలేనిమనిషి ఎవరికీ,ఎన్నటికీ నిజమైన సేవ చేయలేడు; హరిజనులకేకాని, మతసామరస్యానికేకాని, గోరక్షణకేకాని, ఖాదీ గ్రామపునర్నిర్మాణానికే గాని, దేనికిగాని నిజమైన సేవచేయజాలడు. ఇట్టి మహోద్యమాలు సాధించడానికి కేవలం బుద్ధిబలంచాలదు; వాటికి ఆధ్యాత్మిక సాధన, ఆత్మశక్తి, కావాలి. ఆత్మశక్తి కేవలం భగవంతునికృపవల్లతప్ప రాదు. మరి కామవికారములకు వశుడైనమనిషికి భగవత్కృప ఎన్నడూ లభ్యముకాదు.

( హరిజన్ 2-11-1936 )

:- విశ్వాసం :-

నిత్యనూతనమై సజీవమైన విశ్వాసం లోకానికి ఇవ్వడానికి మీరు ముందంజవెయ్యాలి. పారంపర్యంగా వచ్చే వట్టిశుష్క విశ్వాసాలు ఎండిన మొనుకలవంటివి మీరు లోకానికి ప్రసాదిస్తే లాభంలేదు. లోకం వాటిని స్వీకరించదు.

( సింహళంలో గాంధిగారి ఉపన్యాసం )
1928 పేజీ 112

సజీవమైన ఇట్టి విశ్వాసంలేకుండా లోకంలో ఎన్నడూ ఎట్టిఘనకార్యంకాని సాధింపబడలేదు.

( హరిజన్: 9-10-1937 )

## -: ప్రజాసామాన్యంతో ఐక్యభావం పొందాలి :-

వారిలో లీనమైయుండి వారిక్షేమంకొరకు పనిచేస్తూ మనము ప్రప్రథమంగా ప్రజాసామాన్యంతో పరిచయం ఏర్పరచుకొనవలెను. వారి దుఃఖాలలో మనముకూడా భాగస్వాములము కావాలి. వారికున్న కష్టాలేమిటో తెలుసుకోవాలి. వారి అవసరము లేమిటో మనం ముస్ముందుగా ఆలోచించి గ్రహించుకోవాలి. పాకీవాళ్ళలో మనం పాకీవాళ్ళము అయిపోవాలి. ఇతరకుల అనగా పై తరగతులవాళ్ళ పాకీదొడ్లు మనను బాగుచేయమంటే మన కెట్లావుంటుందో - వాళ్ళు తిని వేసిన విస్తరాకులలోని మెతుకులు మొదలైనవి తినమని మన మొగాన వేస్తే మన కెట్లావుంటుందో - ఊహించి చూచుకోవాలి. బొంబాయినగరంలో గాలి, వెలుతురు చొరకుండ "ఇళ్ళు" అని పొరబాటున పిలువబడే పెట్టెలలో కాపురం ఉండండి" అని అంటే మన కెట్లా వుంటుందో తలుచుకోండి. పొలాలలో నడుములువంచి పనిచేస్తూ ఉంటే, వీపుమీద మంటలుమండించే ఎండ కొడుతూవుంటే, పల్లెటూరు ప్రజలు వుండే స్థితిలోమనంకూడ వుంటే ఎలావుంటుందో ఒక్కసారి చూడండి. పల్లెటూళ్ళ చెరువులగుంటలలో గొడ్లు పడి పొర్లుతూ, నీళ్ళు తాగుతూ, జనం బట్టలు ఉతుకుతూ, కుండలు కడుగుతూ, స్నానాలుచేస్తూ ఉండే ఆ మురికినీటిని నిన్ను త్రాగమంటే ఎలా వుంటుందో ఊహించుకో. అట్లా ఊహించుకొని వాళ్ళతోపాటు మనంకూడ లీనమైపోతేకాని మనం నిజంగా ప్రజానీకానికి ప్రతినిధులము ఎన్నటికీ కాలేము.

అప్పుడుకాని మనము చెప్పేమాటలు వారువిని మనను అనుస రించరు. ఇది నిశ్చయం. నే నిప్పుడీ వ్యాసం వ్రాయడం ఎంత నిశ్చయమో, అదియు అంత నిశ్చయమే.

( యంగ్ యిండియా : 11-9-1924 )

మనకు ప్రశస్తమైన మార్గమొక్కటే. ప్రజాసామాన్యా నికి లేని సౌకర్యాలు మనం పొందటానికి నిర్మొగమాటముగ నిరాకరించాలి. ఇట్లు నిరాకరించగల శక్తి ఒక్కరోజులో ఆకాశంనుండి మనమీదికి వచ్చి వ్రాలదు. "ప్రజానీకానికి లేని సౌకర్యాలు మన కెందుకుండాలి? మనకు వద్దు" అనే భావనను ముందుగ మన మనస్సులలో కొంతకాలం సాధన చెయ్యాలి. ఇది ప్రథమంగా జరుగవలసినపని. ఇట్టి మనస్తత్వమును సాధనచేసుకొని, పిమ్మట, వెంటనే చెయ్యవలసిన పనే మంటే – ఈ మనస్తత్వానికి అనుగుణంగా మన జీవిత విధానమును వీలయినంత త్వరత్వరగ మార్చుకోవాలి. అట్టి స్వార్థత్యాగబుద్ధి, కృతనిశ్చయత గలసేవకులు పెక్కుమంది – పెద్దసేనకు సేనయే– లేనిచో, ప్రజానీకము యొక్క నిజమైన పురోభివృద్ధిని మనము ఎన్నడూ సాధించనే లేమని నా మతము. ప్రజానీకపు పురోభివృద్ధి అనేది గగనకుసుమమే అవు తుంది.

( యంగ్ యిండియా 24-6-1946 )

'సోషలిజం' అనేది మొట్టమొదటగా ఈ 'సోషలిజం' మతం పుచ్చుకున్నవాడితోనే ప్రారంభం అవుతుంది. అటి ద్దా డొకడు ముందుగ బయలుదేరితే, ఆ ఒకటి అనే అంకె

కడపటి ప్రక్కను సున్నాలు చుట్టుకుంటూ పోవచ్చును. మొదటి సున్నా చేర్చడంతో ఆ సంఖ్య పదిఅవుతుంది. తరువాత చేర్చే ప్రతి సున్నా కూడ, వెనుకటి అంకెకు పదిరెట్లు విలువను ఇస్తూ పెంచుతూ పోతూ ఉంటుంది. ఇక, అట్లుకాక మొదటివాడే సున్నా అయితే – (అనగా మొదటివాడే సోమరిజం సిద్ధాంతాన్ని అర్థంచేసుకోక, దానిని అనుష్ఠించక పోతే–), వాని ప్రక్కను ఎన్ని సున్నాలుచేర్చినా, మొత్తం విలువ సున్నాయే అవుతుంది. ఈ సున్నాలు చుట్టడానికి పట్టే కాలము, దానికి ఖర్చయ్యే సిరా, కాగితం అంతా శుద్ధ దండుగ.

(హరిజన్: 13-7-1947)

## —: ఇచ్ఛాపూర్వకంగా పేదరికమును వరించుట :—

స్వసౌకర్యములను విడనాడుకోవడంలో, ఇచ్ఛాపూర్వకంగా పేదరికమును వరించడంలో, ఉండే అందమును ఆనందమును గ్రహించడం సర్వోదయకార్యకర్తలు అలవరుచుకోవాలి. జాతినిర్మాణకార్యక్రమములలో వారు పాల్గొనాలి. అనగా, తాను స్వయంగా వడకడం, నేయటం ద్వారా ఖద్దరును వ్యాపింపచెయ్యాలి. ప్రతిపనిలోను, నిర్దుష్టమైన పద్ధతిగా తాను అందరితో కలిసిమెలిసియుండి, ఆ యా కులమత వర్గాల వారి మధ్య హృదయపూర్వకమైనటువంటి ఐక్యతను సంపాదించాలి తాను స్వయంగా అస్పృశ్యతను ఎంతమాత్రం ఏరూపంలోను పాటించరాదు. తాగుటకు మత్తు

పదార్థములకు అలవాటుపడినవారిని ప్రతిఒక్కనిని, వేర్వేరుగ కలుసుకొని, వారికి బోధించి, ఈ మత్తుపదార్థముల నిషేధమునకు తోడ్పడవలెను. మొత్తంమీద తాను స్వయంగా పవిత్రతను సాధనచేసుకోవాలి. పేదవాని స్కేలులో ఈ పనులన్నీ కార్యకర్తకు జీవనోపాధి కల్పిస్తవి. పేదవాని స్కేలు చాలని వాడు దేశానికి పనికివచ్చే ఏవో ఇతర చిన్న పరిశ్రమలలో-తన కింకా హెచ్చు వేతనమిచ్చే వాటిలో-చేరవచ్చును.

(అమృతబజార్ పత్రిక: 8-4-1984)

## —: B. ప్రోగ్రాము :—

నిర్మాణ కార్యక్రమవివరములు, నేను ప్రకటించిన ప్రత్యేక మొక కరపత్రంలో ఉన్నవి. అవిఅందరూ చూచుకోవచ్చును. డాక్టరు రాజేంద్రప్రసాదుగారి కరపత్రంకూడా ఒకటి వున్నది. అది నా కరపత్రంమీద సులభమైన వ్యాఖ్యానము. అందులోని అంశములన్నీ కేవలం ఉదాహరణములు మాత్రముగా చెప్పినవేకాని, అవి సంపూర్తి జాబితా కాదు. ఆ యా స్థానిక పరిస్థితులనుబట్టి కొత్త కొత్తవి దానిలో చేర్చుకొనవచ్చును. అట్టివి నా కరపత్రంలో కనిపించకపోవచ్చును. ఇండియా మొత్తంమీద అన్ని ప్రాంతాలకు పరిపోయే జాబితా ఒక్కసారిగ వ్రాసిపెట్టడం అసంభవం. ఆ యా స్థానికులగు కార్యకర్తలే ఇవేవో కనిపెట్టి తగిన రీతిగా పని సాగించవలసి ఉంటుంది.

ఈ కార్యక్రమం ప్రచురణమైనపిమ్మట కలిగిన అనుభవమును పురస్కరించుకొని కొన్ని కొన్ని అయిటముల మీద మాత్రం ఎక్కువగ నొక్కి చెప్పడానికి వానిని వేరు పరచి వివరించుచున్నాను.

ఈ కరపత్రములో వ్రాసిన అయిటముల జాబితా ఇది:

(1) కులమతసర్గములమధ్య ఐక్యత; (2) అస్పృశ్యతా నివారణ 3 మద్యనిషేధం 4 ఖాదీ 5 ఇతరగ్రామపరిశ్రమలు 6 గ్రామపారిశుద్ధ్యము 7 బేసిక్ విద్య 8 వయోజనవిద్య 9 స్త్రీజనోద్ధరణ 10 శౌచారోగ్యములగూర్చిన విజ్ఞానము. 11 ప్రాంతీయ భాషలు 12 రాష్ట్రభాషా 13 ఆర్థికసమత, 14 రైతుజనోద్ధరణ 15 కార్మికజనోద్ధరణ 16 ఆదివాసుల ఉద్ధరణ 17 కుష్ఠరోగులసేవ 18 విద్యార్థుల వికాసము 19 పశుగోవాభివృద్ధివగైరా

# 1

## :- రైతులు :-

కిసాన్ (రైతు) వ్యవసాయకుడు—భూమిలేని కూలీగా పని చేసే వాడేకాని, భూమి ఉండి కష్టించేవాడేకాని— ప్రప్రథమంగా మన దృష్టిలోకి రావాలి. భూమియొక్క సారమే అతడు. న్యాయముగ భూమి అతనిది. అది అతనికి చెందాలి. అంతేకాని, భూమియున్నక ఎక్కడో (గైర్ హాజర్ గా) ఉండే భూస్వామికికాదు, జమీందారుకుకాదు. అయితే, అహింసా

సిద్ధాంతం ప్రకారం అట్టి జమిందారును, భూస్వామిని, బలవంతంగా తోసివేయడానికి వీలులేదు. తన కష్టార్జితమును భూస్వామి దోపిడీచేసుకు పోవడానికి వీలులేని రీతిగా రైతుకు తగు ఏర్పాట్లు చేసుకోవాలి. అనగా, రైతులలో రైతులకు మిక్కిలి సన్నిహితమైన సహకారము ఉండాలి ఇందునిమిత్తమై ప్రత్యేకముగ సంఘటితమైన సంస్థలు కమిటీలు (అవి ఇదివరకే లేనిచోట్ల) ఏర్పాటు చేసుకోవాలి. ఇదివరకు ఉన్న వాటిని అవసరమైతే చక్కగ సంస్కరించుకోవాలి. రైతులు చాలభాగం నిరక్షరాస్యులు: (చదువురానివారు) కాని, బడికి పోయే ఈడువచ్చిన తమ బిడ్డలకందరకు వారు ఇక మీదనైనా చదువుచెప్పించుకోవాలి. ఆడపిల్లలకు మొగపిల్లలకు కూడ చదువుచెప్పించాలి. భూమిలేనికూలీలుగ ఉండి, పొలాలలో కష్టించి పనిచేసే వారున్నారు. వారికి తగురీతి శుభ్రమైన జీవనానికి తగినంత కూలీ ఇవ్వబడాలి. పుష్టికరమైన తిండి, ఒంటినిండాబట్ట,మంచియిల్లు,వారిఆరోగ్యం సమకూర్చేవిగా ఉండడానికి కావలసిన మేరకు వారికి కూలీ పెంచాలి. భూమిసంబంధమైన చట్టాలు పరిశీలించి సవరించాలి. రైతుల ఋణగ్రస్తత బోలెడుంది. దాని పరిశీలన ఎంతోచేసి, పరిష్కరించవలసియున్నది.

## 2

### లేబర్ (కార్మికులు)

రైతులతోపాటు, వారికి సన్నిహితులుగ, కూలీ లున్నారు. 'లేబర్' అంటే ఇక్కడ (ఈవ్యాసంలో) నేను

చెప్పదలచుకొన్నది మిల్లులు వగైరా పరిశ్రమలలో ఉండే కూలీలగురించి. వీరందరు ఒకచోటనే కేంద్రీకరింపబడి ఉంటారు; కనుక పొలాలలో పనిచేసే కూలీలకంటె వీరి సమస్య పరిమితమై ఉంటుంది. అదికాక, రాజకీయపు ఎత్తులు వేసేవారికి ఈ "మిల్లులేబర్" వర్గం వాటంవారీగా చేచిక్కుతుంది.

ఈ లేబర్ వర్గం ముఖ్యంగా అనివార్యంగా బస్తీలలోనే పరిమితమై ఉండడంచేత పొలాలలో పనికంటె ఈ బస్తీ మిల్లులపనికే కూలిజనం ఎక్కువగ ఆకర్షింపబడతారు. వీరిని ఉచితమైన ఉన్నతస్థితికి తీసికొనిరావడం కూడ మన నిర్మాణకార్యక్రమంయొక్క ముఖ్యోద్దేశములలో ఒకటి. ఇందుకు ప్రధానంగా మనము దృష్టిలో ఉంచుకోవలసినది ఈ మిల్లు కూలీలయొక్క మానసిక నైతికోన్నతి. ఈరీతిగా ఈ కూలీలు (స్త్రీలుకాని, పురుషులుకాని) కేవలం తమ స్వశక్తివల్ల (సుగుణసంపత్తివల్ల) తమస్థితిని చక్కబరుచుకోగలిగేట్టుగ మనం చెయ్యాలి. అంతేకాదు, (మిల్లులువగైరా) ఉత్పత్తిసాధనలకన్నింటికి తాము నేటివలె బానిసలుగాగాక యజమానులుగ తయారయ్యేట్టుకూడ చెయ్యాలి. ధనం కార్మికవర్గానికి నౌకరుగా ఉండాలికాని, యజమానిగా ఉండనీయరాదు. తమ విధ్యుక్తధర్మములేమిటో కార్మికులు బాగా తెలుసుకునేటట్టుగ వారికి ప్రబోధం జరగాలి. ఈ విధ్యుక్తధర్మముల నిర్వహణద్వారానే తమ హక్కులుకూడ వాటంతటవి వస్తవని కార్మికులు గ్రహించాలి. ఇందుకు కొంత కార్యక్రమమును ఈ దిగువ కొద్దిగా సూచిస్తాను:

1. లేబర్‌కు వారి సొంత యూనియన్లు ఉండాలి.
2. రాత్రిపాఠశాలలుపెట్టి స్త్రీలకు, పురుషులకుకూడ, సామాన్యవిద్యయేకాక, సైన్సుల (శాస్త్ర) విజ్ఞానం కూడ క్రమపద్ధతిని తప్పక నేర్పాలి.
3. బేసిక్ విద్యావిధాన పద్ధతిని, వారి పిల్లలకుకూడ విద్య నేర్పాలి.
4. ప్రతి లేబర్ సెంటరులో ఒక ఆస్పత్రి, ఒక ప్రసూతి గృహము, పసిపిల్లల భద్రతాపోషణలకు వసతులు, ఉండాలి
5. సమ్మెలకాలములలో లేబర్ తమ్మును తాము ప...ం చుకోగలిగిఉండాలి. ( దౌర్జన్యరహితంగా విజయవంతంగా సమ్మెలు నడపడం ఎలాగో వారికి మనసు బోధించాలి. )

ఈ పనులన్నీ పైన 1 లో చెప్పిన యూనియనుల ద్వారానే జరగాలి. నాకు తెలిసినంతవరకు అన్నింటిలోకి "అహమ్మదాబాదు లేబర్‌యూనియనే" ప్రశస్తమైనదిగ కన్పట్టుచున్నది. అంటే నా ఆదర్శాన్ని అది అందుకొన్న దని కాదు; అందుకోడానికి ప్రయత్నిస్తున్నది. ఈ పద్ధతినే యూనియనులన్నీ పనిచేస్తే, లేబర్ యొక్క స్థితి ఇప్పటికంటె ఎంతో బాగుపడుతుంది. లేబర్ ఐక్యమై, సంఘటితమై, మానసికముగను నైతికముగను బాగా తరిఫీదైఉంటే, అది ఎప్పటికిగాని, ధనికవర్గముకంటె పైచేయిగానే ఉంటుంది.

( హిందూస్తాన్ స్టాండర్డు పత్రిక: 8-10-1944 )

## గ్రామోద్ధరణ

గ్రామసేవకుని జీవితమునకు కేంద్రము రాట్నమే. దానికి ప్రాధాన్యోద్దేశము— అది వ్యవసాయముతోపాటు సమాన ప్రతిపత్తిగలిగి, వ్యవసాయానికి దోహదం చేసే అదనపు వృత్తిగ ఉంటుందనే. గ్రామాలలో వ్యాపించి ఉన్న సోమరితనమును తరిమివేసి, ప్రతిఇంటిని సంతృప్తిభావముతో నింపే వరకు రాట్నం మనజీవిత రంగంలో ఉచితస్థానమున ప్రతిష్ఠితమైనదని చెప్పజాలము.

గ్రామసేవకుడు నిత్యము తప్పకుండ రాట్నం వడకడమేగాక, తనతిండి సంపాదించుకొనడానికై నిత్యము పలుగు పారలతో భూమి త్రవ్వడమో, గొడ్డళ్లతో కట్టెలు, కొయ్యలు కొట్టడమో, చెప్పులు బూట్లు కుట్టడమో, ఏదో వృత్తి చేసుకుంటూ ఉండాలి. మొత్తం 24 గంటలలో నిద్రకు, విశ్రాంతికి కలిపి, ఏ ఎనిమిదిగంటలో పోను, మిగతా గంటలన్నీ ఏదో ఒక పనితో నిండి ఉండాలి. వృథా కాలక్షేపానికి అతనికి సమయమే ఉండకూడదు. తాను సోమరిగా ఉండరాదు; ఇతరులను ఉండనీయరాదు. విరామ మెరుగని, ఆనందభరితమైన జీవితమంటే ఏమిటో, తన చుట్టుపట్ల వాళ్ళకు గ్రామసేవకుని నడత అద్దములో చూపించినట్లు చూపాలి. అది వారి కళ్ళయెదుట నిరంతరం ప్రబోధించే పాఠంగా ఉండిపోవాలి. సోమరితనము, నిర్వ్యాపారత అనేది మనము బుద్ధిపూర్వకంగా తెచ్చిపెట్టుకొన్నది కాని, లేక, గత్యంతరం లేక ఏర్పడ్డది కాని, మన గ్రామాలనుండి అదృశ్యమైపోవాలి.

అదిపోకపోతే, ఎన్ని ఉపాయాలు చేసినా ఫలించవు. అర్ధ కూటితో ప్రజలు మాడుతూ ఉండడం మనల నెన్నటికీ విడిచిపోదు. ఇది నిరంతరం అపరిష్కృతసమస్యగానే పీఠము వేసుకొని కూర్చుంటుంది. రెండు గింజలు తినే మనిషి, తిరిగి నాలుగుగింజలు పండించాలి. ఈసూత్రాన్ని సర్వత్రా పాటించకపోతే, జానాభాను ఎంత తగ్గించుకున్నా, ఈసమస్య ఎన్నటికీ పరిష్కారం కానేకాదు. ఈసూత్రాన్ని మనం అంగీకరించి, అమలుపరుచుకుంటే, ఇంతకు రెట్టింపుజనం పుట్టుకు రానీకాక, వాళ్ళ కందరకు మనం చోటిచ్చి అన్నం పెట్టగలం.

ఈ రీతిగా గ్రామసేవకుడు సంతతకృషికి ప్రత్యక్షమూర్తిగ గ్రామస్థులయెదుట నిలబడిఉంటాడు. ఖాదీఉత్పత్తికి కావలసిన యావత్తుపనులు అతను అతిసులభంగా చేయగలిగి ఉంటాడు; ప్రత్తిగింజ నాటడంమొదలు, ప్రత్తిపరడం మొదలు, నేతనేసేవరకు అన్నిపనులు అతనికి ఒకటోరకంగా తెలిసిఉంటవి. వాటిని ఇంకా, ఇంకా ప్రశస్తతరంగా చేయడానికి నిరంతరం ఆలోచిస్తూ ఉంటాడు. అది ఒక శాస్త్ర పరిశోధనగ ఎంచుకుంటే, అది అతని కొక కష్టముగ, విసుగుగ కనిపించదు. పైగా, రోజురోజు అతనికి కొత్తకొత్త ఆనందం, హుషారూ వస్తూ ఉంటుంది. ఎంతెంత కొత్త సంగతులు గొప్పగొప్పవి దానిలో గర్భితమై ఉన్నవో తెలుసుకుంటూ ఉంటే, అతని ఉత్సాహం ఊరికే పెరిగిపోతూ ఉంటుంది. తాను గ్రామస్థుల కేదో నేర్పుదామనే

తలంపుతో వెళ్ళినమేరా, గ్రామస్థులనుండి తాను నేర్చుకుందామనికూడ అతను గ్రామంలో ప్రవేశించవలెను. ఇట్టి నమ్రభావంతో నడిస్తే, అతనికి త్వరలోనే తెలుస్తుంది, ఏమీ ఎరగరనుకున్న గ్రామస్థులనుండికూడ తాను నేర్చుకోవలసిన సంగతులు అనేకం ఉన్నవని. గ్రామజీవితం యొక్క ప్రతిచిన్నవిషయమును అతను పరిశీలించి, పరిశోధించి తెలుసుకోవాలి. గ్రామంలో ఉన్న చేతిపనులేమిటో కనిపెట్టాలి; వాటిలో లోటుపాట్లు ఏవైనా ఉంటే సవరించి బాగు చేయడానికి, వాటికి వ్యాప్తినొందించి పెంపొందించడానికి గ్రామసేవకుడు పాటుబడాలి.

ఖాదీ సందేశము నాలకించుటకే గ్రామస్థులకు విముఖత ఉండవచ్చు. కాని, తన ఉదాహరణవల్ల తన సేవాపరత్వ జీవితపద్ధతివల్ల గ్రామస్తులు శ్రద్ధాళువులై, సుముఖులయ్యేటట్లు గ్రామసేవకుడు చేసుకోవాలి. అయితే, తన పరిమితులేమిటో కూడా తెలుసుకొని నడుచుకోవాలి. రైతుల ఋణగ్రస్తత వంటి అసాధ్యపు సమస్యల వెంట తాను పోకూడదు. అవి తనతలకు మించిన సమస్యలు. కనుక వాటి జోలికి తాను పోకూడదు.

శౌచారోగ్యములగూర్చి గ్రామసేవకుడు ఎక్కువగ శ్రద్ధవహించవలెను. ముందుగ తన ఇల్లు తన పరిసరములు మురికిలేకుండ, పరిశుభ్రముగా ఉంచుకోవాలి. అందరూ చూచి అనుకరించే నమూనాలుగా ఉండాలి. అంతేకాదు, మొత్తం గ్రామంయొక్క పరిశుభ్రతకే అతడు శ్రద్ధవహించి

ముందుగా తానే తట్ట చీపురు పుచ్చుకొని వీధు లూడ్చడానికై బయలుదేరాలి.

గ్రామంలో ఆస్పత్రిపెట్టి తానొక డాక్టరుగ బయలు దేరరాదు. ఇల్లాంటివి చెయ్యాలని బుద్ధిపుట్టుతుంది. కాని, అవి గ్రామసేవకుడు చేయరాదు. నేనుహరిజన యాత్ర చేస్తూ ఉండగా ఒక గ్రామంలో ఒక గ్రామసేవకుడు తగిలాడు. అతడు బాగా తెలిసి ఉండవలసినవాడే కాని, అతడు చేస్తున్న పనేమంటే ఒక ఆడంబరమైన మేడవంటి బిల్డింగుకట్టి, దానిలో ఒకవైద్యశాల (ఆస్పత్రి) పెట్టి, చుట్టుపట్ల గ్రామాల కన్నింటికి ఉచితంగా మందులు పంచిపెట్టడం సాగిస్తున్నాడు. అంతేకాదు; మందులు చేతపుచ్చుకునివాలంటీర్లు ఇంటింటికి వెళ్ళి ఇచ్చిస్తున్నారు. నెలకు 1200మంది రోగులకు మందు లిస్తున్నట్లుగ సగర్వంగా ఆస్పత్రి రిజిష్టరుకూడా చూపించాడు. సహజంగా ఇదంతా, నేను పనికిరాదని గట్టిగ విమర్శించవలసివచ్చింది. "అబ్బాయీ గ్రామసేవచేసేపద్ధతి ఇది కాద"ని చెప్పాను. ఇల్లు, ఒళ్ళు, వీథులు, దొడ్లు, పరిశుభ్రతగా ఉంచుకోవడం ఎలాగో గ్రామస్థులకు చక్కగ బోధించడం, వారు చేసుకునేటట్లు ప్రోత్సహించడం తద్వారా రోగాలు రాకుండ ఉండే మార్గాలు చూపించడం తనడ్యూటీ. అంతేకాని, ప్రజలు రోగాలుతెచ్చుకుంటూ ఉంటే, వాళ్లకు మందులిస్తూ కూర్చోవడంకాదు అని చెప్పాను. ఆడంబరంగా ఉన్న ఆపెద్ద మేడ వదలివేసి, దానిని జిల్లాబోర్డుకు అద్దెకు ఇచ్చివేసి, తానువచ్చి పూరిగుడిసెలో కాపురం ఉండమనిన్నీ

చెప్పాను. క్వినైన్, ఆముదం. ఐడిన్, వంటివి ఏవో కొద్దిగ ఉంటే చాలు అనిన్నీ చెప్పాను. తమ ఒళ్ళు, గ్రామంలోని వీధులు, వస్త్రాలు ఎంతఖర్చయినాసరేపరిశుభ్రముగ ఉంచుకోవడం ఎంతఅవసరమో, దానిలో ఎంతవిలువ ఉన్నదో, గ్రామస్థులు గ్రహించేటట్లు చూడడం మీదనే గ్రామసేవకుడు ఎక్కువగ తన దృష్టిని నిల్పవలెను.

ఇక, గ్రామములోని హరిజనుల క్షేమంనిమిత్తమై గ్రామసేవకుడు శ్రద్ధవహించాలి. నిరాఘాటంగా వారందరు తన యింటికి వచ్చేటట్లుగ ఉండవలెను. సహజంగా వారంతా తమ కష్టాలు కలిగినప్పుడు తన దగ్గరకే వస్తారు. తమ యిళ్ళమధ్యలోనున్న తన యింటికి హరిజనులు రావడానికి గ్రామస్థులు ఒప్పుకొనకపోతే, గ్రామసేవకుడు ఆ యిల్లు వదలివేసి, హరిజనవాడలోనే కాపురం పెట్టుకోవాలి;

ఇక, అక్షరాస్యత గురించి ఒకమాట. అక్షరజ్ఞానం ప్రయోజనమైనదే. కాని, దానికి ఎక్కువగ అనవసరపు ప్రాముఖ్యత ఇవ్వరాదు సుమా అని మాత్రం నేను హెచ్చరిక చేస్తున్నాను. అక్షరాలు వ్రాయడం, చదవడంముందుగా చిన్నలకు పెద్దలకు నేర్పకపోతే, గ్రామస్థులను విజ్ఞానవంతులను చేయడం కుదరనే కుదరదనే భ్రాంతితో బయలుదేరవద్దు. అక్షరాలు దిద్దుకోవడం ప్రారంభించక మునుపే, ఎంతో విజ్ఞానం నోటిమాటలద్వారా ప్రజలకు అందించవచ్చును. ప్రస్తుతం ప్రపంచం నలుమూలల జరుగుతున్న సంగతులెన్నో

నోటిమాటలతో బోధించవచ్చును. చరిత్ర, భూగోళం, చిన్నచిన్న లెక్కలు, సైన్సు, ఎన్నో చెప్పవచ్చును. అక్షరాలు వ్రాసే చేతికంటె, కళ్ళు, చెవులు, నాలుక, ఇవన్నీ ఉన్నవికద. వీటిద్వారా ముస్ముందుగ ఎంతో విజ్ఞానం సంపాదించుకోవచ్చును. చేతితో వ్రాయడంకంటె, ముందు కంటితో చూచి అక్షరాలుగుర్తించి చదవడం నేర్పవచ్చును. అట్లే, చేతితో అక్షరాలు దిద్దుకోడానికి ముందుగా బొమ్మలు గీయడం వస్తుంది. ఇది సహజమైన పద్ధతి. దీనిని అవలంబిస్తే ముందుగ అక్షరాలు దిద్దడంతో పిల్లలను బాధపెట్ట నవసరం లేకుండ వారు విజ్ఞానాభివద్ధి పొందడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది.

గ్రామసేవకుని జీవితము గ్రామజీవితముతో ఏకరుగితిగా మేళవించి ఉండాలి. ఎల్లప్పుడూ ఏవో మహాగ్రంథాలలో మునిగిఉన్న మహా పండితుడుగ- అల్పమైన ఐహికవిషయములు విననొల్లని మహావేదాంతిగ - ఆతడు గ్రామస్థుల యెదుట నటించరాదు. ఎప్పుడు చూచినా తాను రాట్నము తోనో, మగ్గముతోనో, పలుగు పారతోనో, గొడ్డలితోనో, చెప్పులుకుట్టే పరికరాలతోనో, తీరికలేకుండ ఏదో చేతిపని చేస్తూ ఉండాలి. గ్రామస్థులు ఎప్పుడు ఎవరువచ్చి చూచినా వారికి నీయందు ఈ దృశ్యమే కనిపించాలి. ఈ చేతిపనులు చేసుకుంటూనే, ఎవరువచ్చి ఏచిన్నసంగతులు అడిగినా వారికి ఓపికతో, ఆదరణతో, సమాధానం చెప్పుతూ ఉండాలి. ఈ కాయకష్టంవల్లనే, నిత్యము తనతిండి సంపా

దించుకుంటూనే ధీరత్వంతో పట్టుదలతో పనిచేస్తూ ఉండాలి. నిత్యము తనకు కావలసిన వస్తుసముదాయమునకంటె హెచ్చుగానే తనకు తాను ఉత్పత్తిచేసుకునేశక్తిని భగవంతుడు ప్రతివానికీ ఇచ్చియే యున్నాడు. ఈ శక్తిని కనుక-అదెంత తక్కువదైనాసరి-ప్రతివాడు సరిగ ఉపయోగించుకుంటే వానికి సరిపడ్డ జీవనాధారపు వృత్తి ఏదో ఒకటి అతనికి దొరకకపోదు. అట్టి వానిని గ్రామస్థులు సాధారణంగా సంతోషపూర్వకంగా పోషించకపోరు; పోషించక ఉపేక్షించే గ్రామాలుకూడ లేకపోలేదు. అయినప్పటికి గ్రామసేవకుడు అలాగే తంటాలుపడుతూ, ఐండీలాక్కురావాలి. బహుశః, కొన్నికొన్ని ఊళ్ళల్లో గ్రామసేవకునికిగల హరిజనాభిమానమును చూచి, అతనిని గ్రామస్థులు వెలివేసినా వేయవచ్చును. అట్టిచో, గ్రామస్థుడు హరిజనులవద్దకే పోయి, తిండిని అర్థించవచ్చును. కష్టించేవాడు ఫలితానికి ఎప్పుడూ అర్హుడే. గ్రామసేవకుడు హరిజనులను మనఃపూర్వకముగ సేవించేవాడైతే, వారిచ్చే తిండిని అతడు పుచ్చుకొని తినడానికి వెనుకాడరాదు. అయితే, ఒకసంగతి- తాను వారి నుండి తీసికొనే దానికంటె వారికి తాను ఇచ్చేసేవ హెచ్చయినదిగా మాత్రం ఉండాలి. మరీ మొదటిరోజులలో, అట్టి ఏర్పాటు ఉన్నచోట, ఏదైన కేంద్రనిధినుండి గ్రామసేవకుడు తనకు కావలసిన కొద్దిపాటి జీవనభృతిని తీసికొనవచ్చును.

మొత్తంమీద మన ఆయుధాలు, సాధనలు, కేవలం ఆధ్యాత్మికమైన వని మాత్రం అందరూ జ్ఞాపకం పెట్టుకో

వాలి. ఆధ్యాత్మికశక్తి పైకి కనిపించకపోయినా, పనిమాత్రం అమోఘంగా చేస్తుంది; దానికి ఎదురులేదు; అడ్డూ, ఆక, లేదు. దాని పురోగమనము 1 + 2 + 3 + 4 — అన్న కూడిక అంకెలలో నడవదు, 1 × 2 × 3 × 4 — అనే హెచ్చవేతలలో ఎగిరి నడుస్తుంది. దాని వెనుక నడిపించే వాడే ఉండాలికాని, దానినడక ఆగదు. కనుక, మన మేపని చేసినా, దాని వెనుక నడిపించే శక్తి ఆధ్యాత్మికశక్తిగానే ఉండాలి. కనుకనే, మనప్రవర్తనలో, నడవడిలో, అత్యంత మైన పవిత్రత ఉండితీరాలని చెప్పడం.

"ఇదంతా సాధ్యంకాని కార్యక్రమమండీ" అని నాకు చెప్పకండి. "దానికి తగిన గుణగతాలు మాలో లేవండి" అనకండి. ఇంతవరకు ఈకార్యక్రమం మీరు సాగించి ఉండకపోవచ్చునుకాక; కాని అంతమాత్రంచేత అది ఇప్పుడొక ఆటంకం కారాదు. నే చెప్పినది మీ హేతువాదానికి, మీహృదయానికి నచ్చితే మీరు ఈ పనిలోకి దిగడానికి జంకకూడదు. "ఇది ఔతుందా" అని భిడియపడకండి. ప్రయోగం ప్రారంభిస్తే అదే క్రమేపి మీకు అంతకంతకు హెచ్చుశక్తిని ఇస్తూ ఉంటుంది.

(గుజరాతువిద్యాపీఠకార్యకర్తలతోటి సంభాషణ నుండి - హరిజన్: 31-8-1934)

ఆదర్శప్రాయమైన భారతీయగ్రామం నిర్మించాలంటే, మునుముందుగ సంపూర్ణమైనటువంటి పారిశుద్ధ్యపువర్పాట్లతో

నిర్మించాలి. మంచి వెలుతురు, గాలి వచ్చేటట్లుగ కుటీరములు నిర్మించాలి. చుట్టుపట్ల అయిదుమైళ్ళలోపు దొరికే వస్తుసామగ్రితోనే ఈ కుటీరాలు నిర్మించాలి. ఈకుటీరాల చుట్టు చక్కనిదొడ్లు ఉండాలి. నిత్యము వంటింటికి పనికి వచ్చే కూరగాయలు పండించుకోడానికి, పశువులను కట్టి వేసుకోడానికి చాలినంతగ ఈదొడ్లు విశాలంగా ఉండాలి. గ్రామంలోని సందులు, గొందులు, వీధులు, మురికి, చెత్త చెదారం లేకుండ, అందంగా పరిశుభ్రంగా ఉంచుకోవాలి. అవసరమైనచోట్ల, అవసరమైనన్ని బావులు అందరూ నీరు తోడుకోడానికి అనుకూలంగా ఉండాలి. అందరూ వచ్చి ప్రార్థించుకోదగ్గ దేవాలయాలు, భజనమందిరాలు ఉండాలి. అందరూ కలిసి ఆటపాటలు పెట్టుకోడానికి విశాలమైన స్థలం ఉండాలి; గ్రామపశువులన్నింటికీ తిరగడానికి మేయడానికి ఉమ్మడిబీడు ఉండాలి; సహకారపద్ధతిని నడుపుకునే పాలు పెరుగు వెన్న పదార్థాల సంఘం ఉండాలి. ప్రయిమరీ సెకండరీ స్కూళ్ళు ఉండాలి. ఈ స్కూళ్ళల్లో చేతివృత్తులు నేర్పే వారిగ్రామీణ విద్యయే ప్రధానమైన విద్యగా ఉండాలి. గ్రామతగాదాల పరిష్కారానికి పంచాయితీలు ఉండాలి. ఆ గ్రామానికి కావలసిన ధాన్యాలు, కూరలు, పండ్లు, వస్త్రములు, అన్నీ ఆగ్రామమే ఉత్పత్తిచేసుకోవాలి. స్థూలంగా ఇదీ నా ఆదర్శగ్రామపు ప్లాను. ఇప్పుడున్న పరిస్థితులలో గ్రామాలలో ఉన్న ఇండ్లనే కొద్దిపాటిమార్పులతో మంచి ఇండ్లుగ తయారుచేసికొనవచ్చును.

జమీందారుడున్నచోట్ల అతడు మంచివాడైతే, లేక ప్రజలలో పరస్పరం సహకారంఉంటే పైన చెప్పిన యావత్తు పోగ్రాము, నమోనా కుటీరములు మినహా గవర్నమెంటు సహాయం లేకుండానే, గ్రామస్థులయు ఆ జమీందారునియు తాహతుకు లోబడియుండే ఖర్చుతోనే, నడిపించవచ్చును. ఇక, గవర్నమెంటు సహాయంకూడా ఉంటే, గ్రామము యొక్క పునర్నిర్మాణమును అంతులేకుండానే పెంపుచేసుకో వచ్చును. అయితే, నే నిప్పుడు చూచే దేమంటే, గవర్న మెంటుసహాయంలేకుండ గ్రామస్థులే పరస్పరం సహకరించు కొని, సమిష్టిప్రయోజనంనిమిత్తమై తమంతటతాముగ చేసే శరీరశ్రమవల్ల గ్రామనిర్మాణమును ఎంతవరకు సాగించ వచ్చుననే సంగతే. ఇదే నా ప్రస్తుత కృషి. మంచి తెలివి తేటలుగ నడిపించే నాయకత్వం ఉంటే ఈ పద్ధతివల్ల వ్యక్తి ఆదాయం మాట యెట్లున్నను మొత్తం గ్రామ ఆదా యాన్ని ఇప్పటికంటె రెట్టింపుగ పెంపుచేసుకోవచ్చునని నా దృఢాభిప్రాయము. సంపదను పెంపుచేయడానికి మనగ్రామా లన్నింటిలో ఎన్నటికీ తరగని ఆధారాలున్నవి. పెద్దవ్యాపార లాభాలు తీయడానికైతే ప్రతిగ్రామంలోను అంతటి పెద్ద ఆధారాలు ఉండకపోవచ్చుగాక; కాని, స్థానికావసరములకు పనికివచ్చేవి మాత్రంఅంతులేకుండా ఉన్నవి. ఇది నిశ్చయం. వచ్చిన గొప్ప విషాదస్థితి ఏమంటే తమ్మను తాము బాగు చేసుకుందామనే కోర్కె గామస్థులలో లేకపోవడమే.

గ్రామసేవకుడు మొట్టమొదటగ పూనుకోవలసిన సమస్య గ్రామపారిశుధ్యము. ఇంత అశ్రద్ధచేయబడిన సమస్య

ఇంకొకటిలేదు. గ్రామసేవకులకు కొరుకుడుపడని సమస్య ఇదే. గ్రామస్థుల భౌతికశ్రేయమును నాశనముచేసి, రోగాలు కలిగించేదిన్నీ ఇదే. గ్రామసేవకుడు ఇచ్ఛాపూర్వకంగా తానే పాకీవాడుగా తయారైతే అతడు గ్రామంలో వీధులు వగైరా చోట్లను ఊడ్చి, మలమునంతను పోగుచేసి, దానిని ఎరువుగ తయారుచేస్తాడు. మలమూత్రాదులను ఎక్కడ ఎలావిసర్జించాలో అతడు గ్రామస్థులకు బోధించి చెబుతాడు. పరిశుభ్రత అనేది ఎంత ఉపకరమో దానిని అశ్రద్ధచేయడం వల్ల ఎట్టి ఆరోగ్యహాని జరుగుతుందో అతడు గ్రామస్థులతో చెప్పి, బోధిస్తాడు. ఈ సూచనలను గ్రామస్థులు విన్నా వినక పోయినా అతడు తన పని తాను చేసుకుంటూనే పోతాడు.

(హరిజన్: 9-1-1937)

మన గ్రామపునర్నిర్మాణపు ప్లానులలో, గ్రామపారిశుధ్య మనేదే లేకపోతే, ఈ రోజున ఉన్నట్లే మన గ్రామములన్నీ ఎల్లప్పుడు పెంటకుప్పలుగానే ఉండిపోతవి. గ్రామ జీవితంలో గ్రామారోగ్యం ప్రాణతుల్యమైనది. అది ఎంత ముఖ్యమో, అంత కష్టమైనదిసాధించడానికి. యుగాలతరబడి ఉన్న ఈ మురికి జీవితపు పద్ధతులను మాన్పించాలంటే భగీరథ ప్రయత్నం కావాలి. గ్రామపారిశుధ్యశాస్త్రము నెరుంగనివాడు - తాను ప్రశస్తమైన పాకీవాడుగా కాలేనివాడు- గ్రామసేవకుడుగా పనికిరాడు.

ఇక, బేసిక్ విద్యావిధానము ప్రవేశపెట్టనిదే ఇండియాలో గల కోట్లకొలది పిల్లలకు విద్య చెప్పించడ మనేది

దాదాపు అసాధ్యమైన పనే అవుతుందని అందరు అంగీకరించిన విషయంగానే కనబడుచున్నది. కనుక, గ్రామసేవకుడు దీనిలో బాగా ప్రవీణుడై ఉండాలి. తానే బేసిక్ విద్యాగురువై పోవాలి. బేసిక్ విద్యా విధానం ప్రవేశపెట్టితే, వయోజనవిద్య దానంతటదే వచ్చిచేరుతుంది. బేసిక్ విద్యావిధానం పిల్లలలో పాతుకుంటే, తలిదండ్రులకు వాళ్లే గురువులై పోతారు. సరే, ఇంతకూ, గ్రామసేవకుడు వయోజన విద్యావ్యాప్తికికూడ పూనుకోవాలి.

స్త్రీ పురుషునికి అర్ధాంగి అన్నారు. — పురుషుడు సగం, స్త్రీ సగం అన్నమాట. ఈరెండు సగాలలో పురుషుని భాగంకంటె స్త్రీభాగమే ఉత్తమమైనదని కూడ అంటారు, 'లా' దృష్టిలో స్త్రీకికూడ పురుషునితోపాటు సమానహక్కులు లేనంతకాలం — ఆడపిల్ల పుట్టితే 'అయ్యో మొగపిల్లవాడుపుట్టలేదే' అని మనవారు పెదవివిరవడం మాననంతకాలం — అంతకాలం ఇండియా ఒకపార్శ్వపు పక్షవాతరోగంతో బాధపడుతోందని మనమందరం గ్రహించాలి. స్త్రీని అధోగతిలో ఉంచడం, అహింసను మనం త్రోసిరాజన్నట్లే! కనుక, ప్రతి గ్రామ సేవకుడు ప్రతిస్త్రీని తనతల్లిగానో, తోబుట్టువుగానో, కన్నకూతురుగానో, చూచుకొని, గౌరవభావంతో ప్రవర్తించాలి. అట్టిగ్రామస్థుడే గ్రామప్రజలచే భక్తివిశ్వాసాలతో చూడబడతాడు.

అనారోగ్యులుగా ఉన్న జనం స్వరాజ్యాన్ని ఎన్నటికీ సంపాదించలేరు. కనుక, ప్రజారోగ్యమును అశ్రద్ధచేసిన

పాపము మనకిక తగులకుండుగాక. ఆరోగ్యమునకు సంబంధించిన సామాన్యసూత్రాలన్నీ గ్రామసేవకునకు తెలిసి ఉండాలి.

దేశంమొత్తానికి సామాన్యభాషఅనేదిఒకటి లేకపోతే ఏ జాతిగాని రూపొందజాలదు. హిందీయూ, హిందూస్థానీయూ ఉరుదూ. అనే వాగ్వాదాల్లోనికి గ్రామసేవకుడు దిగకుండ హిందువులకు ముస్లిములకు సులభంగా అర్థమయ్యే రాష్ట్రభాషను గ్రామసేవకుడు నేర్చిఉండాలి.

ఇంగ్లీషుభాషంటేమనకేర్పడియున్న వెర్రిఅభిమానం మన ప్రాంతీయభాషలయెడ మనకు విముఖతగలిగించి, వాటికి ద్రోహంచేసింది. ఈ ద్రోహరూపమైన పాపానికి పరిహారంగానైనా మనము గ్రామస్థులలో తమ మాతృభాషలయెడల ప్రేమ గలిగించేటట్లు గ్రామసేవకుడు పనిచెయ్యాలి. ఇతర ప్రాంతాల భాషలయెడలకూడ గ్రామసేవకుడు సమానగౌరవము గలిగిఉండాలి తను పనిచేసే ప్రాంతములోని భాషను బాగా నేర్చి ఉండాలి. తద్వారా, వారి భాషయెడల వారికి ఆదరాభిమానాలు కలిగేటట్లు చూడాలి.

అసలు ఈ ప్రోగ్రాముకంతకు గట్టి పునాదిగా ఆర్థిక సమత అనేదే లేకపోతే, ఇదంతా ఇసుకతో కట్టిన బొమ్మరిల్లే అవుతుంది. ఆర్థికసమత అంటే, ప్రతిఒక్కరికి ఈ భౌతిక వస్తుజాలము సమానపు పరిమాణంలో ఉండాలని కాదు అర్థము. దాని అర్థమేమంటే, ప్రతివానికి ఉండడానికి మంచి

కొంప, తగినంత ఆరోగ్యవంతమైనతిండి, వంటినిండా మంచి ఖద్దరుబట్ట ఉండాలి అని అర్థం. ఇవికాక, నేడున్న ఘోరమైన ఈ ఆర్థికవ్యత్యాసములు కేవలం అహింసాపద్ధతులతో తొలగించాలని కూడా అర్థం.

(హరిజన్: 18–8–1940)

# 3

## —: గ్రామము యొక్క గమ్యము :—

నా ఉద్దేశ్యంలో గ్రామరాజ్యం అంటే సంపూర్ణమైన ప్రజారాజ్యమని; ప్రధానమైన అవసరాలన్నీ ఇరుగు పొరుగు గ్రామాలమీద ఆధారపడకుండ గ్రామంలోనే ఉత్పత్తి కావాలని; అనివార్యంగా ఇతరత్ర ఆధారపడవలసిన ఇంక అనేక విషయాలలో గ్రామాలు పరస్పరం ఒకటిపై ఒకటి ఆధారపడి ఉండాలని; కనుక ప్రతిగ్రామం మున్ముందుగా చూచుకోవలసినవి తన గ్రామానికి తిండికి సరిపడ్డ ఆహారపదార్థాలు, బట్టకు సరిపడ్డ పత్తి, గ్రామంలోనే ఉత్పత్తి చేసుకోవడం. ఊళ్లో పశువులకన్నింటికి తిరగడానికి మేయడానికి తగినంత బీడు. మందబయలు, ధారాళంగా వదిలివేసెయ్యాలి; పిల్లలకు పెద్దవాళ్ళకు ఆటలకు వినోదాలకుకూడ తగినంత విశాలప్రదేశం కేటాయించాలి. ఇవన్నీపోను ఇంకా ఏదయినా భూమి మిగిలితే అప్పుడే ఉపయోగకరమైన వ్యాపారపుపంటలు పండించుకోవచ్చు. అయితే డబ్బువస్తుందిగదా

యని వ్యాపారపుదృష్టితో గంజాయి, పొగాకు, నల్లమందు మొక్కల వంటివి పెంచరాదు. ఒక నాటకశాల, ఒకస్కూలు, ఒక పబ్లిక్ హాలు ఇవ్వికూడా గ్రామానికి వుండాలి. పరిశుభ్రమయిన నీటిసప్లయికి ప్రతిగ్రామంలోను వసతులు ఏర్పరచుకోవాలి. ఇందుకై మురికిచేరకుండ జరుపులోవుండే చెరువులు, బావులు నిర్మించుకోవాలి. "ఫైనల్ బేసిక్" స్టాండర్డు వరకు విద్య అందరికి నిర్బంధంగా వుండాలి. ప్రతిపనీ సాధ్యమైనంతవరకు సహకారపద్ధతిగానే జరుపుకోవాలి. ఈనాడు నట్లుగ హెచ్చులొచ్చు భావాలతో అంటరానితనంతో కూడిన కులభేదాలుండరాదు. సత్యాగ్రహము "నాన్‌కోఆపరేషన్" ప్రయోగాలతోకూడిన అహింసావిధానమే గ్రామ సంఘానికి సర్వత్ర ఊతగా వుంటుంది. గ్రామరక్షణకై తగిన మనుష్యులను వరి ఒక జాబితాగా తయారుచెయ్యాలి. వంతుల ప్రకారం వీరికి విధిగ డ్యూటీలు నిర్ణయించాలి. గ్రామమే ఒక రాజ్యం. దాని పరిపాలన యావత్తు అయిదుగురు ప్రతినిధులతోకూడిన పంచాయితీచేత నిర్వహింపబడుతుంది. మైనారిటీవెళ్ళిన స్త్రీపురుషులందరిచేత ఈ పంచాయితీదార్లు నాలుగొకసారి ఎన్నుకోబడతారు. పంచాయితీదార్లుగ ఎన్నుకోబడటానికి కొన్ని కనీసపుఅర్హతలు నిర్ణయింపబడాలి. ఈ పంచాయితీకి యావదధికారములు ఉంటవి. మామూలుగా అందరు నేడు అనుకునే శిక్షలవిధానం ఉండదు కనుక పంచాయితీలోనే శాసనాధికారం, న్యాయనిర్వహణాధికారం, కార్యనిర్వహణాధికారం అన్నీఏకీకృతంగా చేరివుంటవి. ఒక్కొక్క సంవత్సరానికి పంచాయితీ మారిపోతూవుంటుంది. ఇప్పుడు

వున్న ఈ (బ్రిటిష్) గవర్నమెంటు ప్రమేయం ఆక్షేప లేకుండ గానే ఏ గ్రామమైనాసరే అటువంటి గ్రామరాజ్యంగా మారి పోవటానికి అవకాశం నేడుకూడ ఉంది. ఎందుకంటె ఈ గవర్నమెంటుకు గ్రామానికి నేడున్న పటిష్టమైన సంబంధమల్లా గ్రామంలోనుంచి రివిన్యూ గుంజుకుపోవడమేగా! ఇరుగు పొరుగు గ్రామాలతో కాని, ఉంటే కేంద్రప్రభుత్వంతో కాని, గ్రామానికి వుండవలసిన సంబంధంగూర్చి నేనీ వ్యాసంలో చర్చించలేదు. ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యం గ్రామ రాజ్యంయొక్క స్థూలరూపం ప్రదర్శించడంవరకే. నేను చిత్రించిన ఈ గ్రామరాజ్యంలో సంపూర్ణమైన ప్రజాస్వామ్యం వుంది. అది వ్యక్తుల స్వాతంత్ర్యమనే పునాదిమీదనే నిర్మింపబడినది. వ్యక్తియే తన రాజ్యసౌధాన్ని నిర్మించుకోగల శిల్పి అహింసాసూత్రమే వ్యక్తిని, ఆతని గవర్నమెంటును గూడ పాలించేది. వ్యక్తియు, అతని గ్రామరాజ్యంకూడ ప్రపంచములో ఎంతటి బలిష్టమైన శక్తినైనాసరే ఎదుర్కొ గలిగి వుంటుంది. ఎందుకంటె గ్రామంలోని ప్రతివ్యక్తిని నడిపించే సూత్రము ఆత్మార్పణసూత్రమేకనుక. అనగ ప్రతి వ్యక్తి తనయొక్కయు,తన గ్రామముయొక్కయు గౌరవమును కాపాడటానికై తన ప్రాణమును అర్పించడానికైనాసరే సదా సంసిద్ధముగా ఉండడమే.

(హరిజన్ : 26-7-1942)

# 4

## —: ఖద్దరు - రాట్నము :—

ఖద్దరు అనగా దేశానికి ఆర్థికవిముక్తి - వ్యక్తులమధ్య సర్వసమానత్వం. వీటికి ప్రారంభం, విఘ్నేశ్వరపూజ అన్న మాట. దానిలోవుండే ఆంతర్భావములన్నీకూడ గ్రాహ్యం చేసికోవాలి దీనికి నూటికి నూరువాళ్ళ స్వదేశీ మనస్తత్వం అవసరం. జీవితావసరములకు కావలసిన సమస్త వస్తుజాల మును ఇండియాలోనే ఉత్పత్తిచేసుకోవాలని దీనిభావం. అదినీ గ్రామస్థుల కాయకష్టముచేత, బుద్ధివిశేషంచేత తయారు కావాలనికూడ అర్థం. గ్రామాలు చాలావరకు స్వయం సమృద్ధిగ, స్వయంపోషకంగావుండాలి. అంతేకాదు, ఇండియా లోని పట్టణాలకు, ఇంకా ప్రపంచంలోని యితరదేశాలకు కూడ ఇచ్ఛాపూర్వకంగా మనగ్రామాలు సప్లయిలు చేయ గలుగుతవి. అయితే ఆ వ్యాపారం ఉభయత్రా లాభప్రద ముగా వుండాలికూడ.

ఇట్టిపరిణామం జరగాలంటే ముందుగ మనప్రజల మన స్తత్వములోను, అభిరుచులలోను, ఇప్పుడున్నదానికి తల్ల క్రిందుమార్పురావాలి. అహింసామార్గం చాలావిషయా లలో సులభమైనప్పటికి, మరికొన్ని చాలా విషయాలలో అతికష్టంకూడాను. అది ఇండియాలోని ప్రతిమనిషికి ప్రమే యంకలిగిస్తుంది. ప్రతిమనిషిలోను ఇంతకాలంనుండి దాగి యున్న ఏదో మహాశక్తిని మేల్కొల్పి ఆతనికి వెలుగునిస్తుంది.

భారతమానవమహాసముద్రంలో ప్రతిబింబవృత్తోను తాను ఐక్యతను, తాదాత్మ్యమును, పొందుతున్నాననే ఆనందోత్సాహముతో ప్రతిభారతీయుడు ఉబ్బిపోయేటట్లు చేస్తుంది.

భారతమానవజాతియొక్క ఐక్యతకు, భారతదేశపు ఆర్థికవిముక్తికి, సర్వసమానత్వతత్త్వమునకు, ఖాదీ ప్రత్యక్ష చిహ్నమని సామతము. జవహర్‌లాల్ యొక్క కవితావాణిలో అది భారత స్వాతంత్ర్యదేవతావస్త్రము.

అదికాక, ఖాదీమనస్తత్వమంటే సమస్త జీవితావసర వస్తుసముదాయముయొక్క ఉత్పత్తియు, పంపిణీయు కూడ కేవలం వికేంద్రీకరణపద్ధతిగానే జరగాలని చెప్పడం. కనుక, ఇంతవరకు రూపొందింపబడిన కార్యవిధాన మేమంటే, ప్రతి గ్రామము తనకవసరమైన సమస్తవస్తువులనూ తాను ఉత్పత్తి చేసుకోవడమేకాక, పట్టణాల అవసరంకొరకుకూడ కొంత అదనంగా ఉత్పత్తిచేయాలని నిరూపింపబడినది.

ఖాదీలో గర్భితమైయున్న తత్వమేమిటో ఇంతవరకు చెప్పడమైనది. ఇక, ఈ ఖాదీ అభివృద్ధినిమిత్తమై కాంగ్రెస్ సభ్యులు ఏమిచెయ్యాలో చెబుతాను. ఖాదీ ఉత్పత్తిచేయడమంటే ఒకటికాదు, ఎన్నో పనులున్నవి. ప్రత్తిపండించుట, ఏరుట, గింజలుతీయుట(?), పరిశుభ్రపరుచుట, ఏకుట, ఏకులు చుట్టుట, వడుకుట, గంజిపెట్టుట, నూలుకురంగువేయుట, పనుగుతయారుచేయుట, పేకకుకండెలుచుట్టుకొనుట, నేయుట, నేసినబట్టనుఉతికి, నాస్సి(?), రంగుఅద్దుట ఏన్నో ఉన్నవి.

రంగులద్దుట మొదలగు శక్తివంతమైన అనేకరకమైన పనులే. ఈ పనులలో ప్రతిఒకటీ గ్రామాలలో చేయడానికి వీలైనదే. అలా ఇండియా మొత్తంపైనా అన్ని గ్రామాలలోను జరుగుతునే ఉన్నది. గ్రామాలలో అఖిలభారతచరఖాసంఘం వ్యాపించి ఈపనులు పెంపొందడానికి ప్రయత్నంచేస్తున్నది.

కాంగ్రెసు సందేశమును కాంగ్రెసువారంతను నిజంగా పాటించేటట్లయితే, అఖిలభారతచరఖాసంఘం అప్పటప్పటికి జారీచేయుచుండు కార్యక్రమమును కొనసాగించగలరు. ఈ దిగువను స్థూలంగా కొన్ని నియమాలుమాత్రం ఉటంకిస్తాను.

(1) ప్రతికుటుంబం తనదొడ్లో తనఇంటికి కావలసిన ప్రత్తిని పండించుకోవాలి ప్రత్తిపండించడం సులభమైన పనే. బీహారులో ఒకప్పుడు ప్రతిరైతు తనసాగుబడిభూమిలో ఇరవై ఇంట మూడువంతులు (3/20) విధిగా నీలిమందు పండించితీరాలని బ్రిటిష్ ప్రభుత్వం 'లా' యే చేసింది !! విదేశీ నీలిమందువర్తకుల లాభానికై ఇంతపనిని నాడు బ్రిటిష్ గవర్నమెంటు చేసింది! ఇట్టి నిర్బంధంలేకుండ, దేశక్షేమం కొరకై, మన రైతులేల ఇచ్ఛాపూర్వకంగా తమపంట భూమిలో కొంతమేర ప్రత్తిని పండించరాదు? వికేంద్రీకరణ అనేది ఖాదీ ఉత్పత్తివిధానంలో ప్రప్రథమమునుంచి (అనగా ప్రత్తిపండించడం దగ్గరనుంచి) ప్రారంభమవుతుందని గ్రహించాలి. నేడు ప్రత్తిపంట కేంద్రీకరణ పద్ధతిగ పండించబడుతున్నది. అనగ, దూరప్రదేశాలకు ఎగు

మతిచేయవలసివచ్చుచున్నది. యుద్ధానికిపూర్వం బ్రిటన్‌కు, జపాన్‌కు మనప్రత్తి ఎగుమతిచేయబడుతూ ఉండేది. ప్రత్తి పంట వ్యాపారప్రపంటగ ఇదివరకుండెను. ఇప్పుడుకూడ ఇంకా అట్లాగే ఉన్నది. అందువల్ల, మార్కెట్ల ఒడుదుడుకు లకు ప్రత్తిపండించేవారు గురికావలసివచ్చుచున్నది. ఖాదీ స్కీముతో అయితే ఇట్టి ఒడుదుడుకులు, జూదాలు ఉండవు. తనకు కావలసినదే రైతుపండించుకుంటాడు. తన ప్రథమ కర్తవ్యం తన ప్రాంతానికి కావలసిన వస్తువునే పండించు కోవడమని ప్రతిరైతు గ్రహించవలసిన అవసరం ఉన్నది. రైతు అప్రకారం చేస్తే ధరలు పడిపోయి తాను నాశన మయ్యే స్థితి చాలావరకు తగ్గిపోతుంది.

(2) నూలువడికే ప్రతివ్యక్తి – తనకు సొంత ప్రత్తి లేకపోతే – తనకు కావలసినంతప్రత్తిని కొనుక్కోవచ్చును. కొని గింజతీసివేసికోవచ్చును. దీనికి 'రోలర్ ఫ్రేమ్' అక్కర లేదు; ఒక నున్నటి బల్లచెక్క, ఇనుపగంటం ఉంటేచాలు. ఇది కుదరకపోతే చేతిగిలకమీద గింజ తీసిన దూదిని కొను క్కొని ఏకుకొనవచ్చును. ఎవరిముట్టుకు కావలసిన ఏకులు వారుచేసుకోడానికి పెద్దకష్టం అక్కరలేదు. చిన్న విల్లుతో ఏకుడుబద్దతో ఏకి చేసుకోవచ్చును. కాయకష్టమును ఎంత వికేంద్రీకరిస్తే పరికరములు అంతసులభము, చవక, అవుతవి. ఏకులుతయారుకాగానే వడకడం ప్రారంభించవచ్చు.

ప్రత్తిగింజ నాటటంమొదలు వడకడంవరకు ఉన్న అన్నిపనులు యావద్భారతప్రజలు ఏకకాలమందు పాల్గొని

చేస్తూఉంటే, జాతిలో ఎంత ఐక్యభావం, ఎంత విజ్ఞాన వికాసం, ప్రబలుతుందో ఒకనాడి ఊహించుకోండి!! ధని కులు పేదలు అనే విభేదంలేకుండ ఇరుతెగలకు మధ్య ఈ సమిష్టికాయకష్టవిధానంవల్ల ఎంతటి సమత్వం నెలకొంటుందో ఒక్కనాడి ఆలోచించండి !!

ఈ పనిలోకి కాంగ్రెసువారు మనఃపూర్వకంగా ప్రవేశిస్తే దీనికి కావలసిన పరికరములలో ఎన్నో మెరుగులు తేవచ్చును అనేక క్రొత్త ఉపాయములు, సంగతులు, కనిపెట్టవచ్చును. మన దేశంలో వచ్చిని దౌర్భాగ్యం ఏమంటే, బుద్ధివికాసానికి, కాయకష్టానికి పొత్తులేకుండాపోయింది. రెండూ రెండుగా కేటాయించి ఉన్నవి. దీనికి ఫలిత మేమి వచ్చిందంటే. దేశం ఎదుగుబొదుగులేకుండ, స్తంభించి పోయింది. ఈ రెంటికి ఎన్నటికీ విడివడని తాలిబొట్టుకనుక కట్టితే- అదిన్నీ ఈ వ్యాసంలో వివరించిన పద్ధతిగా కొట్టివేస్తే. దానివల్లవచ్చే సత్ఫలితం ఇంతింతని చెప్పడానికి వీలుండదు. మన భారత ప్రజానీకం యావన్మంది ఈ రాట్నము వడకడమనేది ఒక మహాయజ్ఞకార్యంగా చేపట్టే పద్ధతిలో, ప్రతిపురుషుడు, ప్రతిస్త్రీకూడ దీనికొరకై రోజు కొక గంట కంటె ఎక్కువ కాలం వినియోగించ నక్కరయుండదని నాఉద్దేశం.

(నిర్మాణకార్యక్రమము 1945: పేజీ 11-14)

(35)

## రాట్నసందేశం.

రాట్నచక్రసందేశం దాని కైవారము (చుట్టుకొలత) కంటె అతివిశాలమైనది. మనుష్యులు నిరాడంబరముగ బ్రతకాలని, మానవసేవ చెయ్యాలని, ఇతరులకు హానికలుగనిరీతిగ నడచుకోవాలని, ఈ సందేశసారాంశము. ధనికునకు, పేదకు, సాహుకారునకు కూలీకి- రాజుకు, రైతుకు ఎడతెగని సౌమనస్యము కల్పించడం ఈ రాట్నచక్రసంకల్పం.

(యంగ్ ఇండియా: 17-9-1925)

"అంటు దిస్ లాస్ట్" అని రస్కిన్ మహావేత్త ఏ మహావాక్యమైతే పలికాడో, అదే నాకు పరమప్రమాణం. లోకులు మన కేమి చెయ్యాలని కోరుకుంటామో, మనం కూడ మనలోని కడగొట్టువానికికూడ అదే చెయ్యాలి. అందరికీ సమానావకాశాలుండాలి. అట్టి అవకాశం కలిగిస్తే ప్రతిమానవుడు కూడ నైతికోన్నతిపొందడానికి సమానముగ సాధ్యమే. ఆసంగతే రాట్నచక్రం ఉద్ఘోషిస్తోంది.

(హరిజన్: 17-11-1946)

## నూలువడుకుట ఒక యజ్ఞకార్యంగా ఉండాలి.

## (సూత్రయజ్ఞము)

"తిండికోసం కాయకష్టం చేయువలసిన అగత్యం లేని నేను ఎందుకు నూలువడకాలి?" అని కొందరడగవచ్చును.

ఎందుకంటె, "నాదికానిది, (ఇతరులది) నేను తింటున్నాను కనుక" అని నాజబాబు. నాతోడి దేశస్థులు చేసే కష్టార్జితాన్ని నేను హరించి తింటున్నానని అట్టివారు గ్రహించవలెను. నీ జేబులోకివచ్చే ప్రతిదమ్మిడీ ఎక్కడినుండి, ఎలా వస్తున్నదో పరిశీలించి చూడు; అప్పుడు నేను చెప్పిన ఈమాటలోని సత్యము నీకు గోచరమవుతుంది. కట్టగుడ్డలేని పేదవాళ్ళకు వస్త్రదానమంటూ చేయడం వారిని అగౌరవపరచడమే. ఇట్టి పని నే నెన్నడూ చేయను. వారికి నిజముగ కావలసినది నీవు దయదలచి ఇచ్చే వస్త్రదానముకాదు; వారికి అత్యవసరముగ కావలసినది పని. వారిని పేదరికంలోకి దింపడానికి నేనే కారకుడనై యుండి, నేనే మరల వారికేదో మహోపకారం చేస్తున్నట్లు వస్త్రదానం ఆడంబరంగా చేయడమనేది వట్టి దొంగనటన. ఇట్టి దొంగనటన, ఇట్టి పాపం నేను చేయజాలను. నేను తిని పారవేసిన విస్తళ్ళుకాని, కట్టుకొని చింపి మురికిచేసిన బట్టలుకాని, నేను వారి మొగాన పారేసి వారికేదో మహోపకారిలాగ నటించను. అసలు వారిపేదరికానికి నేనే కారకుడనని తెలిసికొనగానే వారికి నాతోపాటు నేనుతినే మంచిఆహారాన్నే. కట్టేమంచివస్త్రమునే ఇచ్చి, వారితోపాటు కాయకష్టం చెయ్యడానికి దిగుతాను.

ప్రతివాడు తనతిండికొరకై కాయకష్టం చెయ్యాలనే దేవుడు మనిషిని సృష్టించాడు. పనిచెయ్యకుండ తిండితింటాననేవాడు దొంగ అని ఆ భగవంతుడే చెప్పాడు (స్తేన ఏవ సః).

(యంగ్ ఇండియా: 13-10-1921)

మనిషి హృదయంలో ప్రేమ అనేది, అహింస అనేది నాటుకొని యుండకపోతే అతడెన్నడూ పరులకు సేవచెయ్యనే లేడు. నిజమైన ప్రేమ సముద్రంవలె అంతులేనిది; అది మానవుని హృదయంలో సదా పొంగి పొరలుతూ ఉంటుంది. అది అన్నిహద్దులు, సీమలు దాటి యావత్ప్రపంచమును ఆవరించుకుంటుంది. తిండికై శ్రమించనిదే సేవచేయుటమనేది సాధ్యంకాదు కూడ. తిండికై శ్రమించడాన్నే భగవద్గీత "యజ్ఞము" అని చెప్పినది. పరుల సేవకై కాయకష్టం చేసినప్పుడే ఏ స్త్రీకాని, పురుషుడుకాని, తాను జీవించడానికి అర్హత సంపాదించుకుంటారు.

(యంగ్ ఇండియా: 20-9-1928)

'యజ్ఞార్థమై' చెయ్యాలనే కాయకష్టం ఏదిగా ఉంటే బాగుంటుందని నన్నడిగితే, నూలువడకడమే ప్రశస్తమై, సర్వాంగీకారమైనదిగ ఉంటుందని నాకు తోస్తున్నది. ఇంతకంటె నాకు ఇతరమైనది తోచడంలేదు. ఇంతకంటె జాతీయమైనది నాకు కనిపించడంలేదు. పేదలు తమ పొట్టకై గత్యంతరంలేక నెత్తిరాతగా ఏ కాయకష్టమైతే చేస్తున్నారో, అట్టి కాయకష్టం మనమందరంకూడ. కనీసం నూలువడకడమనే ఈ రూపంలోనైనా రోజు కొక గంటైనా చేసి, ఆ పేదప్రజానీకంతో, తద్వారా యావత్తు సోదరమానవానీకంతో, మనము ఐక్యభావస్ఫురణను కలుగ జేసుకోవడంకంటె, మహోదరమైనపని, ప్రశస్తతరమైన జాతీయకార్యక్రమం మరొకటి ఏది ఉండగలదో నేను

ఊహింపజాలకున్నాను. పేదలు చేసే రీతిగానే వారిసేవకై నేనుకూడ భగవంతునిపేర, కాయకష్టము చేయడంకంటె, ప్రశస్తమైన భగవదారాధనపద్ధతి నేను ఊహింపజాలకున్నాను. భూమాత ఇచ్చే సంపదలను బిడ్డలందరికీ సమానంగా పంచియిచ్చే మార్గం ఈ రాట్నచక్రమే నాకు చూపించుచున్నది.

( యంగ్ ఇండియా : 20-10-1921 )

పేదలకోసం ఈచిన్న సూత్రయజ్ఞమును చేసి, వారి ఋణమును కొంతకు కొంతైనా తీర్చుకోండి అని నేను అందరిని కోరుచున్నాను. యజ్ఞంచెయ్యకుండ, తిండితినేవాడు, తిండిని దొంగలించే దొంగ యని కదా మన భగవద్గీత చెప్పినది. ఈ వర్తమాన యుగమునకు రాట్నమే మన యజ్ఞము. సూత్రయజ్ఞమే మనయజ్ఞము. అహోరాత్రములు విరామములేకుండా ఈ యజ్ఞాన్ని గురించి మాట్లాడుతున్నాను; వ్రాస్తున్నాను. ( యంగ్ ఇండియా : 30-[illegible]-1927 )

—: గ్రామ ఆర్థికవ్యవస్థలో రాట్నముయొక్క స్థానము :—

ఖాదీపరిశ్రమను మనము పునరుద్ధరిస్తే, తక్కినపరిశ్రమలనన్నీ వాటంతటవే వస్తవి. రాట్నమును పునాదిచేసియే దానిమీదనే గ్రామజీవితమును ప్రశస్తముగ నిర్మించాలని నా కోరిక. ఈరాట్నచక్రం చుట్టూ తక్కిన పరిశ్రమలన్నీ సూర్యునిచుట్టు గ్రహములవలె తిరుగుతూ ఉండవలె.

( యంగ్ ఇండియా : 21-5-1925 )

రాట్నము చాల ఉపయోగకరమైనది, ప్రతి ఇంట ఉండితీరవలసినది. అది భారతదేశంయొక్క ఐశ్వర్యమునకు చిహ్నము; కనుకనే, భారతజాతియొక్క స్వాతంత్ర్యమునకు కూడ చిహ్నమే. అది వాణిజ్యయుద్ధాలకు చిహ్నముకాదు; వాణిజ్యశాంతికది చిహ్నము. ప్రపంచజాతులమధ్య స్పర్థను విద్వేషమును అది వహించదు; ఆత్మోద్ధరణనుచేసికొంటూ అది పరశ్రేయస్సునుగూడ కోరుకుంటుంది. లోకశాంతిని భంగపర్చి లోకంలోని సంపదలను దోచుకునే బ్రహ్మాండమైన నౌకాబలాలతో దానికి పనిలేదు. ప్రతివారు తమ ఇంట్లో అన్నం ఎలా వండుకుంటున్నారో, అలాగే ప్రతివారు తమ ఇంట్లో నూలువడికి బట్టకట్టుకోవాలనే ధర్మదీక్ష భారతప్రజాకోట్లకు ఉండడమనేదే కావాలి.

( యంగ్ ఇండియా : 8-12-1921 )

ఇప్పుడున్న ఏకైక పరిశ్రమతోగాని పోటీచేసి, దానిని పారదోలాలని రాట్నముయొక్క సంకల్పంకాదు, అది అలా పారదోలదుకూడాను. ఇంకొక మార్గంగా ప్రతిఫలంవచ్చే ఏపనినుండిగాని ఏవృత్తినుండికాని, ఒక్కనినైనాకాని, మాన్పించి ఈ రాట్నముపనిలో పెట్టాలనిన్నీ దీనిఉద్దేశ్యంకాదు. ఇంతవరకూ మనకు కొరుకుడు పడకుండాఉన్న సమస్యలలోకెల్ల సమస్యయైన పేదరికము, నిర్వ్యాపారత అనేదానిని తక్షణమే క్రియారూపంలో శాస్త్రపు పునాదిమీద పరిష్కరించుకోడానికి రాట్నమొక్కటే శరణ్యమని మాత్రము నేను దాని తరపున గట్టిగ వాదము చేయుచున్నాను. ఇదొక్కటే నేను

చెప్పేముక్క. వ్యవసాయానికి చేదోడుగ ఉండే ఇంకొక ఉపవృత్తి ఏదీ లేకపోవడంవల్ల ఇండియాజనాభాలో బహుమందిలోకల్లా బహుమంది సంవత్సరంలో దాదాపు ఆరునెలలు నిర్బంధంగా సోమరులుగా ఉండిపోవలసివస్తోంది. తత్ఫలితంగా భారతప్రజానీకానికి తిండిలేక మాడటమనేది వెన్నంటి విడువని పురాణజ్వరంగా ఏర్పడియున్నది

(యంగ్ ఇండియా: 3-10-1926)

కడుపుకాలుతున్నవానికి తిండికన్నా పరతత్వం ఇంకొకటి ఉండదు. ఒకముద్దకోసం తన స్వాతంత్ర్యాన్ని సర్వాన్ని అమ్ముకుంటాడు. ఇండియాలోని కోట్లకొలది ప్రజలస్థితి ఇదే. "స్వాతంత్ర్యం", "దేవుడు" ఇట్లాంటివన్నీ వాళ్ళకు అర్థంలేని వట్టి అక్షరాలపోగులే. ఈమాటలు వారిచెవులకు కటువుగ వినబడతవి "స్వాతంత్ర్యం" అంటే ఏమిటో వారికి స్ఫురణ కలిగించాలంటే ముందుగ వారికి తిండిపెట్టేపని యేదైనా చూపించాలి. తమపేదకొంపలలో కూర్చుండి చేయగలిగేపని- కనీస మొక్క కబళమైనా తమకు పెట్టగలిగేతని- ఏదైనా వారికి మనం చూపించాలి. దీనికి రాట్నమొక్కటే సాధన. ఈరీతిగా వారు తమకాళ్ళమీద తాము నిలబడగలిగినప్పుడు, నిలబడగలమనే ధైర్యంవచ్చినప్పుడు, 'స్వాతంత్ర్యం' అంటే ఏమిటో, కాంగ్రెస్ అంటే ఏమిటో, మనం చెప్పితే వారి కప్పుడు బోధపడుతుంది. కనుక, వారి కింత అన్నం పెట్టేపని చూపేవారే వారికి విముక్తి కారకులవుతారు. వారిలో స్వాతంత్ర్యతృష్ణ కలిగించేవారుకూడ

పోతే అవుతాను. అందువల్లనే, రాట్నచక్రము రాజకీయపు విలువగల చక్రమై వుంటున్నది.

( యంగ్ ఇండియా : 18-8-1916 )

ఈ రాట్నం చక్రంవల్ల కార్యకర్తలకు ప్రజానీకంతో అతిసన్నిహితసంబంధం అత్యావసరమవుతుంది; తద్వారా వారిని ప్రజలతో ఐక్యతనొందిస్తుంది. ఇది జయప్రదమైతే విదేశీవస్త్రపు బెడద మనకు పూర్తిగా వదలిపోతుంది. ఈ రీతిగా, ఇప్పుడు ఇండియాలో వున్న రాజ్యాంగం మీద చెలాయింపగుచున్న విదేశధనికవర్గపు విషపుపలుకుపడి తగ్గిపోతుంది; లేదా, పూర్తిగ నశింపైనా అయిపోతుంది. ఇదీ రాట్నంవల్ల మనకు కలిగే గొప్ప రాజకీయపు సత్ఫలితము. ఇది చాలా ముఖ్యమైన ఫలితము.

( యంగ్ ఇండియా : 8-5-1927 )

ఖాదీయొక్క ఆదర్శం గ్రామపునరుద్ధరణ; ఈపనికై దీనిని మించినసాధన ఇంకొకటిలేదు. గ్రామాలు పునరుద్ధరణ పైతే, అదే ప్రజానీకానికి అపారమైన బలము నిస్తుంది. ఆబలమే, దానంతటదే, మనకు స్వరాజ్యాన్ని తెచ్చి పెట్టుతుంది.

( "రాట్నంద్వారా స్వరాజ్యం" - "కనూగాంధీ" గారిచే సంకలితమైన వ్యాసమునుండి 1945-పేజీ 8 )

నగరాలలో పల్లెలలోకూడ ఖాదీ సర్వవ్యాప్తి కావాలంటే నూలు ఇచ్చినవారికే ఖాదీ ఇస్తామనే సూత్రం

ఉండాలి. ఇది నా అనుభవంవల్ల కనిపెట్టిన సంగతి. కాలము గడచినకొద్దీ ప్రజలే ఈకోరిక కోరుతారని నా ఆశ. ఇది జరుగకపోతే, ప్రజలు నాలుగు, "ఎందుకొచ్చిందిరా ఇది" అని బలవంతపు బాహ్యార్థంగా నడికితే అహింసద్వారా మనకు స్వరాజ్యం రావటమనేది హుళక్కి అవుతుంది.

మిల్లులు, పెద్దపట్టణాలు ఇండియాలో పెరిగితే ఇండియా ప్రజానీకానికది ఐశ్వర్యమును సమకూర్చదు. ఇదినిశ్చయం. ఐశ్వర్యం సమకూర్చకపోగా పైపెచ్చు ఇదివరకే దౌర్భాగ్యపాలుగ ఉన్న ప్రజానీకానికి మరింత దారిద్ర్యమును తెచ్చి పెట్టుతుంది. తిండిలేకపోవడంతో సంక్రమించే సమస్తవ్యాధులుకూడ ఇందువల్ల ఏర్పడతవి. ఈసంగతులన్నీ పట్టణవాసులు, "ఫరవాలేదులే" అన్నట్లు చూస్తూ ఊరుకుంటూ ఉంటే ఇక నే చెప్పేదేమీ లేదు. ఇక మనకు వచ్చేది హింసయొక్క ప్రళయతాండవమే, అహింసాలేదు, గిహింసా లేదు; సత్యంలేదు గిత్యంలేదు. మరి ఇండియాలో ఖాదీకి చోటే లేదని మనము ఒప్పుకొతీరవలసివస్తుంది. అట్టి స్థితిలో ప్రజల యావన్మందికి మిలిటరీ ట్రెయినింగ్ నిర్బంధం, అనివార్యం అవుతుంది. కాని, నిజానికి మనం చేయవలసిన ఆలోచనంతా, తిండిలేకమాడే కోటానకోట్ల ప్రజానీకం కోసమే అని మరవరాదు. వారు బ్రతకాలంటే, వారు ఉద్ధరింపబడాలంటే, మన కార్యకలాపాలకన్నింటికి కేంద్రంగా రాట్నాన్నే పెట్టుకోవాలి. ప్రజలంతా ఇచ్ఛాపూర్వకంగా వడకాలి. (రాట్నంద్వారా స్వరాజ్యం: 1945. పేజీ 5)

# 5

## —: విద్య సంస్కృతి :—

### వి ద్య.

అహింసాభరితమైన సాత్త్వికనిరోధప్రబోధమే విద్యలలోకెల్ల ఉత్తమవిద్య. ఇది పిల్లలకు అక్షరాలు నేర్పడానికి ముందు రావలసిందేకాని తరువాతకాదు. అక్షరాలు నేర్చుకొని ప్రపంచజ్ఞానం సంపాదించుకోడానికిముందుగానే ఆత్మ అంటే యేమిటో, సత్యమంటే ఏమిటో, ప్రేమ అంటే ఏమిటో, ఆత్మలో యెట్టి శక్తులు దాగియున్నవో, ఇవన్నీ పిల్లలు నేర్చుకోవాలి. ఇది కాదని ఎవరూ అనజాలరు. జీవిత సంగ్రామములో ద్వేషమును ప్రేమచేత – అసత్యమును సత్యముచేత – హింసను తాను బాధననుభవించుటచేత, సులభముగ జయించవచ్చుననేసంగతి ప్రతిబాలుడు, బాలిక మున్ముందుగానే నేర్చుకోవాలి. నిజమైన విద్య కిది ముఖ్యముగా ఉండాలి. దీనిలోఉండే సత్యమును నేను గ్రహించాను కనుకనే దక్షిణాఫ్రికాలో అచటిపోరాటపు చివరిరోజులలో మొదట "టాల్‌స్టాయి" ఆశ్రమములోను, పిమ్మట 'ఫోనిక్సు' ఆశ్రమములోను పిల్లలను ఈపద్ధతిలో తరిఫీతుచేయడానికి నాశక్తికొలది ప్రయత్నించాను.

("గాంధిగారి ఉపన్యాసములు, వ్యాసములు"
4 వ ముద్రణ: 189 పేజీ)

కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు, ముక్కు వగైరా అవయవములను సరిగా ఉపయోగించి తరిఫీతుచేయడం ద్వారానే బుద్ధికికూడ నిజమైన విద్య అంటుతుందని నామతము. పిల్లవాని శరీరావయవములను చక్కగ విచక్షణతో ఉపయోగించుకోవడమే వాని బుద్ధికూడ సత్వరముగ ప్రశస్తరీతిగా వికసింపచేసికోడానికి దోవ చూపుతుంది. అయితే, మనశ్శరీరముల రెంటి అభివృద్ధితో పాటు ఆత్మకుకూడ సమానముగ ప్రబోధము కలుగకపోతే ఆ రెండూ వికారప్రకంతులుగానే ఉండిపోతవి. ఆత్మకు వికాసము కలగడమంటే హృదయానికి ప్రబోధం కలగడమన్నమాట బుద్ధికి సర్వతోముఖాభివృద్ధికలగడమనేది పిల్లవానియొక్క శరీరావయములయు ఆత్మయొక్కయు శక్తులు వికసించుటతోపాటే సమానంగా జరగగలదు. ఈమూడున్ను వేర్వేరుగ విడదీయడానికి వీలులేనివి. వీటిని వేటికవి విడదీసి వేర్వేరుగ వృద్ధిపొందిస్తామంటే అది చాలాపొరబాటైనవిషయము – అది ఎన్నడూ జరగనిపని.

(హరిజన్: 8-5-1937)

పిల్లవానిలోగల ఉత్తమోత్తమ శక్తులనన్నింటిని, శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులనన్నింటిని, సర్వతోముఖంగా బయటికి లాగి ప్రస్ఫుటం చేయడమే 'విద్య' అనే మాటకు అర్థమని నా ఉద్దేశ్యము. అక్షరాలు నేర్చుకోవడంతో విద్యప్రారంభంకాదు; దానితోనే అంతంపొందదు కూడా, అదే పరమావధికాదు. 'విద్య' సంపాదించుకొనుటకు

ఉండే లక్షమార్గాలలో అది ఒకటిమాత్రమే. అక్షరాలు తెలుసుకొని చదవడమే విద్యకాదు. కనుక, నేను పిల్లవానికి విద్య దేనితో ప్రారంభిస్తానంటే అక్షరాలతో కాదు, ఏదో ఉపయోగకరమైన చేతిపనినేర్పడంతో ప్రారంభిస్తాను. పని నేర్చుకోవడం ప్రారంభించినక్షణమునుండికూడ ఏదో (ఒక వస్తువు) ఉత్పత్తిచేయగలగడానికికూడ వాణ్ణి తయారుచేస్తాను.

ఇట్టి విద్యావిధానంలో మనస్సు, ఆత్మకూడ ఉన్నతోన్నతమైన వికాసం పొందడానికి అవకాశం ఉందని నా నమ్మకము. అయితే, నేర్పే ప్రతిచేతిపనికూడ ఇప్పటి మాదిరిగ బండగా నేర్పకూడదు; విజ్ఞానపూర్వకంగా నేర్పాలి; అంటే, దానిలోని ప్రతి చిన్నవిషయం ఎందుకు, ఏ ఉద్దేశ్యంతో చేయమంటున్నారో బాలుడు చక్కగ తెలిసికొనేటట్టుకూడా నేర్పాలి.

(హరిజన్: 31-7-1937)

విద్యయావత్తు ఏదో ఒక చేతిపనిద్వారానే లేక ఏదో ఒక పరిశ్రమద్వారానే నేర్పాలని నా ఉద్దేశ్యం.

విద్య కిది ప్రప్రథమదశ. దీనిలో పిల్లవానికి పారిశుధ్యము, దేహారోగ్యము, తనపనితానుచేసికోగలగటం, ఇంటివద్దపనులలో తలిదండ్రులకు తోడ్పడం మొదలైన సంగతులన్నీ అలవర్చాలి. ఈకాలపు పిల్లవాండ్రకు పరిశుభ్రత అంటే ఏమిటో తెలియదు; తమ పనులు తాముగ చేసికోరు; వట్టి దుర్బలశరీరులు. కనుక, వీరందరికి, నిర్బంధ

ఢంగా దేహపరిశ్రమలో ట్రెయినింగ్ ఇస్తాను, తాళలయ ములతోటి పాటలతో కూడిన డ్రిల్లు చేయిస్తాను.

(హరిజన్: 30-10-1937)

'ఏకుట, వడుకుట, నేయుట మొదలైన గ్రామీణపు చేతిపనుల ద్వారా పిల్లలకు ప్రయుక్తవిద్య నేర్పాలి' అన్న నా ప్లాను పైకి మాడ్పు లేకుండ సమాజిక సంఘంలో విప్లవకరమైన మార్పు తేవడానికే ప్రప్రథమాస్త్రప్రయోగంగా నేను ఉద్దేశించాను. ఈ విప్లవగర్భంలో ఎంతెంత మారమో పోయే సత్ఫలితాలు గర్భితమై ఉన్నవి. పల్లెలకు బస్తీలకు మధ్య దోషరహితమైన అకృత్రిమమైన నీతియుతమైన సంబంధం కలపడానికి ఈ రకం విద్య పునాది వేస్తుంది. కుల, మత, వర్గాలమధ్య నేడున్న విద్వేషవిషము, జీవనాధారముల అస్థిరత, మొదలైన ఎన్నో ఘోర అనర్థకములను తొలగించడానికికూడ ఈ విద్యావిధానము ఎంతో తోడ్పడుతుంది. నానాటికి శిథిలమైతున్న గ్రామముల పతనమును అరికట్టుతుంది. ఇప్పటికంటె న్యాయమైన, సక్రమమైన సాంఘిక వ్యవస్థకు పునాది వేస్తుంది. ఈనూతన వ్యవస్థలో "కలవాడు" "లేనివాడు" అనే అసహజమైన తేడాలు ఉండజాలవు, ప్రతి వానికి జీవనాధారపు మార్గాలు సుస్థిరంగా ఏర్పడిపోతవి. ప్రతివాని స్వేచ్ఛకు హక్కులు భాయపడిపోతవి. ఇదంతా కూడ ఘోరరక్తపాతంతో కూడిన వర్గపోరాటాలు, యుద్ధాలు లేకుండానే జరుగుతుంది. ఇండియావంటి పెద్దదేశాన్ని బ్రహ్మాండమైన యంత్రాగారాలతో నింపడానికి కావల్సి

సిన నక్షత్రమండలమంతే ధనరాసులవ్యయముతో పని లేకుండాకూడా ఈ మార్పు జరుగుతుంది. పరదేశాల నుండి బ్రహ్మాండమైన యంత్రాలున్నా, వాటితోపాటు వాటిని నడిపించగల సాంకేతికపు నిపుణులనుకూడ దిగుమతి చేసుకోవలసి దిక్కుమాలి పరాశ్రయపు బ్రతుకుకూడ ఇండియాకు (ఈ నూతన విద్యాపద్ధతివల్ల) తప్పిపోతుంది! బహు క్లిష్టమైన సాంకేతికపు రహస్యాలతోగాని, ప్రవీణతలతో కాని, పనిలేకుండానే భారతప్రజానీకపు బ్రతుకుతెరువుల గతులు సామాన్య ప్రజ్ఞావంతులైన తమతమ చేతులలోనే ఉండిపోతవి. ఇందుకై ఊరికే పరుగులెత్తవలసిన పని యుండదు.

( హరిజన్ : 9-10-1937 )

—: విద్యకు పరమావధి ఏది ? :—

ప్రశ్న:- ఇండియాకు స్వరాజ్యంవస్తే, విద్యకు పరమావధి ఏదిగా ఉంటుంది ?

జవాబు:- మనిషి తన సత్ప్రవర్తనను పెంపొందించుకొనడమే విద్యకు పరమావధిగ ఉంటుంది. ధైర్యము, బలము, సద్గుణసంపద, మహోత్కృష్టకార్యముల నాచరించుటలో మనిషిలీనమై తన్నుతానుమరచుట — ఈ లక్షణాలన్నీ పెంపొందించడానికి నేను ప్రయత్నిస్తాను. వట్టి అక్షరజ్ఞానంకంటె ఇవే చాలా ముఖ్యమైనవి. పుస్తకాలచదువు ఇట్టి లక్షణాలు పెంపొందించడానికే సాధనముమాత్రంగా ఉంటుంది.

ప్రశ్న:- విద్యద్వారా ఏదో ఒకానొక నిర్దిష్టమైన సాంఘిక వ్యవస్థ నవతరింపచెయ్యాలనియా మీ కోరిక ? అయితే, ఆ సాంఘికవ్యవస్థ ఎట్టిదిగా ఉంటుందో చెబుతారా ?

జవాబు:- మనిషిలో సత్ప్రవర్తనను మనము ఈ విద్యద్వారా పెంపొందజేయగలిగితే చాలు: మనపని అంతవరకే. ఇక ఎట్టి సాంఘికవ్యవస్థ నేర్పరుచుకోవాలో సంఘం అదే నిర్ణయించుకుంటుంది. ఈ రీతిగా వికసించిన మనుష్యుల చేతులలోనే భావిసంఘవ్యవస్థానిర్మాణమును వదలివేయడానికి నేను పూర్తిగ ఇష్టపడతాను. ( భావిసంఘవ్యవస్థ ఫలానిరూపంగా ఉండాలని నేను ఇప్పుడు నిర్ణయింపవలసిన పనిలేదు. అది వారే — అనగా, ఇట్టివిద్యలో తయారై వికాసంపొందినవారే- చూచుకుంటారు. ఆ సంగతి వారికే వదలివేస్తాను )

("మానవలోక పునర్నిర్మాతలు"(Re-makers of mankind అనే గ్రంథమునుండి కారల్‌టన్ వాష్‌బరన్-అనేవారువ్రాసిన గ్రంథంనుండి, 1932 - పేజీలు,104,105)

—: ఇతర దేశాల సంస్కృతులగురించి తెలుసుకోవడం :—

ఇంగ్లీషుభాషలో — అంతేకాదు, ప్రపంచంలోని అన్నిభాషలలోను నిండియున్న విజ్ఞానరత్నములను మన భారతీయులు తమతమ మాతృభాషలద్వారా తమవిగ చేసు

కోవాలని నాకోరిక. రవీంద్రనాథఠాగూరుగారి అమూల్య కవితా సౌందర్యములను గ్రహించడానికి నేను ప్రత్యేకముగ బెంగాలీభాష నేర్చుకోనక్కరలేదు మంచి అనువాదముల ద్వారా అవి నేను తెలిసికొని, ఆనందించవచ్చును; "టాల్‌స్టాయి"గారి కథలు తెలుసుకొని ఆనందించడానికి గుజరాతీ బాలురు, బాలికలు రష్యాభాష నేర్చుకొననక్కరలేదు; మంచి తర్జుమాలద్వారా ఇదంతా నేర్చుకోవచ్చును.

ప్రపంచంలో ఏమూల ఏ అమూల్యమైన గ్రంథము అచ్చయినాసరే, అది వెలువడిన వారంరోజులలోపలనే, చక్కని ఇంగ్లీషుభాషలోకి తర్జుమాయై, ముద్రింపబడి. ఇంగ్లండు దేశపు ప్రజలందరి చేతులను అలంకరిస్తుందని ఇంగ్లీషువారు సగర్వంతో చెప్పుకుంటూ ఉంటారు. అట్టి సందర్భంలో షేక్సిపియర్, మిల్టన్, మహాకవుల భావాలు, గ్రంథాలు నాకు అవగతంకావాలంటే నేను ఇంగ్లీషుభాష నేర్చుకోవాలా ?

ప్రపంచంలోగల వివిధభాషలలోని ఉత్తమ గ్రంథాలలో నేర్చుకోతగిన ఉత్తమ విషయములన్నీ తాము నేర్చుకొని, వాటిని మన ప్రాంతీయభాషలలోనికి తర్జుమా చేసిపెట్టుతూ ఉండడమే ప్రత్యేకపు పనిగ కొంతకొంతమంది విద్యార్థులను తయారుచేసి, ఈపనికై వారిని కేటాయించి యుంచడమే మంచి సాధ్యమైన పద్ధతియని నా యభిప్రాయము. ( దీనికై ప్రజలందరు, అన్నిభాషలు, నేర్చుకోవాలనడం అనవసరపుపని - పట్టిదండగ ).

( హరిజన్ : 9-7-1938 )

## —: సాంస్కృతిక వికాసము :—

ప్రపంచంలోని ఇతర సంస్కృతులగాలి మనకు సోకకుండ మనచుట్టూ గోడలు కట్టుకోవాలని నా ఉద్దేశ్యం ఎంతమాత్రంకాదు. కాని, నేనొక మాట సవినయముగ మనవిచేస్తాను. అదేమంటే: — ఇతర సంస్కృతులసంగతి మనం తెలుసుకొని ఆనందించటమనేది, మన సంస్కృతి ఏమిటో తెలిసికొని వంటబట్టించుకోడానికి వెనుక రావాలి కాని, ముందుగా రాకూడదు. మనసంస్కృతిలో ఉన్నన్ని అమూల్యరత్నాలు ఏ ఇతర సంస్కృతిలోను లేవని నా దృఢనిశ్చయము. ఈసంగతి మనం తెలుసుకొనక బాధపడుతున్నాము. అంతేకాదు, ఆ సంగతులు చదవడం శుద్ధ దండగ అని కూడ మనకు నూరిపోశారు; దానిలో ఏమీ లేదని దాని విలువను చపకచేసేశారు. ఆ ప్రకారం మన జీవితములను నడుపుకోవడమే బొత్తుగ మానివేశాము. ఆచరణలో పెట్టుకొనని వట్టి పుస్తకాలచదువు శవానికి అలంకరించి అత్తర్వోలు పూసినట్లుగా ఉంటుంది. బహుశః, ఆ శవం చూడడానికి అందంగా కనబడవచ్చుకాక, కాని, మనను ఉత్సాహపరచడానికి, ఉన్నతి కలిగించడానికి అదెందుకూ పనికిరాదు. ఇతర సంస్కృతులను చిన్నబుచ్చడంకాని, తక్కువ చూపుచూడటంకాని, నామతమునకు విరుద్ధం. అట్లా చేస్తే నేను ఆత్మహత్య చేసుకున్నట్లే - అప్పుడు నేను నా సంస్కృతినే అగౌరవపరచుకొన్న వాడ నౌతాను. నా ధర్మప్రకారము నేను నా జీవితమును గడుపుకొనలేనివాడనే అవుతాను. ( యంగ్ ఇండియా : 1-9-1921 )

## —: భారతీయ భావి సంస్కృతి ఎట్లుండవలెను? :—

"నన్ను ముట్టుకోవద్దు నామాలకాకి" అంటూ ఏ సంస్కృతికాని ప్రపంచములో కేటాయింపుగ బ్రతుక జాలదు. అచ్ఛమైన ఆర్యసంస్కృతి అనేది నేడు ఇండియాలో ఎక్కడాలేదు. ఆర్యులు అసలు ఈ దేశంలోనే పుట్టినవారా, లేక, వద్దన్నకొద్ది బలవంతంగా ఏ పరాయి దేశంనుండియో ఇండియాలో వచ్చి దూరినవారా అనే సమస్య నాకేమీ పట్టదు. నాకు నచ్చినదల్లా ఒక్కటేసంగతి. ఏదంటే: — మన పూర్వీకులు ఒకరితోఒకరు సంపూర్ణమైన స్వేచ్ఛతోకలిసి ఏకజాతి అయిపోయినారు, ఆ కలయికయొక్క ఫలితమే ఇప్పటి తరమువారమైన మనము (ఈసంగతిఒక్కటే నాకు చాలు).

(హరిజన్: 9-5-1936)

నాఇంటికి అన్నివైపుల ఎత్తుగోడలు కట్టుకొని, నా కిటికీల నన్నిటిని దట్టించి మూసివేసికోవాలని నేను కోరు కొనను. ప్రపంచంలోని అన్ని సంస్కృతుల స్వచ్ఛవాయువులు ధారాళంగా నాయింటినలుమూలలా యథేచ్ఛగ సదా వీచుచుండవలెననియే నేను కోరుకొంటాను. అయితే, ఆ గాలుల తాకిడికి నేను నేలమీాద కాలునిల్వలేకుండ ఎక్కడికో ఎగరగొట్టుకు పోవడానికి నే నెంతమాత్రం సమ్మతింపను. సాహిత్యపు అభిరుచియున్న మన యువతీయువకులు కావలసినంత ఇంగ్లీషుభాష నేర్చుకోనియ్యండి; ఒక్క ఇంగ్లీషేకాదు ప్రపంచంలోని ఇతరభాషలు కూడా ఎన్నికావా

లంటే అన్నీ నేర్చుకోనియ్యండి; నాకభ్యంతరంలేదు. కాని వారొక్కపనిమాత్రం చెయ్యాలి ఈనేర్చుకొన్న దానియొక్క సత్ఫలితాలనన్నిటిని మనదేశానికీ, ప్రపంచానికికూడ ఏ బోసు వలెనో, ఏ రాయ్ వలెనో, ఏ రవీంద్రకవీంద్రునివలెనో, ప్రసాదింపవలెననికూడ నేను కోరుకుంటాను. అయితే ఏ ఒక్క భారతీయుడుగాని తన మాతృభాషను నిర్లక్ష్యముచేయరాదు. దానిని చూచి సిగ్గుపడరాదు. ఉత్తమోత్తమములైన భావములను తన మాతృభాషలో "ఊహించలేను, చెప్పలేను" అని కూడ తలచుకోరాదు. బందిఖానాలో మూసిపెట్టుకునే మతము కాదు నాది. (యంగ్ ఇండియా: 1-6-1921)

ఇండియాలో కాలూనడానికివచ్చిన నానావిధములైన సంస్కృతులను సమన్వయపరుచుకొనడమే నాభారతీయ సంస్కృతియొక్క ప్రధానలక్షణము. భారతీయజీవితముపై ఈ నానాసంస్కృతుల ప్రభావము ప్రసరించియున్నది; అంతేకాదు, ఈ నేలలో ఉద్భవించిన భారతీయసంస్కృతి కూడ, ఆ నానారకముల సంస్కృతులపై తన ప్రభావమును ప్రసరింపజేసియున్నది. ఇది పరస్పరం ఇచ్చిపుచ్చుకోలుగా జరిగినది. అయితే, ఈ సమన్వయ మిచ్చట ఈ దేశముయొక్క స్వీయప్రకృతికి అనుగుణముగ రూపొందిన రకముదియై యున్నది. ఇది సహజమే. అది అమెరికారకముదికాదు. ఇండియాలో జరిగిన సమన్వయములో తదంతర్భాగములైన ప్రతిసంస్కృతికి దాని దాని ఉచితస్థానము గ్యారంటీ చేయబడియే యున్నది. ఇక, అమెరికా రకపు సమన్వయ

ములో అట్టిది లేదు. అచ్చట జరిగిన దేమంటే, ఒకే సంస్కృతి మిగతా సంస్కృతుల నన్నిటిని బలవంతంగా దిగమ్రింగివేసింది. దాని పరమావధి నిజంగా సమన్వయమే కాదు; బలవంతంగా కృత్రిమంగా ఏదో ఏకత్వరూపమును పైకి ప్రదర్శించడం మాత్రమే.

(యంగ్ ఇండియా: 17-11-1920)

# 6

## —: ఆరోగ్యము :—

### వ్యాధులకు చికిత్స.

సర్వత్ర వ్యాప్తిచెందే ప్రతివిషయానికి నిరాడంబరత, సులభత ప్రధానలక్షణంగా ఉంటుంది. కోట్లకొలదిజనానికి ఉపయుక్తమైన వస్తువు కనిపెట్టడానికి తయారుచేయడానికి గహనమైన పెద్ద పాండిత్యం అక్కరలేదు. ఇట్టి గహనమైన పాండిత్యం ఏకొద్దిమందియోగాని నేర్చుకోలేరు. అందువల్ల వారు కనిపెట్టే మందులు వగైరాలు భాగ్యవంతులైన ఏకొద్దిమందికిమాత్రమో ఉపయోగపడగలవు. కాని. ఇండియా అంటే, ఈ కొద్దిమంది భాగ్యవంతులే కాదు; నిజమైన ఇండియా, నాదృష్టిలోఉండేఇండియా, ఏడులక్షల పల్లెలలో ఉన్నది మారుమూలలలో ఎక్కడో అణగారిపోయియున్న చిన్నచిన్న పల్లెకొంపలే నాఇండియా. కొన్నికొన్నిచోట్ల జనాభా కొన్నివందలకో, పదులకోకూడ మించని పల్లెలే నాఇండియా. ఇదీ నాఇండియా; దీనికోసమే నేను జీవించి

యుండడం. ఈ పల్లెకొంపల కన్నింటికి పెద్దపెద్దడాక్టర్లను, బ్రహ్మాండమైన ఆడంబరపు ఆస్పత్రులను తీసికొని ఇచ్చుట సాధ్యమైనపనికాదుకదా. మామూలు తేలికైన మందులు, చికిత్సావిధానము లే వారికి గత్యంతరము; రామనామ చికిత్సయే వారికి శరణ్యము.

(హరిజన్: 7-4-1946)

ఇల్లు, వళ్లు, ఊరు, అన్నీ పరిశుభ్రంగా ఉంచుకునే సూత్రాలను నిక్కచ్చిగ పాటిస్తే, ఆహారవిహారములలో తగు శ్రద్ధవహిస్తే, అసలు జబ్బులు రావడానికే సాధారణంగా అవకాశం ఉండదు. బయట దేహానికి, లోపల మనస్సుకు సంపూర్తియైన పవిత్రత చేర్పరుచుకుంటే అసలు జబ్బనేది రావడానికే చోటుండదు

(హరిజన్: 26-5-1946)

జబ్బు నయమవడానికి సహజసూత్రాలన్నీ పాటిస్తూ ఉంటే, ఒకవేళ అది వస్తే కూడ, దానికి మందు సదా రామనామమే. దీనికిమించిన మందులేదు. అయితే, రామనామము ద్వారా రోగాలు నయమవడమనేది అంత తేలికగ ఒక్క కనురెప్పపాటులో సాధించేదికాదు. రోగికి ఈవిషయంలో గట్టి నమ్మకం కలిగించాలంటే ముందుగ ఆ వైద్యుడే తాను రామనామ మహాత్మ్యానికి ప్రతిబింబమైయుండాలి. అతని జీవితంలో ఆ మహాత్మ్యం ప్రతిఫలిస్తూ ఉండాలి. దాని కతడు మూర్తిమంతంగా ఉండాలి. ఈలోగా పంచభూతములద్వారా

లభింపదగిన సమస్తశక్తులను వాని గ్రహించి, స్వీకరించి, ఉప
యోగపరుచుకోనుచుండవలెను. ఆ పంచభూతములేవియంటే,
మన్ను, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము (పృథివ్యాపస్తేజో
వాయురాకాశములు), ప్రకృతి చికిత్సయొక్క పరమావధి,
వానమ్మాయము పేటిలోనే యున్నదని నా మనస్సుకు తోచు
చున్నది. అందువల్లనే, "ఉర్లి కంచన్" అనే గ్రామంలో
నేను స్థాపించిన ఆశ్రమంలో ఈ ప్రకృతిచికిత్స పద్ధతులు
బోధిస్తున్నాను. పరిశుభ్రతతో, ఆరోగ్యవంతమైనజీవితం
గడపడం ఎలాగో వారికి చెబుతున్నాను. పంచభూతముల
ద్వారా రోగములు కుదర్చడం ఎలాగో కూడ చూపించు
చున్నాను. అవసరమైతే, స్థానికముగ పెరిగే ఓషధులను
(మొక్కలవేళ్లు, ఆకులు, గింజలు వగైరాలను) ఉపగించ
వచ్చును. శరీరపుష్టికి ఆరోగ్యానికి అవసరమైన పదార్థము
లన్నీ ఉచితమైన పాళ్ళుగ చేరియుండిన మంచి ఆహారం
కూడ ప్రకృతిచికిత్సా విధానంలో తప్పని సరియైనభాగమే

( హరిజన్ : 11-8-1946 )

## 7

### —: త్రాగుడు, మత్తుపదార్థసేవన దుర్వ్యసనము :—

ఈ దుర్వ్యసనాలకు బానిసలైపోయిన దురదృష్టవంతు
లను వారి దుర్వ్యసనాలనుండి తప్పించవలసిన అవసర
మున్నది. "మానేసే ఉపాయం చెప్పండి బాబు" అని వారే
చాలామంది అడుగుతూ ఉంటారుకూడాను. "బలవంతంగా

తాగుడు మాన్పించడమా. ఇది తప్పుకాదా" అని కొందరు వాదిస్తూ ఉంటారు. పైపైకి చక్కగా కనిపించే ప్రమాదకరమైన వాదము. దీనివల్ల ఎవరూ భ్రాంతిపడి మోసపోరాదు. తాగేవారికి దాహంగా తాగే స్వాతంత్ర్యం ఉండాలని, దానికి తగిన ఏర్పాట్లు గవర్నమెంటు చేయాలని కూడ అంటూ ఉంటారు కొందరు! ఇది చాల తప్పువాదము. ప్రజల దుర్వ్యసనాలకు దోహదంచేయడం, వాటికి వీల్లుకల్పించడం గవర్నమెంటుపని ఎంతమాత్రం కాదు. పడుపువృత్తిచేసే గృహాలకు లైసెన్సులిచ్చి వ్యభిచారం సాగించుకోవచ్చునని చెబుతున్నామా? దొంగలకు "అయ్యో, అది వారికి ఇబ్బందికలిగించడంకాదా, వారి స్వాతంత్ర్యానికి భంగంకలిగించడంకాదా" అని అంటున్నామా? దొంగతనాలకంటె, వ్యభిచారాలకంటెకూడా, తాగుడు ఘోరమైనదని నా అభిప్రాయం. ఈ రెండు పాపాలకు మూలంకూడా తరుచు ఈ తాగుడేకాదా! కల్లు సారాదుకాణాలను రద్దుపరచి, దానిమీద సర్కారుకువచ్చే రివిన్యూను పూర్తిగతుడిచివేయడంలో మీరందరు దేశానికి తోడ్పడాలని నేను కోరుతున్నాను.

(యంగ్ ఇండియా : 8-6-1921)

తాగేవాళ్ళను, అమ్మేవాళ్ళనుకూడ ఈమద్యములు నీచస్థితికి దింపుతవి. తాగినవాడు తల్లెవరో, పెళ్ళామెవరో, చెల్లెలెవరో, తెలిసికోలేడు. మామూలుస్థితిలో చెయ్యడానికి సిగ్గుపడే నీచకార్యాలెన్నో తాగిమైమరచిన స్థితిలో అతడు

చేస్తాడు. త్రాగుబోతైతాన్ మైకంలో పడియున్న కూలిజనం ఎట్టి దుర్గతికి వస్తారో వారి సంగతి ఎవరికున్నా వారికందరికీ విదితమే. త్రాగే ఇతర తరగతులవారి పనికూడ ఇంతకంటె మెరుగేమీ కాదు. ఒక పెద్ద ఓడ కెప్టెన్ తెగత్రాగి తన డ్యూటీమరచిపోతే ఇంకొక ఆఫీసరువచ్చి ఓడ నడిపించాలిసి వచ్చిన సంగతి నాకు తెలుసు. బారిస్టర్లు త్రాగి రోడ్లపక్క మురికికాల్వలలోపడి దొర్లుతున్న ఉదాహరణలు ఉన్నవి.

( యంగ్ ఇండియా : 4-2-1926 )

మద్యము, మత్తుపదార్థాలు అనేవి సైతానుకుగల రెండు చేతులు. వీటితోనే అది తనకు లోబడిపోయిన బానిసలను బాది మత్తులై పడి ఉండేట్లుగ చేస్తుంది.

( యంగ్ ఇండియా : 22-4-1926 )

కడుపుమాడినవాళ్ళు చిల్లరదొంగతనాలు చేస్తే వాళ్ళను శిక్షిస్తున్నారు కాని, ఈ దొంగతనాలకంటె సారాయిత్రాగుడే ఎక్కుడు ఘోరమైన నేరమని నా ఉద్దేశ్యము. నేరాలకు తగుమాత్రపు శిక్ష విధించడమనే పద్ధతిని నేను ఇష్టములేకపోయినా, విధిలేక, సహిస్తున్నాను దీనికి కారణం ప్రేమతత్వమును నేను నూటికినూరుపాళ్ళు పూర్తిగ అలవరచుకోలేని దౌర్బల్యంవల్లనే. శిక్షావిధానాన్ని నేను ఇలా అంగీకరిస్తున్నంతకాలం అగ్నిద్రవమైన ఈసారా తయారుచేసేవాళ్ళను, వలదని యెంతచెప్పినా వినక దానిని త్రాగేవాళ్ళనుకూడ వెంటవెంటనే శిక్షిస్తూ ఉండాలని నేను

చెప్పలేనప్పుడు. నిప్పులోకి, లోతుబావుల్లోకి పరుగెత్తే నాపిల్లలను రెక్కపట్టుకొని బలవంతంగా ఇవతలికి లాగడానికి నేను వెనుకముందాడనుకదా. మండుతున్న నిప్పుకొలిమిలోకి, వరద ప్రవాహంలోకి దూకడంకంటె వెర్రిగ మండుతుండే అగ్నిద్రవమైన ఈసారాయిలోకి దూకడమే ఎంతో ప్రమాదకరమైనది. ఆ నిప్పుకొలిమి, వరదనీరు బాహ్యశరీరాన్ని మాత్రమే నాశనంచేస్తవి, కాని, ఈ సారానీరు బాహ్యశరీరాన్నేకాక అంతరాత్మనుకూడ భ్రష్టంచేస్తుంది.

(యంగ్ ఇండియా : 8-8-1929)

ఇండియా యావత్తుకు నన్నొకగంటసేపు (డిక్టేటరుగ) నియంతగ ఏర్పరిస్తే, మొట్టమొదటగ నేను చేసే పనేమిటో తెలుసా ! డబ్బుకేమీ నష్టపరిహారంకూడ ఇవ్వకుండ అన్ని కల్లుసారా దుకాణాలు, మూయించి వేస్తా. తమ కూలిజనానికి మానవులకు అర్హమైన మంచివసతులు కల్పించాలని ఫ్యాక్టరీయజమానులను నిర్బంధిస్తా. నిరపాయకరములైన పానీయములు, అట్లే నిరపాయకరములైన వినోదములు తమ కూలిజనానికి కల్పించడానికిగాను తగిన పానీయశాలలను, వినోదశాలలను విధిగ ఏర్పాటుచెయ్యాలని నేను ఫ్యాక్టరీయజమానులను నిర్బంధిస్తా.

(యంగ్ ఇండియా : 25-6-1931)

### :- ప్రజలు, ప్రజాసేవకులు చేయవలసిన పనులు -:

మద్యనిషేధం జయప్రదం కావడానికి చేయవలసిన కృషి గవర్నమెంటుమీదకంటె ప్రజలమీద, ప్రజాసేవకుల

మీదనే హెచ్చుగ ఉన్నది. ఈపని ప్రధానంగా మనదే. గవర్నమెంటు చేపట్టిన సనల్లా — ఎక్కువలో ఎక్కువ- ఈ కల్లునాణాలకు లైసెన్సులు ఇవ్వకుండ మానడమే. త్రాగుబోతువానిని త్రాగుడు మాన్పించడమనేపని గవర్నమెంటువల్ల అంతగా కానేకాదు. ఆభాగం మనం ప్రజలం చెయ్యాలి.

( యంగ్ ఇండియా : 13-9-1928 )

అహింసద్వారా మనము మనగమ్యమును చేరాలంటే మద్యపానులకు, మత్తుపదార్థాలకు బానిసలై బాధపడుచున్న లక్షలకొలది స్త్రీ పురుషుల భవిష్యద్గతిని రాబోయే మన స్వరాజ్య గవర్నమెంటుకు వదలివేసివెయ్యరాదు.

ఈ చెడును తప్పించడానికి వైద్యులు సహాయం చేయదగిన పని ఎంతో ఉన్నది. తాగుబోతులను, నల్లమందు భాయిలను ఈ దురభ్యాసములనుండి మరల్చే ఇంకొక మందో, మార్గమో, ఈడాక్టర్లు, వైద్యులు తమబుద్ధివిశేషంచేత కనిపెట్టలేరా ?

ఈ సంస్కరణను జయప్రదంచేయడానికి విద్యార్థులకు స్త్రీలకుకూడ ఎక్కువగ ప్రత్యేకమైన అవకాశాలున్నవి. వారియెడ ఆదరముచూపి పనిచేస్తే ఈ త్రాగుబోతులకు వారియెడల గౌరవాభిమానము లేర్పడతవి. తద్వారా, వారు చెప్పిన బోధనుతప్పకుండావిని ఈ దురభ్యాసములను తాగుబోతులు మానివేయడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది.

కాంగ్రెసుకమిటీలుకూడా కొంత పని చేయవచ్చును. అలసిపోయిన కార్మికులకు విశ్రాంతినిచ్చి, ఆరోగ్యకరమైన పానీయములు, తక్కువధరలో లభ్యమయ్యే కేటిగ విశ్రాంతి భవనములు, పాఠశాలలు, ఏర్పరచవచ్చును. అక్కడే వినోదమునకై నిరపాయకరమైన ఆటలు పాటలుకూడా ఏర్ప రచవచ్చును. ఈ పనులన్నీ ఆకర్షవంతంగాను, ఉత్తేజవంతం గాను ఉండి కార్మికసముద్ధరణకు తోడ్పడుతవి. అహింస ద్వారా స్వరాజ్యం సంపాదించడ మనేది లోకంలో అపూర్వ మైన సాధన. ఈ సాధనలో పాతవిలువలుపోయి, కొత్త విలువలు వస్తవి. హింసామార్గములలో ఇట్టి సంస్కరణలు సాధనలు ఉండవు. హింసయందు నమ్మకము ఉన్నవారు, తమ అసహనంచేత, మరి, అజ్ఞానంచేతకూడ, ఇట్టి సాధనలను పనికిరానివానికింద జమకట్టి లక్ష్యపెట్టక తోసేస్తారు. శాశ్వ తము, నిర్దుష్టమునైన విముక్తి లోపలనుండి అనగ, అంత రాత్మ వారిశుద్ధ్యమునుండి, వస్తుందనే సంగతిని వారు మరచి పోతారు. నిర్మాణకార్యకర్తలు తమకృషివల్ల మద్యనిషే ధమునకు మార్గమును సరిచేసి తద్వారా గవర్నమెంటు దానిని అమలుచేసేపనిని బహుసులువు చేస్తారు.

( నిర్మాణకార్యక్రమం : 1941 : పేజీ 10, 11 )

—: జూదము :—

జూద మనేది గుజరాతుగ్రామాలలో ఎంతటి దారుణ దురంతకార్యాలను జరిపిస్తున్నదో, ఆ సంగతులన్నీ సర్దార్ పటేలు, ఆయనవాలంటీర్లు నా చెవులుచిల్లుపడేటట్లు చెప్పి

చెప్పియున్నారు. ఈ దుర్వ్యసనం దావాగ్నివలె వ్యాపిస్తున్నది. పనిచేయకుండ సులభంగా క్షణంలో భాగ్యవంతులైపోవాలనే ఆతురత ప్రతిజూదగానిలోను ప్రవేశించియున్నది. "ఏదో వస్తువుకు ఈరోజున మార్కెట్టుధర ఇంత ఉంటుంది చూడు" అని పందెం వేస్తారుట; అది నిజమైతే, వాడికి డబ్బు ఊరికే వచ్చిపడుతుందట! ఫలాని ఎక్కియున్నారు ఈ విధంగా లక్షలు వచ్చిపడ్డాయి; నేనుమాత్రం ఎందుకు ఒకచెయ్యి చూడకూడదు అని ప్రతివాడు ఈజూదంలోకి దిగుతాడు, పోయి సరాసరి గోతులో పడతాడు. ఒకప్పుడు ప్రశాంతంగా హాయిగా ఉన్న కొంపలలో ఒక్కసారిగా శాంతి నాశనమై పోయింది.

దానికి పేరేదైనా పెట్టుదురుగాక, ఈ వ్యసనం సృష్టి ప్రారంభంనుండి ఉన్నట్లే ఉన్నది. దాని రూపాలు పేర్లు మారిఉండవచ్చుకాని అసలు వస్తువు మారలేదు.

జూదం 'లా' ప్రకారం నేరమే కావచ్చుగాక. కాని, ప్రజలుకూడ తోడ్పడనిది 'లా' ఒకటే ఏమీ చెయ్యలేదు. కనుక, దేశసేవ చేయబూనిన కార్యకర్తలందరు ఈ జూదమును మాన్పడానికి సత్వరమే పూనుకోవాలి. ఏ ప్లేగో, భూకంపమో వస్తే ఎలా తక్షణమే నివారణకు పూనుకుంటారో అలా పూనుకోవాలి. ఈ చెడుగును సమూలం పెరికివేసే వరకు వారు నిద్రపోరాదు. ప్లేగు, భూకంపం కంటె కూడ జూదం ఘోరమైన చెడుగు, ఎందుకంటె, అది లోపల ఆత్మనే నాశనం చేసివేస్తోంది. ఆత్మలేనిమనిషి భూమికి

గురించిప్రపంచమునకు నడిపించడానికి వీలులేదా? జాతపుభాగములకు కూడ మంచిగురాలిలపెంపకానికి అవసరమా?

(హరిజన్: 4-9-1937)

# 8

## స్త్రీలు.

ఆచారప్రకారం చట్టముప్రకారంకూడ స్త్రీ అణచిపెట్టబడినది. ఈ ఆచారమునుకాని చట్టమునుకాని నిర్మించుటలో స్త్రీకి భాగం లేకుండపోయినది. అహింసపై ఆధారపడే జీవితవిధానములో తన మంచిచెడ్డలను రూపొందించుకొనుటకు పురుషునకు ఎంత హక్కు ఉండునో స్త్రీకికూడ తన మంచిచెడ్డలను రూపొందించుకొనుటకు అట్టి హక్కేఉంటుంది. అయితే, ఇట్టి అహింసాసంఘంలో ప్రతిహక్కుత తూర్వ్యంపాచరింపబడిన విధివల్లనే ఉద్భవిస్తుంది. కనుక, సాంఘికనియమములనేవి స్త్రీపురుషు లుభయుల సహకారముతోను రూపొందవలసి ఉంటవి. పైనుండి ఎవరో ఈనియమములను బలవంతంగ రుద్దరాదు. ఈసత్యమును పురుషులు స్త్రీలవిషయంలో తాము ప్రవర్తించే ప్రవర్తనలో పూర్తిగ గమనించడంలేదు. స్త్రీలు తమకు మిత్రులు, సహచరులు అని గ్రహించడానికి బదులుగ తాము వారిపై అధికారులము ప్రభువులము అన్నట్లు పురుషులు భావిస్తున్నారు. స్త్రీలను ఉద్ధరించడంలో వారికి చేయూత నివ్వడ మనేది కాంగ్రెసు కార్యకర్తలకు గౌరవప్రదమైన అవకాశము. పూర్వకాలంలో

"బానిస"లని ఉండేవాళ్ళు. తాము స్వతంత్రులమనికాని, ఎన్నటికైనా తాము స్వతంత్రులము కావలసియున్నదనికాని పాపము! ఈ బానిసలు ఎరుగకుండిరి. మన స్త్రీలుకూడ దాదాపు అటువంటి స్థితిలోనే ఉన్నారు. బానిసలకు స్వతంత్రము ప్రసాదింపబడగానే, "అయ్యో! ఏమి చేయడమ"ని బెంగపడసాగించారు. తాము పురుషులకు బానిసలే అని స్త్రీలకు చాలకాలం నుండి నూరిపోశారు. స్త్రీలును తమనుగూర్చి తాము కూడ అట్లే భావించుకుంటున్నారు కనుక, ఈ బానిసస్థితినుండి వారిని తప్పించి, స్త్రీలు తమ ప్రాప్తిహోదాను తాము గ్రహించేటట్లు చేయడం కాంగ్రెసువారి ముఖ్యకర్తవ్యం. పురుషులతో సమానులుగ తమ కర్తవ్యభాగములు తాము నిర్వహించగలిగేటట్టుగ కాంగ్రెసువారు స్త్రీలకు చేయూత నొసంగవలెను

మన మనస్సును దృఢంచేసుకుంటే, ఈ మార్పు తేవడం సులభం. కనుక, కాంగ్రెసువారు ఈమార్పును తేవడం మొట్టమొదటగ తమతమ ఇండ్లలోనే ప్రారంభించాలి. వారు తమ భార్యలను ఆటవస్తువులుగా, కామతృప్తికై ఏర్పడ్డ సాధనములుగా ఎంచరాదు. తమతోపాటు దేశసేవ చేసే సహధర్మచారిణులుగ గౌరవదృష్టితో చూచుకోవాలి. ఇంతవరకు ఉదారమైన విద్య చదువుకోనని స్త్రీలు ఇక ఈదృష్టితో తమభర్తలనుండి చెప్పదగినంత చదువును చదువుకోవాలి. తల్లులు, కుమార్తెలుకూడ ఇట్లే తమవారి నుండి చదువుకోవాలి.

భారతదేశపు స్త్రీలను గురించి నేనింతవరకు చెప్పిన దంతా ఒకపక్షముగానే ఉన్నదని నే నిక్కడ వేరే చెప్ప నక్కరలేదు. దీనికి రెండవపక్షముకూడ ఉన్నదనే సంగతి నే మరుగుపరచలేదు. అనగా, గ్రామాలలో చాలా సంసారాలలో స్త్రీలే పురుషులకు ఏ విషయంలోనూ కూడ తీసిపోకుండా ఉన్నా రనిన్నీ, కొన్నికొన్ని సందర్భాలలో స్త్రీలు పురుషులపైనే అధికారం చెలాయిస్తూ ఉంటారనిన్నీ, నాకు బాగా తెలుసు. కాని బయటనుండి నిష్పాక్షికంగా చూసేవారికి, ఆచారరీత్యా చట్టరీత్యా, ఇండియాలో స్త్రీలకుగలస్థితి మొత్తంమీద బాగాలేదనే కనిపిస్తుంది. అందువల్ల ఆస్థితిలో సమూలమైన మార్పు అవసరమనికూడ తోస్తుంది.

(నిర్మాణకార్యక్రమం: 1941 - పేజీలు 17, 18)

## 9

### కులమతసమైక్యత.

ఇట్టిసమైక్యత కావాలని అందరూ అంటున్నమాటే. కాని, సమైక్యత అంటే, పైనుండి నెలకొల్పబడే రాజకీయపు సఖ్యతకాదు సుస్థిరమగు హృదయైక్యత కావాలి. దానికి మొట్టమొదటగా విధిగా కావలసినదేమంటే:- ప్రతికాంగ్రెసు మనిషీ అతడే మతస్థుడైనాసరే, తనవ్యక్తిలో అన్నిమతము లకు తాను ప్రతినిధిగ అయిపోవాలి. హిందూ, ముస్లిమ్, క్రైస్తవ, పారశీ, యూదు వగైరా అన్నిమతములకు తాను ప్రతినిధి అయిపోవాలి 'హిందూ,' 'నాన్ హిందూ' అనే భేదం

కూడ లేకుండ తన్నిమతములను తనలో సమైక్యత పొందించు కోవాలి. హిందూస్థాన్‌లోగల కోట్ల ప్రజానీకంలో ప్రతి వానితోకూడ తనకు ఐక్యతాస్ఫురణ కలగాలి. ఇది సాధించు కోవాలంటే, ప్రతి కాంగ్రెసుమనిషి తదితర మతస్థులతో సన్నిహితస్నేహము అలవర్చుకోవాలి. తన మతమంటే తన కెంత గౌరవమో; ఇతరులమతమునెడకూడ తనకు అట్టి గౌర వమే ఉండాలి. (నిర్మాణకార్యక్రమం: 1941 - పేజీ 8)

# 10

## అస్పృశ్యతానివారణ.

అంటరానితన మనేది హిందూమతంలో భాగం కాక పోవడమేకాక, అది దాని నంటుకొన్న ప్లేగు అని కూడ చెబుతాను. కనుక, దానిని నిర్మూలించుట ప్రతిహిందువు యొక్క విధాయకకృత్యమైయున్నది. అది పాపమని తలచే ప్రతిహిందువుడు దానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఎట్లంటే: అంటరానివా రనే వారితో సోదరభావం కలిగించు కోవాలి; ప్రేమభావంతో, సేవాభావంతో, వారితో కలిసి మెలిసి తిరగాలి;అట్టి పనులవల్ల తాను పవిత్రుడనగుచున్నట్లుగ ఎంచుకోవాలి; యుగములతరబడి బానిసత్వంలో పడియుం డినదాని ఫలితంగా వారిలో ఏర్పడ్డ అజ్ఞానమును, ఇతర చెడుగులను వారు తొలగించుకునేటట్లుగ, ఓర్పుతో వారికి తోడ్పడాలి; తనతోడి హిందూకులస్థులుకూడ ఇట్లే చేసే టట్లు ప్రోత్సహించాలి.

(ఎరవాడామందిరంనుండి: 1945 - పేజీ 32)

హిందూమతంమీదనున్న ఈ మచ్చను తొలగించు కోవలసిన అవసరాన్నిగురించి, నే నీ నాడు ప్రత్యేకంగా విశదీకరించి చెప్పవలసిన పనిలేదు. ఈ విషయంలో కాంగ్రెసువారు చాలా పని చేసియున్నమాట నిశ్చయమే. అయితే చాలామంది కాంగ్రెసువారు ఈపనిని ఎక్కువగ రాచకీయప్రయోజనప్రదృష్టితో చేశారని మాత్రం నేను చెప్పవలసివచ్చినందుకు విచారిస్తున్నాను. అసలు హిందూ మతమనేది బ్రతికియుండాలంటే, హిందువు లీ పనిచేయడం అనివార్యమైన విధి యనే దృష్టితో చేసినవారు తక్కువ. ప్రతి హిందూ కాంగ్రెసువాదియు ఈసమస్యను రాచకీయ ప్రయోజనప్రదృష్టితో కాక, ఇది స్వతస్సిద్ధమైన ధర్మ కార్యంగా చేపట్టెయెడల, సనాతనవాదులను ఇప్పటికంటె హెచ్చుగ దోవలోకి తీసికొనిరావచ్చును. సనాతనవాదులతో కయ్యానికి దిగేధోరణిలో మనముండరాదు. అహింసవాదుల కిది తగదు. స్నేహభావముతో ప్రవర్తించడమే అహింసా పరులకు ఉచితమార్గము. ఇక, హరిజనులతో సోదరభావం కలిగి, వారి కష్టమే మనకష్టంగా భావించుకొని, వారితో ఏకమైపోవాలి. దిక్కులేని స్థితిలో వారికి మనము తోడ్ప డాలి. వారి కేర్పడియున్నంత ఘోరమైన ఈ దీనస్థితి * ప్రపంచంలో ఎక్కడను కానరాదు. ఈపనిచెయ్యడం

* అయితే, అమెరికాలో నీగ్రోలస్థితి ఏమిటి? ఎవరిది ఎక్కువ దీన స్థితి? హరిజనుల కేసును గాంధిగారిచ్చట అతిశయోక్తిగ చెప్పారని తోస్తుంది. (మా.స)

ఎంతకష్టమో నాకు అనుభవంలో తెలుసు. అయితే, ఇది తప్పదు. స్వరాజ్యసాధనిర్మాణములో ఇదియొక ముఖ్య ఘట్టము.

(నిర్మాణకార్యక్రమం: 1941 - పేజీ 9, 10)

# 11

## ఆర్థికసమత.

నిర్మాణకార్యక్రమములజాబితాలో దీనిని (ఆర్థికసమతను) ఆఖరుపద్దుగ చెప్పుచున్నాను. అంటె తక్కినవాటి కంటె ప్రాముఖ్యతలో ఇది ఆఖరుదనికాదు అహింసమీదే ఆధారపడే స్వరాజ్యానికి అసలు కీలకమే ఇది. ఆర్థికసమత కోసం పనిచేయడమంటే, ధనికవర్గానికి, కార్మికవర్గానికి మధ్య నిరంతరం సాగుతున్న స్పర్థను అంతంపొందించడమన్నమాట. దీనికై రెండుపనులు చేయవలసిఉంటుంది. ఒకటి: దేశముయొక్క సంపదలలో హెచ్చుభాగం నేడు ఏ కొలదిమంది ధనికులచేతులలోనో గడ్డకట్టుకుపోయియున్నది. అట్టి వీరినందరిని క్రిందికి దిగగొట్టాలి; ఇక, రెండవది: తిండికి బట్టకుకూడ కరవైన అశేషజనాన్ని పైకి లేవదీయాలి. అప్పుడు అందరూ సమలెవెల్ లోకి వస్తారు.

నా ట్రస్టీసిద్ధాంతాన్ని చూచి చాలమంది పరిహసిస్తున్నారు. అయినాకాని, నే నా సిద్ధాంతాన్నే పట్టుకొని వదలదలచడంలేదు. దానిని సాధించడం కష్ట మనే మాట నిజమే. అయితే, అహింసకూడ కష్టమేకద.

ఆర్థికసమతను అహింసామార్గంగా సాధించటమనేది ఇంకా సాధన రూపంలోనే ఉందికాని, పరిపూర్తియైన సిద్ధస్థితికిరాలేదు. "ఆర్థికసమత అంటే ఇదిగో" అని దాని సంపూర్ణ సిద్ధస్వరూపమును చూపించడానికి ఇంకా మనకు తావాతురాలేదు. కాని, ఈపద్ధతి -ఈప్రయోగం- నెమ్మది నెమ్మదిగానే కానిండు సవ్యమైన దిశగానే నడుస్తున్నదను మాటమాత్రం సత్యం. పని సవ్యమైన మార్గంలోనే బయలు దేరిందని చెప్పవలెను. అహింసావిధానమనేది ఎదుటివాని మనస్సుమార్చడమే కనుక, మార్పు ఒకసారి కనుక కలిగిం దంటే, అది ఎన్నటికీ చెదరక, శాశ్వతంగానే ఉండిపోతుంది.

అహింసామూలకమైన స్వరాజ్యం తెల్లవారేటప్పటి కల్లా అధాత్తుగ ఆకాశంనుండి ఊడిపడదు. అందరూ ఏకమై ఒక్క-చెయ్యిగవేసి ఈ స్వరాజ్యసౌధాన్ని ఒక్కొక్క-రాయిగా కట్టుకురావలసి ఉంటుంది. ఈ దిశగ మనము కొంత చెప్పుకోదగిన దూరం నడచివచ్చాము. కాని, ఇంకా ఎంతో దూరం, ఎంతో శ్రమకోర్చి నడిస్తేనేకాని మన కా సర్వోదయస్వరాజ్య శిఖరశృంగపుదీధితులు గంభీరకాంతులు గోచరముకావు

(నిర్మాణకార్యక్రమము: 1941 - పేజీ 21, 22)

అహింసద్వారా సంపద సమానంగా పంపిణీ జరగడ మనేది ఏట్లా జరుగుతుందో కొంచం ఆలోచించి చూద్దాము. దీనికి మొట్టమొదటిమెట్టు ఏమంటే, ఈ ఆదర్శాన్ని తనజీవి

తంలో భాగంగా చేసుకొన్నవ్యక్తి, మున్ముందుగ తన సొంత జీవితపు నడకలో తగు మార్పులు చేసుకోవాలి. ఇండియా యొక్క పేదరికాన్ని దృష్టిలో ఉంచుకొని, ముందు తనకోరికలను, అవసరములను బాగా, తక్కువలోకల్లాతక్కువగ, తగ్గించివేసుకోవాలి. తన సంపాదనయావత్తు దోషరహితముగా న్యాయార్జితముగ ఉండేటట్లు చూచుకోవాలి. ధరల ఊహాల మీద బేరాలుసాగించి (స్పెక్యులేషన్ మీద) తేరగా, తేలికగా, డబ్బుపోగుచేసుకుందామనే దురాశాపద్ధతులు మానివేసెయ్యాలి. తనజీవితములో చేసుకున్న ఈ మార్పునకు అనుగుణముగా తాను కాపురముండే ఇల్లు పద్ధతికూడ మార్చుకోవాలి. తన నిత్యజీవితపుప్రతిరంగంలోనుకూడ ఎంతో నిగ్రహము ప్రవేశపెట్టుకోవాలి. తన సొంత జీవితమును నడుపుకునే పద్ధతి నిట్లు శక్తివంచనలేక మున్ముందుగ మార్చుకొన్నవాడే తనతోడి కార్యకర్తలకు, తన ఇరుగువారికి ఈ ఆదర్శమును బోధించుటకు అర్హుడగును.

(హరిజన్: 25-8-1940)

## అహింస - ఒకసాధనము.

విద్వేషమును విద్వేషముచేకాక, ప్రేమశక్తులను కేంద్రీకరించి ఎదుర్కొనుటచేతనే ప్రజలను నా అభిప్రాయములోనికి మార్చుకొందును. ఈ రకమైన అహింసద్వారానే దేశములో ఆర్థికసమతను నేను తీసికొని రాగలను. సంఘంలో యావన్మంది నా అభిప్రాయానికి వచ్చేదాకా నేను ఆగను. ముందుగ అపనిని నేనే ప్రారంభ

భిస్తా. నామట్టుకు నేను యాభై మోటారుకార్లుపెట్టుకొని, వందయకరాలభూమి పెట్టుకొని, ఆర్థికసమత తెస్తానంటే, అది అయ్యేపనికాదని వేరుగా చెప్పనక్కరలేదుకదా. ఆర్థిక సమత నేను దేశంలో తేవాలంటే ముందుగ నేను దేశంలో పేదవానికన్న పేదవాడుగ ఉండేస్థితికి దిగిపోవాలి. గత యాభైఏండ్లపైకాలమునుండి నేను చేయయత్నించుచున్న పనే ఇది.

(హరిజన్: 31-3-1946)

మురికిపద్ధతుల ఫలితం మురికిగానే తేలుతుంది. రాజుకు రైతుకు మధ్య సమత్వం తేవాలంటే, రాజుతలకాయకొట్టి వేయడంవల్ల వస్తుందా! ఎన్నటికీ రాదు. అట్లే, షాహుకారుకు కూలివానికీమధ్య సమత్వం తేవాలంటే, షాహుకారు తల నరికివేస్తే వస్తుందా? అసత్యంవల్ల సత్యమును చేరలేము.

కనుక, సత్యసంధులు అహింసాపరులు, నిర్మలహృదయులు అయిన సోషలిస్టులే ఇండియాలో కాని, ప్రపంచంలో కాని నిజమైన సోషలిస్టుసమాజాన్ని స్థాపించగలరు.

(హరిజన్: 13-7-1947)

## —: ఉపసంహారం-ముందుకుపురోగమించండి :—

మనము నిత్యము వాడుకునే 'నీరు' అనే ఆ ఒక్క చిన్న వస్తువులో ఎంతటి మహోత్కృష్టమైన శక్తులు ఎన్ని అసంఖ్యాకముగ నిండినిబిడీకృతమైయున్నవో మన మిప్పటి

కింకా నిజంగా తెలిసికోలేకుండానే ఉన్నాము. ఆవిరియొక్క కొన్నికొన్ని శక్తులు చూస్తే మన కెంతో ఆశ్చర్యం కలుగుతుంది. అట్లే సూక్ష్మాతిసూక్ష్మమైన అహింసలో కూడ ఎంతటి శక్తులు దాగియున్నవో ఎవని కెరుక! కనుక దానిని అంత తేలికగా చూడకుందుముగాక. దానియందు దాగియున్న ఆ మహాశక్తి ఏమిటో కనుక్కోడానికి మనము ఓర్పుతో, విశ్వాసముతో ప్రయత్నింతుముగాక. మనము ప్రారంభించిన ఈకొద్దికాలంలోనే ఈ అహింసాశక్తియొక్క ప్రయోగం ద్వారా ఏదో కొంత విజయము సాధించగలిగాము. అయితే, ఇదొక పెద్ద విజయముగ నేను భావించడం లేదు. అంతేకాదు, అహింసలో ఇదొక ప్రయోగమని పేరు పెట్టడానికికూడా ఇంకా జంకుతునే ఉన్నాను. మనము పురాణములలో చదివిన సంగతి ఒకటి జ్ఞాపకం వస్తున్నది. రాముని పేరు చెబితేనే సముద్రంలో (వారధికట్టడానికి) రాళ్ళు మునగకుండ తేలినవట! అట్లే, అహింస పేరుతో సాగించిన మన ఉద్యమం దేశంలో మేల్కొల్పు కలిగించి, మనను కొంత ముందుకు తీసికొనిపోయినది. అచంచల భక్తి విశ్వాసములతో ఈ అహింసాప్రయోగము సాగించేవారు ఇంకా ముందుకు ముందుకు సాగిపోతూ ఉంటే దానిలో గర్భితమై యున్న ఎంతలెంతలేసి శక్తులు ఇంకాఇంకా పైకి ఉద్భవించి వస్తవో ఎవని కెరుక!

(హరిజన్: 28-7-1940)

**మొదటిభాగం సమాప్తి.**

# సర్వోదయము

## ఎనిమిదవ విభాగము

### నూతన విప్లవము.

## 1

### —: నూతన విప్లవము :—

(శ్రీ వినోబా)

విప్లవాత్మకమైన కార్యక్రమం కావాలని ప్రజలు అంటూఉంటారు; రక్తపాతంలేనిదే అట్టి విప్లవం రానేరదని కూడా అంటూ ఉంటారు. ఈ వాదం నేను ఒప్పుకోనను. 'రక్తపాతంలేనిదే విప్లవం రాదనేవారు నిజంగా విప్లవవాదులు కారు. వారు " ఉన్నదున్నట్లుగ ఉండనీ " అనేవారే. వారునిజంగా కోరేది విప్లవంకాదు; సుఖపడుతున్నవాళ్ళు కష్టపడాలనీ, కష్టపడుతున్నవాళ్ళు సుఖపడాలని, ఇదీ వారు కోరే కోర్కె.. ఒకరికొకరు చోటులుమార్చుకోవాలనే వారి కోరిక. ఇది విప్లవం అవుతుందా? ఈ పద్ధతిలోఒకరిచోటికి ఇంకొకరు రావడమే అయిందికాని మొత్తంమీాద వచ్చిన మార్పేమి? మొత్తంమీాద దుఃఖమనేది (ఎవరికిగాని) లేకుండా చేశారా? చేయలేదు కద. ఎవరికో ఒకరికి దుఃఖం ఉండనే ఉందికద. అందుకనే లోకాన్ని "ఉన్నది ఉన్నట్లు ఉండనీ

అనే వాళ్ళే వీరు" అని నేనంటున్నాను. మినహాయింపు లేకుండ, అందరికీ, సుఖమును కలిగించడమనేదే 'విప్లవం' అవుతుందికాని, కొందరికి ఎలాగూ దుఃఖం మిగల్చడం అంటూ వస్తే, అది విప్లవం కానేరదు. 'సర్వేజనాః సుఖినో భవంతు' అనేదే సర్వోదయం. నేను సర్వోదయవాదిని కనుక ఏ ఒక్కరికీకూడ దుఃఖం ఉండకుండ, అందరికీ సుఖం ఉండాలనేదే నామతము. అందువలననే నేను నిజమైన విప్లవవాది నంటాను. సంఘాన్ని రెండువర్గాలుగ చీలదీయాలనేవారు తమ్ము్మను తాము 'కమ్యూనిస్టులు' అని పిలుచుకుంటే పిలుచు కొనవచ్చుకాక; నిజానికి వారు 'కమ్యూనలిస్టులు' అని అనగా (పాక్షికమైన వర్గదృష్టి కలవారని) నే నంటాను. 'ఎక్కువ మందికి ఎక్కువసుఖం' అనేది పాశ్చాత్యదేశస్థుల మతం. ఈ ధోరణిలోనే వారు పుట్టి పెరిగారు. కాని మన భరతఖండ ములో బిడ్డలకు పసితనంనుండికూడ 'సర్వేజనాః సుఖినో భవంతు' – అనగ అందరికీ సుఖం ఉండాలనేసూత్రం నూరి పోశారు. క్రియలో అందరికీ సేవచేయడానికి శక్తిలేక, కొద్ది మందికే చేసినప్పటికి, ప్రతి భారతీయుని మనస్సుమాత్రం అందరినీ ప్రేమించవలసినదనియే ప్రబోధము పొందుచున్నది. బహుజనము కష్టపడుతుంటే తత్ఫలితములను ఏ కొద్దిమంది యో హాయిగ అనుభవిస్తూఉండే కాలం లోకంలో ఒక ప్పుడు ఉండెను. ఇప్పుడు జరుగుచున్న దేమంటే ఆ కొద్ది మందిని అణచిపెట్టి, బహుమంది సుఖపడాలనిచూస్తున్నారు. కాని ఇండియాలో జరిగినది దీనికి తల్లకిందులు. ఇక్కడ మనకు చేయబడిన ఉపదేశమేమిటంటే, "ఇతరులు నీకెట్లు

చేయవలెనని కోరుకుంటావో, నీవు ఇతరులకు అట్లు చేయవలెను." దీనినే "ఆత్మౌపమ్యము" అని భగవద్గీత చెప్పుచున్నది.

ఈ ఉపదేశమును పునాదిగా చేసికొనియే, యావత్తు సంఘమును మార్చివేయాలని నాకోరిక. అందువల్లనే, నా మార్గము విప్లవమార్గమంటున్నాను. పువ్వుకందకుండ తేనెటీగ పువ్వులోని తేనెను తీసుకొంటుందికదా. నేనును అట్లే ఇతరులకు హానికలుగకుండ నా ఉద్దేశ్యం సాధించాలని నాకోరిక. హృదయపరివర్తన సూత్రంమీాద నమ్మకం ఉంటే మన మీా పనిని సాధించవచ్చును. కనుక, నేనుకొత్తగా ఇప్పుడేమీా చేయడంలేదు. మన పూర్వఋషులు మనకు చెప్పిన దానినే చేస్తున్నాను. అహింసద్వారా ఇట్టి విప్లవాన్ని మనము ఇండియాలో నేకనుక తేలేకపోతే, ప్రపంచంలో ఇతర తారు ఏదేశంకూడ తేలేదు. ఇందును గురించి నాకెట్టి సందేహంలేదు.

(హరిజన్: 15-12-1951)

నేడు సాగుచున్నసూత్రం మెజారిటీపరిపాలన. ఆ మెజారిటీ అనేదానికి మంచీ చెడ్డా వివేకం ఉందా లేదా, దానికి సద్బుద్ధి, సత్ప్రవర్తన ఉందాలేదా, అనే ప్రశ్నతో సంబంధమేలేదు. ఇట్టి మెజారిటీపాలన వట్టి పశుబలప్రయోగం కాదా? మెజారిటీపరిపాలనకు, ధనాధికారమునకు, సైనికపాలనకు తేడా ఏమిటి? ఇదంతా కేవలం పశుబల ప్రయోగంకాక మరేమి? (హరిజన్: 17-1-1953)

ప్రతివాడు చేయవలసిన సవ్యమైన పని ఒకటే. అదేమంటే-తనఇచ్ఛను తనమీాదనే చెలాయించుకోవాలికాని, ఇతరుల మీాద ఎన్నడూ రుద్దకుండ ఉండే నిగ్రహమును తన కివ్వవలసినదని ప్రతివాడు భగవంతుని ప్రార్థించాలి. తనఉద్దేశం ఇతరులకు నచ్చితే వారు దానిని ఇచ్ఛాపూర్వకంగా స్వీకరిస్తే స్వీకరించనీకాక. అప్పు డది తనకు సంతృప్తినిస్తే ఇచ్చుగాక. మంచిదే. కాని తన ఇచ్ఛను ఇతరులమీాద బలవంతంగా—తదితరుల మేలుకొరకైనాసరే—రుద్దే ప్రవృత్తి తనకు లేకుండవలె నని యే ప్రతివాడు ప్రార్థించుకోవాలి. తన భావాలు ఇతరులకు నచ్చినవా లేవా అనేసంగతి ఆలోచించకుండానే, వాటిని వారిమీాద బలవంతంగా రుద్దాలని ప్రజలు ఎంతకాలం అనుకుంటారో అంతకాలం లోకానికి దురవస్థ తప్పదు. హింసలు, దౌర్జన్యములు, ప్రపంచయుద్ధములు సామ్రాజ్యతత్వములు. వీటిబీజాలు ఎన్నడూ నశింపవు.

అందరూ అన్నిసంగతులు బాగా తెలుసుకొని ప్రజలు వారంతటవారే సత్పథంలో నడవగలిగేవరకు ఓపిక పట్టడానికి కొందరు ఇష్టపడడంలేదు కనుక, వా రనే దేమంటే:—"మంచి సాంఘికపద్ధతి నొకదానిని రూపొందించి తయారు చేసి, అందరూ దానిని అనుసరించవలెనని నిర్బంధించాలి, ఇదే మేలైన పద్ధతి" అని వారంటున్నారు. ఇలాచేస్తే ప్రజలకు శిక్షణ క్రమక్రమంగా అదేవస్తూ ఉంటుంది" అనికూడ అంటున్నారు. "ప్రజలకు ఎంతకాలమని ఇలా చెబుతూ కూర్చుంటాము, ఈపద్ధతి లాభంలేదు"అని ఇట్టివారు నిరాశ

నిస్పృహ చెందియున్నారు. అందుకనే ఈపద్ధతి మానేసి ఆయుధాలు పెంచుకోవడంలో ఎక్కువ ఆశ, హుషారు చూపిస్తున్నారు.

దీనికి బదులుగ వినోబాగారు చెప్పేదేమంటే:— ఒకపద్ధతి ఒక కొన్నాళ్ళు బాగా పనిచేసినట్లు కనిపించవచ్చు గాక, కాని దానికి పునాదిగ ప్రజల విజ్ఞానము సమ్మతి అనేది లేకపోతే త్వరలోనే దానియెడల అసంతృప్తి విముఖత ఏర్పడుతుంది; "ఛీ ఇది బాగాలేదు; దీనికి బదులు ఇంకొకపద్ధతి కావాలనే" గోల పుట్టుతుంది. ఈ రీతిగా పాతదిపోయి కొత్తది, ఆ కొత్తదిపోయి మరియొక కొత్తది, అంతులేకుండా ఈ విషచక్రం తిరుగుతునే ఉంటుంది. ప్రజలు అన్నిసంగతులు తెలిసికొని, సమ్మతించిన మీదటనే రూపొందింపబడిన పద్ధతి వీనిలో ఒకటికూడ కాకపోవడమే ఈ క్రిందుమీదులకు కారణము.

"ఎడమచెయ్యితీసి పురచెయ్యిపెట్టు" అన్నట్లు ఒక పద్ధతి తీసివేసి ఇంకొకపద్ధతి పెట్టితే ఏదో సత్ఫలితం కలుగుతుందనే భ్రాంతిని ప్రజలు మానుకోవాలి. దానికి బదులుగా ప్రజలను విజ్ఞానవంతులుగ జేసి, వారు అన్నిసంగతులు తెలిసికొని వర్తించేవరకు ఓపికపట్టుతూ మనపనిని మనం స్థైర్యముతో చేసుకుంటూ పోతేనే మేలని మనము నమ్మాలి. అట్టి నమ్మికతో మన విధ్యుక్తధర్మప్రకారం మనము నడిచి పోతూనే ఉండాలి. గమ్యస్థానాన్ని చేరడానికి తుద కిదే అన్నిటికంటె దగ్గరదోవ అవుతుంది. ఏ సంగతిని కాని

పూర్తిగా తెలిసికొననిది దానిలోకి దిగకూడదు. మనయందుండే కేవలం గౌరవంచేతనో గుడ్డినమ్మకంచేతనో ఎవరైనా ఏపనైనా చేస్తే- అది మంచిపనే అగుగాక- మనంచూచి మురియకూడదు. భయంచేతనో ఇతరులకు లొంగిపోయియో కూడ ఏ పనీ చేయరాదు. శ్రీకృష్ణుడు అర్జునకు ఎంతో మంచి ఉపదేశం చేశాడు. కాని చివరకు ఏమన్నాడు? ''యథేచ్ఛసి తథాకురు'' అన్నాడు. ఇంత చెప్పానుకాని, ఇక, నీ కేది ఇష్టమో అదే చెయ్యి అన్నాడు. అదే నిజమైన ఆదర్శం. దీనినే మనం అనుసరించాలి. బలవంతమనేది ఎక్కడా పనికి రాదు. అప్పుడే మనము అహింస పునాదిగాగల స్వరాజ్యాన్ని నిర్మించుకోగలము. అప్పుడే శాశ్వతమైన శాంతిని పొందుటకు ఆశించగలము. (హరిజన్ 7-7-1951)

# సర్వోదయము

## తొమ్మిదవ విభాగము

### ఆర్థిక సమత

## 1

### —: ఆర్థికసమత :—

(వినోబా)

పాకీవాడు, తల్లి, విద్యాగురువు -ఇట్టివారింకెందరో చేసే సేవకు రూపాయఅణాలపైసలలో విలువకట్టడం సాధ్యం కాదు. కనుక, ఉండవలసిన ధర్మమేమంటే, సంఘానికి హృదయపూర్వకంగా సేవచేసే వ్యక్తికి నిశ్చింతమైన జీవనాధారమునకు సంపూర్తియైనహక్కు ఉండాలి. అట్లే. అట్టి భక్తితోనే, దేశమునకు సేవచేసే ఇండియా ప్రెసిడెంటుకు కూడ ఆతని భుక్తికి సరిపడ జీతమే ఉండాలి; ఆతడు చేసే సేవ బుద్ధివిశేషంచేత చేసేది అగుకాక- అయినా ఆయనకు అన్నాత కడుపునిండ తిండికి మాత్రమే. పొలంలో పనిచేసే రైతుకు, నొర్లూ వీధులు ఊడ్చే పాకీవానికి, ఏలెక్కను దేని ఆధారమువిూద కూలి (లేక జీతం) ఇస్తున్నామో, ఇండియాను యావత్తు పాలించే ప్రెసిడెంటుకుకూడ అదే లెక్కను జీతం ఇవ్వాలి. నేను సంఘానికి అనేకరకములైన సేవచేసి యున్నాను. ప్రొఫెసరుగా, జడ్జీగా, రైతుగా, గ్రంథరచయితగా

పత్రికా సంపాదకుడుగా, ఎన్నెన్ని తరహాలుగానో సేవచేసి యున్నాను. అయినా వీటిలో ఒకదానికంటె ఇంకొకటి గొప్పది గౌరవప్రదమైనది అని నే నెన్నడూ అనుకోనలేదు. దానిలో ప్రతిదానివల్ల నాకు ఆత్మతృప్తి మానసికతృప్తి సమానముగానే కలిగినది. వీటిలో శరీరశ్రమ మాత్రము సమానంగా ఉందని చెప్పలేను. ఈశరీరశ్రమ ఒక్కొక్కతరహా పనిలో ఒక్కొక్కతరహాగా ఉంది. కాని, దానివల్ల మానసిక సంతృప్తిలో మాత్రం ఏమీ తేడా కనిపించలేదు. నాకు కావలసినదానికంటె ఎక్కువగా ఎవరన్నా ఇవ్వదలంచు కుంటే నాకు కంపరంగా ఉంటుంది. దానిని నేను స్వీకరించ జాలను. నాకు కావలసిన పెరుగుకంటె ఎక్కువ పెరుగు నే నెందుకు తీసికోవాలి? ఎవరో తేరగా ఇస్తున్నారుకదాయని తీసికునేదా? ఇది కూడనిపని. ఉండవలసిన సవ్యపద్ధతిఏమంటే *ఏరోజుకు కావలసిన ఆహారపదార్థం ఆరోజువరకే ఉండాలి. మరునాటికికూడా దాయకూడదు. చేసేప్రతిపనికికూడ విలువ-ఆర్థిక, సాంఘిక, ఆధ్యాత్మికపు విలువకూడ- అన్నింటికి సమానంగానే ఉండాలి. ఆపద్ధతినైతేనే మనము "సామ్య యోగము"ను స్థాపించగలము.

సాగుబడిభూమి మొత్తమంతా అందరికి లెక్కప్రకారం సమానంగా పంచాలని కాదు నేను చెప్పేది. అంకెలువేసి

---

* "Give us this day our daily bread" ఓ దేవుడా! ఈరోజు రొట్టె మాకు ఈరోజున ఇమ్ము" అని ఏసుక్రీస్తు చెప్పిన ప్రార్థన కదే అర్థము. (మా. స.)

భాగహారం చేస్తే వచ్చే సమానత్వం కాదు నేను కోరేది. చేతి అయిదు వేళ్ళకు ఏట్టి సమత (సమానత్వం) ఉందో అట్టిదీ నేను కోరేది. ఈ అయిదు వేళ్లు పొడవులో సమానంగా లేవు. కాని అవన్నీ సహకరించి పనిచేసి, ఎన్నెన్నో కార్యములను సాధించుచున్నవి. ఇంకొకసంగతేమిటంటే ఆవేళ్ళయొక్క పొడవులో అసమానత యున్నప్పటికి, అది అంత పెద్ద అసమానత కాదు. చిటికెనవేలు అంగుళం పొడవుండి, మధ్యవేలు అడుగుపొడుగు ఉందా ? అంత తేడా ఉంటే అది తప్పే ? కనుక దీనినుండి మనము నేర్చుకొనవలసిన సారాంశ మేమంటే, కేవలం గణితరీత్యా సమానత లేకపోయినా, మరీవిపరీతమైన అసమానత ఉండరాదు. అసమానతలోకూడ ఉచితత్వం ఉండాలి. చేతిఅయిదు వేళ్ళలో ఒక్కొక్కదానికి ఒక్కొక్కతరహాశక్తి, ఒక్కొక్కతరహా ప్రయోజనం ఉంది. అట్లే మనుష్యులలోకూడ ఒక్కొక్కనికి ఒక్కొక్క రకమైనశక్తి ఒక్కొక్క రకమైన ప్రయోజనం ఉంది. ఈ రీతిగా ప్రతివ్యక్తిలో స్వతస్సిద్ధముగ ఉన్న శక్తులన్నిటిని ప్రస్ఫుటం చేసి పెంపొందించాలి. ఇదే పంచాయితీ ధర్మమంటే.

(1-11-1957) తేదీన ఉత్తరప్రదేశ్‌లో జరిగిన సర్వోదయ మహాసభలో చెప్పిన ఉపన్యాసంనుండి- హారిజన్ (26-1-1952)

# 2

## —: న్యాయమైన కూలి :—

(జే. సీ. కుమారప్ప)

పెట్టుబడి విధానపు ఆర్థికవ్యవస్థలో కూలివాడు డబ్బిచ్చి కొనుక్కునే వస్తువుగ, అమ్ముకునే వస్తువుగ ఎంచబడుతున్నాడు. మనిషిని రూపాయ అణాల పైసల్లో కిమ్మతు కట్టుతున్నారు. అదే కూలివాని కిచ్చే కూలీగా నిర్ణయమవుతున్నది. "అన్నింటికంటె మానవత్వమే ప్రధానమైనది" అనే మూలసూత్రము కేవలం విస్మరింపబడుతున్నది. ఒక ఇనుపచక్రాన్ని ఎట్టి హృదయంతో డబ్బు ఆవల పారేసి కొనుక్కుంటాడో, కూలిఅనే మనిషినికూడ అట్టి హృదయంతోనే డబ్బు పారేసి కొనుక్కుంటున్నాడు షాహుకారు. కనుక, బాగా బేరంచేసి ఎంతతక్కువగ తగ్గించడానికి వీలుంటే అంత తక్కువగ అంతచవకలో కూలివాణ్ణి కొనుక్కోవాలని చూస్తాడు షాహుకారు. దోపిడీ విధానమంటే ఇదే. మనిషి కాయకష్టాన్ని ఈరీతిగా ఏదోబజారువస్తువులాగ చూచుకుంటున్నాళ్ళు ఈ విధానం మారదు.

మనిషిని మనిషిగ చూడాలనుకొనే పద్ధతిలో మన ఆలోచనలన్నీ సాంఘికవిలువలమీద ప్రసరించాలి. అంటే దాని అర్థమిది:— మనిషికిచ్చే కూలి అతడు తయారు చేసిన వస్తువును బజారులో పెట్టితే, ఎంతధరవస్తుందో అనే దాని మీద ఆధారపడి ఉండరాదు. మరి దానిని తయారుచేసిన

ఆమనిషి జీవనానికి ఎంత డబ్బు అవుతుంది అనే లెక్క మీదనే ఉండాలి. ఒక కల్లుగీతవాని సంగతి ఆలోచించండి. అతనికి తదితరమానవులకువలెనే మంచి పుష్టికరమైనతిండి, పరిశుభ్రమైన గాలి వస్త్రాలు వచ్చే వసతులతోకూడిన ఇల్లు, గౌరవనీయుడయిన పౌరుడు తనబిడ్డల కెట్టిరీతిగా చదువు చెప్పించుకుంటాటో అట్టిరీతి తన బిడ్డలకు చదువు చెప్పించుకునే సౌకర్యాలు, ఇవన్నీ ఉండాలి. వీటి కన్నింటికి లెక్క కట్టితే, ఆ కల్లుగీతగాని కుటుంబమునకు ఎంత డబ్బు కావలసి వస్తుందో, అదే వాడు పడే శ్రమకు కనీసపు ధర ఉండాలి. దీనికి తగ్గరాదు. ఈలెక్క ప్రకారం నెలకు ఈనాటి పరిస్థితుల బట్టి- రు150-లు అవుతుందనుకోండి. మరి, మంచిప్రవీణుడయి హృదయపూర్వకంగా పనిచేసే గీతగాడు నెలకు తూకంలో ఎన్నివీశెల లేక ఎన్ని శేర్ల బెల్లం ఉత్పత్తిచేస్తాడో కూడా లెక్కకట్టండి. వానికష్టార్జితముగా లెక్కతేలిన రు 150లను ఈ వీశెలమీద (లేక శేరులమీద) పంచండి. అలా పంచితే బెల్లం ధర మార్కెట్టులో సేరు 1 కి రు 1-8-0 వరకు కూడ పెంచవలసి రావచ్చుకాక. "అబ్బో! బెల్లంధర ఇంతా!" అని మనం కంగారు పడరాదు. ఎందుకంటె సాంఘికన్యాయం జరగాలంటే ఇదితప్పదు! దీనికి మనం జంకరాదు. గవర్నమెంటే కనుక ధరలు నిర్ణయించి సరుకులు అమ్మకానికి పూనుకుంటే, మధ్య లాభాలుపొందే కమీషన్‌దార్లు వగైరా లెందరో మాయమైపోతారు. వారితోపాటు వారు తింటున్న కమిషన్‌లయు లాభాలయు బరువులుకూడ సరుకుల ధరలమీద పడవు. ఈగీతిగా ధరలు నిర్ణయమైనప్పుడు.

ఇంతకాలంనుంచి మధ్యదళారులుగనున్న షావుకార్లయు మిల్లుదారులయు, విదేశీదిగుమతులయు పోటీలనుకూడ తీసి పారవేయవలసి యుంటుంది. మన వస్తూత్పత్తిదారుల జీవిత ప్రమాణమును హెచ్చుచెయ్యాలంటే, ఇదొక్కటేమార్గం. వేరే మార్గంలేదు.

ఇదంతా ఆచరణయోగ్యమైన పద్ధతికాదని ఎవరు కాని తేలికగ కొట్టివేయరాదు. ఎందుకంటె, రష్యాలో ఇలాగే చేస్తున్నారు. ప్రపంచంలో దాదాపు మూడింట ఒక భాగం ఈ రష్యావారిపద్ధతినే ఆదర్శంగా అవలంబిస్తున్నారు. ధరల నిర్ణయవిధానమును ఈ రీతిగానే చేసి ప్రజల జీవిత ప్రమాణమునూ హెచ్చుచేయుటకు పూనుకొనుచున్నారు.

(గ్రామోద్యోగపత్రిక : జులై 1953 : పేజీ 41)

# 3

## విచక్షణాపూర్వక సమత :

## (గుడ్డిసమత కాదు)

:— వినోబా :—

“సమానత్వం అంటే అందరికీ అయిదు యకరాలు ఉండాలి, అందరికీ ఇల్లు సమానంగా ఒకమాదిరిదిగానే ఉండాలి, అందరికీ సరిగా నాలుగుగజాలగుడ్డే ఉండాలి” అని కాదు. బ్రతకడానికి అవసరమైన వస్తువులన్నీ అనగా, గాలి నీరు, భూమి, మొదలైనవి అందరికీ సులభంగా సమంగా

ప్రపంచశాంతిలో ఉండాలనే అర్థం. ఇవన్నీ అందరికీ కావలసినంతగ లభ్యమైనప్పుడు, ఎవరికైనా ఇంకా కొంచెం హెచ్చుగ మిగిలిఉంటే దానిని చూచి మనం చుప్పనాతితనం (అసూయ) పడనక్కరలేదు

విచక్షణతో కూడిన సమతయే మనకు కావాలి. ఇంట్లో ఉన్న అన్నంవస్త్రాది ఆహారపదార్థాలనన్నిటిని పిల్లలెంత మంది ఉన్నారో గణితం ప్రకారం లెక్కకట్టి అందరికి సమంగా భాగించి, పంచిఇస్తుందా తల్లి? పసిపిల్లకు పాలు మాత్రమే ఇస్తుంది; అంతకంటె కొంచం పెద్దపిల్లకు కాసిని పాలు కాస్త రొట్టె ఇస్తుంది. అంతకంటె పెద్దవాళ్ళకు రొట్టెలుమాత్రమే ఇస్తుంది. ఇదే రీతిగా సంఘంలో కూడ విచక్షణ ఉండాలి. ఎవనికి ఎంత ఆకలుందో, ఎవడెంత జీర్ణంచేసుకోగలడో ఇదంతాచూచి ఆహారం తదనుగుణంగా పంచాలి. ఇట్లుకాక, బలాత్కారంచేత సమత్వం తెస్తామనే టట్టయితే చచ్చినట్లు అందరు ఒకేకొలత తిండి తినాల్సి వస్తుంది. ఇదా సమత్వమంటే! ఈరకం బలాత్కారపు సమత్వానికి మనము పూర్తిగ వ్యతిరేకులం. విచక్షణమీాద ఆధారపడియుండే ఆధ్యాత్మికసమత్వం మనం కోరేది (హరిజన్ 20-12-1952).

## సమత్వం—దయాదాక్షిణ్యము

(వినోబా)

పాతకాలపు కవులు, మతాలు, గురువులు అందరూ దయ దయ పేదవానిమీాద దయచూపండి, అంటూ దయా

గుణమును ఎక్కువగ పొగడినదానిని ఈ కాలంలోని సమత్వ వాదులు కొందరు తేలికగ ఎక్కిరిస్తున్నారు. "మాకు ఎవరి దయా అక్కరలేదు. మాకు సమత్వమే కావాలి" అంటు న్నారు వీరు. 'దయ' అనేది దయచూపే ఆమనిషిలో తాను గొప్పవాడననే అహంకారమును పెంపొందిస్తుంది అనికూడ అంటున్నారు.

దీనికి వినోబా గారనే దేమంటే:—ఒకప్రక్క దయా గుణమును నిరసించుతూ సమత్వం తేవాలని కోరేవారు చాల పొరబడుచున్నారు. సమత్వానికి పనికివచ్చే ఒకానొక గొప్ప ఆధ్యాత్మికశక్తియొక్క ప్రయోజనాన్ని వారు అనవస రముగ కాలతన్ని వేస్తున్నారు. అంతేకాదు అనవసరపు విరోధమును కూడా కల్పించుకుంటున్నారు. విరోధమనేది సమతకు అసమతకు మధ్యనున్నదే కాని, సమతకు దయాగుణా నికి మధ్య లేదనే సంగతిని సమతావాదులు గ్రహించాలి. దయాగుణమును పెంపొందించుకున్న వారి నైతిక ఆధ్యాత్మిక శక్తులయొక్క యావత్తులాభమును తమ సమత్వోద్యమమునకు చేదోడుగ తెచ్చుకొని ఉపయోగపరుచుకోడానికే సమతా వాదులు చూచుచుండవలెను. (అంతేకాని, దానిని కాల తన్నివేయరాదు) దయాదాక్షిణ్యామనేది పనికేరాదని వారు మొగం త్రిప్పివేసికోనవసరంలేదు. పైగా ఇంతకాలంనుండి తాము చూపుచువచ్చిన 'దయ' అనేది సరియైన రకముది కాదని గ్రహిస్తూ అసలు రకమైన 'దయ' యేదో 'ఆహా! ఇప్పుడు తెలిసికోగలిగా' మని వారు తలచడం బుద్ధిమంతుల

లక్షణంగా ఉంటుంది. పూర్వానుభవమునుబట్టి సమత్వం స్థాపించడమనేదే నిజమైన "దయ" అని ఇప్పటికి తాము గ్రహించగలిగినందుకు వారు సంతోషించాలి. అసమానత రాజ్యంచేసే సంఘంలో పేదలమెడకాస్తకాస్తదయచూపించడమనేది గొప్పవిషయంగానే కనిపించవచ్చు. అది ఆ ఇచ్చే దాతకకొంత ఆత్మతృప్తినిస్తూవచ్చింది. అయితే అదిచాలదు; నిజమైన దయ అనే అంతస్తును అది అందుకోలేదు నిజమైన 'దయ' అనేది సమత్వస్థాపనమీదనే నిలవవలసియున్నది. సమత్వస్థాపనకై కృషి చేయబూనిన వారు నేనుచెప్పిన పై పద్ధతిని అవలంబిస్తే దయాగుణ వికాసమునకై తమపూర్వులు ఎంతకాలమునుండియో చేయుచువచ్చిన నిరంతరకృషి లాభమును కూడ వారు తమ ఉద్యమానికి చేదోడుగ తెచ్చుకొన్న వారవుతారు. తమ నూతనోద్యమమునకు వారు దానిని చక్కగ ఉపయోగించుకొనవచ్చును. కనుక దయాగుణ వికాసమునకు ఉపకరించిన మనపూర్వుల సాంప్రదాయమును నాశనంచేసే పొరబాటును మన ఈనాటి సమతావాదులు చేయకుందురుగాక. ఆ పూర్వసాంప్రదాయమును నాశనం చేసివేసి దానిస్థానే సమత అనే దానిని స్థాపిస్తామని- అదేదో అచ్చంగా కొత్తగ తామే యీనాడే కనిపెట్టినట్లు,పాతసాంప్రదాయనికది భిన్నమై విరోధియైనట్లు అనడం చాలా పొరబాటు.

సమత్వమును జీవితరంగంలో క్రియారూపంగా సాధించడానికిగాను ఈనాటివారు ముందడుగు వేయుచున్నారు. ఈ యత్నంలో వారు లోగడ తమపూర్వీకులు

ఎంతో ఓర్పుతో ఎంతకాలమో యోచించి సాధించిన ఫలితములను కూడ తమ పక్షముగ లాగికొని ఉపయోగించుకొనుటకు చూడవలెను. తాముకూడ నిరంతరం ఈ ఆదర్శమును ధ్యానగమ్యముచేసికొనుచుండవలెను. మానవ పరిణామములో తామిప్పుడొక కొత్త ఘట్టమును ప్రారంభించారు. ఇది ఒక పుస్తకరచనలో ఒకనూతనాధ్యాయమును ప్రారంభించినట్లన్నమాట. కనుక, గ్రంథకర్త తనగ్రంథరచనలో ఎంతజాగ్రత, ఎంతశ్రద్ధ చూపుతాడో తాము కూడ అట్టి శ్రద్ధాభక్తులనే చూపవలెను 'దయ' అనేది భ్రాంతిగ పరిణమించి ఒకవైపున గర్వమునకు డాంబికమునకు హేతువై. మరియొకప్రక్క దారిద్ర్యమును జాలిగొల్పు పరిస్థితులను ఎట్లు తెచ్చిపెట్టగలదో ఈ తరము వారు చూచియున్నారుకద కనుక తాము మెలకువగ ఉండకపోతే, తమ "సమత"కు కూడా పూర్వీకుల "దయ"కు పట్టిన దుర్గతే పట్టవచ్చును. మంచి ఏదో చెడుఏదో తెలిసికొనే శక్తికూడ తమకు నశిస్తుంది. సమత అనేది మనిషిలోని విచక్షణవిజ్ఞానమునే నశింపుచేస్తే, ఇక అట్టిసమత ఎన్నాళ్లు నిలవగలదు? అదిన్నీ త్వరలోనే లోకాన్ని భ్రాంతిలో పడగొట్టుతుంది. విచక్షణను నశింపు చేసుకొని 'సమత'ను కనుక స్థాపిస్తే, ఇక 'విచక్షణ' అనే దానిని పునరుద్ధరించుకోడానికి మరల ఎన్నియుగాలో మనం తపస్సు చెయ్యాల్సి వస్తుంది. కనుక సరియైన విచక్షణ జ్ఞానంతోనే సమతను సాధిస్తూ పూర్ణమైనదయాగుణమునుకూడ దానితో మేళవించుకొనవలెను. ఇట్టి దానికి నిరంతర ఆత్మపరిశోధన అవసరము; బుద్ధిని భ్రాంతిలో పడవేసే మురికినంతను త్రోసి

వేసుకుంటూ ఉండడమున్ను అవసరము. అసమత్వబుద్ధిని కలిగించే ప్రతిఅహంకారలేశమును వెతకి వెతకి సమూలం నాశనంచేసివేసెయ్యాలి. అట్లే ఒకడు హెచ్చు ఒకడు తక్కువ అనే స్ఫురణనుకూడ ప్రాణాదులలోనుండి త్రవ్వివేసేసుకోవాలి. ఈ కార్యసాధనకు నమ్రమతతో, హృదయపూర్వకముగ పూనుకుంటే ఈ ఆదర్శానికి చేరువ అవుతూ ఉండడానికి మనలో ప్రతివ్యక్తికూడ ఎంతో కృషిచెయ్యవలసి ఉంటుందనే ఆశ్చర్యకరమైన సంగతి మనకు గోచరిస్తుంది.

"ప్రయివేటు ఆస్తిలేని వినోబాబాంటివానికి, ఈసమస్యతో ఏమిపని," అని- ఆర్థికసమత్వవిషయంలో డబ్బులేని ఈయన చేసే పనేమి ఉంటుందని-కొందరు అనుకోవచ్చుగాక! కాని సొంతమైన ఆస్తిపాస్తులు లేని నాబోటివాడుకూడ ఇందులో చేయవలసినది చాలా ఉన్నది నామనస్సును నేను జాగ్రత్తగ పరిశీలించి చూసుకుంటే నేనుకూడ ఈ ఆదర్శానికి చాలాదూరంగానే ఉన్నానని,అక్కడికి చేరడానికి నే నింకా చాలా అడుగులు ముందుకు వేయవలసి ఉందనిన్నీ గోచరమవుతున్నది. ఇవన్నీకాక, భౌతికముగ, శారీరకముగ కూడ మానవులమధ్య అసమానతలున్నవి. వీటిసంగతేమిటో కూడ ఆలోచించవలసియున్నది.

ఏదైనా ఒక ఆదర్శాన్ని జయప్రదంగా సాధించాలంటే, చేయవలసిన పనులు ఇంకా ఉన్నవి. ఉదాహరణకు సమత్వసమస్యే తీసికొనండి. తనచుట్టునున్న మానవసమా

జంలో లేదలచిన సమత్వమునకు నూరురెట్లు సమత్వమును ఈ కార్యసాధకుడు ముందుగ తనలో తెచ్చుకోవలెను. ఇది జరిగితేకాని ఈసాధన జయప్రదం అవుతుందనే ఆశే లేదు. మానవశరీరంలో వేడి, ధర్మామీటర్‌తో కొలిచిచూస్తే, 98 డిగ్రీ లుంటుందంటే, కారణమేమిటి? సమస్తమైన వేడికి జనకస్థానమైన సూర్యుడు 98 డిగ్రీలకంటె కోట్లకోలది రెట్లు వేడిగాఉన్నాడు కనుకనే. సూర్యుడే కనుక మనశరీరపు వేడికంటె అనగా 98 డిగ్రీలకంటె హెచ్చు వేడిగా లేకపోతే మనగతి ఏమవుతుందో చూసుకోండి. కనుక, సమతను స్థాపిస్తామని బయలుదేరే మన సంఘసేవకులు ఈవిషయంలో చుట్టునున్న సంఘానికంటె తామే ఎన్నో రెట్లు ముందడుగా ఉండాలి. అప్పుడే వారి గొప్ప ఆశలు, ఆదర్శాలు, క్రియలు, జయప్రదం అవుతవి.

(హరిజన్: 30–6–1951)

## కమ్యూనిజానికి, సర్వోదయానికి తేడా ఏమిటి?

(కె.జి. - మష్రూవాలా)

సర్వోదయానికి కమ్యూనిజానికి ఉండే తేడా చేరవలసిన గమ్యస్థానంలో కాదు, దానిని చేరవలసిన నడకలో ఉంది. గాంధిగారే ఒకప్పుడు ఏమన్నారు? "హింస మినహా నేనూ కమ్యూనిష్టునే" అన్నారు. ఈ రెంటికీ తేడాను గాంధీగారు ఇంకొకమాటలతో కూడ చెప్పారు. నేను ప్రచారం చేసేది 'సామ్యవాదం' కాదు, 'సామ్యధర్మం' అన్నారు.

కమ్యూనిస్టులది సామ్యవాదం—అంటే, మాటలతో ఆదర్శాన్ని చెప్పే వాదం. "నాది సామ్యధర్మం"—అంటే క్రియలో సమత్వాన్ని ఆచరించే కార్యవిధి విధానం. జీవితాంతవరకు ఆయన చేస్తున్న ధర్మసాధన క్రియ ఇదే. భారతీయులలో అందరికంటె అట్టడుగున పడియున్న ప్రజానీకంతో తాను తాదాత్మ్యమూ ఐక్యతా పొందడానికే ఆయన చేసిన ప్రతి కార్యమున్నూ. కొన్ని తరాలుగా రాజ్యపాలకులుగ ఉండిన సంపన్నగృహంలో ఆయన పుట్టాడు. దానిసాంప్రదాయాన్ని కొంతవరకు తాను తప్పించుకొనలేకపోయినా, దానిని ఆయన తన జీవితవిధానంగా అంగీకరించక, దానికంటె దిగువ మెట్టుదైన 'లాయర్'పని కొన్నాళ్ళు చేశాడు. ఆంగ్ల తత్వవేత్తయైన "రస్కిన్" మహాశయుని గ్రంధాలు ఆయన చదివాడు. దానివల్ల ఆయన కనిపెట్టిందేమంటే తాను లాయరుగా పనిచేస్తున్నప్పటికి, తద్వారా తనకు తాను తన సొంతానికి డబ్బు పోగుచేసుకోవడం న్యాయం కాదని తెలిసికొన్నాడు. లాయరుపనిని తన స్వలాభానికి సాధనగ చేసుకోకూడదనుకున్నాడు. కనుక తనకున్న సొంత ఆస్తినంతా విసర్జించి వేశాడు. రష్యాలో గొప్ప తత్వవేత్తగ నుండిన "టాల్‌స్టాయి" అనే మహాత్ముని గ్రంధాలు చదివాడు. మన భగవద్గీతచదివాడు. లాయరుపని సంపదుత్పత్తి వృత్తికాదని ఈ చదువులవల్ల తెలుసుకున్నాడు. తన సొంతకాయకష్టంచేత తన తిండి సంపాదించుకోవడమే ఉత్తమవృత్తి అని తెలిసికొన్నాడు. అందువల్ల లాయరుపని మానేసి, పొలంపనిలోకి దిగాడు. తాను రైతునని చెప్పు

కున్నాడు. రైతు అనగానే కొంతభూమికి సొంతదారుడు కావాలికద. అందువల్ల చేతిపనులు చేసే వారికంటె ఆర్థికంగా సాంఘికంగా, తాను గొప్పవాడనై పోతున్నానే అనే ఆలోచన కట్టింది. అందువల్ల తానుకూడ వారితో సమానుడుగా ఉండాలని ఆయన నేతవృత్తిని చేపట్టాడు. అయితే చూడగా నేతవాడుకూడ పొలంలో పనిచేసే కూలివానికంటె పై అంతస్థులో ఉన్నాడుకద కనుక తాను ఇంకా క్రిందికి దిగాలని తానును పొలంకూలీవాడైనాడు. పొలం కూలి వానికంటె పాకీవానిపని మరీ అధోగతిగా ఉన్నదికదా. వానికి పలుగుపారలు వగైరా పరికరాలు లేవు. కృషి ప్రావీణ్యతలేదు విజ్ఞానంలేదు. సంఘంలో మానమర్యాదలు లేవు. కనుక, అట్టి అధోగతిలో ఉన్న పాకీవాడితో తాను సమస్థితి పొందాలని, గాంధీగారు కూడ పాకీవాడై పోయినాడు. వాళ్ళుండే గుడిసెలలోనే ఉంటూ వచ్చాడు. వారితో కలిసిమెలిసి వారికి మిత్రుడుగ ఉండి, తన కనిష్ట సోదరులైన వారిస్థితిని పైకి తేవాలని తన తపస్సు ధారపోశాడు

ఈ సాధన ఆయనచేస్తూ పోయినకొద్దీ అది ఎంత కష్టమైనదో ఆయనకు గోచరిస్తూవచ్చింది. దీనిలో తాను పూర్తిగ జయించానని ఆయన చెప్పుకోలేక పోయి నాడు. ఇట్లు తన శక్తివంచనలేక పట్టువిడువక ఆయన ఈ కఠోరసాధనచేస్తూ ఉండికూడ, తక్కినవాళ్ళు తనతో కలిసిరాలేదని హృదయంలో ఎన్నడూ క్రోధం వహించలేదు. అసహనం పడలేదు. "ఎడ్లచేత గొడ్లచేత మనఇష్టంవచ్చినట్లు

చాకిరీ చేయించుకుంటున్నాము. అట్లాగే మనుష్యులచేత మాత్రం ఎందుకు చేయించుకోకూడదు; దీనిలో తప్పేమి" అని వాదించే వారున్నారు; "మనుష్యులకు గల్లకు స్థితిలో తేడా ఉన్నది అట్లే మానవులలో మానవులకుకూడ తేడా లుంటవి; ఇది తప్పదు. అలా ఉండాల్సిందే" అనే వారున్నారు. ఈ రీతిగా ఆర్థికసాంఘికరంగాలలో ఉన్న దోపిడీ విధానాన్ని, అసమత్వాన్ని ఉన్నదిఉన్నట్లుండాలని వాదించే వారెందరో ఉంటే, అట్టివారియెడల గాంధిగారు మనస్సులో కూడ క్రోధము వహించలేదు! తన సహనమును కోల్పోలేదు. అతిపేదవాళ్లల్లోకూడ ఈ ధనాశఅనేది వేళ్లుపాతుకుని ఉన్నది. వీలైతే తానుకూడ పెద్దభూస్వామియై, పెద్దషాహుకారై, పనిచేయకుండా తేరగా తిండితింటూ కూర్చుండేస్థితి తనకు వస్తే బాగుండునని ప్రతివాడు-నిరుపేదసైతం-అంగలారుస్తూ ఉండేవాడే; శరీరకష్టంచెయ్యకుండ తాను ఎగగొట్టి, ఎవడి చేతనో నానాచాకిరీ చేయించుకోవాలనే ప్రతివాని కోర్కె. కాయకష్టం పని తప్పించుకొని, హాయిగా తిండితింటూ కూర్చుందామని ప్రతివాని హృదయంలో ఉన్న ఈ పేరాశయే నేడు సంఘంలోఉన్న ఈ సమస్త అసమానతలను పోషిస్తున్నది. ఒకవైపున "ఈఅసమానతలు తప్పవు, ఉండాల్సిందే" అని ప్రతివాళ్లు సరిపెట్టుకోడానికిన్ని, ఇంకొకవైపున తమకంటే ముందుగ భాగ్యవంతులైన వారినిచూచి కోపం చుప్పనాతితనం చెందడానికిన్నికూడ, ఇదే మూలం. షాహుకారు అనేవాడు, కమ్యూనిస్టు అనేవాడుకూడ -ఇద్దరిలో ఎవడూకూడ -ఒళ్ళువంచి పనిచేసి తిందామనికాని, నిరా

డంబరమైన సత్పథజీవితాన్ని గడుపుదామనికాని- అనుకోవ డంలేదు. హాయిగా తేరగా ఉండే సింహాసనంమీద నేను కూర్చోవాలి. నేను కూర్చోవాలి అని, ఇద్దరూ పోటీపడి, దానికోసం దొమ్ములాడుకునేవారుగానే ఉన్నారు. ఈ జీవితంయొక్క పరమప్రయోజనం- హాయిగా తేరగా తినడం, తిరగడం. పనిచెయ్యకుండ ఎగబెట్టికూర్చోవడం- ఈ రెండే తప్ప వేరులేదని మనుష్యులు ఎంచుకొంటూ ఉంటున్నంత కాలం, వారు వీటిని సాధించుకోడానికై, దౌర్జన్యాలు, దొమ్ములాటలు సాగించుకొనకుండ తప్పించుకోలేరు. కాయ కష్టంచేసి తిండితినడం, హింసాపద్ధతులు మానివేయడం- అనే ఈ రెండూ- కమ్యూనిస్టు ఉద్యమంలో విడరాని భాగములుగ కమ్యూనిస్టులు అంగీకరిస్తే, దానితో ఎవరుకాని తగాదా పడవలసిన పనిలేదు. అసలు కమ్యూనిజం అంటే మంచిదే- అయితే, దానిమీద మనకు సానుభూతి కలగాలంటే-ఏపద్ధతుల చేత కమ్యూనిస్టు లనేవారు ఆర్థికసాంఘికరంగములలో మార్పులు తేవాలనిచూస్తున్నారో, ఆ దౌర్జన్యపద్ధతులకు బదులుగ దౌర్జన్యరహితమైన పద్ధతులు అవలంబించడం అవసరం. నిజమైన కమ్యూనిజంమీద మనకు సానుభూతిఉంటే, మన మీ రీతిగా దౌర్జన్యరహితపద్ధతులే అవలంబించాలి.

(హరిజన్: 5-2-1949)

# సర్వోదయము

## పదియవ విభాగం

### డబ్బుకాదు కాయకష్టమే సర్వమునకు మూలము:—

## 1

### కాయకష్టములో ఉండే ఘనత:—

(వినోబా)

కాయకష్టంచేసే మనుష్యులు తక్కువతరగతివారనే అభిప్రాయం ప్రజలలో బాగుగ వేరుపాతుకొని యున్నది. కాయకష్టానికి విలువా పోయింది. ఘనతాపోయింది. ఇట్టి పరిస్థితులలోనే పరదేశస్థులు మనదేశమును జయించారు.

ఇట్టి విపరీతస్థితి అంతమైపోవాలి. కాయకష్టంచేసి సంపదను ఉత్పత్తిచేసేవారే ఇండియాకు నిజమైన పౌరులని అందరు గ్రహించాలి. ఇట్టి వారిని సంఘం గౌరవించాలి. వారు చక్కగ బ్రతకగలగడానికి వారికి సరిపడ వేతనము లివ్వాలి. ఇతరులు చూచి మెచ్చుకొని "అయ్యో! మనముకూడ యిలాచేస్తే బాగుండునే" అనేటట్లుగ వారు సుఖంగా బ్రతికేటట్లు ఏర్పాట్లు చెయ్యాలి.

18-10-1951 తేదీన ఢిల్లీలో ఇచ్చిన ఉపన్యాసం)
హరిజన్: 19-1-1952)

# 2

## మధ్య తరగతులవారికి ఒకమాట:—

(సి. రాజగోపాలాచార్యులవారు)

ఇతరులచేత చాకిరీచేయించుకోవడ మనేది బాగా తగ్గించుకోవాలి. పూర్తిగ తగ్గించుకుంటే మరీమంచిది. నీ జీవితపద్ధతిని నిరాడంబరముగ చేసికో; ప్రతిపనిని నీవే చేసుకో; ఈ మాటలు మన స్త్రీలకు పురుషులకుకూడ మింగడానికి చేదుగ ఉండవచ్చునుకాక. అయినా, వారు దీనిని తమ గృహ కృత్యములలో నిత్యము అనుసరింపక తప్పదు. ఏదో లాంఛనంగాకాక గట్టిగ విధిగ ఈమార్పు చేసుకోవాలంటే మొదట అసౌకర్యంగా ఇబ్బందిగ కనపడవచ్చునుకాక. కాని, ఇలాగా చేస్తూపోతూ ఉంటే ఇదివరకెన్నడు ఎరుగని ఆనందం మనకు దానిలో గోచరిస్తూఉంటుంది. పాశ్చాత్య దేశాలలో మధ్య తరగతులవారు ఈపద్ధతినే ఎంతో ఆనందంతో, సగర్వంగా ఇప్పటికీ అనుసరిస్తూఉంటారు. అయితే, ఒకసంగతి. పనిలో శ్రమను తగ్గించే సాధనాలు పాశ్చాత్యదేశాలలో ఉన్నవి, మనకులేవు. ఏవిషయంలోకాని పరిస్థితులు సరిగ్గా అక్కడ ఉన్నట్లే మన ఇండియాలోకూడా ఉండేటట్లు చేసుకోవడానికి వీలులేకుండ ఉన్నది. అయినప్పటికి, వారినిచూచి మనము నేర్చుకోవాలి. ఇక్కడ ఎన్ని ఇబ్బందులున్నప్పటికి, పరిస్థితులు భేదంగా ఉన్నప్పటికి, వా రవలంబించే రీతులను మనపరిస్థితులకు అనుగుణముగ మలుపుకొని ఆచరణలోపెట్టుకోవాలి. శ్రమను తగ్గించే యంత్రాలువగైరా సాధనాలు, మొదట

కొంచెం మంచిగ కనిపించినప్పటికి రానురాను తుదకు అవి కూడ మనుష్యులను ఇతరులమీద ఆధారపడేటట్లే చేస్తవి. రానురాను పరాశ్రయం ఘనీభవించి, ప్రజలసౌఖ్యమును స్వాతంత్ర్యమును భగ్నపరచడమే పర్యవసాన మౌతుంది. కనుక, "అయ్యో! అట్టియంత్రాలు మనకుకూడ లేకపోయెనే" యని మనం దిగులుపెట్టుకోనక్కరలేదు. మనపోవను మనము నిజమైన స్వేచ్ఛకోసం పాటుపడుదుముకాక. "నిజమైన స్వేచ్ఛ" అంటే, మన నిత్యకృత్యములలో మనము ఇతరుల కష్టంమీద ఆధారపడకుండ అన్నిపనులు మనంతట మనమే చక్కగా చేసుకోగలగడమన్నమాట. నిజమైన సౌఖ్యం కలగాలంటే వట్టి రాచకీయస్వాతంత్ర్యం; ప్రజాపరిపాలన వస్తే చాలదు. అన్ని విషయములలోను మనము సమానత సాధించాలి. పనిచేయడమంటే ఇక్కడ కాయకష్టమని నా భావన. ప్రతివాడు కాయకష్టం చెయ్యానిది, మనకు వచ్చిన ప్రజారాజ్యం నిలవజాలదు. పనిలో భాగ్యవంతుడు, పేదవాడు అనే తేడా ఉండరాదు. అన్నిపనులు సమానంగా గౌరవప్రదమైనవే అని అనుకోవాలి. ఆ పనులన్నీ గృహాధిదేవతలకు మనం భక్తితో చేసే పూజలుగ భావించుకోవాలి. మన మిలా ప్రవర్తించకపోతే కాయకష్టంచేయడానికి సిద్ధపడే మనుష్యుల పరిపాలనలో లొంగిఉండడానికి మనము సిద్ధపడవలసివస్తుంది. మన బ్రతుకులన్నీ అట్టివారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉండవలసివస్తుంది. ఇప్పుడు కొందరు జన్మచేత మధ్యతరగతులుగ ఉన్నారు. ఇక ముందు జన్మచేతకాక కర్మచేత (అనగ, కష్టపడి శరీరశ్రమ

చేయడంచేత) మధ్యతరగతులుగ తయారయ్యేవారు వస్తారు. వీరే నిజమైన మధ్యతరగతు లవుతారు. కష్టించి, తెలివితేటలను ఉపయోగించి పనులు నేర్చుకొని, ఆపనులలో ప్రావీణ్యతను సంపాదించుకొని సంఘంలో వారు గౌరవస్థానమును పొందగలుగుతారు. వారు క్రొత్తక్రొత్త ప్లానులువేసి, ఇతరులకు బోధించి చెప్పి, తాము సంఘానికి మార్గదర్శకులున్నూ అవుతారు. ఇకముందు పైతరగతివాడు, క్రిందితరగతివాడు అనేమాట ఇప్పుడున్నట్లు వాని జన్మనుబట్టిఉండదు. వాని ప్రజ్ఞనుబట్టి, చేసే పనిలో వాడు చూపే ప్రవీణతనుబట్టి, చేసే కాయకష్టమునుబట్టి, ఉండేఉనికినిబట్టి మాత్రమే ఉంటుంది.

జన్మనుబట్టి ఏర్పడ్డ "మధ్యతరగతులు" అనేవి ఎన్నటి సంగతులో అన్నట్లయిపోవాలి. ఈమార్పు మనంతట మనం బుద్ధిపూర్వకంగా చేసుకుంటే మంచిది. కనుక, దీనికి ప్రారంభం స్కూళ్ళల్లో కాలేజీలలోనే చేద్దాము. ఈపద్ధతులను బోధించే ఉపాధ్యాయులుకూడ దీనియందు భక్తిశ్రద్ధలు కలిగి ఉండాలేకాని, "ఏదో పనిచేస్తున్నాము. చేయిస్తున్నాము" అని పైకి నటనచేసేవారు పనికిరారు. "మేము పైకులాల వాళ్ళము, భాగ్యవంతులము" అని బడాయిలుగా చెప్పుకుని పని తప్పించుకోచూచేవారుగాను ఉండరాదు. ఇట్టి నిర్దుష్టులైన ఉపాధ్యాయుల మార్గదర్శకత్వంలో మన మీ ఉద్యమానికి ఉపక్రమిద్దాం.

(హరిజన్: 9-2-1952)

# 3

## —: సంపదుత్పత్తి హేతుకమైన కృషియే కృషి :—

(వినోబా)

మన సమస్యల కన్నింటికి మూలమేమిటి? ప్రతివాడు ఒళ్ళువంచి పనిచేయకపోవడమే అని నాకనుకు తోస్తున్నది. మనదేశంలో జనసంఖ్య హెచ్చే అగుగాక. అయినా, మనం పోషించుకోలేనంత హెచ్చుకాదనికూడ నా అభిప్రాయం. తినే నోళ్ళు హెచ్చయితే, చేతులుమాత్రం (డబుల్ గా) హెచ్చునా లేదా? కాని, చేతులుపనిచేయడం మానివేసినవి! అసలు వచ్చిన చిక్కు ఇది. పనిచేయడమంటే "ఎందుకువచ్చిన కష్టంరా బాబు ఇది" అని చేతులు అఘోరిస్తున్నవి. సంతోషంతో పనిచేయడమంటే గౌరవమనే భావంతో – అదొక సదవకాశ మనే భావంతో – చెయ్యడంలేదు. పనిచేయడమంటే, ఎవరో తన నెత్తిమీదకి తెచ్చిపెట్టిన అనవసరపు బరువుగ చేతులు ఎంచుకుంటున్నవి. కనుక, అవి నిజంగా చేయగలిగినంత పనిని పూర్తిగ మనస్ఫూర్తిగ చెయ్యడంలేదు. తప్పనిసరిగ ముక్కుకుంటూ మూలుగుకుంటూ చేస్తున్నవి. ప్రతివాడు తన నోటి నిండా అన్నంకావాలని కేకలువేస్తున్నాడేకాని, చేతినిండా పనిచేస్తానని ఎవడూఅనడంలేదు. ఈ రీతిగా పనియందు శ్రద్ధాభక్తులు లేకపోవడమే దేశానికి వచ్చిన అనర్థకం. దేశంలో తగినంత ఉత్పత్తిలేదు అనే స్థితికంటే అసలు ఇదే ఎక్కువ ముప్పుగ ఉన్నది.

ఈ లోపం మనకు ఈనాటిది కాదని నాకు తోస్తున్నది. పనిమానేసి కూర్చోడానికి అనుక్షణం ఏదోసాకు మనకు దొరుకుతునే ఉంటున్నది. "ఇవ్వాళ్ళ శ్రీరామనవమి- కనుక పనిమానేసి, దిట్టంగా పప్పలు వండుకుతిందాం. రేపు ఇంకో పండుగ! కనుక రేపు పనికి సెలవ! మరొకరోజు దీపావళిపండుగ, ఎల్లుండిపెళ్ళి, ఇంకొకనాడు మాయింట్లో కొడుకుపుట్టినబారసాల, లేకపోతే గాంధీమహాత్ముడుపుట్టినరోజు; ఇవన్నీ పనికి సెలవరోజులే; ఇంట్లో మనిషిచస్తే లేక, తద్దినంవస్తే, గాంధిగారు చచ్చిపోతే, అన్నీ సెలవరోజులే. ఇంటికి ఇవ్వాళ్ళ చుట్టంవస్తే పనిమానెయ్యాలి; ఊళ్ళోకి ఏ కాంగ్రెస్‌నాయకుడో, కమ్యూనిస్టు నాయకుడో వస్తే ఆ రోజంతా పనికి మన్నా! పనిఎగ బెట్టడానికి చీమతలకాయంత సాకు దొరికితే చాలు, ఇక మనకు పండగ!

అందరూ రాట్నం విధిగ వడకాలని గాంధిగా రనడం దేనికనుకున్నారు! కేవలం ఖద్దరుఉత్పత్తి చేయించడానికే కాదు. దానివల్ల, ఖద్దరుకూడ ఉత్పత్తి అవుతుందే అనుకోండి. కాని, అది ప్రధానంకాదు. అసలు ఉద్దేశ్యం వస్తువు ఉత్పత్తిచేసే కృషికి ప్రతివాడు విధిగ పూనుకోవాలని చెప్పడమే ముఖ్యమైనది. ఇదొక గొప్ప విప్లవము. ఏపనిచేస్తే ఒకానొక వస్తువు ఉత్పత్తి అవటమేకాక,- దానితోపాటు ప్రతివ్యక్తి- స్త్రీలు, పురుషులు, పడుచువాళ్ళు, ముసలివాళ్లు, బాలురు, బాలికలు- సహా- వీరు వారను విచక్షణలేకుండ యావన్మంది జనం సులభంగా చేయడానికి ఏ పని సాధ్యమవుతుందో- అట్టి పనినే ఆలోచించి గాంధిగారు- ఈ రాట్నపు

పనిని దేశానికి చూపించారు. ఏమాత్రము పనిచేయగల శక్తి ఉన్నవాడైనాసరే, పనిచేసితీరాలి. దీనికి మినహాయింపు ఎవరు కాని కోరకూడదు. తిండి తినడానికి తనకు హక్కు కోరేవాడు ఆ తిండిని ఉత్పత్తిచేయడానికికూడ తాను ఏల హక్కును కోరడు? కోర్టులలోకూర్చుని తీర్పులుచెప్పే జడ్జికాని, బళ్ళో చదువులుచెప్పే పంతులుకాని "నేనూ సంఘానికి ఏదోరకంగా సేవచేస్తున్నాను" అని చెప్పి, కాయకష్టమునుండి తప్పించుకోడానికి ఎంతమాత్రం వీలులేదు. ఎందుకంటే జడ్జి తినేది రికార్డులు కాదుకద! పంతులుతినేది బడిపుస్తకాలు కాదుకద. వీరికి తెల్లవారిలేస్తే తిండికి అన్నంకావాలి. కట్టుకోడానికి బట్ట కావాలి. కనుక, తానుతినే అన్నం ఉత్పత్తిచెయ్యడంలో, కట్టుకునే బట్ట ఉత్పత్తి చెయ్యడంలో ఈ జడ్జి ఈ బడి పంతులుకూడ ఒళ్ళువంచి నేరుగా శరీరకష్టంచెయ్యవలసిందే.

కాని, దురదృష్టమేమంటే, గాంధిగారు చెప్పిన ఈ మాటలను కాంగ్రెస్‌వారే అర్థంచేసుకోలేదు. "కావాలంటే పావలాచందా ఇస్తాం కాని, నూలువడికి ఇవ్వలేము" అన్నారు. దీనివల్ల ఏమైనది? నిజమైన"సంపద" అనే మాటకు "డబ్బు" అనే మాటకు చిరకాలంనుండి ఉన్న మామూలు గందరగోళం పరిష్కారంకాక, అట్లే నిలిచిపోయింది. నూలు వడికి ఇవ్వడమంటే, నూతనసంపదను ఉత్పత్తిచేసి ఇవ్వడ మనిన్నీ,డబ్బురూపంలో ఇస్తే అది నూతనసంపదను ఉత్పత్తి చేసి ఇవ్వడం కాదనిన్నీ, మన కాంగ్రెస్‌వారు గ్రహించలేక పోయినారు. డబ్బు అనేది మనదేశంలో ఇప్పుడు కొల్లలుగ

పెరిగి ఉంది. కాని 'సంపద' అనేది బాగా క్షీణించింది. ఈ 'సంపదే' దేశాభ్యుదయానికి నిజమైన గుర్తు. పట్టి 'డబ్బు' కు మనం గౌరవం ఇస్తే కాయకష్టానికి గౌరవం తగ్గించివేశామన్నమాట. గాంధిగారి స్కీములో ఉన్న విశేషమేమిటంటే: కాంగ్రెస్‌కు లక్షరూపాయిల డబ్బు విరాళంఇచ్చిన మనిషి కాంగ్రెసు 'దాత' మాత్రమే అవుతాడు కాని, కాంగ్రెస్ మెంబరుగ-వోటు అధికారమును చలాయించగల మెంబరుగ-కాజాలడు; ఇక తాను చేతితో వడికిన నూలును చందాగా ఇస్తే, కాంగ్రెస్‌లో అతడు మెంబరై, వోటు చేయడానికి అధికారి అవుతాడు. ఇది చాలా విప్లవాత్మకమైన భావము. కాని కాంగ్రెస్‌వారు దీనిని అర్థంచేసుకోలేక త్రోసివేశారు. (10-3-49 తేదీన ప్రార్థనానంతరం ఉపన్యాసంనుండి హారిజన్ : 17-4-1949)

## 4

### ఖాదీ స్వావలంబన కృషికి చిహ్నము

(కే. జీ. మష్రూవాలా)

ఖాదీ గాంధిగారి నిర్మాణకార్యక్రమమున కంతకు కేంద్రము. ఇది ఇండియాకే కాదు యావత్ప్రపంచమునకు వర్తిస్తుంది. ఖాదీఅంటే కేవలం ప్రత్తివస్త్రములకే కాదు; చేతిమీదవడికి, చేతిమీద నేసిన ఉన్ని, పట్టువస్త్రములకు కూడ వర్తిస్తుంది. ఇండియాలోనే కాకుండా, యంత్రమయమైపోయిన యూరప్ అమెరికాఖండాలలోకూడ జీవితమునకు

అత్యంతము అవసరమైన ఈ వస్త్రవిషయంలో, ప్రతిఇల్లు సాధ్యమైనంతవరకు స్వయంపోషకమై యుండాలి.సర్వోదయా దర్శమును పూర్తిగ అర్థంచేసుకుంటే ఈమాటలోని సత్యం గ్రహించడంఏమీకష్టముకాదు.నాగరికతచెందిన ఏదేశంలో కాని ముందుగ అన్నంకంటె వస్త్రమే ఎక్కువ అవసరమని ఈమధ్యనే వినోబాగారు అనసే అన్నారు. అన్నంలేకుండా ప్రపంచంలో ఎక్కడైనాసరే కొన్నిరోజులు తిరగవచ్చును. దీనికై ఎవరుకాని సిగ్గుపడరు. కాని బట్టలేకుండ మొండి మొలతో మన ఇంట్లోనే అన్నివైపులా తిరగడానికి సిగ్గుపడ వలసి ఉంటుంది. నాగరికతచెందిన ఏదేశంకాని ఇట్టినగ్నతను సహించదు. కనుక ప్రతివానికి తన అన్నం తాను పండించు కొని తినడానికి సాధ్యంకాకపోయినప్పటికి,కనీసం తన వస్త్ర మును తాను ఉత్పత్తి చేసుకోగలిగి ఉండాలి. ఇంకొక సుగుణమేమంటే ఆహారం ఉత్పత్తి చేసుకోవడంకంటె, వస్త్రం ఉత్పత్తి చేసుకోవడం తేలికకూడా. ప్రతివానికి ఇది అందుబాటులోపని. నైతికదృష్టితో ఆలోచిస్తేకూడా, శాంతము, అహింసాత్మకమైన సాంఘికవ్యవస్థకు ఖాదీ చిహ్న ముగా కూడ ఉంటుంది. ఇది దానిప్రత్యేకపు విశిష్టత. మనిషి సోమరిగ ఉండకుండ, ఎప్పుడూ ఏదో పని చేసుకుంటూ ఉండాలనే మంచి లక్షణాన్ని ఇది సూచిస్తుంది. ఇతరుల కష్టాన్ని తాను దొంగిలించకుండా తానే స్వయంగా కష్టపడి తిండి సంపాదించుకోవాలనే లక్షణాన్నికూడ ఇది పెంపొం దిస్తుంది. ప్రతిమనిషిలోని స్వయంవ్యక్తిత్వమును అది వికశీక రిస్తుంది. సర్వోదయోద్యమాన్ని మెచ్చుకొనే వారందరు ఈ

ఆదర్శాన్ని ఎంతవరకు అనుష్ఠానములోనికి తెచ్చుకోగలరో నేను చెప్పజాలను. అయితే' యీమధ్యను శ్రీ కాకా కలేల్కర్ గారు చెప్పినజోస్యము నిజమయ్యేరోజు రావచ్చును. అంటే ఈ ఆదర్శం అందరికి స్వయంసిద్ధముగానే అంగీకృతమై పోవచ్చును. ప్రపంచంలో బ్రహ్మాండంగా యంత్రమయమై పోయిన ఏ దేశానికైనాసరే మన భారతీయుడెవడైనా వెళ్ళి నప్పుడు, ఆ దేశ వాసులకు చేతిరాట్నమును, చేమగ్గమును పరమసాధనలుగ జంకులేకుండ సగర్వముగ అతడు ప్రద ర్శించగలడు. హరిజన్ 27-3-1949.

## 5

### —కాయకష్టము—

వీలయినంతవరకు డబ్బు వాడకాన్ని తగ్గించి, శరీర పరిశ్రమ ద్వారానే అన్నిపనులు సాధించాలనే ఒకమహా ప్రయోగాన్ని శ్రీ వినోబాగారు పవనార్ లోని తమ "పరంధా మాశ్రమము" నందు చేస్తున్నారు. క్రియవిక్రియసాధనముగ లోకంలో 'డబ్బు' అనేది చేసినంతహాని మరొకవస్తువు చేయ లేదని వారి అభిప్రాయము. అతిస్వల్పమైన పరికరాలతో అనగ భూమిదున్నడానికి ఎడ్లతోకూడ పనిలేకుండానే భూమిలో ఎక్కువపంట పండించాలనే మహాయజ్ఞంలో ఆయన తన సహచరులతోసహా నిమగ్నులై యున్నారు. వ్యవసాయానికి పంపులు,మరనాగళ్లు, యంత్రాలు, ట్రాక్టర్లు, కావాలనినీ, ఇవే చాలా శాస్త్రీయమైన ప్రశస్తమైన అధు

నిక వ్యవసాయసాధనములనిన్ని అనుకుంటున్న ఈ రోజులలో ఇవేవి లేకుండ, ఫక్తు కాయకష్టంచేత వ్యవసాయమును ఏల సాగించకూడదు, ఎంతవరకు సాధించవచ్చు చూడాలి" అని ఆయన పట్టుదలగ కృషిచేయుచున్నాడు.

శివరాంపల్లి ఆశ్రమంలో ఉండగ ఆయన మాటి మాటికి చెప్పుతూవచ్చిన విషయమొకటే- "కాయకష్టం పవిత్రమైనది. ఈ పవిత్రసాధనద్వారా యావత్తు నిర్మాణ కార్యక్రమమునకు వినూత్న స్వరూపాన్నె ఇవ్వవచ్చును" అని ఆయన అవకాశం వచ్చినప్పుడల్లా విడువక చెబుతూ వచ్చాడు. మామూలు కాయకష్టంద్వారా లభ్యమైన పవిత్రతయే నిజమైన పవిత్రత. కాని నేటి నాగరిక ప్రపంచంలో ఆయా విషయములకు మామూలుగ ఏవేవోపద్ధతులుగ విలువలుకట్టుచున్నారు. ఇదిసరికాదు, కాయకష్టఫలితమైనపవిత్రతా దృష్టితోనే తిరిగి వీనికి కొత్తవిలువలు కట్టవలెను. లోకాన్నిప్పుడు పీడిస్తున్న పీడలకన్నిటికి ఇదేపరిహారమని శ్రీవినోబాగారి మతము. డబ్బుచెలామణిని తీసివేసి నూతనోత్సాహంతో, విశ్వాసంతో, భక్తితో మనము కాయకష్టము చేపట్టెయెడల నేటి ప్రపంచముయొక్క స్థితే పూర్తిగ మార్పుచెందుతుంది. ఈ నూతనాదర్శంతో ఉత్పత్తిని ఎక్కువగా, ఇంకా ఎక్కువగా-చేయడమే నేటి అవసరం. మనకు అందుబాటులోఉన్న సామాన్యపరికరాలతోనే మనచేతులను సంపూర్తిగఉపయోగపరుచుకుంటేచాలు. మన అవసరంలన్నీ తీరిపోగా, ఇంకా అదనంగాకూడ ఉత్పత్తిచేయవచ్చునని వినోబాగారు మాటి

మాటికి చెప్పుతూ వచ్చారు. ఈ నూతనదృక్పథంతో కనుక మనం కాయకష్టమును చూడడం అలవరుచుకుంటే, మన చిక్కులన్నీ పోతవి. తేరగా ఇతరులకష్టాన్ని దోచుకుతినడ మనేది ఉండదు. అన్ని పనులు వికేంద్రీకృత మవుతవి. జీవితము నిరాడంబరము, సుందరము అవుతుంది. ఆర్థికసమత ఏర్పడుతుంది. ఇవన్నీ తప్పక సిద్ధిస్తవి.

(హరిజన్: 28-4-1951)

## 6

### డబ్బుపీడ వదలించుకోవాలి (కాంచనముక్తి)

(వినోబా)

డబ్బు అనేదాన్ని తొలగించి కాయకష్టమును పునాదిగ చేసి, గ్రామఆర్థికవ్యవస్థనుపునర్నిర్మించాలనిఢిల్లీలో రాజఘట్టములో ప్రార్థనానంతరము ఒకరోజున వినోబాగారు అన్నారు. ఇదంతా పురాతనకాలపు వస్తుమార్పిడివిధానానికి వెళ్ళడమని కొందరనుకున్నారు. అది వారి ప్లానుకానేకాదు. ఆయన కరెన్సీకి వ్యతిరేకుడుకాదు. మామూలు లోహపు నాణెములకంటె, కాగితపు 'కరెన్సీ'యే మేలనివారి ఉద్దేశ్యం. అయితే, ఆయనకోరిన కరెన్సీ కాయకష్టమనే కరెన్సీ. ఏ ప్రభుశాసనానుసారముగానో, ఈ కరెన్సీ "నాసిక్" టంకసాలలో ముద్రింపబడేదికాదు. గ్రామస్థులు తమ ఉపయోగం నిమిత్తము తామే గ్రామంలో అమలుపరుచుకునే కరెన్సీ ఇది. ఈరకం కరెన్సీలో అరువులులేవు.

(హరిజన్: 29-12-1951)

# 7

## అపరిగ్రహము - సంస్థలు

(వినోబా)

కొందరు తమకోసమని డబ్బుపోగుచేసుకోరు కాని, తమ సంస్థలకొరకు పోగుచేసి పెట్టుకుంటారు. "నాసొంత ఉపయోగానికైతే చంపనుకాని, ఉద్యమం కొరకో నా దేశంకొరకో చంపుతాను" అన్న మనిషి మాదిరిగానే ఉంటుంది ఇదికూడ నా ఉద్దేశ్యంలో ఈ రెండూ తప్పే. రెండూ పరస్పర విరుద్ధ ఫలితాలకే దోవదీస్తవి. ఒక ఉదాహరణ చూడండి:-చరఖాసంఘం డబ్బంతా బ్యాంకులలో దాస్తున్నారు. వడ్డీడబ్బులకోసం ఈపని చేస్తున్నారు. అంటే, నిజంగా చరఖా ఉద్యమానికి కావలసిన దానికంటె వారివద్ద ఎక్కువసొమ్ము (వృథాగా) ఉన్నదన్నమాట. అయితే, బ్యాంకులుమాత్రం ఈవడ్డీని ఎలా ఇవ్వగలుగుతున్నవి ? అవి ఈడబ్బును తీసుకొనివెళ్ళి పెద్దపెద్ద లాభసాటి పరిశ్రమలవారికి అప్పులుగా ఇస్తవి. దీనిలో ఉండే స్వవచనవ్యాఘాతాన్ని చూడండి ! "ఈడబ్బు చరఖా ఉద్యమంకోసం ప్రత్యేకింపబడి యున్నది కనుక,చరఖాసంఘం దీనిని గోసేవకోసం ఉపయోగించకూడ"దట, అది నిర్మాణకార్యక్రమంలో భాగమైనాసరే! కాని, బ్యాంకుల ద్వారా దానినే పెద్ద యంత్రాగార పరిశ్రమలకు ఉపయోగపరుపవచ్చునట! ఎంత విపరీతం!

ఎంత స్వోద్యమవ్యాఘాతం * ఈ వైపరీత్యం దేనివల్లకలుగు తోంది? డబ్బుమనసంస్థలపేరుతోనైనాసరే చేర్చి పెట్టుకోండా మనే పేరాసచేత నేకదా! ఇదే కథ కస్తూర్బానిధికి, గాంధి స్మారక నిధికికూడ పట్టుచున్నది. ఇంతడబ్బు పోగుచేసి పెట్టుకోవడం ఎందుకు మనం! ఆ డబ్బు నిజంగా అవసరమే అయ్యేటట్ట యితే, దానిని ఒకటి రెండేండ్లలోనే ఖర్చుచేయవలసి యుండునుకదా! కాని, అది జరగడంలేదు. ఆడబ్బును బ్యాంకులలో వేసి, వడ్డీసంపాదించుతామన్నదానిలో ఉన్న దోషం వైపరీత్యం ఎవరికీ కనబడడంలేదు. దీని కంతకు మూలకారణం ? "వడ్డీ సంపాదించకుండా డబ్బును ఊరికే పెట్టుకోవడం తెలివితక్కువతనం" అనే సంఘంలో మనం పుట్టి పెరిగామనుకనక. మనసంపదలన్నిటిని వదలుకోవాలని భగవద్గీత చెప్పుచున్నది. ఈమాట వ్యక్తులకేకాక ధర్మసంస్థ లకుకూడ వర్తిస్తుంది. ఏ రూపంలోనైనాసరే డబ్బుకు కూడ బెట్టుకోవాలనే ధోరణిలో మనంపోతే, స్వప్రయోజనాలకై డబ్బు కూడబెట్టుకోవడంలో ఏ ఏ దోషాలైతే చేయవలసి

---

* ఏ పెద్దయంత్రాగారాలయితే పనికి రావనిచెప్పి, వాటికి విరోధంగా చరఖాసంఘం పుట్టిందో అట్టి పెద్ద యంత్రాగారాల పోషణకే ఈ చరఖాసంఘం డబ్బు బ్యాంకులద్వారా పరోక్షంగా అందించబడుచున్నది కదా! ఇదొక వైపరీత్యం! ఇక తన తోడి ఉద్యమమైన గోసేవకు ఇవ్వకూడదనికూడా నిషేధింపబడుచున్నది. ఇది రెండవ వైపరీత్యం

ఏస్తుందో ఆ యా దోషాలన్నికూడ మనం ధర్మసంస్థల డబ్బు విషయంలోకూడ చేయవలసియే వస్తుంది.

(హరిజన్: 10-4-1949)

# 8

## డబ్బు చందాలు వద్దు

వినోబా

నాకీ మధ్య ఒక పిచ్చి పట్టుకుంది. ఏమంటే సంస్థలను డబ్బుతోకాక కేవలం కాయకష్టంమీాదే నడపాలని అలా చేయకపోతే, మన సంస్థలు పటిష్ఠంగా పనిచేయలేవని నాకు గట్టిగ తోస్తోంది. గాంధీగారు ఇంతచెప్పి చనిపోయిన తరువాతకూడ, "మాసంస్థలకు చందాలివ్వండి" అంటూ ప్రజలను డబ్బు అడుక్కుంటూ ఉండడం సంస్థలవారికి తగదు. చందాడబ్బుతో పనులు సాగించడానికి మనమిక చూడరాదు. గాంధిగారిపేరుతో వసూలుచేసే ద్రవ్యనిధి గాంధిస్మారకనిధితోనే ఆఖరై పోతుందని ఆశిస్తున్నాను. ఇకమీాదట ఎవరు కాని ఆయనపేరుతో డబ్బు చందాలు వసూలు చేయరాదు. చేయజాలరని కూడ ఆశిస్తున్నాను. ఇంతటినుండి మనము ప్రతిసంస్థను కాయకష్టంమీాదనే నిర్మించుకోవాలి. గాంధిగారిపేరు చెబితే ప్రజలు దయతో డబ్బుచందా లివ్వవచ్చు కాక; కాని, ఆడబ్బు మన నాశనానికే అవుతుంది.

(హరిజన్: 5-1-1952)

# సర్వోదయము

## పదకొండవ విభాగము

## గ్రామ సర్వోదయము

## 1

### సంపద్విభాగ సూత్రము

(కే. జీ. మష్రూవాలా)

జీవితమును సమగ్రమైనదిగా చూడవలెను; వేర్వేరువిభాగములను వేర్వేరుగగాక, అన్నీచేరి ఒక్కటేవిషయమని చూడాలి. వ్యవసాయంవేరు, చేతిపనులువేరు, మిగతాఒక్కొక్కవృత్తియే వేర్వేరు అనే భావం పోవాలి. వీనిలో పరస్పరవైరముకాని వైరుధ్యంకాని లేదని గ్రహించాలి ఒకదానిలో ఒకటి చొరడానికి వీలులేని అడ్డుగోడలుగల అరలు కావివి. ఒకపనిచేసేవాడు ఇంకొకపనిలోకూడ చేయికలిపి పని చేయడానికి సంసిద్ధంగా ఉండాలి; తద్వారా ఇతరవృత్తులలో వచ్చే ఆదాయంలోకూడ భాగం పొందడానికి అర్హుడై యుండాలి ఈపద్ధతులలో సంఘం వికాసంపొందడమే మన ఆదర్శంగా పెట్టుకోవాలి.

దృష్టిలో సమగ్రతలేకపోవడమే ఎన్నో అనర్థకములకు మూలమవుతున్నది. ఒకడు భూస్వామి అని మరొకడు

పొలంలో పనిచేసేవాడని ఒకడు యజమాని అని మరొకడు కూలి అని ఈ రీతిగా ఎన్నో అంతరాలు విభేదాలు ఏర్పడి యున్నవి.

రైతు తాను కష్టించి పండించిన పంటలో భూస్వామికి భాగం తీసుకోవడం న్యాయమే అని అనుక్రమంగా అంగీకరింపబడియున్నది. కాని, భూస్వామిమాత్రం తాను ఇతరత్రా ఇతరవృత్తులద్వారా సంపాదించినదానిలో రైతుకు భాగం పెట్టనక్కరలేదట! ఇదేటిన్యాయము? భూస్వామి పొలంలో తానే దిగి కష్టించి పనిచేయనవసరములేకుండ ఇతరత్ర సంపాదన చేసుకోడానికి తగిన విశ్రాంతిని భూమిస్వామికి ఇచ్చినదెవరు? ఈ రైతుకదా? కనుక, భూస్వామి సంపాదనలో (ఆ సంపాదనకు అవకాశమిచ్చిన) రైతుకు భాగం పెట్టనక్కర లేదా? పెట్టకపోవడం అన్యాయంకాదా?

ఇట్టి అన్యాయమును తొలగించుటకే సొంతసాగు చేసుకొనని భూస్వాములను రద్దుపరచాలనే ఉద్యమం బయలు దేరినది. “నీభూమిని నీవు సొంతంగా వ్యవసాయం చేసుకొని అచ్చంగా రైతువన్నా అయిపో, లేదా భూమితో ఎట్టి సంబంధంకాని లేకుండ వదలుకుపో” అని నేడు అంటున్నారు. అయితే నాకుచూడగా ఇదిసరియైన పరిష్కారమార్గం కాదని తోచుచున్నది.

ఏ గ్రామంలో ఏవ్యక్తికాని, కేవలం రైతుగానే ఉండాలి లేకపోతే కేవలం వర్తకుడుగానే ఉండాలి, లేకపోతే కేవలం

వండ్రింగిగానే ఉండాలి- లేకపోతే గొర్రెలను మేపుకునే గొల్ల వాడుగానే ఉండాలి- (మరొక పని ఏదీ చేయకూడదు) అని ఎడమొగం పెడమొగంగా కేటాయించడం సర్వంగా మంచి పద్ధతి కాదు. మనగ్రామాలను పునరుద్ధరించుకోవాలంటే సరియైన మార్గ మిదికాదు. నిజం మాట్లాడితే, ఈ వృత్తులలో ఏ ఒకటి కూడ ప్రత్యేకించి సంవత్సరం పొడుగునా పనిని ఇవ్వదు; అందువల్ల సంవత్సరంపొడుగునా అన్నం పెట్టదు. ఒకవేళ ఏ వృత్తినైనా, సంవత్సరంపొడుగునా పని ఇచ్చి, అన్నంపెట్టగలిగేటట్లుగ చేయగలిగినప్పటికీ, ఏ మనిషికాని కేవలం ఆ ఒక్కవృత్తినే నమ్ముకొని ఉండడం క్షేమంకాదు. ప్రధానమైన ఆ వృత్తికి చేదోడుగ మరొక వృత్తినికూడ (ఉప వృత్తినికూడ) చేయగలిగి ఉండడం నేర్చుకోవాలి. వ్యక్తియొక్క సమాగ్రవికాసమునకుకూడా ఇది అవసరము. "ఒకే పని చేతనవును, నాకు రెండోపని చేతకా"దనడం ఆ వ్యక్తియొక్క అసమగ్రతనే తెలియజేస్తుంది. అందువల్లనే కేవలం పొలంపాటుపడే మనరైతులు సాధారణంగా బుద్ధివికాసమును పూర్తిగ పొందియుండకపోవడానికి కారణ మవుతున్నది. కేవలం దుకాణంమీాద కూర్చుని సరుకులు అమ్ముకునే వైశ్యుడు బొర్రపెంచుకొని దుర్బలుడై పిరికివాడై కూడా పోతున్నాడు. అట్లే కేవలం ఇతర చేతిపనులుచేసే సాలీలు, కళాకారులు మొదలైనవారుకూడ దుర్బలులు, పిరికివారు అయిపోతున్నారు.

గ్రామావసరములనుబట్టి, అనేకవృత్తులవారు పుట్టుకు వచ్చారు. గ్రామంలో అట్టివారు లేకుంటే పొరుగూళ్ళనుండి

పిలిపించుకున్నారు. వర్తకులుకూడ ఇందుకే ఏర్పడ్డారు. కేవలం రైతుగ ఉన్నవాడు తన అవసరంకొద్దీ వర్తకునికి లోబడి ఉండవలసివచ్చింది రైతులలో బాగా తెలివితేటలు, ఉపాయాలు కలవారు కొద్దిమంది వర్తకము వగైరా ఇతర సంపాదనలలోకి కూడ దిగారు. ఇతర సంపాదనలలోకి దిగినా వారు తమ భూములను మాత్రం వదిలిపెట్టుకోనవసరం లేకుండ, కూలీలచేతనో, కౌలుదార్లచేతనో సాగుచేయించుకుంటూ భూమిమీద వచ్చే సంపాదనకూడ తమకే దక్కించుకుంటున్నారు

ఈ రీతిగా పనులు విభాగమైతే జరిగింది కాని, తత్ఫలితముల విభాగంమాత్రం జరగలేదు. ఎట్లంటే- పొలంఉన్న వర్తకుడు అటు పొలంలాభంలో భాగం పొందుతున్నాడు. తదితర చేతివృత్తులవాళ్ళలాభంలో భాగమూ పొందుతున్నాడు. కాని, తన వర్తకంలాభంలో మాత్రం వాళ్ళకెవరికీ కవ్వంతైనా భాగం పెట్టడంలేదు. అట్లే భూస్వామి, కూలీలశ్రమవల్ల ఉత్పత్తిరైన లాభంలో భాగం కొట్టుతున్నాడు; వడ్రంగులు వగైరా ఇతరచేతిపనివాళ్ళ మొగాన ఏదో కాస్తపారేసి, వాళ్ళ శ్రమఫలితాలలో విశేషభాగం కాజేస్తున్నాడు; తాను మాత్రం ఇతరులతో ఇతర వ్యాపారాదులవల్ల సంపాదించిన దానిలో దమ్మిడీకూడ భాగం వీరికెవరికీ పెట్టడంలేదు తుదకు తేలిన సారాంశమేమంటే- అందరికంటె ఎక్కువపనిజేసి, అందరికంటే తక్కువలాభం పొందేవాడు పొలంపనిచేసే పనివాడుగా- లేక, ఇతరచేతిపనులుచేసే పనివాడుగా- మాత్రమే కనిపించుచున్నాడు.

ఇప్పుడు చేయవలసిన మార్గమంటే - పనిచేయని భూస్వామిని, మధ్యవర్తిగనున్న వ్యాపారస్థుని తొలగించి పొలంపనిచేసేకూలీని, చేతిపనులుచేసే పనివానిని బానిసత్వము నుండి విముక్తులనుచేసి, స్వతంత్రులనుగా చెయ్యాలని. వారికి తమ కష్టంలో న్యాయమైన భాగం దక్కేటట్లు చెయ్యాలని.

పెద్దపెద్ద యంత్రపరిశ్రమలను ఆపిచేయడానికి నేను ఎవరికీ దమ్మాలు లేకపోబట్టి ఈ పరిశ్రమాధిపతులు దేశ ఆర్థిక వ్యవస్థలో గౌరవస్థానమును ఆక్రమించుకొని కూర్చునియే యున్నారు.

మన హిందూ జాయంటుకుటుంబపద్ధతి రక్తసంబంధం మీద ఆధారపడి యుండెను. ఒక్కొక్క కుటుంబంలో 200, 250 మందికూడ సమిష్టిగా ఉన్నరోజులుండెను. ఇంటివాళ్ళు తలొకపని పంచుకొని చేసుకోడానికి వీలుండేది. ఒకళ్ళు భూమిదున్నుతుంటే, ఒకళ్లు పశువులను చూస్తూఉంటే, ఒకళ్లు ఇంటికి కావలసిన రకరకాలైన వస్తువులు తయారుచేస్తూఉంటే ఒకళ్ళు సరుకులు అంగడికితీసికొనివెళ్ళి అమ్ముకువస్తూ ఉంటే సంసారం యావత్తు చక్కగా కంజాయింపుగా జరిగిపోతూ ఉండేది. అందరూ ఏకకుటుంబీకులు: అందరూ అందరిశ్రమ లాభంలో భాగస్వాములు. కాని, ఇట్టి పద్ధతి నేడు అదృశ్యమైపోయింది. సరిగ్గా ఆమాదిరిగానే నేడు పరిస్థితులను పునరుద్ధరించడం సాధ్యంకాదు. కాని, అందరిసంపాదన అందరు పంచుకోవడమనే ఆనాటి సమిష్టికుటుంబసూత్రం చాలా విలువైనది. దాని నిప్పుడు మనం "బహుళార్థసాధక సహకార

సంఘముల" ద్వారా చట్టములలోనికి తెచ్చుకోవచ్చును. కనుక ప్రభుత్వశాసనములు సంస్కరణములు అన్నికూడ ఈ సంకల్పంతోనే ఇక ఇట్టి సంఘాలచే స్థాపించుకోవాలి.

భూమిసంబంధమైన చట్టాలుకూడ ఈ సంకల్పంతోనే చెయ్యాలి. భూస్వామి, రైతు, కౌలుదారు, పాలికూలి, చేతి పనివాడు, దుకాణదారుడు, పరదేశాలలో సంపాదనకై కొద్ది కాలంపోయినవారు– వీరందరిని ఒక్కటే సమిష్టిసంఘంగా గుదిగుచ్చాలి. వీరిలో ఒకరి సంపాదనలో ఒకరు భాగ స్వాములై ఉండేటట్లుండాలి; మరి వీరిలో ఎవరుకాని పని లేకుండ, పనిచేయకుండ, ఉండకూడదని నియమము ఉండాలి. ప్రతివానికి జీవనానికి సరిపడ ఉండాలనిన్ని వేరుగ చెప్పనక్కరలేదుకదా. ఈ రీతిగా "బహూళార్థసాధక సహకార సంఘ" సూత్రముపై మన ఆర్థిక సాంఘికవ్యవస్థ పునర్నిర్మాణం కావాలి. ప్రజలకీ విషయాలన్నీ బోధించి, వారి నీ ఆదర్శంవైపునకు నడిచేటట్లుగ మార్గం చూపించాలి.

భూస్వామి తాను ఇతరత్రాతో ఇతర ఉద్యోగాలవల్ల, ఇతర వ్యాపారాదులవల్ల సంపాదించుకునే లాభాలలో తన పొలంచేసే రైతుకు కూలివానికికూడ భాగం పెట్టే పక్షంలో ఆ భూస్వామి ఆ పొలంపై తన స్వామ్యత్వమును (ఓనర్ షిప్పును) ఉంచుకున్ననూ ఫరవాలేదు.

అట్లే వర్తకుడు సైతం తన వర్తక లాభాలలో, తన భూమిని సేద్యంచేసే రైతులకు కూలీలకు భాగంపెట్టేపక్షంలో

ఆతడు తన డబ్బును ఎంతైనాసరే భూమిమీదపెట్టుబడిపెట్టి, రైతులచేత కూలీలచేత సాగుచేయించి, ఆ పంటలో భాగం తీసుకోడానికి ఏమీా అభ్యంతరంలేదు.

జాయింటు హిందూకుటుంబంలో ఒక తెలివైన కుర్రవాడు, ఏ లండనో వెళ్ళి డబ్బుసంపాదిస్తాడను కోనండి. ఆ సంపాదనలో కుటుంబంలోని ఇతరులకుకూడ తాను భాగంపెట్టాలి. అట్లే తాను పరదేశాలలో ఉన్నంత కాలంలో ఇంటివద్దవాళ్లు సంపాదించిన దానిలోకూడ తాను భాగం తీసుకోవచ్చును. కుటుంబ మనే దాన్నే ఇంకా కాస్త పెంపుచేసిచూస్తే, యావత్తుగ్రామంకూడ ఇదే పద్ధతిని జాయింటుకుటుంబంగా నడవవచ్చుకదా! అప్పుడు ఒకరిని చూసి ఒకరు ఈర్ష్య, చుప్పనాతితనం, పడనక్కరయుండదు. పైగా అందరి సహాయం అందరికి వస్తుంది. ఇది సహకార సూత్రంమీాదనే జరగడం సాధ్యం. ఇది జరిగిననాడు "గైర్ హాజర్ భూస్వామి"–"తేరసంపాదన"– "దోపిడీ"అనే మాటలే మాయమవుతివి.

50 ఎకరాలకంటె 100, 200 ఎకరాలు సేద్యం చెయ్య డం ఎక్కువలాభకరం చిన్నమందకంటె పెద్దమంద ఎక్కువ లాభాల నిస్తోంది. అయితే, ఇదంతా సహకారసూత్రాల మీాద పనిచేస్తేనే.

నేడు కొత్తగ చేసిన భూమిచట్టాలు సహకారసూత్రా లకు అనుగుణ్యంగా లేకపోతే ఆ లోపాలను తప్పకుండ సవ

రించవలసినదే. నిన్నటివరకు జైహాజిక్ భూస్వాములుగా ఉన్న వారు, నేటినుండి తమ భూములపై యెక్కువ శ్రద్ధచూపి, తమ గ్రామాలలోనే కాపురాలుపెట్టుకొని, సొంతంగా సాగుచేసుకొని, గ్రామ వ్యవసాయమునేకాక గ్రామంలోని తదితర వృత్తులనన్నిటినికూడ పెంపొందించేటట్లు ప్రభుత్వశాసనములు ప్రోత్సహించాలి. అంతేకాదు, రైతు, కూలివాడు, చేతిపనివాడు అందరూ తమ తమ సంపాదల నన్నింటిని కలబోసుకొని తనతోపాటు తన లాభాలుకూడ కలుపుకొని పంచుకునేటట్లుగకూడ ఆ భూస్వామి చూడాలి. అన్నివృత్తులు. అన్ని సంపాదనలు జాయింటు అనే భావించాలి.

భూమి అంటే వ్యవసాయకుడు పడిచస్తాడు. దానిని ఒకపట్టాన వదిలిపెట్టడు. మీరు ఎన్ని "లా"లు చేసినా వాటి నుండి తప్పించుకోడానికి యెన్నో సందులు వెదుకుతాడు. కనుక, ఈ సందులు గొందులుకంటె, అతనికి 'చక్కని రాజ మార్గం'– "సర్వోదయమార్గం" చూపించడం అతనికేకాక, యావన్మందికికూడ క్షేమం. (హరిజన్: 17–10–1948)

# 2

## —:గ్రామ నిర్వహణ:—

(వినోబా)

ఢిల్లీలోఉన్న గవర్నమెంటు మీ ఊరువచ్చి మీకు సౌఖ్యాన్ని యిచ్చిపోదు. మీ ఊళ్లో కొంపలు నిప్పంటుకుంటే హైదరాబాదునుండి జనంవచ్చి ఆర్పుతారా? ఎవరో కొద్ది

మంది వ్యూహాలో కూర్చుని యింతటి బ్రహ్మాండమైన దేశాన్ని నిర్వహించడమంటే మనుష్యమాత్రులవల్ల అయ్యే పనికాదు. కనుక, ఏ గ్రామస్థులు ఆ గ్రామంలోనే కమిటీలుగా ఏర్పడి, గ్రామానికి సంబంధించిన పనులన్నీ నిర్వహించుకోవాలి. గ్రామానికి ఏమేమికావాలో అవన్నీ పరిశీలించిచూచి, వాటి అన్నింటికి తగిన ఏర్పాట్లు సాధ్యమైనంతవరకు ఆ గ్రామంలోనే చేసుకోవాలి. తాగుబోతు దురభ్యాసాన్నికూడ ఈ గ్రామ కమిటీవారే మాన్పించుకోవాలి. పెద్దపట్టణాల్లో, నగరాల్లో, పుట్టుకువచ్చే కీచులాటలు రాజకీయపు ముఠాలు- కాంగ్రెస్, సోషలిస్టు, కమ్యూనిస్టు, వగైరా ముఠాలు- తమఊళ్లోకి పాకి రాకుండా గ్రామస్థులు జాగ్రత్త వహించాలి. ఎన్నికలు వచ్చి నప్పుడు తమ ఇష్టమువచ్చినట్లు గ్రామస్థులు వోటుచేస్తే చేయుదురు కాక; అది వేరే సంగతి; ఎన్నికల రోజులలో బయటినుండి ఎందరెందరో రాజకీయపు ముఠాలవాళ్ళు ఉసుళ్ళవలె ఊళ్ళల్లోకి వచ్చిపడి గ్రామంలో లేనిపోని ముఠాలు చీలదీయడానికి ప్రయత్నిస్తారు. అట్టివాళ్ళకు గ్రామస్థులు నెమ్మదిగ గట్టిగ ఏమని చెప్పాలంటే: "మీ మీ రాజకీయపు ముఠాలతో, కీచులాటలతో, మా కేమీ పనిలేదు. మా గ్రామానికి సంబంధించినంతవరకు మేము కాంగ్రెసువాళ్ళముకాదు, సోషలిస్టులముకాదు, కమ్యూనిస్టులముకాదు,- ఏ ఇస్టులముకాదు.

* మా ఊరును హిమాయత్ గ్రామం అంటారు- మేమంతా హిమాయత్ గ్రామీణులమే- ఇంకేమీ కాదు" అని చెప్పి వారిని పంపించివెయ్యాలి. నే నొక హెచ్చరిక

చేస్తున్నాను- మీరంతా జాగ్రత్తగ ఉండాలి. ఎందుకంటే ఈ రాజకీయపక్షములవాళ్లు మీ ఊరువచ్చి మీలో ఉన్న భాగ్యవంతులమీదికి పేదవాళ్లను ఉసుకొల్పిపోతారు; యజమానిమీదికి కూలిజనాన్ని ఉసుకొల్పిపోతారు; ఒకళ్ళమీద ఒకళ్ళకు రేగకొడతారు. పిల్లిమీద ఎల్లిని, ఎల్లిమీద పిల్లిని. ఎక్కించి చక్కాపోతారు. ఇదిసాగనీయరాదు. "మా గ్రామమంతా ఒకటేనండి, మేమంతా ఏకకుటుంబంగా బ్రతుకుతున్నాము. మాలో భేదాలెరుగము; మీరంతా దేశం మొత్తానికి సంబంధించిన సంగతులెల్లా ఆలోచిస్తున్నారో, మేము మాగ్రామానికి సంబంధించిన సంగతులన్ని అల్లా ఆలోచిస్తున్నాము." అని వారికి చెప్పి పంపివెయ్యాలి. ఈ రీతిగా గ్రామస్థులు గట్టిగ నిలబడి, బయటినుండి ఇట్టి చెడ్డగాడ్పులు ఊరిమీదికి రాకుండా చూచుకుంటే తమ గ్రామంలోని చిక్కులనన్నింటినిఒక్కటొక్కటే తామే సులభంగా తొలగించుకోగలరు.

* (హైదరాబాద్ "హిమాయత్ నగర్"
అనే చోట చెప్పిన ఉపన్యాసభాగం)
(హరిజన్: 20-10-1945)

ఈ ఉపన్యాసం 'హిమాయిత్ నగర్' అనే ఊళ్ళో చెప్పారు వినోబాగారు.

(46)

# 3

## —: సర్వోదయమున కుపకరించు విద్య :—

### (వినోబా)

ఈ మధ్య నేను కొందరు పిల్లవాళ్ళతో ఆట లాడు చుండగా నా కొక సమస్య తట్టింది. వీళ్ళను పైకితీసికొని వచ్చే బాధ్యత, వాళ్ళవాళ్ళతలిదండ్రులమీద వుండాలా లేక మొత్తం గ్రామమంతటిమీద వుండాలా? అని. పేదఇంట్లో పుట్టిన బాలునికి భాగ్యవంతుని ఇంట్లో పుట్టినబాలునికి భేదం లేదు. ఇరువురు పరమేశ్వరరూపములే, ఇరువురు వారివారి తలిదండ్రుల గృహాల సమానంగా వెలిగించే దీపాలే. తల్లి తన బిడ్డను పోషించుకున్నట్లుగ మొత్తంగ్రామం గ్రామం లోని పిల్లలనందరిని చూచుకుంటే గ్రామం మొత్తం అభివృద్ధి చెందుతుంది. సంఘాభివృద్ధికి అదే మార్గం. దానిని మీరు ఆలోచించండి అని మీయెదుట పెడుతున్నాను.

పిల్లలకు కులాలులేవు. భాగ్యవంతుడు పేదవాడు అనే భేదం వాళ్ళకు తెలియదు. వారందరు సమానంగా భగవంతుని సృష్టియే. కాని ధనవంతుడు తన సంగతి తానే చూచుకొని గ్రామంయొక్క సమిష్టిసమస్యలను పట్టించుకోవడం లేదు. తన పిల్లలను చదువులకోసం బస్తీలకు పంపిస్తున్నాడు. పిల్లవాడు బస్తీపోకడలకు అలవాటుపడుతున్నాడు. పల్లెటూరంటే అసహ్యించుకుంటున్నాడు. బస్తీనే తన స్థిరనివాసంగా చేసుకుంటున్నాడు. పల్లెటూరు మనుష్యులతో కలిసిమెలిసి

ఉండలేకపోతున్నాడు. పల్లెటూరులో ఉండి ఆత దేన్నైనా పని చేసాడు. చేసియుండలేడు. పంటరోజులలో పంటతీసికొని వెళ్ళడానికి మాత్రం ఊళ్ళో ముఖం చూపిస్తాడు. పల్లెటూరిలో ఉండక వ్యవసాయంలో పాల్గొనక పోవుటచేత, పంటలో తనకు సరిగా రావలసినది రాక ఇబ్బందిపడుతాడు.

అందువల్ల తనకు గ్రామస్థులకుమధ్య విద్వేషంవర్ధిస్తు తుంది. గ్రామస్థులంతా తనమీదకి ఏకమైతే ఆతనికి కంగారు పుట్టి పోలీసు సహాయం కోరుకుంటాడు. "ఊళ్లో వాళ్ళంతా కమ్యూనిస్టులయిపోయినార"ని మనస్సులో అనుకుంటాడు. వాళ్ళంతా తనకు హాని చేయ తలపెట్టారనిన్నీ అనుకుంటాడు. ఇక పోలీసులు వచ్చి మాత్రమేమి చేస్తారు? వాళ్ళపద్ధతులు వాళ్ళకు ఉండనే ఉన్నవికదా. వాళ్లు ప్రేమతో అభిమానంతో ఏదీ చెయ్యరు. పోలీసువాడి బలమంతా వాడి చేతి లాఠీలోనే ఉంది. తుదకు తేలిన పర్యవసానం ఏమంటే గ్రామమంతా నాశనం కావడమే. తుదకు మిగిలేది మనిషిమనిషికీ మధ్య విద్వేషవిషప్రవాహం. ఈరీతిగా పల్లెలు విద్వేషవిష దేవతలకు తాండవరంగములయినవి. కనుక, గ్రామస్థులు తమ గ్రామము సౌభాగ్యవంతముగ చేసికొనదలచినట్లయితే, తమ యావన్మంది పిల్లలకు తమ గ్రామంలోనే ఉచితమైన విద్యా శిక్షణ చెప్పించుకోడానికి పూనుకోవాలి.

ఈ రీతిగా పిల్లలు గ్రామంలోనే కలిసిమెలిసి సమిష్టిగా శిక్షణపొందితే, పెద్దవాళ్ళయిన తరువాత గ్రామభూమిని

వారు జాయింటుగ కలిసి సేద్యంచేసుకోగలుగుతారు. అప్పుడు ఒకళ్ళను చూస్తే ఒకళ్ళకు బెదురూఉండదు, విద్వేషమూ వుండదు. వారు తక్కినవారితో స్నేహంగా కలిసిమెలిసి బ్రతకగలుగుతారు. 'అంతాకలిసి తిందాంరండ'ని ఆనాడు శ్రీకృష్ణుడు గోపబాలుర నందగును పాలుపెరుగులతో బువ్వంబంతులాడుకుంటూ, చద్దులారగిద్దామురండని బృందా వనంలో పిలిచినట్లుగ పిలవగలుగుతారు. అట్టిగ్రామం గోకుల బృందావనంగానే మారిపోతుంది. భూలోకస్వర్గమే అవుతుంది. గోకులమంటే ఏమిటి అసలు? గ్రామసంపద యావత్తు పాలు కాని, వెన్నకాని, తేనెకాని, చెరుకుగాని, బియ్యంకాని, జొన్నలు రాగులుకాని, ఏదైనాకాని-అన్నీ సమంగా పంచు కొని తినడమేకాదా! దొంగలాగు మనిషి తానొక్కడే తిం దా మనికూర్చుంటే తన అన్నంచుట్టూ మూగేవి ఈగలే! అట్లు కాక, మిగతా తన స్నేహితులందరితో కలిసి, ప్రేమతో పంచుకుతింటే, ఆ అన్నం ఎంతో తీపిగా తయారవుతుంది. మనిషి తనకు తోడివారైన మనుష్యులను ప్రేమించగలడు కాని, ఈగలను ప్రేమించగలడా? అందువల్ల అతనిలోని ప్రేమ లక్షణము పెరగడానికి ఆలంబనలేక కొట్టుకులాడుతుంది. (ప్రాకడానికి ఏదీ పట్టుదొరకక అల్లాడుతున్న తీగెలాగు). అందు వల్ల, అతడు ఏ వేవో వికారపుపనులు చేయడానికి చూస్తాడు. అంటే, ఏ కుక్కనో పిల్లినో పెంచుకుంటూ, దానితో ముద్దు లాడుతూ కూర్చుంటాడు. తీరని తనప్రేమను- కాతిని- ఈ రీతిగా పిల్లులమీద కుక్కలమీద తీర్చుకోడానికి దండు గగ ప్రయత్నిస్తాడు. సరియైన త్రోవను నడవకుండ, వంకర

మార్గాలలోపోతే ఇట్టివే ఏవో వికారపు విపరీతపు పరిణామాలు మరిమరీ కలుగుతూఉంటవి. ఈ వంకరటింకరలన్నీ సరికావడానికి ఒకటే ఉపాయముంది.అదే సమష్టిజీవనం. ఈ విధానం సుందరము, శివమునైన కళ. చిన్నప్పటినుండి అందరూ కలిసి ఒకే స్కూలులో చదువుకోవడం, ప్రార్థించుకోవడం, పనులు చేసుకోవడం, ఆడుకోవడం- ఇవన్నీ మొదటినుండి అభ్యాసంచేస్తే జీవితం సుందరం సౌఖ్యవంతం అవుతుంది.

గ్రామానికి ఏరకం స్కూలు ఉండాలో వినోబా గారిట్లు వివరించారు- స్కూలులో ప్రతివారు- పిల్లలు పంతుళ్లు సహా- కాయకష్టంచెయ్యాలి. ఏదో వస్తువునో ధాన్యాదులనో, ఉత్పత్తిచేసే పనిగా ఉండాలి అది. చేసేపని ద్వారానే వారు జ్ఞానాన్ని విద్యను సంపాదించుకోవాలి. స్కూళ్లల్లో చదువుకునే ధనికులపిల్లలు, తమ కాళ్ళచేతులతో ఉపయుక్తమైన పనిని చేసేశక్తిని, అలవాటును, కోల్పోయినారు. అది విద్యకాదు; అవిద్య. ఎందుకంటె దీనివల్ల మనిషిలోవుండే మంచి మంచి శక్తులన్నీ క్షీణించిపోతున్నవి. అందువల్లనే మన స్కూళ్ళన్నీ ఏదోరకం ఫలవంతమైన కృషితో నిరంతరం స్పందిస్తూఉండాలని గాంధీగారు చెప్పారు. పిల్లలు నాగలి పుచ్చుకొని భూమిదున్నాలి; నూలువడకాలి; దానితో బట్ట నెయ్యాలి. ఈ పనులుచేస్తూ వీటిద్వారానే అనేకసంగతులు నేర్వాలి. ఇదే విద్యఅంటే. ధనికులపిల్లలు, పేదల పిల్లలు, బ్రాహ్మణపిల్లలు, హరిజనపిల్లలు, అందరూ స్కూలులో కలిసి పనిచెయ్యాలి; కలిసి చదువుకోవాలి. అట్టిస్కూలే సాంఘిక

ఆర్థిక అసమానతలులేని నూతనసంఘమునకు పునాది వేయగలదు.

(1951, ఏప్రిల్, 26 తేదీన
తెలంగాణాలో ఒక ఉపన్యాసం)
హరిజన్: 2-2-1952)

విద్యవల్ల రెండుఫలితాలు రావాలి. ఒకటేమిటంటే- తాము చదువుకున్న చదువు ప్రజలకు లాభము కలిగించేటంత పటిష్టంగా ఉండాలి. అంటే, తాము తీసికొన్నదానికి పదిరెట్లు తిరిగి ఇవ్వాలి. విద్యఅంటే విత్తనం నాటడమన్నమాట. మంచిగింజను, మంచిఅదునులో నాటితే వేలకొలది గింజలను అది మరల ఇస్తుందికద. విద్యకూడ ఇట్లే పదిరెట్లు ఫలితాలు ఇవ్వాలి. దానికై వెచ్చించిన శ్రమకు, ఖర్చుకు, పదిరెట్లు ప్రతిఫలితం రావాలి. విద్యవల్ల రావలసిన మొట్టమొదటి ఫలితం ఇది.

ఇక రెండవదేమిటంటే:- విద్యార్థి తన వయస్సుకు తగిన వికాసమును పొందడానికి తగిన దోహదమును విద్య ఇవ్వవలెను. ఆ వ్యక్తిలో గర్భితమైయున్న సర్వశక్తులను మేల్కొల్పి వికసింపజేసే అవకాశాలువిద్య అతనికి ఇవ్వవలెను. మనకు పెద్దలు బోధించిన పరమసత్యమొకటియున్నది- అదే మనగ:-శరీరము, మనస్సు, బుద్ధి- ఈ మూడింటికంటె కూడ వ్యక్తి భిన్నమైనవాడని వారు చెప్పారు. ఇదే మనం నేర్చుకోవలసినవిద్య, ఈ సత్యమును విద్య మనకు తెలియజెప్పక

పోతే, ఆ విద్య అర్థరహితమైనదే. ఎందుకంటే విద్యయొక్క ప్రధానలక్ష్యమేమో భగ్నమైనట్లే. విద్య ప్రధానంగా గుర్తించవలసిన అంశమేమిటంటే, ఈచదువువల్ల తాను నిజంగా వికాసంపొందుతున్నాడో లేదో విద్యార్థి తానే తెలిసికోగలిగి ఉండాలి. అట్టిశక్తిని విద్య అతనికి ఇస్తున్నదో లేదో విద్యావేత్తలు ప్రధానమైన దృష్టితో గమనించాలి. వికాసం పొందడమంటే మానవునిలో సహజముగా నిక్షిప్తమై, పరంపరగా వచ్చుచున్న మహోదార సుగుణ సంపత్తి, మహోన్నతశక్తులు, తనలో నిజంగా వికసిస్తున్నవో లేవో విద్యార్థి తెలిసికోవడమన్నమాట. తన ఈ భౌతికశరీరంకంటె, తనచుట్టునున్న ఈ భౌతికపదార్థజాలముకంటె తాను భిన్నుడను అనే సంగతి విద్యార్థి గమనించడంఅన్నమాట. ఈభౌతికవిషయముల కన్నింటికి తాను లోనుగాక, తన స్థిరప్రజ్ఞతచే వాటినే తనవశంలో విద్యార్థి పెట్టుకోగలగడమన్నమాట. మన ఉపనిషత్తు లేమంటున్నవి:- ఒకవిద్యార్థి అన్నిచదువులుశాస్త్రాలు చదువుకొన్నప్పటికి, విద్యయొక్క పరమార్థమును-అనగ, ఈ భౌతికశరీరమేమిటో, లోపలనున్న అంతరాత్మవికాసమేమిటో ఇవన్ని తెలిసికొని, అనుష్ఠించగలిగేవరకు- అతనివిద్య పూర్తి అయినట్లుకాదు; ఆతడు (గ్రాడ్యుయేటు) స్నాతకుడు కాడు- అని చెప్పినవి మన ఉపనిషత్తులు. కేవలం గ్రంథాలను శాస్త్రాలను వశంచేసుకోవడమేకాక, తన మనస్సునుకూడ విద్యార్థి తన స్వాధీనం చేసుకోవాలి. తననుతాను జయించుకున్నదానికి గుర్తుగ తాను సంకల్పించిన వ్రతాలనన్నిటిని (అనగా చేసిన ప్రమాణాలనన్నిటిని) జయప్రదంగా అనుష్ఠించగలిగి ఉండాలి.

మంచిరౌతు గుర్రాన్ని ఎలా స్వాధీనంచేసుకోగలడో, అలా విద్యార్థి తనశరీరాన్ని మనస్సును, బుద్ధిని, ఇంద్రియాలను సంపూర్తిగ తన స్వాధీనంలో పెట్టుకోగలిగిఉండాలి. తనపై తనకు ఆధిపత్యం- ఆత్మశిక్షణ-తన ఇంద్రియాలను మనస్సును సత్యమార్గాలలో వినియోగించుకోవడం, ఇదీ అన్నింటికంటె ఉత్తమోత్తమమైనకళ. విద్యకంతకు అతిముఖ్యమైన పరమావధి ఇదే. ఈ ఆత్మవశ్యతను సాధించిన వాడే వ్రతస్నాతకుడు. వట్టిచదువులు శాస్త్రాలు చదువుకున్నవాడు విద్యాస్నాతకుడు మాత్రమే.

ఈ రకమైన వ్రతస్నాతకుడైనవాడే ప్రజాసేవచేయడానికి నిజంగా అర్హుడవుతాడు. అతడే సత్ పౌరుడు. అత డెక్కడికి వెళ్ళినా ఏపనికి పూనుకున్నా, ధైర్యస్థైర్యములతో ఆత్మవిశ్వాసంతో ప్రవర్తిస్తాడు. ఈనాటి విద్యార్థి పరీక్షప్యాసైన క్షణంలోనుండి ముందుగతిగానక పెద్దచీకటికోణంలో ప్రవేశిస్తాడు. ఎట్లాగో తంటాలుపడి ఏదో నౌకరీలో ఇరుకుతాడనుకోండి. కాని, అది అతనికి రుచించేదిగా ఉండదు. తన సహజ ప్రజ్ఞకది అనుగుణంగా ఉండదు. తానుపెట్టుకొన్న ఆదర్శానికి తనను చేర్చగలిగేదిగకూడ ఉండదు. పరిస్థితుల తుపాను అతనిని అటుఇటూ త్రిప్పి త్రిప్పి- కొట్టికొట్టి- తుదకు తన జీవితవిమానమును భళ్ళున ఏ కొండబండలమీదో పడగొట్టి ముక్కలు చెక్కలు చేసివేస్తుంది. ఇదంతా కేవలం లాటరీ అయిపోతుంది. కాని, ఇంద్రియనిగ్రహమును సాధించిన వ్రతస్నాతకుడు తనమీద తాను ఆధిపత్యమును నిర్భీతిగా చెలా

యించుకోగలడు. జీవితాన్ని 'సత్యంశివంసుందరం'గా నడిపించే ప్రజ్ఞలన్నీ ఆతడు సంపాదించియే యున్నాడు కనుక అతనికి ఎక్కడికి వెళ్ళినా నిర్భీతి. నాగలిపట్టి వ్యవసాయం చేయగలడు, మగ్గంపట్టినేయగలడు ఒకటేమిటి ఏపని పడితే ఆపని నిరా ఘాటంగా చేసుకుపోగలడు. నా కిది చేతకాదని దేబవలె దిగులుపడి చతికిలబడడు. చేతకాని అనాథవలె మొగంవేలా డేసుకొని ఏడుస్తూ తిరగడు. మొగసిరిగ రొమ్మువిరుచుకొని ఆత్మవిశ్వాసమునిండి తొణికిస లాడుచున్న పూర్ణహృద యంతో ఆతడు తలెత్తుకుని లోకంలో ఎక్కడబడితే అక్కడ ఎట్టిఘట్టములోనైనాసరే, తిరగగలడు.

అంటే ఆతడు గర్విష్ఠిగ, పొగరుబోతుగ ఉంటాడని కాదు అర్థం. అతనిలో నమ్రతకూడ ఉంటుంది. ఎందుకంటె, నిజమైనజ్ఞానం సంపాదించినవాడు తాను నేర్చిన విద్య అత్యల్పమనిన్నీ, జ్ఞానం అంతులేనిసముద్రమనిన్నీ గ్రహించి నమ్రభావంతోనే అణిగిఉంటాడు.

నమ్రతతోపాటు అతనికి దృఢసంకల్పం, ఆత్మవిశ్వాసం, గట్టితనం, నిర్భీతి మొదలైనవికూడ ఉంటవి. అనగా "బుద్ధితో పాటు "ధృతి" కూడా ఉంటుంది. అందువల్ల ఆతడు జీవిత రంగంలో సద్గుణవంతుడైన వీరుడుగా ప్రవేశిస్తాడు. ఈ ఆత్మ విశ్వాసం, ధృతి అనేవి విద్యవల్లనే రావలసియున్నవి. ఇవ్వి అతనికి అబ్బితే ఆతడు లోకానికి సేవచేయగలుగుతాడు. జీవితం అతనికొక బరువుగ కనిపించదు. నేర్చినవిద్య కొద్ది

దైనా, ఆతనికి సంపూర్తియైన ఆత్మతృప్తి ఉంటుంది. విద్య కూడ అన్నంవలెనే తక్షణం తృప్తినిస్తుంది. తినడం ప్రారంభించిన మొదటిముద్దనుండికూడ నీకు సంతోషం ప్రారంభ మవుతుంది. సంతోషం కలగడమనేది తినడం ప్రారంభించిన రెండుమూడురోజులదాకా వాయిదా పడదు. సంతోషం మొట్టమొదటి ముద్దతోనే తక్షణమే ప్రారంభమవుతుంది. జ్ఞానార్జనలోకూడ ఇదేపద్ధతి. తాను నేర్చుకొన్నది ష స్వల్పమో అగుకాక, అయినా "అది నేర్చుకున్నాను" అనే స్ఫురణ మనిషికి కలగగానే ఆతని ముఖం కాంతివంత మవు తుంది. ఇంకా నేర్చుకోవాలి అనే దాహం పుట్టుకువస్తుంది. తనకాలమంతా దండగై పోతుంది అని అతడు అనుకోడు. ఈచదువులపీడ ఎప్పుడు అయిపోతుంబా, ఎప్పుడు పుస్తకాలు అవతలపారేసి హాయిగ తిరుగుదామా అని ఆతడు అను కొనడు. జ్ఞానమనే పాతాళగంగనీరు కాస్త రుచిమరిగితే నిజంగా వాడు దానిని వదలిపెట్టడు ఇంకా ఇంకా జీవి తాంతంవరకు దానిని త్రాగుతూ ఉండాలనే కోరుతూ ఉంటాడు. విద్యార్థిదశపూర్తియై గృహస్థాశ్రమంలో ప్రవే శించిన తరువాతకూడ విద్యార్జన మానకుండా సాగిస్తూనే ఉండాలని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. బ్రహ్మచర్యాశ్రమం తరువాతది గృహస్థాశ్రమం. అనగ బ్రహ్మచర్యాశ్రమపుచదువు కంటె, పైమెట్టుచదువు గృహస్థాశ్రమమన్నమాట. (అంతే కాని బ్రహ్మచర్యాశ్రమంతో చదువు సంపూర్తి అనికాదు అర్థం) కనుక, గృహస్థుకూడ సదావిద్యార్థియే. అంతకంతకు ఆతడు పైచదువులు, ఎక్కువ ఎక్కువ విద్య, ఎక్కువ

ఎక్కువ జ్ఞానం సంపాదించుకుంటూనే పోవాలన్నమాట. దీనికి అంతు అనేదిలేదు. ఈ రీతిగా తనజ్ఞానాన్ని విద్యను పెంచుకుంటూ పోతున్న గృహస్థు తాను సంఘానికి నేరుగా చేయగలిగిన సేవ యేదో చేస్తూనే ఆ సంఘాన్ని సత్పథంలో నడిపించడానికి కూడ తోడ్పడుతాడు. తాను అధ్యయనం చేసుకోడానికి తనఇంట్లో ప్రత్యేకమొక పవిత్రమైన చోటును కేటాయించుకుంటాడు ఈరీతిగా విద్యార్థిదశ అయిపోయిన తరువాతకూడ ఇంకా విద్య సాధించవలసిందే అని ఉపనిషత్తులు స్పష్టంగా నిర్దేశించియున్నవి. ఆమరణాంతము విద్యార్జన సాగుతూ ఉండాల్సిందే. జ్ఞానగంగ చవిచూచినవాడు దానిని వదలిపెట్టగలడా? తాను చదువుకోవడం, ఇతరులకు చెప్పడం (స్వాధ్యాయము, ప్రవచనము) ఈరెంటిని ఉపనిషత్తులు లింకుచేసిపెట్టినవి. ఇతరవిధ్యుక్త ధర్మములతోపాటు ఈరెండుకూడ జ్ఞాని సాగిస్తూ ఉండవలసిందే. ఋతం, సత్యం, తపస్సు ఇవి వేర్వేరుగా చెప్పలేదు. ఇవన్నీ కలిపి ఏకంగా అవినాభావంగానే మన ఉపనిషత్తులు నిర్వచించినవి. "సత్ప్రవర్తన (ఋతం కలిగిఉండు; చదువుకో, చదువుచెప్పు, తపస్సు చెయ్యి-చదువుకో, చదువు చెప్పు, లోకసేవచెయ్యి+చదువుకో చదువుచెప్పు, నిత్యాగ్నిహోత్రిగ ఉండు - చదవుకో చదువు చెప్పు, అని ఈ రీతిగా ప్రతిపనికి "చదువుకో చదువుచెప్పు" అనేది విడరాని పల్లవిగానే ఉపనిషత్తులు గానముచేసి మనకు వినిపించినవి.

ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ (సత్ప్రవర్తన)
సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ (సత్యం)
తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ (తపస్సు)
మానుషం చ స్వాధ్యాయప్రవచనే చ (లోకసేవ)
అగ్నిహోత్రంచ స్వాధ్యాయ ప్రవచనేచ

(నిత్యాగ్నిహోత్రకార్యం)

(స్వాధ్యాయము=తాను చదువుకోవడం;ప్రవచనము= ఇతరులకు చెప్పడం.

(తైత్తిరీయోపనిషత్, తొమ్మిదవ అనువాకం)

దీని సారాంశమేమి? గృహస్థు జ్ఞానార్జనను జ్ఞాన దానమునున్నకూడ తదితర గృహస్థధర్మములతోపాటు విడువక సాగిస్తూనే ఉండాలని దీనిసారాంశము.

మనం స్వరాజ్యం సంపాదించుకున్నాము. దానితో అనేకబాధ్యతలు మననెత్తిమీద పడ్డయి. ప్రతిశాఖలోను మంచి ప్రవీణులైన వారుంటే తప్ప ఈ బాధ్యతలను మనము సంతృప్తికరంగా నెరవేర్చలేము. జ్ఞానమనేది మహారణ్యం; దానిలో ప్రతిశాఖలోను ఏమేమి ఉన్నదో బహుజాగ్రత్తతో మెళుకువతో శ్రమించి పరిశోధించి పరిశీలించగలిగితే తప్ప మనదేశం ముందుకుపోలేదు. కాని ఇంతశ్రద్ధ తీసికొని కష్టించి పరిశోధించే విద్యావంతులు అట్టేమంది నాకు దేశంలో కనిపించడంలేదు. దీనికిముఖ్యకారణం నేటి పనికి మాలిన విద్యావిధానమే. ఈరకపు విద్యావిధానపుగాడిలోపడి

ఒకడు అయిదేండ్లు కొట్టుకుకొట్టుకు బయటపడేటప్పటికల్లా వాడి ఉత్సాహమే. పోయి, వట్టి ఎండుకర్ర అయిపోతాడు. శరీరదార్ఢ్యమూ తగ్గిపోతుంది; మానసికశక్తులూ కుంటుపడ్డాలు పూస్తవి! జ్ఞానేంద్రియద్వారములు మూతపడతవి; అన్నింటి కంటె అధ్వాన్నమేమిటంటే, అసలు వాని జీవసత్వమే భగ్నమైపోతుంది. ఇక ఆత్మ అంటే ఏమిటో కూడ వానికి లీలమాత్రంగానైనా గోచరమే కాదు. అది బొమికెలతో చర్మముతో కూడిన ఈ దేహంకంటె భిన్నమైనదిరా అని చెబితే మాత్రం వానికేమి అర్థమవుతుంది? ఈ సంగతులన్నీ వాడికి అయోమయం అంధకారం! ఇక తనఇంద్రియాలను తన కంట్రోలులో పెట్టుకోలేనివాడు-అసలు ఆ కంట్రోలులో పెట్టుకోవడం అంటే ఏమిటో అర్థంకానివాడు-దేశానికి ఏమి సేవ చేస్తాడు? ఆ చదువు ఎందుకు పనికివస్తుంది?

(సికిందాబాదులో ఉపన్యాసం
హరిజన్: 14-7-1951)

# 4

## వయోజనవిద్య

### వినోబా

ప్రతి ఊళ్ళో విజ్ఞానప్రదమైన గ్రంథపఠనం ఉండాలి. బ్రతకడానికి రోజూ తిండిఎలా అవసరమో, మనస్సుకుకూడ విజ్ఞానం అవసరం. దేహానికి అన్నం ఆహారమైతే, మనసుకు

జ్ఞానం ఆహారం. తులసీరామాయణము, గాంధిగారి ఆత్మకథ, గీతాప్రవచనం ఇలాంటి గ్రంథాలు ప్రతిరోజు పఠించుకోవడానికి గ్రామంలో తగు ఏర్పాటుచేసుకోవాలి. రైతుకు రోజల్లా ఏదో కాయకష్టపుపని ఉంటూ ఉంటుంది. అతనికి చదువుకోడానికి తీరిక ఉండదు. చదివితే కండ్లకుకూడ జబ్బుచేయవచ్చును. అందువల్ల ప్రతిగ్రామంలో అందరూ కూడే బహిరంగప్రదేశంలో గ్రంథపఠనమునకు ఏర్పాటు చేసుకోవాలి. మంచిసంగతులు వింటూఉండడానికి అలవాటుపడితే, గ్రామం అచిరకాలంలోనే బాగుపడుతుంది.

(హరిజన్: 2-2-1952)

# 5

## సర్వోదయం - దాని స్థూలరూపం

(వినోబా)

సర్వోదయముయొక్క స్థూలరూపం చెప్పవలసినదని మిత్రులు అడగగా, వినోబా గారిలా చెప్పారు:—

గ్రామాలు స్వయంపోషకంగా ఉండాలి. ధరల ఒడుదుడుకులకు గ్రామం గురికాకూడదు ముడిపదార్థాలు స్థానికంగా దొరికేటట్టయితే ఏగ్రామానికి కావలసిన తయారీ సరుకులు ఆగ్రామంలోనే తయారు చేసుకోవాలి. యంత్రాలుంటే అవి గ్రామం మొత్తానికి సమిష్టిగ చెందాలి. సరుకు ఉత్పత్తి చెయ్యడానికి, ఆ సరుకు వినియోగ పడేదానికి మధ్య

దళారీ యెవడూ ఉండకూడదు. అహింసమీద ఆధారపడే సంఘం మధ్యదళారుల ద్వారా నడవజాలదు. ఇట్టి సంఘం నిర్మాణం కావాలంటే, గ్రామపరిశ్రమలు పెంపొందాలి. అందరూ పనిచెయ్యాలి; అందరూ తిండితినాలి. జాయింటు కుటుంబపద్ధతిగా దేశము మొత్తము యొక్క ఆర్థికవిధానం రూపొందాలి. రాష్ట్రం అందరికీ పని (తిండి) కల్పించేటట్లయితే, దానిని ఉపయోగించుకోవాలి. "దేశం మొత్తానికి ప్లాను వేయలేను; కొంతమంది లాభానికే వేయగలను" అని ఎవరన్నాఅంటే, నేను చెప్పే దేమంటే (నేను కాస్సేపు కమ్యూనిస్టును అని అనుకొని ఆ 'కొంతమంది' అనేవారు) పేదవారుగా ఉండాలని నేనంటాను. పేదవారి లాభానికే మీప్లానులన్నీ రూపొందాలి. ఇది క్లుప్తంలో నేను చెప్పే సర్వోదయస్థూలరూపం

(హరిజన్ 2-3-1952)

## 6

### ఆర్థిక సమత

(జే. సి. కుమారప్ప)

ప్రప్రథమంలో భూమిని వ్యవసాయదారునకు సుమారు పదేండ్లకు సాగుచెయ్యవలసినదిగ ఇవ్వాలి. ఈ పదేండ్లలో అతడు వ్యవసాయంలో చూపిన చాకచక్యమును సమర్థతను బట్టి, మరొక పదేండ్లకు భూమిని అతనికే ఇవ్వవచ్చును. అట్లే ఆతడు చూపించిన సమర్థతనుబట్టియే ఆతనికి ఇచ్చే

భూమియొక్క విస్తీర్ణమును హెచ్చించవచ్చును. లేదా తగ్గించవచ్చును. ఇంతవరకు సాగుచేస్తున్నవారందరి భూములు గ్రామసంఘానికి చెందుతవి. గ్రామసంఘమే మరల ఈ భూములను ఎవరెవరి కివ్వవలెనో కొత్తగ నిర్ణయిస్తుంది. పంటను ఏరీతిగా సైకెలుచెయ్యాలో గ్రామసంఘమే అట్టడుగున సాగుచేసిన వ్యక్తులతోను, పైనున్న జిల్లా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వములతోను సంప్రదించి మరీ చేస్తుంది.

ఈ రీతిగా గ్రామసంఘం నిర్ణయించిన ప్లానును ప్రతి వ్యవసాయదారుడు అనుసరించాలి. గ్రామభూమియొక్క సారాసారములను బట్టి, ప్రజల ముఖ్యావసరములనుబట్టి; ఏ ఏ పంటలు ఎంతంత ఏరీతిగా పండించాలో గ్రామసంఘము నిర్ణయిస్తుంది. సుమారు 15, లేక 20 గ్రామాల అవసరాలను దృష్టిలో పెట్టుకొని జీవితావసరమునకైన ప్రధానవస్తువులలో ఈ 15, 20 గ్రామాల ప్రాంతం స్వయంపోషక మయ్యేటట్లుగ చూచుకోవాలి. ఈ ప్రాంతానికి సరిపడగా మిగిలినదే బహుళార్థసాధక సహకారసంఘాలద్వారా అమ్ముకోవాలి. ఆ యా సరుకు ఉత్పత్తిచేయడానికి ఎంతెంతఖర్చు అవుతుంది అనే సమస్య ఈ సహకారసంఘమే తేలుస్తుంది. ఎలా అంటే, ఒకవస్తువును, ఒకానొక ప్రమాణంలో—(ఒకపుట్టెడు ధాన్యం అనుకోండి) ఉత్పత్తిచెయ్యాలంటే, ఎంతమంది మనుష్యులు ఎన్నిగంటలు పనిచేస్తే అవుతుంది అని లెక్కకట్టుతారు. ఈ లెక్క ఆధారంమీదనే ఆ యా సరుకులయొక్క ధరలు నిర్ణయమవుతూఉంటవి. ఈ ధరల ప్రకారమే ఆ యా వస్తువు

లను గ్రామంలోని వ్యక్తులు, సహకార సంఘం ద్వారా ఇచ్చి పుచ్చుకొంటూ ఉంటారు. (ఇది వస్తుమార్పిడి పద్ధతి; దీనిలో డబ్బుయొక్క అవసరం ఉండదు) గ్రామంలోనుండి బయటికి వెళ్ళే ఎగుమతులుకాని, గ్రామంలోకి వచ్చే దిగుమతులు కాని బహుళార్థసాధక సంఘంద్వారానే తప్ప, ఇంకొకరీతిగా జరగడానికి వీలులేదు. ఈ సంఘం ప్రధానంగా డబ్బు పెట్టుబడి పెట్టేదిగ ఉండదు. ఆయాపరిశ్రమలను, పరిశ్రమలద్వారా వివిధరకముల వస్తూత్పత్తిని ప్రజలచేత ప్రోత్సహించి చేయించే సంస్థగ ఉంటుంది; క్రియాత్మకమైన సంస్థగ ఉంటుంది; అట్లే ఆయాసరుకుల క్రయవిక్రయములుకూడ జరిపించుతుంది. ఎరువులు తయారుచేయిస్తుంది; గ్రామంలోని భూసారం (నేలలోని ఎగుడుదిగుడు లెవెల్సువల్ల) కొట్టుకొని పోకుండ, తగురీతిగా కట్టలువేయించి కాపాడుతుంది. నదులకు వాగులకు కట్టలువేసి నీరు సాగుకు మలుపుతుంది; గ్రామంలోపలి రోడ్లు గ్రామస్థులే ఉత్సాహంతో నిర్మించుకుంటారు. దానికి కావలసిన కంకర బండరాళ్ళు వగైరాలు మాత్రం పైనున్న ప్రభుత్వం ఇస్తుంది. భూమిలేనికూలీలను సంఘటితపరచి వారి హక్కులేమిటో, విధులేమిటో వారికి బోధించాలి.

స్వదేశీ ఉద్యమమును - లోగడ అవలంబించినదే - మరల పునరుద్ధరించాలి. స్వదేశీఅంటే, ప్రప్రథమంగా మనకు దగ్గరలో ఉత్పత్తియైన వస్తువులే అని అర్థం. ఇవి లేనప్పుడే ఇంకా కొంచందూరంవెళ్ళి, దూరప్రాంతాలలో తయారైన వస్తువులు కొనుక్కోవాలి. విదేశీసరుకులు వీలైనంతవరకు-

ప్రజలు కొనుక్కోవడం మానివేయ్యాలి. ఇది మానివేస్తే సరిపోయిందా? ఏమిచెయ్యకూడదో అంతవరకే యిప్పుడు చెప్పడమైనది. ఇది ఒకభాగం. ఇక, మనం చురుకుగ ఏమిచేసు కోవాలో కూడా ఆలోచించాలి. విదేశీసరుకుకు ప్రత్యామ్నాయంగా తత్తుల్యమైన వస్తువులను ఇక్కడ మనమే చేసు కోవడం ఎలాగో తీవ్రంగా ఆలోచించాలి ఇది రెండవభాగం. ఇందునుగూర్చి విశేషంగా పని జరిగినతరువాత విదేశీవస్తువ్రలను తగులబెట్టడమనే ప్రోగ్రాంవస్తే రావచ్చు. అయితే దీనికి ముందుగా ఎంతో పనిజరిగి వేలకొలది జనం పైన రెండురీతులుగ చెప్పిన స్వదేశీవ్రతమును అనుష్ఠించవలసి ఉంటుంది. ఈ ప్లానుప్రకారం భూమి పునర్విభజన జరిగి స్వదేశీతత్వం వంటబట్టితే, అందరికి పూర్తి అయినపని, అన్నం దొరుకుతుంది. దేశసంపద అందరికి న్యాయముగా పంపిణీఅవుతుంది. ఈ రీతిగా మనం ఆర్థికసమతను స్థాపించుకోగలుగుతాము.

(మధ్యప్రదేశ్‌లో 'సెల్టో' అనేచోట చెప్పిన ఉపన్యాసంనుండి)

హరిజన్: 24-1-1953

# 7

## -: సర్వోదయపద్ధతిగా జరిగే ప్లానింగ్ :-

(కే. జీ. మష్రూవాలా)

ఇండియా పురోభివృద్ధిని సర్వోదయపద్ధతిగ ఏ మూల సూత్రాలప్రకారం సాధించడానికి వీలవుతుందో ఈ దిగువ ఆలోచించి చూద్దాము:—

(1) 'ప్రాణి' అనే ప్రతిదానిమీద (అది మనిషి కాని పిపీలికాది తదితర తిర్యక్ రకముదికాని) ఆదరాభిమానము లుండడమనేది సర్వోదయముయొక్క ప్రప్రథమమూల సూత్రము. ఇండియా పురోభివృద్ధి పొందవలెనంటే- ఇక్కడ ఉన్న ఈ ప్రాణులన్నీ (మానవులు తిర్యక్కులు కూడ) ఆరోగ్యవంతముగ, పుష్టికరముగ, సర్వతో సుఖముగ తమ శరీరమునే కాక, వ్యక్తిత్వమునుకూడ పెంపొందించుకోవడమన్నమాట. అయితే, తిర్యక్ ప్రాణుల పురోభివృద్ధి, అవి మానవజీవితముతో విడరాని భాగములుగ పెనవేసుకొని యున్నంత మేరకే వర్తిస్తుంది. ఈ తిర్యక్ జంతువులలో మనిషితో పెనవేసుకొన్న జంతువు ప్రధానంగా గోవు.

(2) మన చుట్టునున్న ప్రకృతిలో అనేక సహజసంపద లున్నవి. ప్రాణుల పురోభివృద్ధికి ఇవ్వి ప్రధానమైన సాధన లుగఉన్నవి. కనుక, ఈ సంపదలను పెంపొందించకుండ నిర్లక్ష్యము చేయరాదు. అయితే, ఈ రెంటిలో- అనగ ప్రాణుల వికాసము, ప్రకృతిసంపదల వికాసము- అనే ఈ రెంటిలో ఏది ప్రధానమనేటట్లయితే ప్రాణుల వికాసమే మున్ముందుగ ప్రధానమని చెప్పాలి. ఎందుకంటె, సాధించవలసినపని ప్రాణుల వికాసము - ప్రకృతిసంపదలవికాసము ఆ పనికి సాధనము మాత్రమే. కనుక, ప్రకృతిసంపదల వికాసంకోసం, ప్రాణుల వికాసమును మట్టుపెట్టరాదు; అయితే, దేనికైనాకానీ, ప్రకృతిసంపదలను దుబారాగా, దండుగగ పాడుచెయ్యడ మనేది మాత్రము పనికిరాదు. అంటే, పైకి చైతన్యరహితంగా

కనిపించి, నోరులేనిదికదాఅని చెప్పి ఆ ప్రకృతిసంపదనైనా మనము దోచుకోరాదు. మానవుడు తనచుట్టునున్న ప్రకృతి పరిసరముల ప్రభావముచేతనే తరుచు ప్రవర్తించుచూ,ఒక్కొక్కప్పుడు దానికి బానిసగకూడ అయిపోతున్నప్పటికి, కొసకు ఆతడు తత్పరిసరముల సృష్టికే కారకుడై వానికి యజమాని (ప్రభువు) కూడ అవుతున్నాడు; అంతేకాని, తత్ పరిసరములు సృష్టించిన బిడ్డగ తాను అయిపోవడంలేదు. అందువల్లనే, మానవవ్యక్తివికాసమును ప్రకృతివికాసమునకు లోబడియుండునదిగ చేయరాదని చెప్పడం మానవుని తోడ్పాటుతో మానవవికాసంకోసమే- ప్రకృతిసంపదను వికసింపజేయవలెనే కాని, ప్రకృతివికాసంకోసం మానవుని వట్టి పరికరంగా చేసి కూర్చోబెట్టరాదు.

(౩) అందువల్లనే ప్రతిసంఘంయొక్కయు, ప్రతి గవర్నమెంటుయొక్కయు, ప్రప్రథమకర్తవ్యమేమంటే - తన సంఘంలో తన రాజ్యంలో ఉన్న ప్రతి మానవునకు తనకు తత్క్షణం అందుబాటులోఉన్న ఏదో ఒకపనిని, ఏదో ఒకసాధనను ఆతని శక్తికి అనుగుణ్యమైనదానిని చూపించి ఆతనికి జీవనాధారం ఏర్పరచడం- ఇదే ప్రథమకర్తవ్యం. ఆ పనిని, ఆ సాధననుకూడ అతనికి ఉపయోగపడేటట్లు క్రమాభివృద్ధి నొందించవలెను; మరియు ఆతనితోడ్పాటుతో తదితరులందరి శ్రేయస్సుకొరకైకూడ- ఆ శ్రేయస్సునకు ఉపకరించురీతిగా ఉపకరించు మేరకు మాత్రమే- దానిని వృద్ధినొందింపవలెను.

(4) జీవితమును రెండు భాగములుగ చూడవచ్చును. ఒకటి బాహ్యజీవితము; రెండవది ఆంతరజీవితము; ఈ రెంటికి

గల తేడా గమనించవలెను. ఈ రెంటిలో ప్రధానముగ ఎంచుకోవలసినది అంతరజీవితము. బాహ్యజీవితపు స్థా (స్టాండర్డు) పెరగడంవల్ల అంతరజీవితపు స్థాయి ఒక్కొక్కప్పుడు పడిపోవడంకూడ కలుగవచ్చును. అప్పుడు మనిషి భౌతికంగానేకాక, నైతికముగ, మానసికముగ, ఆధ్యాత్మికముగకూడ పడిపోతాడు. తద్వారా ఈ అంతరశక్తులన్నియు కూలిపోతవి. కనుక, ప్రకృతిని వికసింపజేయడమనేది మానవుని అంతరజీవితపుదర్జాను పెంచేదిగా ఉండాలికాని, కేవలం బాహ్యజీవితపు దర్జాను పెంచేదిగా ఉంటే లాభంలేదు.

(5) ఏ ప్రణాళికనుగాని (అనగ ప్లానునుగాని) రూపొందించడమనేది రెండు విషయములు. దృష్టిలో పెట్టుకొని చెయ్యాలి. ఒకటి:- మానవునివికాసమునకు అడ్డువచ్చే అడ్డంకుల నన్నింటిని-అవి మనిషి తెచ్చినవేకాని, ప్రకృతిసిద్ధమైనవే కాని- ఏవైనాకాని, తొలగించవలెను. రెండు:- మానవుని వికాసమునకు తగిన శిక్షణనిచ్చి, అతని కా త్రోవచూపే ఉపాయాలన్నీ కనిపెట్టి, వాటి అనుసరణకు తగు ఏర్పాట్లు చెయ్యాలి.

(6) మానవుని వికాసమునకు అడ్డువచ్చే అడ్డంకులేవనగా:- (1) ప్రభుత్వము చేతిలోసంపదుత్పత్తి అమితముగా కేంద్రీకృతమవడం. (2) భూమి దానిని సొంతంగా సేద్యముచేయని ఏ కొద్దిమందిచేతులలోనో, ప్రాణంలేని యంత్రంలాగు పని చేసే గవర్నమెంటుచేతులలోనో, లేక ఏ కంపెనీచేతులలోనో సొంత ఆస్తిగ చిక్కియుండడం; దానిని వారు తమ ఇష్టము

వచ్చినట్లు వినియోగించుకోవడం; తద్వారా "గైర్ హాజరీ భూస్వామ్యతత్వము" ఏర్పడడడం; (3) డబ్బే ప్రధానంగా ఉన్న ఆర్థికవ్యవస్థ ఏర్పడడం; అది కేవలం లాభసాటి వ్యాపారాల కోసం సాధనముల కోసం మాత్రమే చూచుకొని మానవవ్యక్తి యొక్కయు, సంఘముయొక్కయు అవసరములు చూడక పోవడం; పల్లెల నుండి ముఖ్య పరాన్నభుక్కులగు ఎందరో తయారుగా ఏర్పడడం; (4) అనేక కొత్తకొత్త రీతులుగ బానిసత్వం తిరిగి అవతారమెత్తడం, (5) వడ్డీ వ్యాపారమనేది ఏర్పడడం- దానిద్వారా పెద్దపెద్ద ధనరాసులకు వడ్డీవ్యాపారస్థులు, భూములుసొంతంగా దున్నని గైర్ హాజర్ భూస్వాములు, సొంతంగా చేతిపనులు చేయని ధనికపారిశ్రామికులు, అధిపతులై కూర్చుండడం; (6) సామాన్యమానవుని ఆరోగ్యమును, శౌచవిధులను, వైద్యశిక్షణమును సామాన్యవైద్య పరికరములను, మూలికలను, మూడిఓషధులను ప్రభుత్వమేగాక సంఘంలోని పైతరగతులవారు సైతము నిర్లక్ష్యముచేసి పాడు చేయడమే కాక- కొత్తకొత్త దురభ్యాసములను వ్యాసనములను భోగలాలసములను, ఆకర్షణలను ఎన్నెన్నో కల్పించి కొత్త సాంప్రదాయాలు, కొత్తహక్కులు, మిరాశీలు స్థిరపరచడం- ఇవన్నీ చేరి భారతజాతిని నానాటికి ఆయురారోగ్యైశ్వర్యములలో తీసికట్టుగ చేయడం- (7) వ్యక్తికి ప్రమేయంకాని హక్కుకాని లాభంకాని లేని రాచకీయ ఆర్థిక సాంఘికవ్యవస్థ నొకదానిని తయారుచేసి అతనిని దానికి కట్టివేసి కదలమొదలకుండ అష్టదిగ్బంధనచేయడం.

## సర్వోదయపద్ధతిగా జరిగే ప్లానింగ్

(7) అడ్డులేకుండా మనచేత కోరుకోబడేవాటికి యితర దేశాలు తేరగా మనచేతికి చిక్కితేతప్ప, మనసంస్కృతి ననుసరించి కలనెంతగా మనం వికాసంపొందడం మునుపటికి పై పేరాలో వివరించిన అడ్డంకులు తొలగించుకోవాలి. మన ప్రజలలో – ప్రతిఒక్కవ్యక్తి కూడా అనుభవించే – కనీసం మెజారిటీసంఖ్యాకైనా శ్రేయస్సును సమకూర్చలేము. ఈమాట ముఖ్యంగా దట్టమైన జనాభాగల దేశాలకు వర్తిస్తుంది. నిర్వ్యాపారత, నిరుద్యోగత, విపరీతపుధరలు, ఇరుకైన వసతి అమానుషమగు బ్రతుకుబాటలు, రోగాలు, జాడ్యాలు. పేదరికాలు, కడుపుమండించే ఆకల్లు, ప్రజానీకముల బానిసత్వము, స్త్రీలకు భద్రతలేని లజ్జాకరపరిస్థితులు, బందిపోట్లు, దొంగతనాలు, వ్యాపారాలలోను సర్కారుకచేరీలలోను లంచాలు – ఇవన్నీ స్థిరంగానే ఉండిపోతవి; మరి ఇంకా హెచ్చుపెరిగి కూడా పోతవి. అంగళ్ళల్లో, ఫ్యాక్టరీలలో సరుకులుచూస్తే విపరీతంగా గుట్టలు పెరిగిపోవచ్చుకాక – ఆహారపదార్థాలు కూడ కొల్లలుగ ఉత్పత్తిఅయియుండవచ్చుకాక, అయినప్పటికి లేమిడి, అసంతృప్తి, ఆకలిమంటలు అలాగే ఉండిపోతవి. వ్యక్తియొక్క ప్రజ్ఞావిశేషములు వికాసము చెందడానికి అవకాశములు మృగ్యమైపోతవి.

(8) ఎక్కువ ఏమీ చెయ్యలేకపోయినా, గవర్నమెంటు కనీసం అడ్డంకులు తొలగించడానికైనా వీలైనంతత్వరగ ప్లానులు రూపొందిస్తే కొంతకుమేలే. త్వరగా కాకపోయినా నెమ్మదిగానైనా ప్రజలు కోలుకుంటారు. ఈఅడ్డంకులు తొల

గించడంతోపాటు, ఇంకా అదనంగా గవర్నమెంటు ప్రజలకు తోడ్పడదలచుకుంటే మరీ మేలు. దీనికిగాను సర్కారు తాము వేసే ప్లానుల నన్నింటిని సద్యః ఈ దిగువసంగతులు దృష్టిలో పెట్టుకొని వేయడం మంచిది. (1) ప్రజలకు లభ్యమయ్యే తిండి పుష్టికరము, ఆరోగ్యకరము, సమగ్రముగాను ఉండాలి. ఈ విషయంలో దేశం స్వయంపోషకముగ- ఇంకా కొల్లలుగా కూడ- ఉండాలని చెబుతాను. పుష్టికరమైన ఆహారంలో మనకుగల స్వయంసమృద్ధి మీాదనే మన పూర్ణస్వరాజ్యం కొరకు ఆధారపడిఉంటుంది; అంతేకాని, మన ఆయుధబలం మీాదకాదు. కనుక, మనప్లానింగ్‌లో అన్నివిషయములకంటె మున్ముందుగ ఇదే మొదటి పద్దుగ ఉండాలి. (2) దేశంలో ఆహారం కోకొల్లలుగ ఉండడమేకాక అది ఎక్కువదూర ప్రాంతాలనుండి దిగుమతిచేసుకోనక్కరలేకుండ, ఎక్కడికక్కడే ప్రతివారికి దగ్గిరలోనే లభ్యమయ్యేటట్టుగ ఉండాలి. అనగా, ఎక్కడి కక్కడ స్వయంసమృద్ధమైన ప్రదేశాలు (యూనిట్లు) ఉండాలి. వానిలో సర్వసామాన్యముగ ఒక్కొక్క గ్రామమే ఒక్కొక్క స్వయంసమృద్ధమైన యూనిట్‌గ ఉండాలి (3) పని చేయగల ప్రతిమనిషికి ఈ ఆహారం ముష్టిగా, దాక్షిణ్యంగా యిచ్చేదిగాకాక, గౌరవప్రదమైనరీతిగా లభ్యమయ్యేటట్లు ఉండాలి. అంటే, ప్రతివాడు పనిచేసియే తిండితినడం గౌరవ ప్రదమైన పద్ధతి కనుక. పనిచేయశక్తియున్న ప్రతివానికి పని చూపించాలి. నిర్వ్యాపారత నిరుద్యోగత అనేవి ఉండరాదు. స్వయంసమృద్ధ పద్ధతిని ఆహారం ఉత్పత్తిచేసే ప్లానుతోపాటు, ప్రతివానికి పనిపెట్టే ప్లానుకూడ లింకు చెయ్యాలి. (4) ప్లానింగ్

సందర్భంలో ఇంకొక ముఖ్యవిషయం ఏమంటే, జాతికి సవ్యమైన శిక్షణఇవ్వడం "నయీతాలీం" సూత్రాల మీద శిక్షణ ఇవ్వడంకంటే వేరొక ప్రశస్తమైన శిక్షణ ఇంకొకటి ఉండబోదు. వీటిలో ఒకభాగం "బేసిక్ విద్య" (v) రోగాలువస్తే మందులివ్వడం, ఇంజక్షనులుపొడవడం, టీకాలువేయడం, ఇవన్నీ అట్లుండగా వీటి అన్నింటికంటె ముందుగ ప్రజలు త్రాగడానికి, పంటలసాగుబడికి, పరిశుభ్రముగ కడుక్కోడానికి, మంచినీటివసతులు ఏర్పరచాలి. (vi) ఋణగ్రస్తత పెంచకుండ వ్యవసాయపరికరాలు ప్రజలకు అందించాలి. (vii) ప్రజోపయోగకరమున కుద్దేశించిన ఏర్పాట్లు, అనగ, పోస్టలు, టెల్లిగ్రాములు, రైళ్ళవగైరా రాకపోకసౌకర్యములు, ట్రాక్టర్లుబసుళ్ళుఇవ్వడం, విత్తనాలుసప్లయిచేయడం ఉప్పు వగైరా జీవితావసరవస్తువులుసప్లయి. ఇవన్నీ గవర్నమెంటుద్వారాచేసినా, ఇతరపబ్లిక్ లేక ప్రయివేటు ఏజన్సీల ద్వారాచేయించినా, లాభము తీద్దామనే దృష్టితో చేయకూడదు, చేయించకూడదు. అదిగాక, పెద్దలాభాలు మిగుల్ద్దామనిన్నీ చూడకూడదు. (viii) డబ్బువస్తుందికదా యని చెప్పి ప్రజలకు కల్లుసారాల త్రాగుడు, నల్లమందుగంజాయిలు, టీ, పొగాకువంటి డబ్బుదండుగమారి, నిష్ప్రయోజనపు దురభ్యాసాలు ప్రోత్సహించరాదు. వీటికి లైసెన్సులివ్వరాదు.

చులకనగా డబ్బుసంపాదించాలని చూచే దుర్వ్యాపారాలు అనగ, జూదం, "క్రాస్‌వర్డుపజుల్సు", తుచ్ఛప్రదర్శనాలు, డ్యాన్సులు, ఆటలు, పాటలు, వీటిని కూడ ప్రోత్సహించరాదు, లైసెన్సు లివ్వరాదు. (ix) "జనసంఖ్యతగ్గనిది

మేము అన్నంపెట్టలేమని, సంక్షేమరాజ్యం తేలేమని, చెప్పే గవర్న మెంటు— అందుకుగాను, కృత్రిమపుసంతాననిరోధపు పద్ధతులు కల్పించి, వాటిని ప్రోత్సహించే గవర్నమెంటు— రాజ్యపాలనచేయడానికి పట్టి అసమర్ధమైన, చేతకాని అనాధపు గవర్నమెంటన్నమాట సామ్రాజ్యవిస్తరణకాంక్షకు, యుద్ధాలకు జనసంఖ్య హెచ్చించాలని, "ఎక్కువమందిపిల్లలను ఇంకా, ఇంకా పుట్టించండి" అని పోత్సహించి బలవంతంచేసే గవర్నమెంట్లు ఎంతదుష్టమైనవో, "అన్నంపెట్టలేము, పిల్లలను కనవద్దండీ" అని చెప్పే గవర్నమెంటుకూడ అంత దుష్టమైనదే కాక, అనాధమైనదనికూడ చెబుతాను. ఇంద్రియజయమును సాధించుకోడానికి అవకాశంలేకుండ మనిషిని అశక్తుని చేసవేసి, "కావలసినంత ఇంద్రియలోలత్వం చేసుకో, ఫరవాలేదు, దానివల్ల వచ్చే అనర్ధకాలు రాకుండ నీకు కృత్రిమోపాయాలు చూపిస్తాములే" అని ప్రజలకుసలహా చెప్పి, పనికిరాలిన తప్పుడుమార్గాలు ప్రజలకు చూపించే ప్రభుత్వము ఏమిప్రభుత్వం! ఇదేనా ప్రభుత్వం ప్రజలకు మప్పే విద్య! శిక్షణ! అట్టి విద్య విద్యకాదు. అట్టి ప్రభుత్వం ప్రభుత్వంకాదు, రెండూ భగ్నమైపోయినట్లే! కనుక, విద్యకు ప్రజాశిక్షణకు, సంబంధించిన ప్రణాళికా (ప్లాను) భాగము మూలమట్టముగ మార్పుచెందాలి.

నాకు అర్ధమైనంతవరకు, సర్వోదయాప్లానింగ్ యొక్క ప్రధానసూత్రములలో ముఖ్యమైనవి కొన్ని ఇవ్వి. ఏ ప్లానింగ్ కాని – దీర్ఘకాలికమైనదికాని – సద్యఃకాలికమైనదికాని— ఈ సంకల్పములకు అనుగుణ్యముగానే నడవాలి.

(హరిజన్: 27-10-1951)

# స ర్వో ద య ము

## పన్నెండవ విభాగము

### కార్యవిధానము.

### 1

### —: పంచవిధకార్యక్రమము :—

**కే. జీ. మష్రూవాలా.**

దేశముయొక్క సర్వతోముఖవికాసమునకై నిర్మాణ కార్యకర్తల మహాసభలో వినోబాగారున్ను, ఇతర పెద్దలున్ను ఆలోచించి, పంచవిధకార్యక్రమము నొకదానిని రూపొందించినారు. దీనిని యావత్తు ఒక్కశ్లోకంరెండుపాదాలలో వినోబాగారు ఇట్లని నిర్వచించినారు:—

(1) అంతశ్శుద్ధి, (2) బహిశ్శుద్ధి, (3) శ్రమ, (4) శాంతి, (5) సమర్పణ.

(అంతశ్శుద్ధి, ర్బహిశ్శుద్ధిః శ్రమ, శ్శాంతి, స్సమర్పణమ్)

—వీటి వివరణ ఈదిగువచూచేది.

(1) అంతశ్శుద్ధి:- అనగ. ప్రజలు నిజాయితీతో ప్రవర్తించాలి అని అర్థము. డబ్బు అన్యాయార్జితంగా సంపా

దించరాదు; అట్లే, ఏవస్తువుకాని, ఏసౌకర్యముకాని, అన్యాయమార్గంగా సమకూర్చుకోరాదు, ఈసంకల్పంతోనే ప్రతివారు పనిచెయ్యాలి.

(2 బహిశ్శుద్ధి:- మనబట్టు, ఇల్లు, మనపరిసరములు, దొడ్లు, దోవలు, వీధులు అన్ని పరిశుభ్రంగా, మురికి లేకుండ ఉంచుకోవాలి. ఇదీ సర్వోదయప్రోగ్రాము. మనదేశస్థులు సాధారణంగా దేహం పరిశుభ్రంగానే ఉంచుకుంటారు. తమచుట్టుపట్టులుకూడ పరిశుభ్రంగా ఉంచుకోవాలనే భావం సర్వోదయకార్యకర్తలలో ఇప్పుడిప్పుడే మొలకెత్తుచున్నది. కాని, మొత్తం జనసామాన్యంలోమాత్రం ఇదికలుగలేదు. చాలారోగాలకు, మహామారీలుతరుచుప్రబలిరావడానికి ప్రజాసామాన్యంలోని ఈలోపమే కారణం. వ్యక్తులలోను, ఇంటాబయటాకూడ పరిశుభ్రత కలిగేటట్లు తీవ్రప్రచారం చేయడం అవసరము సర్వోదయస్థితిరావడానికి అవసరమైన కార్యక్రమంలో ఇది ఒకటి.

(3) శ్రమ:- ఇదే కాయకష్టంచేయడం. సర్వోదయస్థితి కిది మూడవకార్యక్రమము. కాయకష్టముయొక్క విలువను ఘనతను నాశనం చెయ్యడానికి శతశతాబ్దాలుగా మనం ఎంతచెయ్యాలో అంత చేశాము. మనకు అన్నం, బట్ట, ఇల్లు, వాకిలి, నగలు, నాణేలు, సమస్తసౌఖ్యములు తమ తరతరాలుగా, చెమట ఓడ్చి కష్టించి తయారుచేసియిచ్చిన జనాన్ని మనం నిర్లక్ష్యం చేయడమేకాక, అణచిపెట్టి అగౌరవపరచికూడయున్నాము. మనబట్టలుతికి, మనఅంట్లుచెంబులుతోమి'

మనవీధులు, గొడ్లసావిళ్ళు ఊడ్చి, మన మూత్రపాత్రలు, మురుగుదొడ్లు పరిశుభ్రపరచి, మనకు కావలసినబట్టలు నేసి యిచ్చి, కుండలు, చట్లు, చెప్పులు, సమస్తం తయారుచేసి మనకు ధారవోసిన జనం నేడు మనసృష్టిలో గౌరవహీనమైన అట్టడుగుగోతిలో ఉన్నారు. వాళ్ళను మనం నీచంగా చూస్తున్నాము, వాళ్ళ యెడ పొగరుబోతుతనంగా ప్రవర్తిస్తున్నాము. సంఘంలో వాళ్ళను అగౌరవపరుస్తున్నాము. మన అందరికీ తండ్రియైన భగవంతుని సేవించడానికై ఒకచోటకూడిన దేవమందిరములలోకూడ, మనతోబుట్టువులైన ఈబిడ్డలకు చోటులేదు. ఒకవేళ ఉన్నా దూరంగా నీచమైనచోట నుంచోబెడుతున్నాము. ఉన్నగౌరవమంతా డబ్బుకు, అధికారానికి, పుస్తకాలచదువులకే అంటగడుతున్నాము. దీనికంతకు ఫలితం? సంపదుత్పత్తి తరిగిపోయింది; భోగపరాయణత, ఇంద్రియలోలత్వం మితిమీరిపోయింది ఒళ్ళువంచి పనిచేసే వాడు ఒక్కడూలేడు కాని, తిండికైతే పదిమంది చేరుతారు. ఎవడో కష్టించి పనిచేసిన దాని ఫలితాన్ని తేరగా తినడానికి భోగించడానికి వస్తారు. ఇట్టిది ఇకమీదట సాగడానికి సాధ్యం కాదు. వట్టిచేతులతో పనిచేసినా, ఏవో పరికరాలతో యంత్రాదులతో పనిచేసినా, పనిచేయడమనేది మాత్రం ఇకమీదట తప్పించుకోడానికి వీలుపడదు. వికసించినశరీరానికి, సంస్కృతి చెందిన మనస్సుకు, ఇకమీదట గుర్తు కాయకష్టమనేదగానే ఉంటుంది. కాయకష్టంచేసే శక్తి, సంకల్పం, ఉండాలి. ఇవే పూర్ణవికాసంచెందిన మనిషికి గుర్తులు.

(4) శాంతి:- ఇది నాల్గవ అయిటం. శాంతి అంటే కేవలం యుద్ధాలు రద్దవటము మాత్రమే కాదు; ఇది సంకు చితార్థము మాత్రమే. యుద్ధాలు పోవలసినమాట నిజమే. అయితే, అసలు యుద్ధాలనేవి ప్రతి చిన్నచిన్న వర్గాలలో మతాలలో తరుచు పుట్టుకువచ్చే చిన్నచిన్న కీచులాటలన్నీ చేరిన పెద్ద దెబ్బలాటలేకద. ఈ చిన్నచిన్న వర్గాలే కనుక, తమలోతాము మెల్లా మైత్రితో నడచుకోవాలో, చిన్న చిన్న కీచులాటలు ఎలా సర్దుబాటు చేసుకోవాలో, ఒకరిని చూస్తే ఒకరికి భయం, అనుమానం చుప్పనాతితనం అనేవి లేకుండ రద్దుపరుచుకోవాలో తెలుసుకుంటే, పెద్దపెద్ద దేశాల మధ్య జరిగే యుద్ధాలకు ప్రపంచయుద్ధాలకు అసలు మూలమే సాఫుగ తెగిపోతుంది.

(5) సమర్పణ:- స్వయంగా వడికిననూలు గాంధిగారి జన్మదినోత్సవం రోజుననైనా ఒక చిలప సమర్పించడం. ఈచిలుప దానిని సమర్పించిన వ్యక్తికి గాంధిగారిమెడలగల భక్తికి చిహ్నము; అంతేకాదు, సర్వోదయాదర్శముమీద, స్వయంగాచేసే కాయకష్టం మీద, కాయకష్టముయొక్క శాశ్వతత్వముమీద, దాని ఘనతమీద, దోపిడీమెరుగని అహింసాసమాజంమీద, ధనికునకు పేదకు తేడాలేదనేదాని మీద, ఆ వ్యక్తికి ఉన్న భక్తిశ్రద్ధలకు, నమ్మకమునకుకూడ చిహ్నముగా ఉంటుంది.

(హరిజన్: 28-4-1951)

# 2

## —: సమగ్రసేవ :—

### వినోబా.

సమగ్రసేవంటే అన్నిపనులు ఒక్కసారే, ఒక్కగుక్క లోనే చెయ్యాలనికాదు. నిర్మాణకార్యక్రమంలో ఏదో ఒక అయిటము ప్రధానంగా ఎత్తుకొని, దానిని చేస్తూ, దాని చుట్టూ దానితోపాటు ఇతర అయిటములనుకూడ క్రమంగా సహజంగా వికాసం పొందేటట్లు కృషిచేయడం. ఇదే సమగ్ర సేవంటే.

దీనినే వినోబాగారు ఒక ఉదాహరణపూర్వకంగా, తమస్వానుభవంలో చెప్పారు. ఒకసారి, మధ్యప్రదేశ్ లో, అనంతపురం అనే చోటికి వినోబాగారు వెళ్ళారట, అక్కడ ఒక కార్యకర్త ఖాదీసెంటరునుఏర్పరచి పనిచేయుచున్నాడు. కాని,ఏలనో అది సాగక కొంతకాలంక్రిందట ఆగిపోయినదట, దానికారణమేమిటో కనుక్కోవలసినదని వినోబాగారిని కొందరు కార్యకర్తలు కోరారు. ఆయన జాగ్రత్తగా పరిశీలించి చూచి, దానికిగల అనేకకారణాలలో, ఒక కారణం ముఖ్యముగా ఇలాచెప్పారు. ఆ కార్యకర్త తక్కిన సంగతులన్నీ వదలివేసి, అస్తమానం, కేవలం ఒక్క ఖాదీపనిమీదనే కేంద్రీకరించుకుకూర్చున్నాడు. ఆగ్రామంలో జనం వీధుల లోనే మలమూత్రాలు విసర్జించి, ఖరాబుచేసివేస్తుంటే, ఈ ఖరాబుస్థితిని బాగుచేద్దామనే సంగతి అతను పట్టించుకో లేదు. ఖాదీపనిలోనే మునిగి కూర్చున్నాడు. ఇంకొకపని

గనది కాదన్నట్లు చూస్తూ ఊరుకున్నాడు. తనజాగృతిని సర్వత్ర ప్రసరింపజేయకుండా కేవలం గుడ్డిరెద్దురీతిగా ఒకే దోవను చూచుకుంటూ పోవడం అంటే ఇదే అన్నారు వినోబాగారు. ఇదిసరియైన ధ్యాననిమగ్నత కాదు; ఒకరక మైనసంకుచిత పంథా మాత్రమేఇది. ఇది ఒకరకమైన గుడ్డి ఘంత. దీనిలో సంకుచితత్వం పనికిరాదన్నామేకాని, నిమగ్నత (తల్లీనత) పనికిరాదనలేదు. నిమగ్నతా కావాలి, సర్వత్రో వ్యాపకమైన దృష్టీ కావాలి, రెండూ ఉండాలి. (అదే సమగ్ర సేవ అంటే).

(వారి ఉపన్యాసం క్లుప్తం – హరిజన్: 23-6-1951)

## 3

విదేశీసరుకు నిషేధం – నిర్మాణకార్యక్రమంలో ఒకభాగం.

(ధీరేంద్రముజుందార్.)

నిజంగా క్రొత్తసాంఘికవ్యవస్థను తీసికొనిరావాలనే ఆశయంతో పనిచేసే కార్యకర్తలందరు నిర్మాణాత్మకంగా ఏదో చేస్తూ, ఇప్పుడున్న సాంఘికస్థితిని అంతమొందించ డానికికూడా పాటుబడాలి. ఏ విప్లవమునకుకాని అవసరమైన లక్షణమే ఇది.

—: విప్లవానికి మున్ముందుగ జరగవలసినపనులు :—

ఏ విప్లవాన్నైనా తీసుకురావాలంటే, దానిని గవర్న మెంటే తేవచ్చును. లేదా ప్రజానీకమే తేవచ్చును. లేదా, ప్రజాసేవకులు తేవచ్చును. గవర్నమెంటే దీనికి పూనుకో

దలచుకుంటే, అదితక్షణం యంత్రములద్వారా వస్తూత్పత్తిని చేయించడమనేదానిని ఆపివెయ్యాలి. ఇది అనివార్యం. అట్లే, బర్రెల (గేదెల) రక్షణమానివేసి గోరక్షణచెయ్యాలి; ఇప్పటి విద్యాపద్ధతిమానివెయ్యాలి. ఈరీతిగా చెయ్యడానికి గవర్నమెంటు తయారుగాలేకపోతే, వారు గ్రామపరిశ్రమలకై (వికేంద్రీకరణపరిశ్రమలకై) ఖర్చుచేసే ధనమంతా శుద్ధ దండుగ. ఇక, పబ్లిక్ సంస్థలుకాని, పబ్లిక్ వర్కర్లుకాని, విప్లవము తేదలచుకుంటే వారు రెండువిధములైన ప్రోగ్రాములు అవలంబించాలి. ఒకవిధమైనప్రోగ్రాము ఏమంటే రాట్నపరిశ్రమ, ఇతరగ్రామపరిశ్రమలు, గోరక్షణ, బేసిక్ విద్య, ఇక, రెండవ విధమేమంటే: యంత్రముల ద్వారా ఉత్పత్తియైన వస్తువులను బహిష్కరించడం, మహిషరక్షణ మానివేసి గోరక్షణచేయడం. ఇప్పటివిద్యాపద్ధతి మానివేయడం. వారు తమసొంత జీవితములోను తమ సంస్థలనడకలోను ఈ బహిష్కరణకార్యక్రమమును అవలంబించాలి. దానినిఅమలు పరుస్తామని దీక్షపట్టాలి. ఇతరవ్యక్తులను, సంస్థలనుకూడ ఇందుకై ప్రోత్సహించాలి. ప్రజానీకం బాగా మేల్కొన్నదని తెలిసినతరువాత సమగ్రమైన బహిష్కరణోద్యమం లేవదీయాలి. ఈపనులు మనం చెయ్యలేకపోతే, సాంఘిక విప్లవదృష్ట్యా, మన నిర్మాణకార్యక్రమమంతా శుద్ధదండుగ.

నేను వెళ్లినచోట్లల్లా ఈసంగతులు చెబితే, వ్యక్తులు, సంస్థలుకూడ దీనికి వెంటనే ఒప్పుకున్నారు. సిద్ధాంతాలలో భేదాభిప్రాయాలేమీ కనిపించలేదు. "ఇదే చేయవలసినది"

(50)

అని అందరూ అంగీకరించారు. కాని, దీనిని ఆచరణలో పెట్టడానికిమాత్రం "చాలాకష్టాలున్నయ్యండీ" అన్నారు. "పరిస్థితులు అనుకూలంగా లేవండీ" అంటూ కూడా చెప్పారు. ఇక, అందుకే గవర్నమెంటునుమాత్రం నిందించడ మెందుకు? "యంత్రాలు ద్వారా ఉత్పత్తిని గవర్నమెంటు ఆపడం లేదని" మనం ఊరంతా గవర్నమెంటుమీద ఏల అసంతృప్తి పొందాలి? ఈ కష్టాలు గవర్నమెంటుకు మాత్రం లేవా? కనుక ఇంకముందుకూడా గవర్నమెంటుమీద నిందవేయకుం డుదుముగాక. 'విప్లవం' తెస్తామని మనం పెద్దకబుర్లు చెబుతున్నాము కాని కష్టాలు చూచి, వ్యతిరేక పరిస్థితులుచూచి, ఏల బెదిరిపోవలెను? కనుక, గవర్నమెంటువారి ధోరణిని చూచి మనము ఆశ్చర్యపడనక్కరలేదు.

పరిస్థితులు ఒకొక్కప్పుడు చాలా వ్యతిరేకంగా మనకు అడ్డుకుంటవనే సంగతి నేను కాదనను. కాని, నే నొక ప్రశ్న అడుగుతాను మనము శక్తివంచన మానసికవంచన లేకుండ చేయగలిగినదంతా చేశాము అని గుండెమీద చేయివేసుకొని మనం చెప్పుకోగలమా? ఇక, మిగిలినదల్లా పరిస్థితుల వ్యతిరేకత ఒక్కటేనా? ఇదెంతమాత్రంకాదని నాఅభిప్రాయము.

మనకు కావలసినదల్లా విస్పష్టమైన దృక్పథము, సుదృఢమైన సంకల్పము, సంపూర్ణమైన ఆత్మసమర్పణ. మొట్టమొదటగ "యంత్రములలో తయారైన సరుకును,

ముఖ్యంగా. తిండికి బట్టకు సంబంధించిన పనులను. బహిష్కరిస్తాము" అని పెద్దప్రబోధం చెయ్యాలి. గ్రామాలలో ఇతర వస్తువులకుకూడ ఈ ప్రబోధమును వ్యాపింపచేయాలి. ఇదికాక, నిర్మాణ కార్యక్రమంలోని ఒక్కొక్క అంశమునే తీసికొని దానిపైన మన కృషిని కేంద్రీకరించాలి. వ్యక్తులందరు, అన్ని సంస్థలన్నియుకూడ, అన్నీ సమానంగా పటిష్టంగా పనిచేయలేక పోవచ్చునుకాక. కాని, ఉద్యమముమాత్రం ముందుకు పురోగమిస్తూ ఉంటుంది. అయితే, ఈ ఉద్యమమువైపునకు నడవడానికి మనము మనస్ఫూర్తిగ యత్నమే చేయకపోతే మనము ఎక్కడికిపోతున్నామో తెలియక, నిరాశామయంగా చీకటిపరుగులే పెట్టుతూఉంటాము. తుదకు, ఏ గోతిలోనో పడతాము. మనత్యాగము, మనసత్యాన్వేషణ మనకు కొంత వ్యక్తిగతమైనతృప్తిని, ఆధ్యాత్మికశాంతిని ఇస్తే ఇవ్వవచ్చునుగాక; కాని, మనము కలలుకంటున్న సాంఘికవిప్లవంమాత్రం ఎన్నటికీ కలగానే ఉండిపోతుంది. అది 'నిక్కము' (నిజము) కాజాలదు.

మనము సాగించిన ఆనాటి గొప్పస్వరాజ్యసమరపు రోజులలో, దానితోపాటు విదేశీవస్తుబహిష్కరణకూడ సాగించియుండకపోతే, మన 'స్వదేశీ' ఉద్యమము ఆనాడే మటుమాయమైపోయేది. అదేరీతిగా, గ్రామపరిశ్రమల అభివృద్ధికై మనము పూనిన ఉద్యమంతోపాటు "యంత్రముల మీదతయారైన వస్తువులను బహిష్కరించాలి" అనే ఉద్యమాన్నికూడ లేవదీయకపోతే, మన గ్రామపరిశ్రమోద్ధరణ

నిష్ఫలమే అవుతుంది. కాకపోతే, ఏకొద్దిమంది పేదలకో కొంచం అన్నం అప్పుడప్పుడు దొరకవచ్చును. అంతే. వికేంద్రీకృతమై, స్వయంపోషకమై, దోపిడీనుండి విముక్తిచెందిన దైన సాంఘికవ్యవస్థ మాత్రము ఎన్నటికీ అవతరింపనేరదు.

నా సహకార్యకర్తలు, నిర్మాణకార్యక్రమసంస్థలు ఈ నా వాక్యములను శ్రద్ధతో గమనింతురుగాక అని మనవి చేయుచున్నాను.

(హరిజన్: 13-10-1951)

## —: అనుబంధం :—

### ఒకకథ.

బైబిలులో, 'మత్తయసువార్త' XX వ అధ్యాయము, 1-14 పేజీలలో ఒక కథకలదు. ఇది ఏసుప్రభువు చెప్పిన కథ. ఈ కథ చివరిభాగంలో "అంటు దిస్ ల్యాస్ట్" అనే వాక్యమున్నది. ఈ మహావాక్యమునే ఆంగ్లతత్వవేత్త "రస్కిన్" మహాశయుడు తాను రచించిన ఒకానొక ఉద్గ్రంధమునకు శీర్షికగ ఉంచినాడు. ఈ వాక్యమునే గాంధిగారు కూడ, తనసందేశమునకు అనుగుణ్యముగ ఉండుటచే, అవలంబించి, దానిని "సర్వోదయం" అనే పదముగ తర్జుమా చేసియున్నారు. దీనికింతకు మూలకారణమైన ఆ కథ నీదిగువ ఉల్లేఖించుచున్నాము.

అనగనగ ఒక సంపన్నగృహస్థు ఉన్నాడు. అతని కొక ద్రాక్షతోట ఉన్నది. ఈ తోటలో పనిచేయడానికి కూలీలకొరకై ఉదయమే బయలుదేరినాడు.

మొదటగ, కొందరు కూలీలుకనిపించారు. మీకు రోజుకొక "పెన్నీ" కూలి ఇస్తాను, నా ద్రాక్షతోటలోకి వెళ్లి పనిచెయ్యండి" అన్నాడు. వారు దానికి ఒప్పుకొని తోటపనికి వచ్చారు.

మరల, ఒకఝాము (మూడుగంటలు) అయినతరు వాత, మార్కెట్టులోకి వెళ్లితే, అక్కడ కొందరు పనిలేకుండ నిర్వ్యాపారులుగ కూర్చుండడం చూశాడు. "ఊరికే ఎందుకు కూర్చుంటారు! నాతోటలోకివెళ్లి పనిచెయ్యండి; ఏది న్యాయమో ఆకూలి ఇస్తాను" అన్నాడు. దానికి వారు ఒప్పు కొని తోటపనికి వెళ్ళారు.

ఇట్లే, మరొకగంట ఉండి వెళ్ళాడు; మరల మరియొక గంట తరువాత వెళ్ళాడు.

వెనుకటి వాళ్ళకు చెప్పినట్లుగానే చెప్పి, వాళ్ళను కూడ తనతోటపనికి పంపించాడు.

చివరకు, ఇంకా ఒక గంటపొద్దుమాత్రమే ఉండగా వెళ్లిచూస్తే, మరికొందరు జనం పనిలేకుండ ఉండడం చూశాడు. "రోజంతా మీ రెందుకు సోమరులుగ ఉన్నారు'

అని అడిగాడు. "మా కెవరూ పనిచెప్పలేదండీ" అన్నారు వాళ్లు. "అట్లయితే, మీరుకూడ నాతోటలోకి వెళ్లి పనిచెయ్యండి; ఏది న్యాయమో ఆ కూలి ఇస్తాను"అన్నాడు. ఆ ప్రకారమే వాళ్ళున్నూ తోటలోకి వెళ్లి వంగున్నారు.

ఇక, పొద్దుక్రుంకిన తరువాత ఆ సంపన్న గృహస్థుడు తన పెద్దగుమాస్తాను పిలిచి ఇలా చెప్పాడు. "కూలీలనందరిని పిలు; వరుసగ నుంచోపెట్టు; ఆఖరుగంటలో వచ్చినవాడితో ప్రారంభంచేసి,క్రమంగా మిగతావారందరికీ కూలి ఇస్తూరా" అన్నాడు. "మొదటివాడికి ఆఖరుకు ఇవ్వు" అన్నాడు.

ఆప్రకారం అందరూ వచ్చి నిలబడ్డారు. ఆఖరు గంటలో వచ్చిన ముఠాలో ప్రతిఒక్కనికి ఒక్కొక్క పెన్నీ చొప్పున కూలిఇచ్చారు. ఈరేటుననే క్రమంగా తక్కినవాళ్ళ కందరకు ఇచ్చుకుంటూ వచ్చివచ్చి, మొట్టమొదటగ ఉదయమే వచ్చిన ముఠావాళ్ళకుకూడ అదేరేటున ఒక్కొక్క పెన్నీయే కూలి ఇచ్చారు.

"ఇదేమిటి, మాకూ పెన్నీయేనా కూలి, రోజంతా ఎండలో పనిచేసిన మాకూ పెన్నీకూలీయేనా, ఆఖరు గంటలో వచ్చి, కాస్త నడుంవంచిన ఈ ఆఖరుముఠావాళ్ళకు కూడ పెన్నీయేనా? ఇది ఏటి న్యాయం? గుర్రం గాడిదా సమానంచేశారు. మాకు ఎక్కువకూలి రానక్కరలేదా" అని ఆ మొదటిముఠావాళ్ళు గొణగడం సాగించారు.

అప్పుడు ఆగృహస్థు ఆ ముఠాలో ప్రతిఒక్కనితో ఏమన్నాడంటే "అరే, తమ్ముడా, విను: నేను నీ కేమీ అన్యాయం చెయ్యలేదు; పెన్నీకూలీకి పనిచేస్తానని నీవు నాతో ఒప్పుకున్నావా లేదా? ఆ ఒప్పుకున్నదాని ప్రకారం నీకు ఇచ్చేశాను. నీకు ముట్టవలసింది ముట్టింది; ఇక పో అబ్బాయి; "ఈ ఆఖరువానికి" కూడా Even Unto This Last (అంటూ దిస్ లాస్ట్) నీకు ఇచ్చినట్లే ఇస్తాను" అన్నాడు.

ఈ కథలోని సంపన్న గృహస్థు చేసిన పద్ధతే దేవుని రాజ్యంలో కూడ ఉంటుంది. ఇదీ కథ.

"అంటూ దిస్ లాస్టు" - అనే ఇంగ్లీషుపదమునకు అర్థం ఇదీ:—

"ఈ ఆఖరు వానికి."



గ్రామస్వరాజ్య ప్రెస్, విజయవాడ - 2.

## తెలుగులోనికి అనువదింపబడిన

# గాంధీజీ రచనలు

1. ఢిల్లీ దినచర్య
2. నా మతము
3. మన గ్రామ పునర్నిర్మాణము
4. నూతన విద్యా విధానము
5. అంటు దిస్ లాస్ట్ (సర్వోదయము)
6. సర్వోదయము
7. నవీన విద్యావిధంలో
8. నిర్మాణ కార్యక్రమము
9. పంచాయతీ రాజ్యము
10. సహకార సేద్యము
11. యరోడా జైలునుండి

## అచ్చులో నున్నవి

12. అస్పృశ్యతా నివారణ కార్యకర్తలకు
13. అహింసాత్మక సామ్యవాదము
14. శాంతి సమరములలో అహింసా సిద్ధాంతము
15. ఆశ్రమదీక్షలు, నియమములు

గాంధీ సాహిత్య ప్రచురణాలయము
(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)
రామారావుపేట, కాకినాడ.